# నారీ జీవనము

## (ప్రేమ్‌చంద్ కథలు)

రచయిత:

**ప్రేమ్‌చంద్**

అనువాదము:

సాహిత్యరత్న, హిందీ తెలుగు విద్వాన్,

**యన్. యస్. వి. సోమయాజులు**

(ఆంధ్ర విశ్వవిద్యాలయ బహుమతి గ్రహీత)





—ప్రేమ్‌చంద్

## పరిచయం

హిందీ సాహిత్యజగత్తులో అమరకథాకారుడు, నవలా సామ్రాట్ శ్రీ ప్రేమ్‌చంద్ మహిమాన్వితమైన పేరు సంపాదించెను. ఆయనరచనలు దేశములోని అన్ని భాషలలోను అనువదింపబడి ప్రచురింపబడినవి.

కాశీ దగ్గరనున్న 'లమహి' అనే గ్రామములో 1880 సం|| జూలై 31 న జన్మించెను. ఆయన అసలు పేరు

'ధనపతరాయ్ శ్రీవాత్సవ్' ముద్దుపేరు 'నవాబ్ రాయ్' అతి పేదకుటుంబములో పుట్టి అయిదవ సంవత్సరములో 'ఉరుదూ' అక్షరాభ్యాసముతో విద్యార్థి జీవితము నారంభించి, సవతితల్లి పెట్టు కష్టములను సహించుచు, ఆర్థిక పరిస్థితుల వలన, గృహచ్ఛిద్రములవలన కృంగిపోవుచు, హతాశుడు మాత్రముగాకుండ దీక్షగ విద్యాభ్యాసము సాగించెను. 1905 లో శ్రీమతి శివరాణిని వివాహము చేసికొనెను. నవాబ్ రాయ్ పేరుతో ప్రచురించిన 'సోజేవతన్' కథల సంపుటిని బ్రిటిష్ ప్రభుత్వము కాల్చివేయుటతో పేరు మార్చుకొని 'ప్రేమ్‌చంద్' పేరుతో కథలను పెద్దపెద్ద నవలలను పెక్కింటిని రచించెను. 1921లో గాంధీ మహాత్ముని శంఖారావము విని, డిప్యుటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స ఉద్యోగమునకు రాజీనామానిచ్చి, అసహాయోద్యమములో పనిచేసి, కష్టములనొంది, కొందరు సహచరులతో కలిసి 'సరస్వతీ ప్రెస్'ను స్థాపించి, ఎగుడుదిగుళ్ళను తట్టుకొనుచు 1930లో 'హంస' పత్రికను స్థాపించి, యువ రచయితలను ప్రోత్సహించుచు 'సేవాసదన్, గోదాన్, నిర్మల' మొదలగు నవలలను కథలను అసంఖ్యాకముగ ప్రచురించి, బ్రిటిష్ ప్రభుత్వ మీయవచ్చిన 'రాయ్‌సాహెబ్' బిరుదును తిరస్కరించి, విశ్వసాహిత్య క్షేత్రములో 'ఉపన్యాససామ్రాట్' (నవలాచక్రవర్తి)గ యశస్సునొంది 1936 అక్టోబరులో అమరత్వము నొందిరి.

# విషయసూచిక





మీరు చదివారా?

---

# జైనేంద్ర సాహిత్యం!

సాహిత్యక్షేత్రంలో ఇదొక అపూర్వమైన కళాసృష్టి!

---

వివరాలకు:

ప్రేమ్ చంద్ పబ్లికేషన్స్,

విజయవాడ.

పెద్దవాఁడు కాంతానాథుఁ డొక ప్రభుత్వ కార్యాలయమున నేబదిరూప్యముల సంపాదించు నుద్యోగి. రెండవ వాఁడుమానాథుఁడు- డాక్టరీప్యాసై యెక్కడనో యొకచోట నౌషధాలయము నారంభించు నాలోచనలోనున్నాఁడు. మూఁడవ వాఁడగు దయానాథుఁడు బి. ఏ. పరీక్షయందపజలుఁడై పత్రికలయందు వ్యాసములు వ్రాయుచుఁ గొలఁదిగనో గొప్పగనో సంపాదించుకొనుచున్నాఁడు. నాల్గవ వాఁడు సీతానాథుఁ డందఱి కంటెను కుశాగ్రబుద్ధి-సుగుణములప్రోవు - ఉజ్జ్వలమైన భవిష్యత్తుగలవాఁడని జనులనుకొందురు. ఈ సంవత్సరమే బి. ఏ., పరీక్షలోఁ బ్రథమశ్రేణియం దుత్తీర్ణుఁడై యమ్. ఏ., పరీక్షకుఁ బోవ నుద్యమించుచున్నాఁడు. తల్లిదండ్రులకు దుఃఖముఁ గలిగించునట్టి, కుల మర్యాదలను బట్టిపాడ్జేయునట్టి - యేవిధమగు దుర్వ్యసనములుగాని, శోకికీర్తనములుగాని, డాంబుదర్పములుగాని యీ సంసారములో నొక్కఁడును గానరావు.

పూలమతి ఇంటి యజమానురాలు. తాళపుఁజెవ్వులు పెద్దకోడలియొద్దనుండును. వృద్ధులను-గాను స్వభావులుగను, సహజ కలహశీలురుగను జేయునధికారవాంఛ వృద్ధురాలగు పూలమతికి లేదు; పూలమతి కిష్టము లేనిదే పసిపిల్లవాఁడు కూడ నాయింటిలో మిఠాయినైన కొనఁడు, తినఁడు. ఆనాఁటి మా యింటి యాచారమట్టిది!

సంధ్యాసమయమైనది. పండిత అయోధ్యానాథుఁడు మరణించి నేటికిఁబండ్రెండు. రేపు పదమూఁడవరోజు బ్రాహ్మణులకు సమారాధన. ఆతని స్నేహితులందరు విందున కాహ్వానింపఁబడుదురు. అందులకు వలయు ప్రయత్నము లన్నియు జరుగుచున్నవి. పూలమతి తనగదిలోఁ గూర్చుండి చూచుచున్నది-గోధుమపిండి బస్తాలు, నేతిడబ్బాలు, తట్టలలోఁ గాయగూరలు, చక్కెరమూటలు, పెరుగుకడవలు మొదలగు సామగ్రి యంతయు వచ్చుచున్నది. బ్రాహ్మణులకిచ్చు దానములకుఁ గావలసిన పాత్రలు, బట్టలు, గంధములు, తివాచులు, ఛత్రములు, చెప్పులు, చేతికఱ్ఱలు, లాంతరులు ఇత్యాది సామాగ్రియంతయు వచ్చినది; కాని ముందుగ పూలమతికి మాత్ర మేవస్తువునుఁ జూపఁబడలేదు. వెనుకటి రోజులైనచో నా సామగ్రియంతయు మొదట నామెవద్దకు రావలసియున్నది. ఆమె ప్రత్యేకముగ నా వస్తువులనుగాంచి తన యామోదమును తెలియఁ జేయును; ఏ వస్తువునందైన హెచ్చుతగ్గులున్నచో సరిజేయించును; అనంతర మా వస్తువులన్నియు గృహభండారమునకుఁ జేర్చఁబడునవి. కాని, నేఁడా వస్తువుల నామెకుఁ జూపుటగాని యామె సలహా పొందుటగాని యనావశ్యకమని భావించిరేమో!

మంచిది! గోధుమపిండి మూఁడు సంచులే వచ్చిననేమి? తా నయిదు సంచులఁ దెప్పింపు మనినదే! నేయికూడ నయిదు డబ్బాలు మాత్రమే వచ్చియున్నది. తాను పది డబ్బాలు చెప్పినది? ఇదేవిధముగఁ గాయగూరలు, చక్కెర,

పెరుగు మొదలగునవి కూడ తగ్గింపఁబడియో యుండును. ఆమె యాజ్ఞలో జోక్యము కలిగించుకొనిన వారెవరు? ఆమె యొక నిర్ణయము చేసిన వెనుక దానిని హెచ్చుతగ్గులు జేయు నధికార మెవరికున్నది? పూలమతి మతిలోఁ బడుగిడు చున్న యాలోచనలిట్టివి.

నేటికి నలుబది సంవత్సరములనుండి ఈ యింటికి సంబంధించిన ప్రతి విషయమునందును పూలమతిమాట సర్వమాన్యమై యొప్పుచున్నది. ఆమె వందయన్నచో వంద ఖర్చు చేయఁబడెడిది, ఒక్కటన్నచో నొక్కటియే! ఎన్న డును బల్లెత్తి మాట యనరు. చినజాకుఁ బండిత అయోధ్యా నాథుఁడునైన వారామె యభిప్రాయమునకు వ్యతిరేకముగ నేమియుఁ జేసెడివాఁడు కాఁడు; కాని నేఁడామె కనుల యెదు టనే ప్రత్యక్షరూపమున నామె యాజ్ఞ ధిక్కరింపఁబడు చున్నది. దీని నామె యెట్లు సహింపగలదు?

ఆమె కొంతసేపటి వఱకు నతికష్టముతో నోర్చు కొన్నది; గాని చివఱకు సహింపలేకపోయినది. తన యింటి లోని ప్రతి వ్యక్తిని, ప్రతివిషయమును నిర్ణయించి శాసించు టామెకు నిదివఱకే ప్రధానమైపోయినది. క్రోధావేశముతోనై వచ్చి కాంతానాథునితో నన్నది—"పిండి మూఁడు బస్తాలే తెచ్చితిరేమి? నేను నీతో నయిదు బస్తాలు చెప్పియుంటినిగదా! నేయి కూడ నైదు సేర్లు తెచ్చితివి. నేను పదిసేర్లు చెప్పితిని, నీకు జ్ఞాపకమున్నదా? మిగత వ్యయము నేను కాద నను: కాని, మాతని ప్రవిలనవారి యాత్మలతో నీటికై

తపించుచుండుల నీ కార్యము నిర్వర్తింపఁ జూచుట యెంత సిగ్గుచేటు ?"

కాంతానాథుఁడు క్షమాప్రార్థన చేయలేదు, తన పొరపాటునుగూడ నంగీకరింపలేదు. ఎంతమాత్రమును లజ్జితుఁడుగూడ కాలేదు. ఒక నిమేషమాత్రము విద్రోహభావముతో నిలువఁబడి యిట్లనెను— "మేమందఱము సంప్రతించుకొని మూఁడుబస్తాలు చాలునని నిర్ణయించుకొంటిమి; మూఁడుబస్తాల పిండికి నయిదుడబ్బాల నేయి సరిపోఁగలదు. ఈ లెక్కప్రకారమే యితర వస్తువులన్నియుఁ దగ్గింపఁబడినవి."

పూలమతి క్రోధపరవశయై యన్నది— "ఎవరిసలహాప్రకారం మీరు పిండి తగ్గింపఁ బడినది?"

"మా అందఱి సలహాప్రకారమే తగ్గింపఁబడినది."

"అయిన నా సలహాతో నికఁ బనిలేదా?"

"ఎందుకు లేదు; కాని మా లాభనష్టములు మాకు తెలియును."

పూలమతి నిశ్చేష్టురాలై యాతని ముఖముఁ జూడసాగినది. ఆ [illegible]క్యాసయ మామె కర్థము గాలేదు. తన లాభనష్టములు-తన యింటిలోని లాభనష్టములు, బాధ్యత [illegible] తన కడుపునఁ బుట్టిన కొడుకులేయగుగాక, [illegible]తన్నలకుఁ దన కార్యకలాపములలో జోక్యముచేసుకొనుటకు [illegible]వారికేమి యధికారమున్నది? ఈకుటుంబము, ఈయిల్లు [illegible] తానొక్కనిదే[illegible]యైనప్పుడు, తానే చచ్చి చెడి యీ సంసారము నీస్థితికి

దెచ్చినటుల, నేను బరాయిదాననైనటు లీ విధముగ నెదురు జవాబులు జెప్పుచున్నాఁడు ! ఎంతపొగరు !

క్రోధారుణమైన ముఖముతో నామె యనినది—"నా లాభనష్టములకు నీవు బాధ్యుడవుగావు. నా మంచిచెడ్డలను నేను నిర్ణయించుకొనఁగలను. నా కుచితమని తోఁచినపనినే నేను జేసెదను. ఇప్పుడే వెళ్ళి రెండుబస్తాలు పిండి, అయిదు డబ్బాలు నేయి తీసికొనిరమ్ము. జాగ్రత ! ముందెన్నఁడును నామాటకెదురు చెప్పకుండుముగాక!"

పూలమతి కుమారుని నుచితరీతిని మందలించితినని దలంచినది. వలసినంతకంటె నెక్కుడు కాఠిన్యమునే కుమారునిపైఁ జూపితినని భావించి కొంతనడి యిట్లు జింతించినది- 'నాపిల్ల లేగదా! ఖర్చులను గొంత తగ్గించుట మంచిదని భావించియుందురు. నేను స్వయముగఁ బ్రతి వ్యవహారము నందును ఖర్చులను తగ్గించుచుండుటవలన నీవిషయమైనా యభిమత మిట్టిదని గ్రహించలేకపోయియుందురు. ఈవిషయములో నేను ధనవ్యయమును బాటింపనను సంగతి నెఱింగినచో వారు నామాట నుపేక్షింప నెంతమాత్రమును సాహసించెడివారుగారు.'

కాంతానాథుఁడింకను అక్కడనేనిలువఁబడియున్నను- నాతని ముఖభంగిమలవలన నాతఁడీ యాజ్ఞాపాలనమునకు సుముఖుఁడుగా లేఁడను విషయము వ్యక్తమగుచున్నను- పూలమతి నిశ్చింతతోఁ దనగదిలోనికిఁ బోయినది. ఇంత తీవ్రముగ మందలించిన వెనుకఁగూడఁ దనకుమారులలో

నేరైన నామెయాజ్ఞ నుల్లంఘింప సాహసించుట సంభవమని యామె యూహించుకొనలేకపోయినది.

కాలము గడచినకొలది— నేటికి పది పండ్రెండు దినముల వెనుక ఆయింటిపైఁ దనకుఁగల యధికారార్హత నేఁడు నశించినదను సత్యమామెకు విశదము కానాగినది. చుట్టుపక్కములనద్దనుండి దినవారములకుఁ జక్కెర, మిఠాయి, పెరుగు, ఊరుఁగాయలు మొదలగునవి వచ్చుచున్నవి. పెద్దకోడలీ వస్తువులను స్వామినీభావముతో స్వీకరించి యింట సర్దుకొనుచున్నది. ఎవ్వరుఁ బాలమతి నేవిషయము నడుగ వచ్చుటలేదు. బంధుమిత్రులుగూడ ప్రతివిషయమును కాంతానాథునితోఁగాని పెద్దకోడలితోఁగాని ముచ్చటించుచున్నారు. కాంతానాథునివలన నీ పనులన్నియు నిర్వహింపఁ బడఁగలవా! రాత్రింబవళ్ళు నల్లమందుభాయినవలె పడియుండువాఁడతఁడు. ఆఫీసునకు బోవుట యన్నచో వానికి గుండెక్కి నేఁకపోఁతును దోలినట్లుండును. ఎందుకువచ్చిన పీడరా భగవంతుడా! యనుకొనుచు నెలకుఁబదునైదు నాగాలతో నతఁడాఫీసునకుఁ బోవుచుండును. అక్కడ యజమాని పేని తండ్రిగారిపైఁగల భక్తిశ్రద్ధలవలన నీతని వ్యతిక్రమ చర్యలను సహించి యూరకొనుచున్నాఁడు గాని, లేకున్న నెన్నఁడో యుద్యోగ మూడఁబీకెడివాఁడు. ఇఁకఁ బెద్దకోడలు ఏపని యందును నేర్పు, చాకచక్యము లేని మూర్ఖురాలు! ఆమె వలన నేపనులు జరుగును? చినటకామె తన బట్టలను వస్తువులనుగూడ సరిగ సర్దుకొను నేర్పులేనిదనుటలో నసత్య

మానవంతయు లేదు. అట్టియామె యిప్పుడీ సంసారమునంతను జక్కఁబెట్టఁ బూనుకొన్నది. అంతయునాశనమగును. అందఱుఁగలిసి వంశగౌరవమును మంటఁగలుపుదురు. సరియైన సమయములో నేదోయొకవస్తువు తోటగును. ఇటువంటి కార్యముల నిర్వహించుట కెక్కుడుగా ననుభవము గావలయును. లేనిచో నొక్కొక్క వస్తువెన్నిమారులు తిరిగితిరిగి వడ్డించినను చెల్లుఁబడి కానంత తయారగును. ఒక్కొక్కవస్తువు కొంత మందికి మొదటి వడ్డనలోనేవాడ నందనంత తక్కువగ నుండును. చివరకు వీరందఱ కిట్టిబుద్ధిపుట్టినదేమి? అప్రతిష్ఠ కుటుంబమున శాశ్వతముగా నిలచిపోవునను విషయము వీరి మనసునకుఁ దోచినట్లు లేదు.

మంచిది! కోడ లినుప పెట్టెను దెరచుచున్నదేల? నాయనుజ్ఞ లేనిదే పెట్టెను దెరచుట కీమె కేమియధికార మున్నది? తాళపుఁజెవు లామెవద్ద నుండవచ్చుఁగాక; ఇతఃపూర్వము నేను డబ్బుదీసి యిచ్చునంతవఱకుఁ దానుస్వయముగ బెట్టెఁదెఱచెడిదికాదు. నేఁడు నాతో నిమిత్తమే లేనట్లుగఁ బెట్టెఁ దెఱచుచున్నది. దీనిని నేను సహింపఁజాలను— ఆమె మానస మిట్టి యాలోచనల నుడకిపోవుచున్నది.

ఆమె తీవ్రస్వభావముతో లేచి పెద్దకోడలి వద్దకు వెళ్ళి కఠోరస్వరముతో నన్నది—"ఇనుప పెట్టె నెందుకుఁ దెఱచు చున్నావు కోడలా? నేను నిన్నుఁ దెఱువుమంటినా?"

పెద్దకోడలు నిస్సంకోచభావముతో జవాబిచ్చినది— "బజారునుండి సామాగ్రి వచ్చినది, డబ్బియవలె!"

"ఏ వస్తువు ఏ వెలకు ఎంత వచ్చినది, యను విషయ ములు నాకేమియుఁ దెలియనక్కఱలేదా? లెక్క పత్రము లేమియుఁ జూడకుండ రూపాయలిచ్చుటెట్లు?"

"లెక్క పత్రము లన్నియుఁ జూచుటయైనది."

"ఎవరు చూచినారు?"

"ఎవరుచూచిరో నాకెట్లు దెలియును? వెళ్ళి మగ వారి నడుగుఁడు. డబ్బు దెచ్చి యిమ్మనినారు. తీసికొని వెళ్ళుచున్నాను."

పూలమతి క్రోధమును దిగమ్రింగి యూరకున్నది. క్రోధమును వెడల గ్రక్కవలసిన సమయమిదికాదని యామె యెఱుంగక పోలేదు. ఆతిథ్యమునకు వచ్చిన స్త్రీ పురుషులతో నిల్లంతయు నిండియున్నది. ఇప్పట్టునఁ గుమారుల నదలించి నచో పండితుఁడు మరణించినంతనే వీరిలో వీరికిఁ గలహము లుద్భవించినవని యూరివారందరు నందురు. క్రోధము నతి కష్టముపై దిగమ్రింగి తిరిగి తన గదిలోనికిఁ బోయినది— 'అతిథులందఱు వెడలిపోయిన వెనుక ఒక్కొక్కని సంగతి కనుగొందును. నా యెదుటి కెవ్వరు వత్తురో, నా కెదురు చెప్పు వారెవరో చూతును. వీరి యాకతాయి వేషములు నదలింతును. అనుకొనినది.

కాని తన గదిలో నేకాంతముందుఁగూడ నామె నిశ్చిం తగఁ గూర్చుండలేక పోయినది. పరిస్థితినంతను నతి జాగ్రతగఁ బరిశీలించుచున్నది. సత్కారములలో నియమభంగము జరుగు చున్నదో లేక మర్యాద యుపేక్షింపఁ బడుచున్నదో యను

యాందోళనమా మెలోఁ బెచ్చుపెరిగినది. అతిథులందరు నొక్కే పంక్తిని కూర్చుండిరి. వరండాలో నతికష్టముమీఁద రెండు వందల మంది మాత్రమే కూర్చుండఁగలరు! ఈ అయిదు వందల మంది యతిథులు నదే వరండాలో నెట్లు కూర్చుండఁ గలరు? ఒకరినెత్తిన మఱియొకరిని కూర్చుండఁబెట్టు చున్నారా? ఒకపంక్తి లేచినవెనుక మఱొకపంక్తికి విస్తళ్లు వైచిన నేమిపోని యున్నది? పండ్రెండు గంటలకుఁ బూర్తి కావలసిన భోజనములు రెండు గంటలకుఁ బూర్తియగును; కాని యిక్కడ నీబుద్ధిమంతు లందఱకు నిద్రపోవుటకుఁదొందరగా నున్నది గాఁబోలు! ఏదేనొక విధముగ నీబరువును నెత్తి నుండి దించుకొని విశ్రాంతిగ సుఖనిద్రపోఁగోరుచున్నారు! అయ్యయ్యో! అతిథులందరు నెంత యిరుకుగ నొకరి నొకరంటుకొని కూర్చున్నారు? ఒక్కరికైనఁ గదలుటకు మెదలుటకు నవకాశమున్నట్లు లేదు. విస్తళ్ళొక దానిపై మరొకటి వేయఁబడినవి. పూరీలు చల్లారిపోయినవి. అతిథులు వేడివి తెమ్మని కోరుచున్నారు. మైదాతోఁ జేసిన పూరీలు చల్లారి నచోఁ దోలుముక్కలవలెఁ బంటి క్రింద నారసాగును. వాని నెవరు తిందురు? వంటవానిని గాడిపొయ్యి వద్దనుండి యెవ్వ రెందుకు పంపిరో తెలియుదు. ఇదంతయు పరువు ప్రతిష్ఠలు గంగపాలగుటకే వచ్చినది-అని పూలమతి యాందోళనము జెందుచున్నది.

వెంటనే యాచోటున నేదోకలవరము బయలుదేరినది; కూరలలో నుప్పు వేయలేదట. పెద్దకోడలు కంగారుగ నుప్పు

నూఱు నారంభించినది. పూలమతి కోపముతోఁ బండ్లు కొఱకు చున్నది; కాని యామె యీసమయములో నెవ్వరి నేమనఁ గలదు? తుదకు ఉప్పునూఱి విస్తళ్ళలో నందఱకు వడ్డించిరి. ఇంతలోఁ దిరిగి వేఱొక కలవరము బయలు దేరినది—"మంచి నీళ్ళు వేడిగనున్నవి, చల్లని నీళ్ళు తెం"డని అతిథులు కేకలు వైచుచున్నారు. చల్లనినీళ్ళ కిక్కడ నేయేర్పాటును జరుగ లేదు. మంచుగడ్డను గూడఁ దెప్పించి యుంచలేదు. వెంటనే యొకనిని బజారునకుఁ బర్వెత్తించిరి; కాని బజారులో మంచు గడ్డ లభింపలేదు. మంచుగడ్డకు వెళ్ళిన మనుజుఁడు వెళ్ళినట్లు గనే శూన్యహస్తాలతోఁ దిరిగివచ్చినాఁడు. అతిథులు గత్యం తరములేక వెచ్చని కుళాయినీటినే త్రాగవలసివచ్చినది.

పూలమతికిఁ జేతనైనచోఁ గుమారుల నెంత తీవ్రముగ నైనను దండించి యుండెడిది. ఇంతకు ముందెన్నఁడు నతిథుల కామె యింటియందింతటి దుర్గతిసంభవింపలేదు. ఎవరికిపారే యజమానులు గావలెనని కుమ్ములాడు చున్నట్లున్నది చూడగా నీయింటిలోని విషయము! మంచుగడ్డవంటి అనసర వస్తువును దెప్పించి యుంచుకొనవలెనను జ్ఞానము వీరిలో నేరికిఁ గలుగలేదు. ఎవరికిని గొప్పలు చెప్పుకొను చుండు టతోఁ దీరికయే లభింపకయున్నది. ఇటువంటి యత్యనసర విషయములు జ్ఞాపకము కూడ నెట్లువచ్చును? అతిథులందఱు మనస్సులో నేమనుకొందురో గదా! 'ఎంత గొప్ప సమా రాధనఁ జేసిరి! కొంపలో మంచుగడ్డ యైనలేదు!' అనక మానుదురా! ఈయభాగ్యులు పెత్తనము వెలగఁబెట్టి యెంత

యపకీర్తిం దెచ్చినాను? ఇట్లు ప్రేమమతి మనస్సులో లేంగు చున్న యూహపోను నెవ్వరెఱుగంగలరు?

మంచిది! ఇదేమి? మఱల గగ్గోలు ప్రారంభమైనది! అరెరే!!! అతిథులందరు భోజనములు పూర్తిగాకుండగనే లేచిపోవుచున్నారేల! ఏమిటి విశేషము?

ప్రేమమతి యిక నౌదాసీన్యము సహింపలేక పోయినది. గదిలోనుండి బయలుదేరి వరండాలోనికివచ్చి కాంతానాథునడిగినది—"ఏమైనది నాయనా? అతిథులందఱు లేచి పోవుచున్నారేమి?" యని.

కాంతానాథుడేమియు జవాబుం జెప్పకుండం దప్పించుకొని యాచోటువీడి పోయినాడు. ప్రేమమతి కేమియుం దోంచక మండిపడుచున్నది. ఇంతలో నింటిదాసి కనుపడగా ప్రేమమతి దానిని గూడ నదేప్రశ్నించినది. "ఎవరి విస్తరిలోనో పులుసు వడ్డించుచుండగా పులుసుతోంగూటు వచ్చిన యెలుకపిల్ల యొకటి/పడినదని తెలిసినదమ్మా"యని నెమ్మదిగా పలికినదాదాసి. ప్రేమమతి చిత్రప్రతిమవలె నిశ్చేష్టురాలైయచటనె నిలువంబడి పోయినది. ఆమె హృదయములో బెద్దపెంటే బయలుదేరినట్లనిపించినది. తల గోడకు వైచి కొట్టుకొనవలె ననిపించినది. దౌర్భాగ్యులు, విందున కేర్పాట్లుచేయ నుద్యమించిరి! వీరి యజ్ఞానమునకు మూర్ఖత్వమునకు నేమైన హద్దున్నదా? ఎందఱు బంధుమిత్రుల ధర్మమును మంటగలిపిరి? అతిథులు లేచిపోక యెట్లు కూర్చుందురు? ప్రత్యక్షముగం జూచుచుం దమతమ ధర్మము నెవ్వరు

చెడగొట్టుకొనుటకు సిద్ధపడుదురు? చేసిన ప్రయత్నము లన్నియు మంటిపాలైనవి. వందలకొలది రూప్యములు కృష్ణార్పణమైనవి–పూలమతి యీవిధముగ విహ్వలమతియగుచున్నది.

అతిథులందఱు లేచిపోయిరి. విస్తళ్ళాహార పదార్థములతో నిండియున్నవి. అరక్షిత ద్వారములనుండి లోనికెప్పుడు ప్రవేశించినవో రెండు గ్రామసింహములవానిపైఁ గలియఁబడి యొకదానిపై నొకటి కవ్వించుకొనుచు నఱచుచున్నవి. ఈదృశ్యముఁ జూచి–తన కాఁపుర మీనాటి కీఁవిధముగా గుక్కలు జించిన విస్తరియైనది గదా యని–పూలమతి యతి వికలమతి యైనది.

నలువురన్నదమ్ములు తలవాకిట లజ్జితులై తలలువంచి నిలువఁబడి యుండిరి. పరస్పర నేరారోపణముఁ జేసికొనుచుండిరి. పెద్దకోడలు తన తోడికోడండ్రపైఁ గోపించుచున్నది. తోడి కోడండ్రందఱు నాదోషమును ముక్కుపచ్చలారని కుముద నెత్తిపై ఁద్దుచున్నారు. కుముద నిలువఁబడి యేడ్చుచున్నది. అదేసమయమున పూలమతి మండిపడుచు వచ్చి అన్నది–"నా న్యాస పూర్తిగ మంటఁగలిసినదా? ఇంకేమైన లోపమున్నదా? అందఱుఁ గట్టగట్టుకొని పోయి గంగఁబడి చనుఁడు! ఈయూర నెవరికైన ముఖముచూపు నవ్వత మీకుఁ గలదో?"

నలువురు కుమారులలో నొక్కకుమారుఁడును జవాబు చెప్పలేదు.

పూలమతి యింకను ప్రచండమతియై యున్నది - "మీ కేమి? ఎవరికిని సిగ్గుబిడియము లున్నట్లు గూడ లేదు. ఈయింటి కీర్తిప్రతిష్ఠల కొఱకు జీవితమును ధారపోసిన వారియాత్మ దుఃఖించుచున్నది. ఆయన పవిత్రాత్మను మీరీ విధముగఁ గళంక పఱచినారు. ఊరంతయు నునియు చున్నది. ఇక మీగున్నములోని కెవ్వరు నెట్టి యవసరము లందు నడుగుపెట్టరు."

కాంతానాథుఁడు కొంతసేపటి వఱకు మాట్లాడక వినుచు నిలిచియుండెను. చివఱకుఁ జిరాకుపడుచు ననెను- "మంచిది, ఇఁక చాలింపు మమ్మా! పొరపాటైనది; నేమం దఱము నంగీకరించుచున్నాము; అతి భయంకరమైన పొర పాటు జరిగినది; ఆ పొరపాటునకు గాను ఇంటిల్లిపాదిని చంపివైతువా యేమి?"

పెద్దకోడలు తన నిర్దోషిత్వమును గుఱించి చెప్పినది- "అమ్మాయి (కుముద) యీమాత్రము పనిని గూడఁ జేయ లేదని యెట్లనుకొనఁగలము. ఆమె కూరముక్కలను బరిశీ లించిచూచి చోష్యభాండమున వైచినచో నీప్రమాదమే జరిగియుండెడిది గాదు. బుట్టబుట్ట యెత్తి పులుసున గ్రుమ్మ రించినది. ఇందు మాతప్పేమున్నది?"

కాంతానాథుడు భార్య నదలించినాఁడు- "ఇందుఁ గుముద దోషములేదు, నీదోషము లేదు, నాదోషమును లేదు. సంయోగవశమున జరిగినది. విధాత యప్రతిష్ఠను బడుఁడని మా నుదుట లిఖించి యున్నాఁడు. అదియే జరిగినది. ఇంత

పెద్దసమారాధనలయందు గుప్పెడుగుప్పెడు కూరముక్కలఁ దీసి కళాయిలో వేయరు. బుట్టలకు బుట్టలెత్తి గ్రుమ్మరింతురు. అప్పుడప్పుడిటువంటి దుర్ఘటనలు జరుగుచునే యుండును; అయినను నిందు నగుపాటేమున్నది? అప్రతిష్ఠయేమున్నది? నీవనవసరముగ గాయముపై నుప్పుఁజల్లుచున్నావు."

పూలమతి పండ్లు కొఱుకుచుననినది- "సిగ్గుపడుట లేదు సరికదా ఇంకను లజ్జాకరముగ మాట్లాడుచున్నావేమిరా?"

కాంతానాథుఁడు నిస్సంకోచముగ ననినాఁడు-"ఎందులకు సిగ్గుపడవలెను? ఎవరి వస్తువునయిన దొంగిలించితినా? చక్కెరలోఁజీమలు, పిండిలోఁ బురుగులు, చూచి యుపయోగించుట లేదా? ముందుగాఁ జూడఁజాలకపోయితిమి? అదియే పొరపాటైనది. లేకపోయినచో రెండవకంటివానికిఁ దెలియకుండ నెలుకపిల్లను దీసి యావలఁ బారవైచెడివారము. ఎవరికిని దెలిసెడిదికాదు."

పూలమతి చకితయై యన్నది— "ఏమనుచుంటివి? చచ్చిన యెలుకపిల్లను దినిపించి యందఱ ధర్మమును నాశనము జేయ సమకట్టెదవా?"

కాంతానాథుఁడు చిఱునవ్వునవ్వి, యనినాఁడు— "పూర్వకాలపు మాటలాడెద వేమమ్మా! ఇంత మాత్రమున ధర్మము నాశనముగాదు. విస్తళ్ళముందునుండి లేచిపోయిన యీధర్మాత్ములలో మేఁక-గొఱ్ఱె మాంసమును దిననివారెవరున్నారు? చెరువునందలి తాఁబేళ్ళను నత్తలను

గూడ నేనను నూరకబోనిచ్చుటలేదు. చిన్న యెలుకపిల్ల వలన నేమి మునిఁగిపోయినది?"

పూలమతికి తానుభూమిలోనికి క్రుంగిపోవుచున్నట్లని పించినది. ఇఁక ప్రళయము సంభవించుట కాలస్యము లేదు. 'చదువుసంధ్యలు నేర్చిన ప్రబుద్ధుల మనస్సులలోనే యిట్టి యధార్మిక భావములు బుట్టుచున్నప్పుడు భగవంతుఁడే ధర్మ రక్షణముఁ జేయఁ బూనుకొనుఁగాక'- యనుకొని యామె ముఖము చిన్నబుచ్చుకొని యచటినుండి వెడలిపోయినది.

## 2

రెండు మాసముల కాలము గతించిపోయినది. రాత్రి సమయము. పనిపాటలనుండి విశ్రాంతినొంది నల్వురన్న దమ్ములు నొకగదిలోకూర్చుండి మంతనము లాడుచున్నారు. పెద్దకోడలు గూడ కుట్రయందుఁ బాల్గొనియున్నది. కుముద వివాహప్రశ్న ముదయించినది.

కాంతానాథుఁడు మంచము మీఁదఁ జారపడుచు అని నాఁడు—నాన్నగారి మాట నాన్నగారితోనే గతించిపోయి నది. మురారీ పండితుఁడు విద్వాంసుఁడు, కులీనుఁడు కూడ కావచ్చు. కాని తన విద్యనుఁ గులీనతను డబ్బుకు నమ్మజూపు నీచుఁడాతడు. అయిదువేల కట్నముసంగతి యటుండనిండు- కట్నము కానుక లేమాత్రమును పుచ్చుకొనకపోయినను నిట్టి నీచభావములు గలవారిపిల్లవానికిఁ గుముదనిచ్చుటనాకిష్టము లేదు. వారికిఁ మనకాసంబంధమును కూర్చుట వైముఖ్యముఁ

దెలియఁజేసి, వేఱొక సంబంధము నన్వేషింతము. మనవద్ద నున్నది కేవల మిరువది వేలు రొక్కము మాత్రమే! ఒక్కొక్కరి వాటాకయిదు వేలువచ్చును. అయిదు వేలుకట్నమిచ్చి మఱియైదు వేలు లాంఛనములకు, విందు వినోదములకు వదలించుకొన్న చో మనమందఱము దివాలాతీయవలసిన దే!"

ఉమానాథుఁడనినాఁడు—"నాకు నాయౌషధాలయముఁ దెఱచుటకుఁ గనీస మయిదు వేలు గావలయును. నాభాగము నుండి యొక్క పైసగూడ నీయ వలనుపడదు. దుకాణము తెఱచిన వెంటనే యాదాయము వచ్చిపడదుగదా! కనీస మొక సంవత్సరము వఱకు నాసంసార మంతకుఁ గావలసిన ఖర్చులన్నియు సమిష్టి కుటుంబమునుండియే జరుగవలసి వచ్చును గూడ."

ఇంతదనుక దయానాథుఁడొక వార్తాపత్రికను జూచుచున్నాఁడు. పత్రిక మడతవైచి యావలనుంచి నేత్రముల నుండి సులోచనములఁ దీయుచు ననినాఁడు—నేనొక పత్రికను బ్రారంభింపవలె ననుకొనుచున్నాను. ప్రెస్సునకుఁ బత్రికకుఁ గనీసము పదివేలు పెట్టుబడి గావలసి యున్నది. నావంతు ద్రవ్య మయిదు వేలున్నవి; మఱియైదు వేల కేరినైన భాగస్థునిఁ గలుపుకొనవలసి యున్నది. పత్రికలలో వ్యాసములు వ్రాయుచు సంసారమును పోషింపజాలను.

కాంతానాథుఁడు తలద్రిప్పుచు ననినాఁడు—"రాను భజన జేయవలసిన దే! ఊరక యిచ్చినను బత్రికలలో వ్యాసములఁ బ్రకటించువారు లేరు. రూపాయల నెదురిచ్చువారు గూడ నెవరుందురు?"

దయానాథుఁడు ప్రతివాదముఁ జేసినాఁడు-"అందఱి విషయము వంటిదికాదు నాతోఁ గూర్చిన వ్యవహారము. నేనుమాత్రమెన్నఁడుఁ బ్రతిఫల రహితముగ నే వ్యాసమును వ్రాయుటలేదు."

కాంతానాథుఁడు తనమాట నుపసంహరించుకొనుచున్నట్లు నెను-"నీవిషయము నేను జెప్పుటలేదు తమ్ముఁడు! కొలదియో గొప్పయో నీకు లభించుచుండవచ్చు; కాని వ్రాసెడి వారందఱకు మాత్రము సిరాఖర్చు, కాగితముల వ్యయమునకు నైనద్రవ్యముగూడ లభించుటలేదు, అని నా వాక్యాశయము."

పెద్దకోడలు శ్రద్ధాభావముతో నన్నది - "కన్య యదృష్టవంతురాలైనచో దరిద్రుని యింటఁగూడ సుఖింపఁ గలదు. దురదృష్టవంతురాలైనచో మహారాజు నింటఁగూడ దుఃఖింప వలసివచ్చును. అది యంతయు విధివిలాసము గాని, వేరుగాదు."

కాంతానాథుఁడు భార్యవైపు ప్రశంసాపూర్వకముగఁ జూచి యిట్లనినాఁడు-"పైగా ఈ సంవత్సరమే మనము సీతానాథుని వివాహముఁగూడ చేయవలసి యున్నది."

సీతానాథుఁ డందఱికంటెఁ జిన్నవాఁడు. తలవంచుకొని సోదరుల స్వార్థపూరితప్రసంగములను వినివిని తానేదో చెప్పవలెనని యౌత్సుక్యముతో నుబికిపోవుచున్నాఁడు. తన పేరు వినినంతనేయ నెను-"నావివాహమును గుఱించి మీ రెవరును విచారింపవలసినదిగాని వివాదపడవలసినదిగాని కించిత్తును లేదు. నేనేదైన నొక స్థిరజీవితమార్గము నేర్పరచు

కొనుటకు వివాహవిషయముఁ దలపెట్టఁదలఁచుకొనలేదు. యథార్థము చెప్పవలెననిన నేనసలు వివాహముఁ జేసికొనఁ గోరుటలేదు. దేశమునకిపుడు పిల్లల యవసరములేదు; పని చేయువారి యవసరమున్నది. నా భాగమునకు వచ్చు రూపాయలను మీరు కుముద వివాహమునకు ఖర్చుఁజేయుఁడు. మాటలన్నియు జరిగి నిశ్చయించుకొనిన పిమ్మటఁ బండిత మురారీలాల్ సంబంధమును తెగ్రదెంపులు జేసికొనుట యుచితమైన పనిగాదు."

ఉమానాథుఁడు తీవ్రస్వరముతో ననెను—"పదివేల రూపాయ లెక్కడినుండి వచ్చును?"

సీతానాథుఁడు భయపడుచు నిట్లనెను—"నేను నా వంతు డబ్బు నిచ్చుటకే చెప్పుచున్నాను. మన చెలియలు సుఖించిన మనకును సుఖమే! నా భాగమును కుముదవివాహ మునకై సంతోషముతో వదలివేయుచున్నాను."

ఉమానాథుఁడు—"నీవంతు అయిదువేలు నవ్మూయి పెండ్లికట్నమునకె సరిపోవును. మరి శేషించినవి?"

సీతానాథుఁడు—"మురారీలాల్‌తో కట్నములోఁ గొంత తగ్గింపుమని చెప్పుదము. ఆయన, ఈసమయములో నామాత్రపు నౌదార్యమును చూపఁజాలని స్వార్థాంధుఁడు కాఁడు. భగవదనుగ్రహమువలన నాయన మూఁడువేలతో సంతుష్టుఁడైనచో నయిదువేలలో వివాహము పూర్తిచేయ వచ్చును."

ఉమానాథుఁడు కాంతానాథునితో ననెను—"వినుచుంటిరా అన్నయ్యా! వీనిమాటలు ?"

దయానాథుఁడ నెను—"ఇందు మీ కేమినష్టమున్నది? తమ్ముఁడు తన భాగమిచ్చు చున్నాఁడు; ఖర్చు చేయుఁడు. మురారీ పండితునితో మన కేమియు వైరము లేదు. మనలో నెవరో యొకరు త్యాగసంపన్ను లున్నందులకు నాకు మాత్రముచాల సంతసముగ నున్నది. వీనికిఁ బ్రస్తుతముడబ్బు అవసరము లేదు. ప్రభుత్వమునుండి యుచితవిద్యాసౌకర్యముఁ బొందుచునే యున్నాఁడు. ప్యాసయిన బిమ్మట నేఁడేనొక యున్నతస్థానమున నుద్యోగము తప్పకలభింపఁగలదు. ఇట్లను కొనుట కాతని విషయమునఁ గొంత యవకాశము గలదు. మఱి మనపరిస్థితులు మాత్రమటువంటివి కావుసుమా!"

కాంతానాథుఁడు దూరదృష్టిని సూచించుచు ననెను—"నష్టమును గురించి యొక్కఁడే జెప్పెను. మనలో నొకరు కష్టపడుచుండఁగ మిగిలిన వారందఱుఁ జూచుచు గూర్చుందురా? వీఁడింకను జిన్నపిల్లవాఁడు. రేపువీఁడువిదేశములకు వెళ్ళి చదువుటకుఁగూడ ప్రభుత్వ గౌరవవేతనము లభించుననిగాని, సివిల్‌సర్వీస్‌లో స్థానము లభించుననిగాని, నిశ్చయముగ నెవరు చెప్పఁగలరు? ఈతఁ డపు డెవ్వరి నాశ్రయించును? ఎవరిముందు చేయిజాపును? కట్నముల ఖర్చు కని వీని జీవితము నాశనము చేయుటకు నే నంగీకరింపఁ జాలను."

ఈ తర్కము సీతానాథుని మనస్సునుగూడ విఱిచి వైచినది. సంకోచించుచు నతడిట్లనెను—"ఔను, ఒక వేళ వటులే జరిగినచో నిస్సందేహముగ నాకు డబ్బు అవసరము కాఁగలదు."

"అయిన అటుల జరుగుట యసంభవమా?"

"అసంభవమని నేను భావించుటలేదు, సంభవమని కూడ నిశ్చయముగఁ జెప్పలేకున్నాను. డబ్బుమాత్ర మత్యంతావశ్యక మనుట నిశ్చితవిషయము. సిఫారసులను సంపాదించెడివారికే ఉచిత విద్యావేతనములు లభించుచుండును. నాకు సిఫారసు జేయువా రెవరున్నారు?"

"ఒక్కొక్కపుడు సిఫారసులుగూడ నిష్ప్రయోజనమై పోవుచుండును; వేఱొకపుడు సిఫారసు లేమియు లేనివారే సఫలురగుచుందురు."

"అయిన మీ రుచితమని దోఁచిన విధముగఁజేయుఁడు. నేను విదేశములకుఁ బోఁజాలక పోయినను నా కంగీకారమే! కాని కుముదను మాత్రము యోగ్యుల యింటికే పంపఁగోరుచున్నాను."

కాంతానాథుఁడు నిష్ఠాభావముతోన నెను—"యోగ్యుల సంబంధము కట్నము నిచ్చినంత మాత్రముననే లభింపదు! మీ వదిన సెప్పినట్లిది యంతయు విధివిలాసమే! వధువు నదృష్టమే! మురారీలాలు కొక్క నమస్కారముఁ జేసి కొలఁదిలో నంగీకరించు వరు నెవ్వనినైన నన్వేషింపవలెనని యే నే ననుకొనుచున్నాను. ఈ వివాహమున కొక్క వేయి కంటె నెక్కుడుఖర్చుఁ జేయఁజాలము; పండిత దీనదయా ళెట్లుండును?"

ఉమానాథుఁడు ప్రసన్నుఁడై యనెను—"చాల బాగుగ నుండును. యం. ఏ. లు, బి. ఏ. లు లేకపోయినను పౌరోహిత్యములో బాగుగ సంపాదించుకొనుచున్నాఁడు."

దయానాథుఁడా దీనదయాలుని తోడి సంబంధమునకు నభ్యంతరముఁ జెప్పుచు నమ్మను గూడ నడుగవలె ననినాఁడు.

కాంతానాథున కీవిషయమున తల్లి సలహాతో నిమిత్త మున్నట్లు యేమాత్రముఁ గోచరించుటలేదు. అనెను-"ఆమె బుద్ధియంతయు భ్రష్టమైపోయినది. ఆమె తన పాతకాలపు టాలోచనలను వదలిపెట్టదు. మురారీలాల్ పేరును గుత్తకుఁ బుచ్చుకొని కూర్చున్నది. ఆరోజులు గతించినవను విషయ మును గ్రహింపదు. మన మందఱము నాశనమైపోయినను సరియే! కుముదను మాత్రము మురారీ పండితుని యింటికిఁ బంపవలెనని యామె యుబలాటము!"

ఉమానాథుఁడొక సంశయమును వెలిబుచ్చెను—"చూచుచుండుఁడు, అమ్మ తన నగలన్నియుఁ గుముద కిచ్చివైచును."

కాంతానాథుని స్వార్థము నీతి కెదురు తిరుగజాలక పోయినది. ఇట్లనెను—"నగలపై నామెకుఁ బూర్తి యధి కారము గలదు. అది యామె స్త్రీ ధనము. ఇచ్చవచ్చిన వారి కామె యిచ్చుకొనవచ్చును."

ఉమానాథుఁడనెను—"స్త్రీధనమైనచో నేమి దానికే దోచిపెట్టునా? చివఱకది కూడ నాన్నగారి సంపాదనయే కదా!"

కాంతా—"ఎవరి సంపాదనమైన గావచ్చు; స్త్రీ ధన ముపై నామెకుఁ బూర్తి యధికారమున్నది. ఈవిషయము శాస్త్రము గూడ నొప్పుకొనును."

ఉమా—“మీరు లేనిపోని న్యాయశాస్త్రములకు బద్ధులగుచున్నారు. ఇరువది వేలలో నల్వురు వాటాదారులు! పదివేలరూపాయల నగలమ్మవద్ద నుండిపోవుట! చూడుఁడు! వీనిత్రోడనేయమ్మ, కుముదవివాహామునకై మురారిపండితుని సంబంధమును నిశ్చయించి వైచును.”

ఉమానాథుఁ డింత పెద్దమొత్తము నింత సునాయాసముగ బోనిచ్చు స్వభావము గలవాఁడు కాఁడు. అతఁడు కూట నీతిఁ గుశలుఁడు. ఏదేనొక యెత్తుఁగడఁ బన్ని తల్లివద్దనుండి నగలన్నియు సంగ్రహించి వైచును. అంతదనుకఁ గుముద వివాహచర్చ నామెయొద్దఁ దెచ్చి యామె నుద్రిక్త పఱచు టుచితముగాదు.

కాంతానాథుఁడు తలఁ ద్రిప్పుచుననెను—“తమ్ముఁడూ! నేనీ కపటవ్యవహారముల నామోదింపఁ జాలను.”

ఉమానాథుఁడు ఖిన్నవదనుఁడై యిట్లనెను—“నగలు పదివేలకుఁ దక్కువ విలువ యుండవు.”

కాంతానాథుఁడవిచలితస్వరముననెను—“ఎంతఖరీదు చేయునవైనఁ గానిమ్ము, నేనవినీతికిఁ బాల్పడఁజాలను.”

“అయిన మీరు దూరముగ నుండుఁడు. మధ్యలో నడ్డుపుల్లలు మాత్రము వేయకుండుఁడు.”

“నేను దూరముగనే యుందును.”

“నీవురా! సీతానాథ్?”

“నేనుగూడ దూరముగనె యుందును.”

కాని దయానాథుని ప్రశ్నించినపుడాతఁ డుమానాథునితో సహకరింప సంసిద్ధుఁ డాయెను. పదివేలలో రెండున్నరవేలు తనకే లభింపగలవు. ఇంత పెద్దమొత్తము కొఱకుఁ గొంచెము కూటనీతి నవలంబింపవలసివచ్చినను క్షమార్హ మగునుగదా యని యప్పటివారి యాలోచనలు.

# 3

**పూ**లమతి రాత్రి భోజనము చేసి పండుకొనగనే యుమానాథ దయానాథు లిద్దఱు నామెవద్దకుఁ బోయి కూర్చుండిరి. ఇద్దఱు నేదేనొక పెద్దవిపత్తునఁ జిక్కుకొనిన వారివలె ముఖములు పెట్టుకొనివచ్చియుండిరి. పూలమతి సంశయాస్పదురాలై యడిగినది—"మీారిద్దఱు నేదోభయ భీతులైనట్లు గన్పట్టుచున్నారేమి ?"

ఉమానాథుఁడు తల గోకికొనుచు ననెను—"సమాచారపత్రములలో వ్యాసములు వ్రాయుట చాల ప్రమాదకరమైన పనియమ్మా! ఎంతజాగ్రత వహించి వ్రాసినను, ఎచ్చటనో యొకచోటఁబట్టువడక దప్పుటలేదు. దయానాథుఁడొకవ్యాసమువ్రాసెను. ప్రభుత్వమువారు దాని కయిదు వేలరూప్యముల జామీానుకోరినారు. రేపుపగలు బన్రెండు గంటలలోగా జామీాను పైకముఁ జెల్లింపకపోయిన కైదు

చేయుదురు. మఱియుఁ బదిసంవత్సరములు కఠినశిక్ష విధింపఁబడు శిక్ష నుక్రిందికి వచ్చు నేరమయ్యెది."

పూలమతి తలఁ బాదుకొనుచునన్నది—"అయినచో నటువంటి మాటలను వ్రాయు టెందులకురా నాయనా? మనకిపుడు చెడురోజులు వచ్చినవను సంగతి నెఱుంగవా? ఏదేనొక విధముగ జామీను గట్టకుండఁ దప్పించుకొను మార్గము లేదా?"

దయానాథుఁ డపరాధి కోతెచ నెను—"నేనేమియు నంత చెడుమాట వ్రాయ లేదు; కాని విధినిర్ణయమిట్లున్నది. మండలాధిపతి చాల కఠినుఁడు; ఎంత మాత్రము తగ్గింపుఁ గూడఁ జేయఁడు. నేను శక్తికొలఁది నెంతయో ప్రయత్నించి జూచితిని."

"అయిన నీవు కాంతానాథునితో రూపాయల నేర్పాటు జేయుమని జెప్పలేదా?"

ఉమానాథుఁడు ముఖముఁ జిట్లించుకొని యనెను—"ఆయన స్వభావము నీ వెఱుంగుదువుగదమ్మా, ఆయనకు డబ్బు ప్రాణములకంటెఁ బ్రియమైనది. వీనికి ద్వీపాంతరవాస శిక్షయే విధింపఁబడినను సమ్మతించునుగాని యాయన యొక్క దమ్మిడీగూడ నిలువ ద్రవ్యమునుండి యీ విషయమున ఖర్చుచేయనీయఁడు."

దయానాథుఁడాతనివచనముల సమర్థించెను—"అందుచేతనే నేనాయనతో నీవిషయముఁ బ్రస్తావించనేలేదు."

పూలమతి మంచముపైనుండి లేచుచుననెను—"పద నేను జెప్పెదను; ఎందుకీయఁడు? డబ్బు యిటువంటి దినములలో వినియోగించు కొనుటకేగాని పాఁతరవైచి యుంచుకొనుటకుఁగాదు."

ఉమానాథుఁడు తల్లి నాటంకపఱచినాఁడు- "వలదమ్మా! ఆయనతో నేమియుఁ జెప్పవద్దు. రూపాయలీయఁడు, సరిగదా యనవసరమైన గందరగోళములను లేవఁదీయును. ఆయన తన యుద్యోగమునకు భంగము కలుగునను భయముతో వీనినింటినుండి గూడ వెడలఁగొట్టును. ఆయన స్వయముగ వెళ్ళి యధికారులకు వీనినిగూర్చిన విషయములఁ జెప్పివైచినను మనమాశ్చర్యపడ నక్కరలేదు."

పూలమతి గత్యంతరము లేక యనినది—"అయిన జామీను గట్టుటకేర్పాటు లేమి జేయుదువు? నావద్ద రూపాయలులేవు. అవును! నానగలున్నవి, అవి తీసికొనిపోయి, యెచటనైనఁ దాకట్టుబెట్టి జామీనుఁ గట్టివేయుము. ఇప్పటికైన బుద్ధితెచ్చుకొని నేటినుండి యేపత్రికలోను నితరుల నొవ్వఁజేయు నేయొక్క మాటయైనను వ్రాయనని చెంపలు వేసికొనుము."

దయానాథుఁడు చెంపలపైఁ జేతులఁ బెట్టుకొని యనెను-"లేదమ్మా! నీనగల నడ్డుబెట్టుకొని నేనీయుచ్చునుండి బయటపడుటకు నామనస్సంగీకరించుటలేదు. అయిదు-పది సంవత్సరముల కైదు విధించెదరు; అనుభవించి వచ్చెదను. ఇక్కడకూర్చుండి మాత్రము నేఁజేయునదేమున్నది?"

పూలమతి గుండెల బాదుకొనుచు ననెను—"ఏమి మాట లనుచుంటివి నాయనా నోటివెంట! నాకంఠములోఁ బ్రాణముండగ నిన్నెవరు ఖైదుచేయగలరు? వాని ముఖమున నిప్పులు బోయక యూరకొందునా? నగలిటువంటిసమయములకుఁ గాక మఱియెందులకు? నీవే లేనపుడు నేనానగలు కట్టుకొని పోదునా?"

ఆమె నగలపెట్టెఁ దీసికొనివచ్చి యాతనిముందుఁ బెట్టినది.

దయానాథుఁ డుమానాథుని వైపు నేరారోపణభావమునఁజూచుచు ననెను—"మీయభిప్రాయమేమిటిఅన్నయ్యా! ఇందుచేతనే యమ్మకీవిషయముఁ దెలియనీయ వద్దని మొదటినుండియుఁ జెప్పుచుంటిని. ఖైదుశిక్షయే విధింతురుగాని యంతకన్న నురిఁదీయరు గదా!"

ఉమానాథుఁడు సిఫారసు జేయుచున్న వానివలె ననెను—"ఇంతపెద్ద దుర్ఘటన జరుగుచుండ నమ్మకుఁ దెలియ నీయకుండుటెట్లు? అయినవాని కాపద ప్రాప్తింపనున్నదనిన విషయము కడుఁపులోఁ బెట్టుకొని కూర్చుండుట నావలనఁగానిపని; కాని యిప్పట్టునఁ గర్తవ్యమేమో నేను నిర్ణయింపలేక బోవుచున్నాను. నీవు జైలునకుఁ బోవుటను నామోదింప లేకున్నాను; అమ్మనగలఁ దాకట్టు వెట్టుటను నామోదింప లేకున్నాను."

పూలమతి బాధాపూర్వక స్వరముతో నడిగినది—"మీకంటె నాకు నగలెక్కుడు ప్రియమైనవని దలంచు

చుంటిరా? నేను నా ప్రాణములను సహితము మీకై పరిత్యజింపఁగలను; నగలన నెంతమాత్రము?"

దయానాథుఁడు దృఢభావముతోన నెను—"అమ్మా! నాపై నెంతటివిపత్తయిన వచ్చిపడుఁగాక, నీ నగలను మాత్రము దీసికొనను. ఇప్పటివఱకు నేను నీ కేవిధమైన సేవను జేయఁజాలక పోయితిని ఇప్పుడు నీ నగల నేముఖము బెట్టుకొని దీసికొని బోదును. నీకడుపు జెఱుపఁబుట్టిన యభాగ్యుఁడను. నేఁబుట్టక బోయినను బాగుగనుండి యుండెడిది. సదా నిన్నుఁ గష్టపెట్టు చుంటిని."

పూలమతిగూడ నదే దృఢభావముతో ననెను— "నీవిట్లు దీసికొనకపోయినచో, నేను స్వయముగ వెళ్ళి వీటిని గుదువబెట్టి, స్వయముగ మండలాధిపతి వద్దకుఁబోయి, జామీనుపైకమును గట్టి వచ్చెదను. నేఁ గనులు మూసిన పిమ్మట నేది యెట్లుజరిగినను నాకు పట్టదు—భగవంతుఁడే యున్నాఁడు. కాని నాకంఠమునఁ బ్రాణమున్నంత వఱకు నాసంతానముపై నీఁగ వ్రాలరాదు."

ఉమానాథుఁడు తల్లిమాట కెదురుచెప్ప నిచ్చగింపని వానివలె, నామెనుద్ధరించుటకుఁబోలె నిట్లనెను-"తమ్ముడా! మనకిపుడు మార్గాంతరము లేదు – ఇంతలో బోయినదే మున్నది? తీసికొనుము; కాని జ్ఞప్తియందుంచుకొనుము— నీచేతికి డబ్బు వచ్చినంతనే నగలను విడిపింప వలయును సుమా! మాతృత్వము దీర్ఘతపస్సమానమనుమాట యథా

ర్థము. మన మెంతయు నభాగ్యులము; తల్లి యెడ జూపవలసిన శ్రద్ధాభక్తులలో శతాంశముఁ గూడఁ జూపుట లేదు."

అన్నదమ్ము లిద్దరు నేదో పెద్ద ధర్మసంకటమునఁ బడి విధిలేక పెట్టెఁదీసికొని పోవుచున్న వారివలెఁ బెట్టెను గ్రహించి బయలు దేరిరి.

తల్లి, వారివైపు మాతృవాత్సల్యముతోఁ జూచి లోలోన నాశీర్వదించినది. వారికే విపత్తు కలుగకుండ తన యొడిలో భద్రపరచు కొనవలెనని విహ్వలయై వాత్సల్య పూర్ణదృష్టితోఁ జూచుచున్నది. నేఁడు—చాల నెలలపిమ్మట ఆమె భగ్నమాతృ హృదయము తన సర్వస్వము నర్పించి యానంద విభూతినందినది. ఆమె యీయింటికి యాజమా న్యము వహింపఁగోరుట యిట్టి త్యాగముకొఱకే!– ఇటువంటి ఆత్మ సమర్పణము కొఱకే! అధికారము, లోభము నచట ఛాయామాత్రముగఁగూడ లేవు. త్యాగమే ఆమె యానం దము ! త్యాగమే ఆమె యధికారము ! గతించిన తన యధి కారము నామె నేఁడు తిరిగిపొంది, తన కడుపుపంట కొఱకై తన సర్వస్వమును సమర్పించి పరవశయైనది.

## 4

పదునాఁడు మాసములు గడచిపోయినవి. తల్లి నగల నన్నిఁటిని సంగ్రహించి నల్వురుసోదరులు నామెను సంతోష పెట్ట సాగిరి. ఆమె మనసును దుఃఖింపఁ జేయవద్దని తమతమ భార్యలకుఁ గూడఁ జెప్పిరి. కొంచెము శిష్టాచారముగ నున్నంత మాత్రమున యామె యాత్మకు సంతృప్తి కలుగు

చున్నపు డటులాచరించుట వలన నష్టమేమున్నది? నల్వురుఁ దమ కిచ్చవచ్చిన పనినే జేయుచుండిరి; కాని తల్లి సలహా కోరుచుండిరి. ఆమె సునాయాసముగ తమ మాటలను నమ్మునట్లు, తాము జేయు ప్రతివ్యవహారము నామె యామోదించునట్లును, నల్వురుగూడి యేదేనొక కుట్రపన్నుచుండిరి. తోటనమ్మట యామె కెంతమాత్రము నిష్టములేదు; కాని నల్వురును గలిసి కూడపలికికొని యామె నంగీకరింపఁ జేసిరి; కాని కుముద వివాహవిషయమున మాత్రము ఏకాభిప్రాయము కుదరలేదు. తల్లి పండిత మురారీలాల్ సంబంధముపైన, కుమారులు దీనదయాల్ సంబంధముపైన పట్టుఁ బట్టిరి. ఒకదినమున పరస్పర వివాదము జరిగినది.

పూలమతి యన్నది—"తల్లిదండ్రులు సంపాదనలో కొమార్తె భాగముకూడ నున్నది. మీకు పదునారు వేల రూపాయల తోటవచ్చినది; ఏఁబది వేల భవనము వచ్చినది. ఇరువది వేల రొక్కమున నయిదు వేలు కుముద భాగము మాత్రము లేదా?"అని.

కాంతానాథుఁడు నమ్రభావముతో ననినాఁడు—"కుముద మీకొమార్తె–మా చెల్లెలు! నీ వేదో మూఁడునాల్గు సంవత్సరములలో మమ్ములనందఱను వదలిపోదువు; కాని మాకును కుముదకును సంబంధము మాత్రము చాలకాలము వఱకు నిలిచియుండును! మేము మాశక్త్యను సారము దాని కేలోటును జరుగకుండఁ జూతుము; కాని నీవు భాగముల

విషయమై చెప్పినదానికి నేఁజెప్పుసమాధాన మేమన—కుము దకు భాగమను పేర నేమియులేదు. నాన్నగారు జీవించియు న్నచో నప్పటి విషయము వేఱు! ఆయన యామె వివాహ మున కెంతైనను ఖర్చుబెట్ట వచ్చును! ఆయనచేతి కెవ్వరు నడ్డురాఁజాలరు. కాని యిపుడు మేము మాపరిస్థితినిబట్టి యొక్కొక యోగానికిఁగూడ జాగ్రత్త పడవలసివచ్చినది. ఒక్క వేయితో జరుగవలసినపనికి ఐదు వేలు ఖర్చుచేయుట మంచిదికాదు."

ఉమానాథుఁడు సవరణఁదెల్పెను—"అయిదు వేలేమి పది వేలనుడు."

కాంతానాథుఁడు కనుబొమలు చిట్లించి యనెను— "లేదు, నేనయిదు వేలనియే యందును. ఒకవివాహమున కయిదు వేలుఖర్చుఁజేయు సమర్థులము గాము మనము. నేటి మనసంసార పరిస్థితులు వేఱు!"

పూలమతి పట్టుఁదల సూచించుచునన్నది—"అయిదు వేలుఖర్చయినను పది వేలుఖర్చయినను వివాహముమా త్రము మురారీలాల్ పుత్రునితోనే జరుగవలెను. ఈ కాన వచ్చుసంపదయంతయు నా భర్తసంపాదన! నేనుచచ్చి చెడి జాగ్రతపఱచితిని. నాయిచ్చవచ్చినట్లు ఖర్చుచేతును. మీ రొక్కరే నాకడుపునఁబుట్టలేదు. కుముదకూడ నాకడుపున బుట్టినదే! నాదృష్టిలో మీరందఱును సమానులే. నేనెవ్వ రిని నేమియు నడుగవలసిన బనిలేదు. నీవు కూర్చుండి చూచుచుండుము. నేనన్నియుఁ జక్కఁబెట్టెదను. ఇరువది వేలలో నయిదు వేలు కుముదవి."

కాంతానాథునకిపుడు కఠోరసత్యము నాశ్రయించుట తప్ప నన్యమార్గము గోచరింపలేదు. ఇట్లనెను—"అమ్మా! నీవు వ్యర్థముగ మాటలు పెంచుచున్నావు. నీవేడబ్బును నీది యనుకొనుచున్నావో యది నీదికాదు-మాది. మాయను మతిలేనిది నీవుదానినుండి యేమియు ఖర్చు జేయజాలవు."

పూలమతికిఁ బాముకఱచినంత పనియైనది—"ఏమంటివి? తిరిగియనుము! నాభర్త సంపాదించిన డబ్బును—నా చేతులతో నేను జాగ్రతపఱచిన డబ్బును—నాయిచ్ఛవచ్చినట్లు ఖర్చుపెట్టఁజాలనా?" యనికొంత యుద్రిక్తస్వరముతో ననినది.

"డబ్బిపుడు నీదికాదు. మాదై పోయినది."

"అట్లేయగును! కాని యిపుడుకాదు—నేనుఁగూడ చనిపోయిన పిదప!"

"కాదు, నాన్నగారు చనిపోయినంతనే మాదైపోయినది."

ఉమానాథుఁడు నిర్లజ్జాభావముతో ననెను-"అమ్మ న్యాయశాస్త్రము నెఱుఁగదు, వర్థ్యముగఁ బోట్లాటకు సిద్ధముగనున్నది."

పూలమతి క్రోధవిహ్వలయై యన్నది—"నీన్యాయ శాస్త్రము గంగఁగలియుఁ గాక! ఇటువంటిన్యాయము నేనంగీకరింపను. మీతండ్రి యేమంత లక్షాధికారికాదు. నేనుపొట్ట మాడ్చుకొని యీడబ్బు గూడబెట్టితిని. లేకపోయిన మీకు, నేడునిలుచుండుటకుసీడకూడనుండెడిది కాదు. నాకంఠములో,

ప్రాణముండగ మీ మేనకోడల్ని చంపుకొనజాలను. మీ ముగ్గురన్నదమ్ముల వివాహము లొక్కొక్కదానికి నేను పదేసివేల రూపాయలు ఖర్చుజేసితిని. అట్లే నేను కుముద వివాహమునకుఁ గూడ ఖర్చుచేతును."

కాంతానాథుఁడుగూడ నుద్రిక్తుఁడాయెను—"నీ కేమాత్రమును ఖర్చుచేయు నధికారములేదు."

ఉమానాథుఁ డన్నగారి నదలించినాఁడు—"అన్నయ్యా! మీ రెందుల కనవసరముగ నమ్మతో వాదము బెట్టుకొనెదరు? మీ పిల్లవానికి మా కుముద నిచ్చుటలేదని మురార్లాలున కొకయుత్తరము వ్రాసివేయుఁడు. దానితో పీచీ వదలిపోవును. ఈమె న్యాయశాస్త్రము నేమియు నెఱుఁగదు; వ్యర్థముగ వాదనకు మాత్రము దిగును."

ఫూలమతి కొంచెము తగు స్థాయిలో ననెను—"సరే నీ న్యాయశాస్త్ర మేమో చెప్పుము! నేనుఁగూడ కొంచెము విందును!"

ఉమానాథుఁడు శాంతిప్రియునివలె ననెను—"న్యాయశాస్త్రప్రకారము తండ్రి చనిపోయిన వెనుక నాతని యాస్తి పుత్త్రులకు సంక్రమించును. తల్లికిఁగల హక్కు కేవలము తిండి బట్ట పొందుటకే."

ఫూలమతి హృదయము గిలగిల కొట్టుకొనినది. అడిగినది—"ఎవరు రచించిరీ న్యాయశాస్త్రమును?"

ఉమానాథుఁడు శాంతస్థిరస్వరముతో ననెను—"ఇంకెవరు? మన ఋషీశ్వరులు! శాస్త్రకారుఁడు మనువు!"

. పూలమతియొక్క క్షణముసేపు కొయ్యబారిపోయి గాయపడిన స్వరముతోనే నిట్లనెను—"అయినచో నేనీయింటిలో మీ దయాధర్మభిక్షపై నాధారపడవలసిన దాననేనా?"

ఉమానాథుఁడు న్యాయాధీశునివలె నిర్మమ భావముతో నిట్లనెను— "నీ యిచ్చవచ్చినట్లు భావించుకొనవచ్చు."

పూలమతి యాత్మ ఈ వజ్రాఘాతముతో నార్తనాదము చేయసాగినది. ఆమె నోటివెంట కణకణలాడుచున్న యగ్నికణములవలె నీ మాటలు బయల్వెడినవి— "నేనీ యింటిని నిలబెట్టితిని; నేనీ సంపదనంతటినిఁ గూడబెట్టితిని; నేను మిమ్ములఁ గంటిని–పెంచియింతవారల నంతవారలఁ జేసితిని; నేఁడు నేనీ యింటిలో పరాయిదానను! ఇదే మనుధర్మశాస్త్రము; దీనినే మీ రనుసరింపఁ గోరుచున్నారు. చాల బాగున్నది. మీయిల్లు మీసంసారము మీకు దిద్దుకొనుఁడు. మీ యాశ్రితురాలనై యుండుటకు నేనంగీకరింపఁ జాలను. ఇంతకంటె నేను చనిపోవుట యెన్నియో రెట్లు మంచిది. అహా! ఏమి న్యాయము! నేను చెట్టు నాటితిని; కాని దాని నీడను నిలువఁబడు నర్హత నేఁడు నాకు లేదు; ఇదే న్యాయశాస్త్రమైనచో నీన్యాయశాస్త్రము నాశనమైపోవుగాక."

నలుగురు యువకులమీఁద నామె క్రోధసంతాపము లేమాత్రమును పనిచేయలేదు. న్యాయశాస్త్రమను నుక్కుకవచము వారిని రక్షించుచున్నది. ఈ పలుకు ములుకులు వారినెట్లు చలింపఁ జేయగలవు?

కొంచెముసేపయిన తర్వాతఁ బూలమతి యచటి నుండి లేచి వెడలిపోయినది. నేఁడు జీవితములో మొదటి సారిగ నామె వాత్సల్యమగ్న మాతృత్వమొక కఠోరశాప ముగ మారి యామెను ధిక్కరింపసాగినది. ఏమాతృత్వము నామె జీవిత విభూతిగ భావించినదో, యేమాతృత్వ చరణ సన్నిధిని ఆమె యెల్లపుడు తన సమాస్తాశల నర్పించి ధన్యనైతినని భావించెడిదో, ఆమాతృత్వమే నేఁడామెకొకయగ్ని కుండమువలెఁ గన్పట్టుచు, తానందుజ్వలించి భస్మమై పోవు చున్నట్లనిపించినది.

ఆహా! మనుధర్మశాస్త్రకర్త యాఁడుదేయగునో...?

సంధ్యాసమయమైనది. ద్వారము ముందున్న వేఁప చెట్టు తలవాల్చుకొని లోకగతికి క్షోభించుచున్నదా యను నట్లు నిస్తబ్ధమై నిలువఁబడి యున్నది. పశ్చిమాద్రిని ప్రకాశ ప్రాణదాతయు ప్రత్యక్ష దైవమునైన సూర్యభగవానుఁడు పూలమతి మాతృత్వమువలెనే తన చితినిబడి జ్వలించు చున్నాఁడు.

## 5

పూలమతి తన గదిలోనికివెళ్ళి పండుకొనినది, ఆమెకు నడుమువిఱిగిపోయినట్లనిపించినది. భర్త చనిపోయినంతనే తన కడుపునఁబుట్టిన పిల్లలే తన శత్రువులగుదురని యామె యెన్నఁడుఁ గలలోఁగూడ ననుమానింపలేదు. ఏ పిల్లల కామె పాలిచ్చి—తన హృదయ రక్తమునిచ్చి — పెంచి పెద్దలఁ

జేసినదో వారే నేఁడామె హృదయమునింత కఠోరాఘాతములచే వ్రయ్యలు జేయుచున్నారు. తన నెంతమాత్రమును గణింపని, తన కేమాత్రము విలువనీయని, తన్నొక బిచ్చగత్తెవలెఁ జూచుచున్న యాయిల్లామెకొక యంపశయ్యవలె నున్నది. అక్కడనే దిక్కులేని యనాథవలె ముష్టికూడు దినుచుఁ, బడియుండుట యామె స్వాభిమాన ప్రవృత్తి కసహ్యమై పోయినది.

కాని యుపాయాంతర మేమున్నది? తాను పుత్రుల నుండి వేఱుబడి ప్రత్యేకముగ నున్నచో నపకీర్తి యెవరికి? లోకముతనపై నుమిసిన నేమి? పిల్లలపై నుమిసిననేమి? అపకీర్తి తనకేగదా! నల్వురందివచ్చిన పిల్లలుండియు ముసలిది వేఱుగనుండి కూలి నాలి జేసికొని పొట్ట బోసికొనుచున్న దనియే లోకులందురు. తానింతకాలమెవరిని నీచులుగ భావించినదో, వారందఱుఁగూడ నేఁడామెను జూచి నవ్వుదురు. కాదు, ఆ యవమానమీ యనాదరణకంటెఁగూడ నెక్కుడు హృదయ విదారకముగ నుండును. ఇప్పుడు తానింటి వ్యవహారములఁగుట్టుగ నుంచుకొనుటలోనే క్షేమమున్నది. ఔను, ఇకనామె తన్ను తానీ క్రొత్త పరిస్థితుల కనుకూలముగ మార్చుకొనవలసియున్నది. కాలము మారిపోయినది. ఇప్పటివఱకు తానుస్వామినియైయున్నది; ఇఁకనుండి దాసియై యుండవలెను. భగవన్నిర్ణయ మిట్లున్నది గాఁబోలు! పరాయివారివలనఁ జీవాట్లు చెప్పుదెబ్బలు తినుటకంటెఁ దన పిల్లల వలనఁ జీవాట్లుఁ చెప్పుదెబ్బలు తినుట కొంత నయమేగదా!

ఆమె యెంతోసేపటివఱకు ముఖము కప్పుకొని తన దుర్దశకు నేడ్చుచునే యున్నది. రాత్రి యంతయు నీ యాత్మ వేదనతోనే గడచిపోయినది. శరత్ప్రభాతము భయపడుచు భయపడుచు నుషాదేవి యొడినుండి యెవరో యొక కైదీ దొంగతనముగ కైదునుండితప్పించుకొని బయిటకువచ్చు చున్నట్లుగ, వెలికి వచ్చెను. పూలమతి తన నియమమునకు విరుద్ధముగ నేఁడు ప్రాతఃకాలముననే నిద్ర లేచినది. రాత్రి యంతయు నాఁమె మానసిక ప్రవృత్తులలో సంపూర్ణమైన మార్పులు జరిగిపోయినవి. ఇంటనందఱు నింకను నిదుర వోవుచునే యున్నారు; ఆమె వాఁకిలి యూఁడ్చుచున్నది. రాత్రియంతయు మంచునఁ దడిసిన గచ్చునేలపై నాఁమె యరక్షిత పాదములకు ముండ్లపై నడచుచున్నట్లున్నది. భర్త యాఁమె నెన్నఁడు నింత పెందలకడ లేవనిచ్చెడువాఁడు కాదు. శీతల మాఁమెకు చాలహానికరము; కాని ఇపుడా రోజులు కావు! తన భౌతిక ప్రకృతినిగూడ కాలముతోఁబాటుగ నాఁమె మార్చివేయ ప్రయత్నించుచున్నది.

ఊడ్చుపనిఁ బూర్తిచేసికొని, నిప్పురాజేసి, పప్పు బియ్యములలో రాళ్ళేరుచున్నది. కొంతసేపటికి కుమారులు కోడండ్రును నిదురలేచిరి. అందఱును వృద్ధురాలు చలికి ముకుళించుకొని పనిజేయుచుండుట జూచిరి; కాని యెవరును 'నీ వెందుకు శ్రమపడు చుంటివమ్మా' యనుమాట ననరైరి. బహుశః అందఱును తమతమ మానసములలోనె వృద్ధురాలి సౌజన్యతకుఁ బ్రసన్నులై యుండిరనుటకు సందియము లేదు.

నేటినుండి యతిశ్రద్ధగ నింటిపనులన్నియు జేయుట, సంసారాంతర్గత వ్యవహారములకు దూరముగ నుండుటయే పూలమతి నియమమైపోయినది. నేటివరకామె ముఖమండలముపై బ్రకాశించుచున్న యాత్మగౌరవము పోయి యిపుడపార వేదనచ్ఛాయ లలముకొనినవి. విద్యుద్దీపము ప్రకాశించుచున్నచోట, ఇపుడు చిఱుగాలికి సైతమారిపోవు చిన్న దీపము మినుకు మినుకు మనుచున్నది.

మురారీలాలుకు వివాహ నిరాకరణ పత్రము వ్రాయుటకే నిశ్చయింపఁబడినది; మరునాఁడే వ్రాయఁబడినది గూడ! దీనదయాలుకు కుముదనిచ్చి వివాహముఁజేయ నిశ్చయమైపోయినది. దీనదయాలు వయస్సు నలుబదికిఁ గొంచెమెక్కువగనే యుండును. గౌరవ మర్యాదలలో నయోధ్యానాధుని వంశమున కాతని వంశము సాటిరాదనుటలో నతిశయోక్తియానంతయు లేదు; కాని అన్నవస్త్రములకు మాత్ర మేలోపమును లేదు. బేషరతుగ వివాహమున కంగీకరించినాఁడు. ముహూర్తనిర్ణయము జరిగినది; పెండ్లివారు వచ్చిరి; వివాహమైపోయినది. కుముద యత్తవారింటికిఁ బంపివేయఁబడినది. పూలమతి హృదయములో నెట్టి యుత్సాహ తరంగము లణఁగారి పోయెనో యెవరెఱుంగఁగలరు? కుముద హృదయములో నేమిజరుగుచున్నదో నెవరెఱుఁగుదురు? కాని నలుఁరన్నదమ్ములు మాత్రము గుండెలపైనున్న కుంపటి దింపుకొని నట్లుగఁ జాలసంతోషించిరి. సద్వంశ సంజాతయైన కన్య తన హృదయవ్యథ నోరువిప్పి యెట్లు చెప్పగలదు? తన భాగ

మందు సుఖపడవలెనని లిఖించియున్న సుఖపడును; దుఃఖ పడవలెనని లిఖించియున్న దుఃఖము లనుభవించును. దైన్య జీవులకు భగవన్నిర్ణయమే అంతిమావలంబనము. ఇంటిలోని పెద్దలందఱు నెవనికిచ్చి వివాహముఁ జేసిరో, అతనిలో నేయిదోషము లుండుఁగాక, ఆతఁడే యామె కుపాస్య దైవము! ఆమె కతఁడే జీవితేశ్వరుఁడు. ప్రతిరోధ కల్పన మామె ఛాయలకైనను రాదు.

పూలమతి యేపనియందును జోక్యము కల్పించుకొనలేదు. కుముద కేమేమి యిచ్చినారు? అతిథుల ఆదరసత్కారము లెట్లు జరిగినవి? విందులో నుపయోగింపఁబడుట కెవ రెవరేమేమి బంపిరి? అను నేవిషయముతోడను నామె కేవిధమైన సంబంధమును లేదు. ఆమె నెవరైన నేసలహాయైన నడిగినచో నిటులె జవాబు చెప్పెడిది—"నాయనా! మీరు చేయుచున్న దేదియో మంచియే జేయుచున్నారు; నన్నడుగ వలసిన దేమున్నది?"

కుముదకొఱకు గుమ్మములోనికి మేనా వచ్చినపుడు, కుముద తల్లిని గట్టిగ కౌఁగలించుకొని యేడువ నారంభించినది. పూలమతి కుమార్తెను తన గదిలోనికిఁ దీసికొనిపోయి తనవద్ద నున్న కొలది రూపాయలను రెండు మూడు సాధారణ వస్తువులను బిడ్డ యొడిలోఁ బోసి, కనులవెంట కన్నీటి ధారలగార్చుచు అన్నది—"అమ్మా! నా మనసులోని యభిలాష మనసులోనె యణఁగిపోయినది; కాకున్న నేఁడు

నేటినుండి యతిశ్రద్ధగ నింటిపనులన్నియు జేయుట, సంసారాంతర్గత వ్యవహారములకు దూరముగ నుండుటయే పూలమతి నియమమైపోయినది. నేటివరకామె ముఖమండలమునై ప్రకాశించుచున్న యాత్మగౌరవము పోయి యిపుడపార వేదనచ్ఛాయ లలముకొనినవి. విద్యుద్దీపము ప్రకాశించుచున్నచోట, ఇపుడు చిఱుగాలికి నైతమారిపోవు చిన్న దీపము మినుకు మినుకు మనుచున్నది.

మురారీలాలుకు వివాహ నిరాకరణ పత్రము వ్రాయుటకే నిశ్చయింపఁబడినది; మఱునాఁడె వ్రాయఁబడినది గూడ! దీనదయాలుకు కుముదనిచ్చి వివాహముఁజేయ నిశ్చయమై పోయినది. దీనదయాలు వయస్సు నలుబదికిఁ గొంచెమెక్కువగనే యుండును. గౌరవ మర్యాదలలో నయోధ్యానాథుని వంశమున కాతని వంశము సాటిరాదనుటలో నతిశయోక్తి యంతయు లేదు; కాని అన్నవస్త్రములకు మాత్ర మేలోపమును లేదు. బేషరతుగ వివాహమున కంగీకరించినాఁడు. ముహూర్తనిర్ణయము జరిగినది; పెండ్లివారు వచ్చిరి; వివాహమైపోయినది. కుముద యత్తవారింటికిఁ బంపివేయఁబడినది. పూలమతి హృదయములో నెట్టి యుత్సాహ తరంగము లణగారి పోయెనో యెవరెఱుంగఁగలరు? కుముద హృదయములో నేమిజరుగుచున్నదో నెవరెఱుఁగుదురు? కాని నల్వురన్నదమ్ములు మాత్రము గుండెలపైనున్న కుంపటి దింపుకొనినట్లుగఁ జాలసంతోషించిరి. సద్వంశ సంజాతయైన కన్య తన హృదయవ్యథ నోరువిప్పి యెట్లు చెప్పగలదు? తన భాగ్య

మందు సుఖపడవలెనని లిఖించియున్న సుఖపడును; దుఃఖపడవలెనని లిఖించియున్న దుఃఖము లనుభవించును. దైన్యజీవులకు భగవన్నిర్ణయమే అంతిమూవలంబనము. ఇంటిలోని పెద్దలందఱు నెవనికిచ్చి వివాహముఁ జేసిగో, అతనిలో నేయిదోషము లుండుఁగాక, అతఁడే యామె కుపాస్యదైవము! ఆమె కతడే జీవితేశ్వరుఁడు. ప్రతిరోధ కల్పనమామె ఛాయలకైనను రాదు.

పూలమతి యోపనియందును జోక్యము కల్పించుకొనలేదు. కుముద కేమేమి యిచ్చినారు ? అతిథుల ఆదరసత్కారము లెట్లు జరిగినవి? విందులో నుపయోగింపఁబడుట కెవరెవ రేమేమి బంపిరి? అను నేవిషయముతోడను నామె కేవిధమైన సంబంధమును లేదు. ఆమె నెవరైన నేసలహాయైన నడిగినచో నిటులె జవాబు చెప్పెడిది—"నాయనా! మీరు చేయుచున్న దేదియో మంచియే జేయుచున్నారు; నన్నడుగ వలసిన దేమున్నది?"

కుముదకొఱకు గుమ్మములోనికి మేనా వచ్చినపుడు, కుముద తల్లిని గట్టిగ కౌగలించుకొని యేడువ నారంభించినది. పూలమతి కుమార్తెను తన గదిలోనికిఁ దీసికొనిపోయి తనవద్ద నున్న కొలది రూపాయలను రెండు మూడు సాధారణ వస్తువులను బిడ్డ యొడిలోఁ బోసి, కనులవెంట కన్నీటిధారలగార్చుచు అన్నది—"అమ్మా! నా మనసులోని యభిలాష మనసులోనె యణఁగిపోయినది; కాకున్న నేఁడు

నీ వివాహము నా విధముగ జరిగెడిదికాదు; నీవీ విధముగ అత్తవారింటికిఁ బంపఁబడుదానవు గాదు.”

నేటివఱకు ప్రాలమతి తన నగల విషయము నెవరికిఁ జెప్పలేదు. సమాని లాభమునకై యెవరలఁ జేసిన గపటవ్యవహారము నామె యిప్పటివఱకు గుర్తింపకపోయి యుండవచ్చును! కాని నగలు మాత్ర మింక రావని, వాటిని గురించి మనోమాలిన్యమును వృద్ధిజేసికొనుట యేగాని, జేతికి వచ్చునదేమియు నుండదని మాత్రమామె తెలిసికొన్నది; కాని ఈ సమయమున తన నిర్దోషిత్వమును ఋజువు చేసికొనవలసిన యవసర మామె గుర్తించినది. అమ్మ తన నగలన్నియు కోడండ్రకే కట్టబెట్టిన దను భావముతోఁ గుముద యిచటనుండి వెళ్ళవచ్చు; దీని నామె యెంతమాత్రము సహింపజాలదు. అందువలననే ఆమె కుముదను తన గదిలోనికిఁ దీసికొనిపోయినది; కాని, కుముద కీవఱకే అన్నల మోసమును గురించిన సమాచార మందినది. ఆమె తల్లి యిచ్చిన నగలను రూపాయలను దీసి తల్లి చరణములనద్ద నుంచి యన్నది—“అమ్మా! నాకు నీ యాశీర్వాదమే లక్షలు—కోట్లు! నీవీ వస్తువులను నీ నద్దనే యుంచుకొనుము. ముందు ముందు నీవింకను నెటువంటి విపత్తుల నెదుర్కొనవలసి వచ్చునో!” యనునంతలో నామె కంఠము రుద్ధమైనది. కన్నుల నీరు గ్రమ్మినది.

ప్రాలమతి యేమో చెప్పబోవుచున్నది, ఇంతలో సుమనానాథుఁడు వచ్చి యనెను —“కుముద యేమి చేయుచున్నది? పద! త్వరగా. సుముహూర్తము దాటిపోవు

చున్నది. వారందరు నక్కడ గోలచేయుచున్నారు; మూడుగు నాలుగు మాసములలోఁదిరిగి యెట్లును వత్తురు. ఇచ్చి పుచ్చుకొనుట కేమైన నున్నచో నపుడు తీసికొనవచ్చును.”

పూలమతికి గాయముపై కారము రాచినట్లయినది. అన్నది—“నేను దీనికిచ్చుటకు నావద్ద నిఁక మిగిలిన దేమున్నది నాయనా? పోయిరా, తల్లీ! భగవంతుఁడు చిరకాలము నీ పసుపుకుంకుమలను చల్లగఁజూచుగాక! భగవంతుఁడు నీ కమరసౌభాగ్యమును బ్రసాదించుగాక!”

కుముద వెళ్ళిపోయినది. పూలమతి మూర్ఛితురాలై పడిపోయినది. జీవితములోని అంతిమలాలసనష్టమై పోయినది.

## 6

**ఒ**క సంవత్సరము గడచినది.

పూలమతి గది యింటిలోని గదులన్నిటికంటె విశాలమైనది; స్వేచ్ఛగ గాలివచ్చు నదుపాయములు గలది. చాల నెలల క్రిందటనే దాని నామె పెద్దకోడలి కొఱకు ఖాళీచేసి వైచినది. తానొక సంకీర్ణమైన గదిలో, నొక బిచ్చగత్తెవలె నివసింపసాగినది. కొడుకులు కోడండ్రపై నామెకిపుడే మాత్రము ననురాగము లేదు.

ఇపుడామె యాయింటిదాసి. ఇంటిలోని వారితోడను, నే వస్తువుతోడను, నే ప్రసంగముతోడను నామె కేవిధమైన సంబంధ ప్రయోజనములును లేవు. ఇంకను

మృత్యుప్రరా లేదు–కనుకనె యామె జీవించి యున్నది.
ఇంకను కొంతకాలము జీవించియుండి తన సంసారమునుగాని
లోకమునుగాని జూడవలెనని–అనుభవింపవలెనని – ఆశగాని,
యభిలాషగాని యిప్పుడామెకే మాత్రమును లేవు. ఆమెకు
సుఖదుఃఖముల జ్ఞానమే లేదు.

ఉమానాథుని ఔషధాలయము తెరువఁబడినది
మిత్రులందరకు విందుజరిగినది; నృత్యవినోదములు జరిగినవి.
దయానాథుని ప్రెస్ తెరువఁబడినది; తిరిగి జల్సాలు జరిగినవి.
సీతానాథునకు కుపరా వేతనము లభించినది; అతఁడు విదేశము
లకు ప్రయాణమై వెళ్ళునప్పుడు తిరిగి యానందోత్సవములు
జరిగినవి. కాంతానాథుని పెద్దకుమారునకు యజ్ఞోపవీత సంస్కా
రము జరిపిరి; తిరిగి నృత్యవినోదములు ఆనందోత్సవములు
వెల్లివిరిసినవి; కాని ఏసందర్భమునందును పూలమతి ముఖ
మండలముపై నానందరేఖలు ఛాయామాత్రముగ నైన
గన్పట్టలేదు. కాంతానాథునకు టైఫాయిడ్ వచ్చి ఒకనెల
పూర్తిగ మంచముఁబట్టి చచ్చిబ్రతికినాఁడు. దయానాథుఁడు
తన పత్రిక ప్రచారమభివృద్ధి యగునను నాసతో నభ్యంతర
కరమగువ్యాసము నొకదానిని బ్రకటించి యాఱుమాసములు
కఠినశిక్ష పాలయ్యెను. ఉమానాథుఁడొక సైనిక సంబంధమైన
వ్యవహారములో లంచముఁదీసికొని తప్పుడురిపోర్టును బంపుట
వలన నాతని ప్రమాణపత్రము రద్దుగావింపఁబడినది; కాని
పూలమతి ముఖమండలముపై దుఃఖచిహ్నము లేమాత్రమును
గన్పించలేదు. ఆమె జీవితములో నెట్టియాశయమును నెట్టి

యుత్సాహమును విచారమును లేవు. కేవలము పశువువలెఁ బనిచేయుట, క్షుద్బాధానివృత్తి కేదియో కతుకుట; ఆమె జీవితమునకీ రెండే రెండు పనులు! జంతువులు కొట్టి యదలించినచోఁ బనిచేయును; కాని నేఁతనేయు నపుడానందముతో మనస్ఫూర్తిగ నేయును. కాని పూలమతి మాత్ర మెవ్వరుఁ జెప్పకుండగనే బని జేయును—కాని తిండిఁదినుట మాత్రము విషభోజనమువలెఁ దినుచున్నది. నెలల పర్యంతము దలకుఁ దైలసంస్కారము లేదు; నెలల పర్యంతముఁ గట్టు వస్త్రము లుదుకుటలేదు. అయినను దిగులు-విచారము లేదు. ఆమె చైతన్యశూన్యయైపోయినది.

శ్రావణమాసము - చిత్తడిముసురులు బట్టినవి. మలేరియా వ్యాపించుచున్నది. మట్టిరంగు గల దట్టమైన మేఘములతో నాకసమంతయు నావరింపఁ బడినది; బురద నీటితో పృథ్వియంతయు నిండిపోయినది. ఆర్ద్రవాయువు జీవకోటికి శీతజ్వరములను, శ్వాసరోగములను బంచుచుఁ దీరికలేకుండ వీచుచున్నది. ఇంటఁ బనిచేయు దాసికి రోగమువచ్చి పనిచేయుటకు రాలేదు. పూలమతి యింటిలోని పాత్రలన్నిటిని దోమి శుభ్రము జేసినది; నీటఁదడిసి తడిసి యింటిపనియంతయుఁ జక్కబెట్టినది. పిమ్మట నిప్పురాజేసి, ఎసరు బెట్టినది. పిల్లలకు వేళకు భోజనము కావలెను గదా!

అకస్మాత్తుగ పూలమతికి జ్ఞాపకము వచ్చినది-కాంతానాథుఁడు కుళాయినీరుత్రాగఁడు. ఆవర్షములో గంగాజలముఁ దెచ్చుటకు బయలుదేరిన దామె.

మంచముపైఁ బండుకొనియున్న కాంతానాథుఁడు పండుకొనియె యనెను—“ఉండనీయమ్మా! నీళ్లు నేను తెత్తును. పనిమనిషి నేఁడు పూర్తిగ మానుకొన్నది.”

పూలమతి మేఘావృతమైన యాకసమువైపు జూచి యన్నది — “నీవు తడిసిపోదువు నాయనా! పడిసెము పట్టును! నీ కెందుల కాశ్రమ?”

కాంతానాథుఁడనెను—“నీవు గూడ తడియుచునే యున్నావు. జబ్బుపడెదవేమో!”

పూలమతి నిర్మలహాసముతో ననెను—“నేను జబ్బుపడను. భగవంతుఁడు నన్నారను జేసివైచినాఁడు.”

ఉమానాథుఁడుగూడ నక్కడనే కూర్చుండియుండెను; ఆతని పాఠశాలయందున నాదాయ మేమియు లేదు. ఇందువలన చాల చింతిలుచు నుండెను. అన్నవదినెల వైపు జూచుచు వారి యనుగ్రహముకొఱకు కన్నులు సాచుచున్నాఁడు. అతనెను—“క్షమింపు అన్నయ్యా. చాలకాలము కోడండ్రపైఁ గైతవము చేయించినది. అందులకు ప్రాయశ్చిత్తముగూడఁ జేసికొందును.”

గంగానది మహార్ణవముంబోలెఁ బొంగిపొరలుచున్నది. దిక్చక్రవాలముతోఁ గలిసియున్నది. గట్లపై గల వృక్షములు నీటఁ మునిగియుండ వృక్షాగ్రభాగములు మాత్రమె నీటిపైఁ గన్పట్టుచున్నవి. ఇరువైపులనున్న గట్లయంచుల దాఁక నీరెగదన్నినది. పూలమతి మోకాలులోఁతు నీటఁదిగి బిందె నింపుకొని పైకిపోవు చున్నది—ఇంతలోఁ గాలు

జారినది. జారుడును దట్టుకొని నిలువఁబడలేక పోయినది! నీటఁ బడిపోయినది ! క్షణమాత్రము కాలుసేతులు గొట్టుకొన్నవి; కాని కెరటములామెను క్రింద కీడ్చుకొనిపోయినవి. గట్టుపైఁగల యిర్వురుమువ్వురు పండాలఱచిరి-"అయ్యయ్యో! పర్వేత్తుఁడు ముసలిది మునిగిపోవు చున్నది." ముగ్గురు నలుగురు సహృదయులు పర్వెత్తిరిగూడ; కాని జూచుటచేతనె హృదయముఁ జలదరింపఁ జేయుచున్న యాభయంకర కెరటములు బూలమతిని దమతో దోడ్కొని వోయినవి.

ఒకఁడడిగినాఁడు—'ఎవరీ వృద్ధురాలు?' అని.

'ఆమెయే! పండిత అయోధ్యానాథుని భార్య.'

'అయోధ్యానాథుఁడు చాల యోగ్యుఁడు!'

'ఔనౌను; కాని యీమె నుదుటమాత్రము గష్టపుఁ బ్రదుకు వ్రాయఁబడి యున్నది.'

'నారికెందఱో సంపాదించుచున్న ఎదిగినపిల్లలున్నారు.'

'ఆ! అన్నియు నున్నవి తమ్ముఁడూ; కాని యదృష్టము గూడ నుండవలెను కదా!'

—(౦)—

## అంతిమశాంతి

స్వర్గీయుడైన దేవనాథుఁడు నా యాంతరంగిక మిత్రులలో నొకఁడు. ఇప్పటికిని నాతఁడెన్నఁడైన జ్ఞాపకమునకు వచ్చినచో నాహృదయతంత్రులు లొక్కసారిగాఁ గంపించి నాయామోద ప్రమోదములన్నియు స్మృతి పథమున గిరుక్కునఁ దిరుగుచుండును. దానితో నేను దుఃఖాక్రాంతుఁడనై యెచటికైన నేకాంతమునకుఁబోయి గొంతవడి యేడ్చుచుందును.

మాయిరువురి మధ్యను రెండువందల యేబదిమైళ్ళ దూరమున్నది. నానివాసము లక్నోలో—వారిది డిల్లీలో; కాని సర్వసామాన్యముగఁ బ్రతిమాసమును మే మొకపరియైనఁ గలిసికొనకుండ నుండెడివారము గాము. ఆయన స్వేచ్ఛాప్రకృతి గలవాఁడు, వినోదప్రియుఁడు, సహృదయుఁడు, ఉదారుఁడు. మిత్రులనినఁ బ్రాణమిచ్చు స్వభావముగల గొప్పవ్యక్తి. పెఱవారనుమాట నాతఁడు నేర్వనేలేదు; నేర్చినను మఱచియుండును; తనవారను దృష్టితోడనే యందఱి నాదరించెడివాఁడు. ప్రపంచ మెట్టిది? ఇచట లౌకికవ్యవహార నిర్వహణ మేరీతిని జరుగుచున్నది? అను విషయ మాతఁడెన్నఁడుఁ దెలిసికొన లేదు—తెలిసికొనఁ బ్రయత్నించనులేదు. ఆతని జీవితములో భవిష్యత్తుకొఱకు

జాగ్రత్త పడవలసిన యవసరమెన్నఁడు నాతనికి గోచరము కాలేదు. మిత్రులందఱు నాతని నిష్కపట స్వభావము నాధారముగఁ గొని యనుచిత లాభముఁ బొందిరి. కాని యాతఁ డెన్నఁడును జీవితములో నేయనుభవమునుండియు నెట్టి గుణపాఠమును నేర్చుకొనలేదు. ఇందులకెన్నో పర్యాయము లాతఁడు లజ్జితుఁడాయెను గూడ; ఆయన వ్యవహారమాద్యంతము నాకేపధముగ "ఎట్లు పుట్టెనో యట్లేచచ్చె" ననినట్లే నడచినది.

ఆతని ప్రపంచమొక విలక్షణమైనది. అందు సందేహమునకు, కృత్రిమమునకు, కపటమునకు స్థానమేమాత్రమును లేదు—అందఱు స్వజనమే! పెఱవారు లేనేలేరు. నేననేక పర్యాయము లాతనిని హెచ్చరింపఁ గోరితిని; గాని నేనాశించిన ఫలిత మెన్నఁడుఁ గలుగకపోఁగా విరుద్ధ పరిణామములుగూడ సంఘటిల్లెడివి. జీవిత స్వప్నములు భంగమైనప్పుడాతఁడు హార్దిక వేదన ననుభవించెడివాఁడు. ఈతఁడు చేయి గట్టుకొని సంచరించనిచో నెట్టి దుష్పరిణామములు గల్గునోయని నేనప్పుడప్పు డెంతేని విచారించెడివాఁడను.

ఇంకొక విచిత్రమేమన నాతని భార్య గోపాదేవికూడ పూర్తిగ నదేస్వభావముగల వనిత. సామాన్యముగ మన స్త్రీలలో నుండెడి అమాయకత్వము బోళాతనము నామె ముఖముపైననే గానవచ్చుచుండును ఇటువంటి ముందువెనుకలు చూడని పురుషుల యజాగ్రతలకు అర్గళము (బ్రేకు) వంటి

పనిచేసెడి చాతుర్యము మామెలో లేదు. చివరకు వస్త్ర భూషణములపైఁ గూడ నామె కెక్కువ యాసక్తి లేదు.

ఇందువలననే దేవనాథుఁడు స్వర్గస్థుఁడైన సమాచారము నాకుఁ దెలిసినంతనే నేను ఢిల్లీకిఁ బయనమై చూచితిని గదా-గిన్నెలు చెంబులు యిల్లు తప్ప మరేసంపదయు నాకచట కానరాలేదు. కొద్దియో గొప్పయో కూడఁబెట్టెనని నాలోచనయైన గల్గుట కాతని వయస్సుమాత్ర మెంత పెద్దది? పూర్తిగ నలుబది యేండ్లుకూడ నిండనేలేదు.

సర్వసామాన్యముగ నీ వయసులో నందఱును నిర్విచారముగ సంపాదన యంతయు ననుభవమునకే సరిపుత్తురు గాని ముందురానున్న కాలమును గుర్తెఱుంగనేరరు. పైగా ఆయన స్వభావమే సహజసరళము. ప్రథమ సంతాన మొక యాఁడుపిల్ల. తరువాత నిద్దరు మగపిల్లలు బుట్టిరి; గాని పసితనముననే పరలోకగతులైరి. ఆఁడుపిల్ల మాత్రమే మిగిలి యున్నది. ఈమెయే మా కథాభాగమున కంతకు కరుణారస ప్రధానమైన పాత్ర.

వీరి జీవనవిధానము చూచినచో నీ చిన్నకుటుంబము నకు నెలకు రెండువందల రూప్యములకుఁ దక్కువ చాలవను సంగతి యెవరికైనఁ దెలియఁగలదు. రెండుమూఁడు సంవత్సరములలోఁ బిల్లవివాహము కూడ చేయవలసియున్నది. విధాత భవిష్యత్తు నెట్లు లిఖించియుండెనో నాకేమియుఁ దోఁచినది కాదు.

## 2

ఆతరువాత నొక నెలపిమ్మట నేను నావ్యాపార సందర్భమున విదేశములకుఁ బోవలసివచ్చినది. అచ్చట నేసను కొనిసదానికంటె రెండుసంవత్సరము లధికముగ నుండవలసి వచ్చినది. గోపాదేవివద్దనుండి నాకు మామూలుగ నుత్తరములు వచ్చుచునే యుండెను. ప్రతి యుత్తరమందును తాము సుఖముగ సంతోషముగ దినముల గడపివేయుచున్నటులే వ్రాయుచుండెడిది. గోపాదేవి నన్నుఁ గూడఁ బరాయివాని వలెనే జూచినదని, వాస్తవస్థితి నాకుఁ దెలియఁ జేయలేదని నాకుఁ దరువాతఁ దెలిసివచ్చినది.

విదేశములనుండి తిరిగివచ్చి నేను తిన్నగ ఢిల్లీ వెళ్ళితిని. గుమ్మములో నడుగు వెట్టగనే నాకుఁ బెద్ద దుఃఖము కలిగినది. ఆ యిల్లు నాకొక పాడునడిన కొంపవలెఁ గన్పించినది. మిత్రబృందముతోఁ గోలాహలముగనుండు గదితలుపులు బిగింపబడియున్నవి. సాలెబుర్వులు నలుదెసల నల్లుకొని యున్నవి. దేవనాథునితోబాటు ఆ లక్ష్మీకళ గూడ వెడలిపోయినదనిపించినది. మొదటిసారిగ నాయింటివైపుఁజూడగనే దేవనాథుఁడు గుమ్మములో నిలువఁబడి నావైపుఁజూచి చిఱునవ్వు నవ్వుచున్నటు లనిపించినది. నేను మిథ్యావాదినికాను; మృతాత్మల సాక్షాత్కారములోనాకు నమ్మకములేదు;అయినను నాసమయములో నేనొక్కపరి యులికిపడితిని. హృదయమకస్మాత్తుగఁ గంపించినది; ఒక్కపరి గనులుమూసికొని తిరిగి

నా చూపునకు నాకంతకుమున్ను కన్పించిన దృశ్య మదృశ్యమైనది.

ద్వారము తెఱవఁబడినది. గోపాదేవికంటెఁ దెఱచువారింకెవరున్నారు? ఆమెను జూడఁగనే నాహృదయము స్తంభించి నట్లైనది. నేను వచ్చుచున్నటు లామెకు ముందుగనే సూచించితిని. నాకు స్వాగత మిచ్చుట కామె క్రొత్త చీర ధరించినది; తల దువ్వుకొని ముడివైచుకొనినది గూడ; కాని, యీ రెండు సంవత్సరముల కాల మామెపై గావించిన యాఘాతములనుండి యెట్లు దప్పించుకొనఁ గలదు. స్త్రీలలో యౌవనలావణ్యములు, సంపూర్ణ వికాసము నొందు వయసు— దార్ఢ్యత్వము, చంచలత, యభిమానముల స్థానములో నాకర్షణము మాధుర్యము. రసికత ప్రవేశించు కాలము; కాని గోపాదేవి యౌవనము గతించిపోయినది. ఆమె ముఖము ముడతలుబడిపోయినది. ఎంత ప్రయత్నపూర్వకముగఁ బ్రసన్నతను బ్రకటించుచున్నను నామెలోని విషాదచ్ఛాయలను దాచలేకపోవుచున్నది. కేశములు ధవళవర్ణమునకుఁ దిఱుగుచున్నవి; ప్రత్యవయవమునందును శిథిలావస్థ గోచరించుచున్నది.

నేను కరుణాస్వరముతో ప్రశ్నించితిని—"గోపాదేవి! నీకేమైన జబ్బు చేసినదా?"

ఆమె ముఖమును లోలోననే యణచికొనియనినది— "లేదు. నాకెన్నఁడుఁ దలనొప్పికూడ రాలేదు."

"అయిన నీవిట్లుంటివేమి? పూర్తిగ ముదుసలి వైపోతివి."

"ఇంకను యువతిగానుండి నేఁజేయున దేమున్నది? నా వయస్సుగూడ ముప్పదియైదు దాటినది."

"ముప్పదియైదు సంవత్సరము లేమంత పెద్ద వయస్సు గాదు. ఈ వీధిలో నీ యీడువా రెందఱున్నారు? వారెల్లఱు నీవలె నింత జరాభారాక్రాంతలై గానవచ్చుచున్నారా?"

"ఔను! ఇంకను జాల కాలము బ్రదుకఁదలఁచిన వారి కిది యేమంత పెద్ద వయస్సుకాదు. నేను సాధ్యమైనంత త్వరగ నీ జీవితము సమాప్తము గావలెనని కోరుచున్నాను. సున్నీ వివాహమును గుఱించి మాత్రమే నాకున్న చింత! దీనినుండి విముక్తిఁ బొందినచో నిఁక నాకీ జీవితముతోఁ బనియే లేదు."

ఆ యింటిలో నద్దెకున్న సజ్జనుఁడు మఱొక యూరు నకు బదిలీయై వెళ్ళిపోయినాడని, తిరిగి వేఱొక రెవ్వరు నద్దెకు రాలేదని తెలిపినది. నా హృదయములో బల్లెము గ్రుచ్చుకొని నట్లనిపించినది. ఇతరాధారము లేక వీరింత కాలమెట్లు గడిపిరో యూహించుటగూడఁ జాల దుఃఖకర మైన విషయముగాఁ గన్పట్టినది.

నేను విరక్తిభావముతో నంటిని—"కాని నీవు నాకీ విషయముల నెందులకుఁ దెలియఁజేయలేదు? నన్నంత దూరపు బంధువుగ భావించుచుంటివా?"

గోపాదేవి లజ్జితురాలై యన్నది—"లేదు - లేదు, విషయ మదికాదు. నిన్నే 'పరాయి'వానిగ భావించినచో నిఁక నావానిగ నేనెవనిని భావింతును? పరదేశములో నీ జంజాటములతో నీవే చాల సతమత మగుచుండవచ్చును.

నా కష్టగాథలను చెప్పి నిన్నింతకు బాధింపనలేనని భావించి తిని. ఏదేవొక విధముగ రోజులు గడిచిపోయినవి. పంటపొలములు లేవు—సంస్థలకోట్లును కూడకొక్క, విలువజేయు పాత్ర సామానుగాని భోగవస్తువులుగాని సున్న. ఇంట వేరేమియు లేమగాని, కొలఁదిగ నగలుమాత్ర మున్నవి. ఇప్పుడు సునీత వివాహమును ఘటించితే చింతించుచున్నాను. ముందీ ఇంటి నమ్ముకొనిచో నొక పదివేల రూపాయలకు పైగా జేతికి రావచ్చును. వివాహముఁ జేసిజేయవచ్చును, నాకుఁగూడఁ గొంత మిగులునని యాలోచించితిని; కాని ఇల్లు తాకట్టులో నున్నదని నిన్ననేఁ గలసి యిరువదివేలకుఁ బైగా నప్పున్నదని తెలియాకఁ జెప్పినది. బాకీదారు నన్నింకను నీ యింటినుండి వెడలఁ గొట్టలేదు. ఆమహానుభావుఁడు నాయెడ నీమాత్రపు దయఁజూపుటయే పదివేలు. ఇంక నీ యింటిపై నే విధమగు నాశయు నాకులేదు. కాలు చేతులు పట్టుకొని ప్రాధేయబడినచో బాకీదారు మన యిల్లు స్వాధీనపఱచుకొని రెండు మూఁడు వేలరూప్యము లిచ్చుటయే గగనము. దీనితో గడచి గట్టెక్కుటెట్లు? ఈ చింత నన్నుఁ దినదినమునకుఁ దినివేయుచున్నది. కాని, అయ్యయ్యో! నా తెలివి తగులబడినట్లున్నది, నీకుఁ గాలుసేతులు కడుగుకొనుటకు నీరైననీయకుండ నా కష్ట కథల నుడువఁ బ్రారంభించితిని. నీవు దుస్తులు మార్చుకొని మంచినీరు పుచ్చుకొని విశ్రమింపుము. నేను కొంచెము ఫలాహారముఁ దెత్తును. ఆరగించిన వెనుక మాట్లాడుకొనవచ్చు. ఇంటివద్ద నందఱుఁ గుశలమేగదా?”

నేనంటిని - "నేను చిన్నగ బొంబాయినుండియే యిటు వచ్చితిని. ఇంటి కెక్కడ పోతిని?"

గోపాదేవి నన్నుఁ దిరస్కారపూర్ణములైన నేత్రములతోఁ జూచినది; కాని యీ దిరస్కారము వెనుకనుండి గరిష్ఠ ప్రమాణమున నాత్మీయత తొంగి చూచుచున్నది. నా కామె ముఖముపైనున్న మృదత లదృశ్యమైపోయినట్లు గన్పించినవి. సన్నని హాసరేఖతోఁ జేత రక్తవర్ణ మామె నెమ్మొగముపైఁ బర్వెత్తినది. ఆమె యనినది-"ఇందుకు ఫలితముగ నీ భార్య ముందెన్నఁడు నిక నిన్ను మా యింటికి రానీయదు."

"నే నొకరికి దానిననా యేమి?"

"ఒకరినిఁ దన దాసినగఁ జేసికొనుటకు ముందు తాను వారికి దానిన గావలసియుండును గదా!"

శీతకాలపు సంధ్యాసమయము. చూచుచుండగనే దీపకాంతులు వెలుగొంద సాగినవి. సున్ని లాంతరుఁ దీసికొని గదిలోనికి వచ్చినది. రెండు సంవత్సరములనాటి శుష్కశరీర-అబోధబాలిక నేఁడు రూపవతి, యువతి; యైపోయినది. ఆమె లోచనములనుండి వెడలు క్రీగంటిచూపు, ముఖారవిందమునుండి వెడలు మధుబిందువుఁబోలు నొక్కొక మాట యామె గౌరవశీలమైన ప్రకృతిని జాటుచున్నవి

ఏ బాలికను నేనొడిలోనికిఁ దీసికొని ముద్దు లాడెడివాఁడనో, యట్టి యామెవైపు నేఁడు కండ్లెత్తి చూడఁజాలకుంటిని. నా మెడకుఁ జేతులు జుట్టి యానందించెడి యా బాలిక నేఁడు నాయెదుట నిలువఁబడలేక పోవుచున్నది. తన యవయవముల

సంపూర్ణ సౌందర్యమునుపై నా దృష్టి పడకుండ నామె ముఖముఁగు పడుచుకొను చున్నట్లుల, నేనందుల కామె కవకాశము నిచ్చు చున్నటు లనిపించినది.

నే నడిగితిని— 'ఇప్పు డేతరగతి చదువుచున్నావు సున్నీ?"

ఆమె తల వంచుకొనియే జవాబిచ్చినది—"పదియవ తరగతి."

"ఇంటిపని గూడ నేమైనఁ జేయుచున్నావా?"

"అమ్మ నన్నసలెన్నఁడైనఁ జేయనిచ్చునా?"

గోపాదేవి యనినది—"నేను జేయనిచ్చుట లేదా— నీవే పనిజోలికిఁ బోవుటలేదా?"

సున్నీ ముఖము ప్రక్కకుఁ ద్రిప్పుకొని నవ్వుచుఁబోయి నది. తల్లికి ప్రాణప్రదమైన గారాబుపట్టి. ఏ రోజునైన బిడ్డ యింటిపనిఁ జేయసాగినచో, నా రోజున బహుశః గోపాదేవి కంఠము నాచిపోవునట్లైయున్నది. ఆమె స్వయముగ బిడ్డ నేపనియు జేయనీయదు; కాని యందఱితో నేపనియుఁ జేయదని చాడీలు మాత్రము జెప్పును. ఈ చాడీలుగూడ బిడ్డపై నామెకుఁ గల విచిత్రమైన ప్రేమలోని యంతర్భాగము. మన మంచిచెడ్డలు మన యనంతరముకూడ జీవించి యుండునుగదా!

నేను భోజనముఁజేసి పండుకొనగానే గోపాదేవి తిరిగి సున్నీ వివాహ ప్రసక్తిఁ దెచ్చినది. ఇంతకంటె నామె కిప్పుడు గావలసిన విశేషమేమున్నది? "వరులు చాలమంది యున్నారు; కాని యోగ్యతనుగూడ పాటింపవలయునుగదా! 'నాన్న

గారు జీవించియున్నచో నా కింతకన్న నంచి సంబంధముఁ జూచెడివారుగదా' యని బిడ్డ విచారించు నక్లెందులకుఁ జేయవలె" నని యనినదామె.

తరువాత గోపాదేవి, భయపడుచు భయపడుచు లాలా మదారీలాలుని కుమారుని గుఱించి ప్రస్తావించినది.

నేను చకితుఁడనై యామె వైపుఁ జూచితిని. లాలా మదారీలా లిదివర కింజనీరుగఁ బనిచేసెను. ఇప్పుడుపకారవేతనముఁ బొందుచున్నాఁడు. కొన్ని లక్షల రూప్యములఁ గూడబెట్టెను; కాని యిప్పటికిఁగూడ నాయన లోభతృష్ణ కేమాత్రమును వక్రత వాటిల్లలేదు. గోపాదేవి తన కండుబాటులో నుండని సంబంధము నెన్నుకొనినది.

నే నభ్యంతర పఱచితిని-'మదారీలాలు వట్టి దుర్జనుఁడు.'

గోపాదేవి నాలుక కఱచుకొని యనినది - "లేదన్నయా, నీ వాయన నర్థము జేసికొన లేదనుకొందును. నాపై నెంతేని దయఁజూపుచున్నాఁడు. అప్పుడప్పుడిటు వచ్చి క్షేమము దెలిసికొని బోవుచుండును. ఇఁకఁ జిల్లవాఁడందువా? నేనాతని గుఱించి యేమని వర్ణింతును? పైగా వారి కేవిషయములోఁగాని లోప మేమున్నది? మొదట ఆయన బాగుగ లంచములు దీసికొనెడివాఁడనెడు ప్రతీతియున్న విషయము యథార్థమే! కాని యిచట ధర్మాత్ము లెవరున్నారు? చేతికందిన యవకాశము నూరక బోనిచ్చు ధర్మచింతకు లెవరు? మదారీలాలు తనకుఁ గట్నముతో నేమియుఁ బని లేదనియు, కేవలము కన్యను మాత్రమే

గోరుచుంటి ననియుఁగూడ నాతోఁ జెప్పెను. సున్ని యాయన మనస్సులో సంకేతమైపోయినది.

నాకు గోపాదేవి యమాయకత్వముఁ జూచి చాల జాలి గల్గెను; 'కాని, ఒకరియెడల నీమె మనస్సులో నవిశ్వాసము నెందుకు కల్గింపవలెను? మదారీలాలు పూర్వపు స్వభావమును మార్పు చెచ్చియుండవచ్చును. మనోభావములు మారుచుండవచ్చునుగదా!' యనుకొంటిని.

అర్థాంగీకారము సూచించుచు నేనంటిని—"కాని, నీవు నాతనికి గల యంతరమును గురించి యాలోచింపుము. నీవు నీ విశ్వాసము నర్పించినను నాతని యంతస్తు నందుకొనఁ జాలవు."

కాని గోపాదేవి మాత్ర మీ విషయములో కృతనిశ్చయురాలై యున్నది. సున్ని యొక మహారాణివలె నుండ దగిన యింటికే యామెను గోపాదేవి పనుపఁగోరుచున్నది.

మఱునాఁడు ప్రాతఃకాలమే నేను మదారీలాలునొద్దకుఁ బోతిని. నేనాయనతోఁ జరిపిన సంభాషణలలో నన్నాయన ముగ్ధునిఁ జేసివైచెను. ఒకానొక సమయమున నాతఁడు, లోభాకృష్ట చేతస్కుఁడై యుండవచ్చు; కాని యిప్పుడు మాత్రము నాకాయన యత్యంత సహృదయుఁడు, ఉదారుఁడు, వినయ సంపన్నుఁడు గనే గోచరించెను. ఆయన యనెను—"అన్నగారూ! దేవనాథునితో నాకుఁ బరిచయమున్నది. మనుష్యులలో రత్నమువంటి వాఁడతఁడు. వారి బిడ్డ నాయింటికి వచ్చుట నా యదృష్టముగ భావించు

చున్నాను. తమరు గోపాదేవితో మదారీలాలు మీ వద్ద నుండి యే వస్తువు నాశించుటలేదని జెప్పెడు. భగవంతుఁ డిచ్చినంతవఱకు నా యింట సర్వము సమృద్ధిగా నున్నది. నేనామె నీయదనులో బాధింపఁగోరుట లేదు."

నాహృదయభారము తగ్గిపోయినది. మనము చెప్పెడు మాటలు విని యితరుల యెడల నేయునంటి దురభిప్రాయములఁ బడుచుందుమో నా కొక పెద్ద శుభానుభవము గల్గినది. నేను తిరిగివచ్చి గోపాదేవికి నా యభినందనములఁ దెల్పితిని. రాబోవు వేసవిలో వివాహము జేయ నిశ్చయింపఁ బడినది.

## 3

ఈనాల్గు మాసములు గోపాదేవి తన తనయ వివాహప్రయత్నములలో గడపినది. నేను నెల కొకపరి యైన నీమెను దప్పక కలిసికొని వచ్చుచుంటిని; కాని ప్రతి పర్యాయమును ఖిన్నుఁడనై దిరిగి బోవుచుంటిని. గోపాదేవి తన కుల మర్యాదను గుఱించి మహోన్నతమైన యాదర్శమును తన ముందు బెట్టుకొని కూర్చున్నది. తన తనయ వివాహ మహోత్సవ మీనగరములోఁ దన జ్ఞాపక చిహ్నముగ నుండఁగలదను పిచ్చిభ్రమలోఁ బడిపోయినది. ఇటువంటి తమాషాలు ప్రపంచములో నిత్యము జరుగుచునే యుండునని, కొలఁది దినములలోనే యివి యన్నియు విస్మరింపఁ బడుచుండునని యెఱుంగదు. 'ఏనుఁగు చచ్చినను వేయి' యనుమాటఁ దనయెడల సార్థక మొనర్చుకొనఁ జూచుచున్నది.

అడుగడుగునకు నామెకు దేవానందుఁడు జ్ఞాపకము వచ్చు చుండును. 'ఈయన యున్నచో నీకార్య మిట్లు జరిగెడిదా?' యనుకొని మాటిమాటికి నేడ్చుచుండును. మదారీలాలు సజ్జనుఁడను మాట యథార్థమే; కాని, గోపాదేవికిఁగూడఁ దన బిడ్డకుఁ దాను జరుపవలసిన ముచ్చటలనుగూర్చి యున్న యభిలాష యుండుటలో నాశ్చర్యము లేదుగదా! ఆమెకు మాత్ర మేమంత యెదిగింది పిల్లలున్నారు? హృదయ పూర్వకముగ నభిలాషను దీర్చుకొనఁ గోరుచున్నది. సున్ని కొఱకామె తయారు జేయుచున్న నగలను వస్త్రములను జూచిన నాశ్చర్యము గల్గుచున్నది. ఎప్పుడు చూచినను— బిడ్డకొఱకు క్రొత్తదే యొకటి కుట్టుచుండును. ఇంకొకప్పుడు దినమంతయు ధ్యానములోఁ గూర్చుండి యుండును; వేఱొకప్పు డింటిపని యేదో సన్నాహములఁగూర్చి యాలోచించు చుండును. తన వీథిలోఁ గల ప్రతి సంపన్న గృహస్తునొద్దను కొలఁదిగనో గొప్పగనో యామె యేకొంతయైన నప్పుఁ దీసికొనక యుండలేదు. ఆమె యప్పుగైకొనుచుంటినను భావములోనే తీసికొనుచున్నది; కాని యిచ్చువారు మాత్రము దానముఁ జేయుచుంటిమను భావముతోనే యిచ్చుచున్నారు. ఆ వీథిలోని యావజ్జనులు నామెకు సహాయభూతులై నిలచిరి. సున్ని యా వీథివారందఱకు బిడ్డ యైనది. చివరకు గోపాదేవి మానమర్యాదల నావీథిలోని వారందఱుఁ దమ మానమర్యాదలుగఁ భావింపసాగిరి. ఇఁక గోపాదేవికి విశ్రాంతి యెంతమాత్రమును లేదు. వేయేల, ఆమెకు నిద్రయే పట్టుట లేదు. తలనొప్పి తలఁ బగులగొట్టి

వేయుచునుండుగాక, అర్ధరాత్రి యైపోవుంగాక, కాని యామె కూర్చుండి యేదేనొకటి కుట్టుచుండును; లేక యీ గదిలోని సామగ్రి నా గదికిఁ జేరవేయుచుండునుఁ. ఎంత వాత్సల్య పూర్ణచిత్త యామె! ఆమె కార్యదీక్ష చూపరు లలోఁగూడ శ్రద్ధాసక్తులఁ గలిగించుచున్నది.

గోపాదేవి యొంటరిది, అబల, ఆపైన శుష్కశరీర. సమర్థులగు పురుషులచే నిర్వహింపబడినను పరుని బంధువు లకు సంతృప్తిని కలిగింపలేని సందర్భములు పెక్కులు గలవు. ఈమె యెంతవఱకు జేయఁగలదు? ఇతరులపై వదలిపెట్టిన పనులలో నామె కేదేనొక లోపము గన్పట్టుచుండును. సరిపెట్టుకొను స్వభావ మామెలో నుచ్చునకుఁగూడఁ గాన వచ్చుటలేదు. ఆమె కింత శక్తి, యింత యోర్మి యెచట నుండి వచ్చెనో దుర్గ్రాహ్యము!

ఒక పర్యాయము వచ్చినపు డామె స్థితిని చూచి నేను సహింపలేక అంటిని—"గోపాదేవీ! నీ వీ శోకము నుండి బోఁదలఁచుకొన్నచో వివాహమైన బిమ్మటఁ బొమ్ము. నీ పరిస్థితిఁజూడ నంతవఱకు జీవించి యుండువను ధైర్యము నాకుఁ గల్గుటలేదు."

గోపాదేవి శుష్కవదనమున హాసచంద్రిక లుది తములైనవి. చిరునవ్వులను చిందించుచు ననినది—"నీకా భయమక్కరలేదు. విధవ యాయుర్దాయము చాల పెద్దది గనే యుండును. "విధవ చనిపోదు-పాడుకొంప పడిపోదు" అను శాస్త్రము నీవు వినలేదా? కాని నా యభిలాష

మాత్రము బుద్ధి గాక బదికిఁ జేర్చి నేనుగూడ సెలవు తీసికొనవలెననుకొనుచున్నాను. ఇంకను నేను బ్రతికియుండి ఏమి చేయవలెను? నీవే చెప్పుము! ఏమి చేతును? ఏదైన విఘ్నము జరిగినచో నపకీర్తి యెవరికి వచ్చును? ఈ నాలుగు నెలలనుండి యతికష్టము మీఁద నొక గంట నిద్రపోవుచుంటినో లేదో. అసలు నిద్రయే వచ్చుటలేదు; కాని నేను మాత్రము ప్రసన్నచిత్తనై యుంటిని. నేను చచ్చినను బ్రతికినను బుద్ధి నామె కంత్రికి చేయఁగలిగిన దంతయు నేను చేసితినను సంతృప్తిమాత్రము నాకుఁ గలుగఁగలదు. మదాలింగాలు కవ సౌజన్యతను జూపినపుడు నేనుగూడ నా సౌభాగ్యమును రక్షించుకొనవలెనుగదా."

ఒక సహచారిణి వచ్చియనినది—"అక్కయ్యా! పాకము సరిగా వచ్చినదో! లేదో! నీవు వచ్చి చూడుము" గోపాదేవి యామెతోఁ బాకపరీక్ష నిమిత్తము పోయి కొలఁది క్షణములకుఁ బిమ్మటఁ దిరిగివచ్చి యనినది—"తల గోడకు వైచి కొట్టుకొందునా?...యనిపించుచున్నది. నీతో నొక్క నిమిషము మాట్లాడుచుండగనే యక్కడ పాకము బిగిసికొనిపోయి లడ్డులు దంతములతో యుద్ధము చేయు స్థితికి వచ్చినవి. ఎవరి నేమందును ?"

నేను చిరాకుపడియంటిని—"నీవనవసరమైన జంజాటమునఁబడుచున్నావు. ఎవరైన వంటవానిని బిలిపించి మిఠాయి పని గుత్తకీయగూడదా! అదియుఁగాక నీవింత పెద్ద ప్రయత్నములఁ జేయుటకు నీ యింటికి వచ్చు నతిథు లెందరు? పది రూపాయల మిఠాయియైనచో నందఱకు సరిపోవునుగదా!"

గోపాదేవి నా వైపు వ్యథిత నేత్రములతోఁ జూచినది. నా యాలోచన మామెకు నచ్చలేదు. ఈ మధ్య నామెకు మాటమాటకుఁ గోపము వచ్చు టధికమైనది. ఇట్లనినది—"అన్నయ్యా! నీవీ విషయముల నర్థము జేసికొనలేవు. మాతృత్వముఁగాని పత్నీత్వముఁగాని బొందునవకాశము నీకు లభింపలేదు. నున్నీ తండ్రి కెంతపేపున్నది! వారినలన నెందరు బ్రతుకుచుండెడివారో నీ వెఱుఁగవా? ఇప్పుడా భారమంతయు నా నెత్తికే జుట్టుకొనినది. నాస్తికుఁడవు గనుక నీకు నమ్మకముండకపోవచ్చును! కాని యహర్నిశలు ప్రతి నిమేషము వారు నా హృదయములోనే గూర్చుండి యున్నట్లే నాకు తోచుచుండును. ఈ పన్నులన్నియు వారే చేయించుచుండిరనుట కెంతమాత్రమును సందేహములేదు. మందబుద్ధిని—స్త్రీని! ఒంటరిగా నేనేమి చేయఁగలను? వారే నాకు సహాయకులు—వారే నాకు వెలుఁగుజూపి ముందు మార్గము గోచరింపఁ జేయుచున్నారు. ఈ శరీరము నాదియే గావచ్చు! కాని దీనిలోఁ గల యాత్మ వారిదేసుమా! వారి పవిత్రమైన యాదేశముననే యిదియంతయుఁ జరుగుచున్నది. నీవు వారి మిత్రుడవు. కేవల మీ మైత్రి కారణముననే వందలకొలఁది నీ డబ్బును మా నిమిత్తమై ఖర్చు పెట్టుచు నీ వింత సతమత మగుచున్నావుగదా! ఇహపరములు రెంటియందును నే నాయన సహధర్మచారిణినిగదా!"

నేను ముఖము చిన్నబుచ్చుకొని యూరకొంటిని.

జూను మాసములోన సుస్నీ వివాహ మైపోయినది. గోపాదేవి చాలసొమ్ము కట్నముగా నిచ్చినది. తన శక్తికంటె చాల యెక్కువగనే యిచ్చినది. అయినను నామెకు సంతృప్తి లేదు. నేఁడు సుస్నీ తండ్రియున్నచో నింకను నేమేమి చేసెడి వాఁడో యని తలపోయుచునే యున్నది.

# 4

శీతాకాలమున నేను తిరిగి ఢిల్లీ వెళ్ళితిని. గోపాదేవి యిప్పుడు సుఖముగా నుండునని భావించుచుంటిని. వసుని వంటి [illegible] నాదర్శవంతులు. గోపాదేవి కింతకంటెఁ గావలసిన దేమున్నది? కాని, గోపాదేవి సుఖజీవితమునకు నోచుకొన లేదని నే నెట్లూహింపఁగలను?

నే నింకను మస్తులనైన విడువలేదు; గోపాదేవి తన కష్టకథనిట్లు ప్రారంభించినది—"అన్నయ్యా! సంబంధము మంచిదే లభించినది. అత్తమామలుగూడఁ జాల యోగ్యులే! కాని యల్లుఁడే పనికిమాలిన వాఁడయ్యెను. పాపము సుస్నీ యేడ్చుచు దినములఁ గడపుచున్నది. నీవు దానిని జూచినచో నసలు గుర్తుబట్టలేవు. కేవలము ఛాయా మాత్రముగ మిగిలి యున్నది. చాల దినముల క్రిందట నొకపరి యిక్కడకు వచ్చి నది. దాని దీనదశఁజూచిన నాహృదయము పగిలిపోవుచున్నది. జీవితలక్ష్యమే నాశనమైపోయినట్లున్నది. తన యున్న వస్త్రములపైఁ గూడఁ దానికిపు డేమాత్రమును నాసక్తిలేదు.

నా సున్నీ కెట్టి దుర్గతి ప్రాప్తించునని కలలోఁగూడ నే నెఱుంగక పోతిని. కలుడుగట్టిన దుఃఖమూ ర్తియైపోయినది. 'అమ్మా! అతఁడు నీతో నెందుకు మాట్లాడుట లేదు? దేనిని గురించి కోపగించుకున్నాఁడు? అని యెంతయో బుజ్జగించి యడిగితిని; కాని యేమియు జవాబు చెప్పదు. కన్నీరు మాత్రము ధారాపాతముగఁ బ్రవహింపఁ జేయును. చివఱకు నా సున్నీ యగాధములోఁ బడిపోయిన దన్నయ్యా!' అని గోపాదేవి యూరుకుమని యేడ్చినది.

నే నంటిని-"నీ వా యింటివారినుండి జాడతీయ లేదా?"

"ఎందుకు తీయలేదన్నయ్యా! విషయ మంతయుఁ దెలిసినది. ఆ సొగసుగాని యభిప్రాయము 'తానేదారినఁ బోయినను సున్నీ తనను బూజించుచు నుండవలె'నని. సున్నీ దీని నెట్లు సహించును? అది యెంత యభిమానవంతురాలో నీ వెఱుంగుదువుగదా! భర్త యెంత దుర్వ్యాపారపరుఁడైనను భర్తనే దైవముగ భావించు స్త్రీల వంటిదిగాదు సున్నీ. అది గారాబముగా పెఱిగిన పిల్ల. తండ్రికుఁడు సున్నీ యనిన ప్రాణములు వదలెడివాఁడు. నేనుగూడఁ గంటికి రెప్పవలె దానిఁ గాచుకొనుచుంటిని. భర్తమాత్ర మొకజులాయి వాఁడు దొరకెను. అర్ధరాత్రి పదికెచ్చ లెచ్చటనో దిరుగుచుండును. భార్యభర్తలిరువురిలో నేనేమి మాటపట్టింపులువచ్చెనో యేమో పరస్పర ద్వేషభావము లంకురించినవి. సున్నీ నాతఁడు లక్ష్య బెట్టుటలేదు. సున్నీ యాతనిని సరకుజేయుటలేదు; కాని యతఁడు మాత్రము తన విలాసనర్తనములో మైమఱచి

యున్నాఁడు. సున్నీ క్రుంగిపోవుచున్నది. ఆతనికి సున్నీ స్థానములో వేఱొక సున్నీ యున్నది. దానితో నాతఁడు కులుకుచున్నాఁడు; సున్నికి నాతని స్థానములో నాతని నిరాదరణమున్నది, దానితో నిది దుఃఖసముద్రములో మునిఁగిపోవుచున్నది."

నేనంటిని—"అయిన సున్నికి నీవేమైన నచ్చఁజెప్పక పోతివా? దీని జీవితము ధ్వంసమగును గాని, ఆ విలాసవంతుఁడు కుఁ బోవున దేమియు లేదు."

శోభాదేవి కనులలో నశ్రువులు గిఱ్ఱున తిరిగినవి—"అన్నయ్యా! ఏమని నచ్చజెప్పమందువు? సున్నినిజూచి, నా హృదయము ద్రవ్యమైపోవుచున్నది దాని నెవరును కన్నెత్తిజేసి చూడకుండ నా హృదయము చీల్చి యందు భద్రపఱచి వైచికొందునా యనిపించుచున్నది. సున్నీ మూర్ఖురాలైనచో, కటుభాషిణియైనచో, సోమరియైనచో నచ్చజెప్పి బోధించెడిదానను. 'నీ పతి పీఠవీధుల నపఖ్యాతిపాలైదిరుగుచున్నను నీవు నాతని బూజింపు'మని జెప్పమందువా? నాయంత నేనే యిటువంటి యవమానమును సహింపఁజాలను, దాని నెట్లు సహింపుమని చెప్పుదును? సంపూర్ణముగా ఒండొరుల మనస్సులైక్యత నొందుటే స్త్రీ పురుషుల వివాహములోని ప్రథమనియమముగదా! స్త్రీ యణుమాత్రము విచలితయగుటఁజూచి సహింపఁగలిగిన పురుషులు చాల తక్కువమంది యుందురు; కాని భర్త స్వేచ్ఛాజీవియని భావించి శాంతచిత్తలైన స్త్రీలు మాత్ర మనేక శతసహస్ర సంఖ్యలోగలరు. సున్నీ యటువంటి

స్త్రీగాదు. సున్నీ యాత్మార్పణముఁ జేసినచో వరుని దెస నుండి గూడ యాత్మార్పణముఁగోరు తెగువుఁజెందిన వ్యక్తి. ఒకవేళ భర్తచే నుపేక్షింపఁ బడినదా, ఇఁక వానితో — దన జీవితము నాశనమైపోయినను సరియే — యేవిధమగు సంపర్కముఁ బెట్టుకొన నిచ్ఛగింపదు."

ఈవిధముగఁ జెప్పి గోపాదేవి లోనికిఁబోయి యొక నగలపెట్టెఁ దెచ్చి యందలి యాభరణములఁ జూపుచు నని నది-"సున్నీ దీని నిపుడిచటనే విడిచి పోయినది. అసలిందు కొఱకే వచ్చినది. ఈ నగలను సమకూర్చుటకు నేఁ బడిన పాట్లెన్నియు నన్నియుగావు, నీ వెఱుంగనివాఁడవు కావు గదా! వీనికొఱకు మాసముల కొలఁది కాలికి బలపము గట్టు నట్లు తిరిగితిని. వేయేల బిచ్చమెత్తి సమకూర్చితి ననుకొనుము. సున్నీ యిపుడీ యాభరణములవైపు కన్నెత్తియైనఁ జూచుటలేదు. ఎవరికొఱకు ధరింపవలెను? దేనికొఱ కలంకరించుకొనవలెను? అయిదు పెట్టెలతో బట్టల నిచ్చితిని. బట్టలు కుట్టికుట్టి నా కన్నులు చిల్లులు వడిపోయినవి. అది యా బట్టలనన్నిటిని దెచ్చి యిచటఁ బారవైచినది. ఈ వస్తువులపై దాని కసహ్యాము జనించినది. చేతులకు రెండు మామూలు గాజులు, ఒక తెల్లనిచీర మాత్రమే యిపుడు దాని యలంకారమునకు సరిపోయినవి."

నేను గోపాదేవి కొకింత ధైర్యము జెప్పియిట్లంటిని— 'నేను వెళ్ళి కేదారనాథుని కలిసికొందును. అసలతని )షయమేమో దెలిసికొందును."

గోపాదేవి చేతులు జోడించి యనినది–"వద్దన్నయ్యా! వద్దు. పొరపాటునఁగూడ వెళ్ళవద్దు. నున్నీవినినచోఁ బ్రాణములే వదలివేయును. అది యభిమానపు బొమ్మయని తెలిసికొనుము. కాలిపోయిననుగూడ బలముపోని గొలుసని భావింపుము. తనను తృణీకరించిన పాదములనది జీవితములోఁ దిరిగి స్పృశింపదు. మంచితనముచే దాని మనస్సును జయించి దానిసను జేసికొనవచ్చుగాని, శాసన పూర్వకముగా దానిని వశపరచుకొనుట నాకే శక్యము కాలేదు; ఇతరులకు శక్యమగునా ?"

ఆ సమయములో నేను గోపాదేవితో నేమియు ననలేదు; కాని సీలుఁజూచుకొని వెళ్ళి లాలామదారీలాలును గలిసికొనవలె ననుకొంటిని. నేను రహస్యముఁ దెలిసికొనఁ గోరుచుంటినని వారికెవ్వరికిఁ దెలియకుండునట్లు ప్రవర్తింపఁ దలఁచుకొంటిని.

సంయోగవశమున తండ్రి, కుమారులిర్వురు నింటికడ నొక్కచోటుననే నుండగాఁ గలిసికొనగల్గితిని. నన్నుఁజూడఁగనే కేదారుఁడు వచ్చి నా చరణముల స్పృశించి, యాతని సౌశీల్యతకు నేను ముగ్ధుఁడనై పోవునట్లుగ వందన మాచరించినాఁడు. వెంటనే లోనికిఁబోయి టీ, జామ్, మిఠాయిలఁ దెచ్చియిచ్చినాఁడు. ఇంత సౌమ్య, సుశీల, వినమ్ర గుణగణ సమన్వితుఁడగు యువకుని నేనెచ్చటను జూడలేదు. వాని యాంతరంగిక భావములకు బాహ్యావర్తనకుఁ భేదముండఁ గలదను భావనే నాకు గలుగలేదు. నా సన్నిధి నున్నంత

నలుకు నతను స్తకుఁడై గూరుచుండి యున్నాఁడు. ఔద్ధత్యము ఛాయామాత్రముగనైనను నాకాతనిలోఁ గాన్పింపలేదు.

కేదారుడు 'టెనిస్' ఆడుకొనుటకుఁ బోయిన వెనుక నేను మదారీలాలుతో నిట్లంటిని—"కేదారబాబు చాల సచ్చరిత్రుఁడుగనే గన్పట్టుచున్నాఁడు. భార్యా భర్తలలో నీ యననుకూలత యెందుకుఁ దలయెత్తినదో యూహాకందని విషయముగ నున్నది!"

మదారీలాలొక్క క్షణమాలోచించి యనెను—"ఇరువురును దమతమ తల్లిదండ్రుల గారాబుబిడ్డలే! గారాబము, పిల్లలలో తా బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళను స్వభావమును సంపాదించును. ఇంతకంటె కారణాంతరమేమియు నాకుఁ గన్పించుటలేదు. నా జీవితమంతయు సంఘర్షణలతోడనే గడచిపోయినది. ఇపుడిపుడే యొకింతశాంతి లభించినది. భోగవిలాసము లనుభవించుట కెన్నఁడు నవకాశమే కలుగలేదు. జీవితములోని దినములన్నియుఁ గఠినపరిశ్రమలోను, రాత్రులోడలెఱుంగని సుషుప్తిలోను గడచిపోయినవి. ఆరోగ్యము కూడ సంతృప్తిగాలేదు; ఈ కారణములచే నెల్లపుడు నేగొంతయో ద్రవ్యము సంపాదించవలెనను విచారముతో నుండెడివాఁడను. నా యనంతరమునఁ బిల్లలకుఁ దిరిపెమెత్తుకొనవలసిన దుర్గతి బట్టకుండవలెనని యెంతయో వ్యథపడెడివాఁడను. దీనికంతకు పరిణామస్వరూపముగ నీ మహాశయునకనాయాసముగ పైతృకమైన పెద్ద ధనరాశి లభించినది. పెంకెపట్టుదల యెక్కువైనది. మధుపానమునకుఁ దావులభించినది.

ఆ పిమ్మట నాటకములలోఁ బాల్గొను నభిరుచి యేర్పడినది. ధనాభావము లేనేలేదుగదా! ఆపైన తల్లిదండ్రుల కేకైక సుకుమార కుమారుడు! వాని ప్రసన్నతయే మా కిహలోక స్వర్గము! చదువు సంధ్యలమాట యటుండ విలాసవాంఛ యధికమైనది. క్రమముగా వ్యవహారమింకను ముదురుపాకమున బడినది. తనజీవిత నాటకమునే యాడఁ దొడఁగినాఁడు. ఇదియంతయుఁజూచి నే నత్యంత ఖిన్నుఁడనైతిని. వివాహముఁ జేసినచో వ్యవహారము కుదుటఁ బడఁగలదని యోచించితిని; ఇంతలో గోపాదేవి పిల్లనిత్తునని సందేశమంపినది. వెంటనే యంగీకరించితిని.

"నేను సున్నీ నంతకుఁ బూర్వమే జూచియుంటిని. ఇటువంటి సౌందర్యరాశిని భార్యగాఁ బొందినచో వాని మనస్సునకు స్థిరత్వము లభింపఁగలదని యాశించితిని. కాని యామెకూడ నింతకుమఱింత గారాబమునఁబెఱిగిన బిడ్డయే-మొండిపట్టుదలగలది, అబోధ, ముగ్ధ, ఆదర్శవాదిని. సహిష్ణుత నేమాత్రము నామె నేర్చుకొనలేదు. పట్టుదలలను సడలించుకొని సమాధానవైఖరి నవలంబించుటవలన జీవితమున కెటువంటి విలువ లభించునో యామె యెఱుంగనే యెఱుంగదు. వీర లిరువురి మూర్ఖతఁ జూడగా నుక్కుముక్క, యుక్కుముక్కతో యుద్ధమునకుఁ దలపడిన విధముగానున్నది. అమె దన యభిమానముతోడను, వీఁడు తన యుపేక్షతోడను నొండొరులను బరాజితులఁ జేయఁగోరుచున్నారు. ఇదే రహస్యము. పైగా, అన్నగారూ! నేను కోడలినే యధికదోషినిగ

భావించుచున్నాను. మగపిల్లలు సర్వసామాన్యముగ నేగాంతయో విశృంఖల స్వభావులుగనే యుందురు. ఆడుబిడ్డలు మాత్రము సహజముగ సుశీలురై తమ బాధ్యతలను గుర్తెఱింగి యుందురు. వారి సేవా తత్పరత, త్యాగనిరతి, నిరవధిక ప్రేమలే పురుషులపై విజయము సాధించుటకు వారికిఁగల మహిమాన్వితములైన యస్త్రములు! దురదృష్టవశమునఁ గోడలిలో నీ గుణసంపద కొఱవడియున్నది. ఈ నావ యెటు లేదరిఁ జేరునో పరమేశ్వరునికే యెఱుక! నాకంతయు నగమ్యగోచరముగ నున్నది."

ఇంతలో సున్నీ గూడ లోపలినుండి యచటకు వచ్చినది. కేవలము తన స్వరూపమున నొక రేఖాచిత్ర మాత్రముగ, నొక మనోహర సంగీతపు ప్రతిధ్వని మాత్రముగ నామె మిగిలి యున్నది. మేల్మి బంగారము తపించి భస్మమై పోయినది. నశించిపోయిన యాశాలతల కింతకన్న సార్థకరూపకల్పనము నే చిత్రాకారుఁడును జేయఁజాలడు! నిందాగర్భితముగ నిట్లనినది—"ఎంతసేపైనదో మీరిటకు వచ్చి, నాకు మాట మాత్రమైనఁ దెలియలేదు. బహుశః మీరిచటినుండి యిటే వెళ్ళిపోయెడివారేమోగూడ—అందుకు సందేహమేమి? నిజముగా నట్లే జరిగియుండెడిది!"

అశ్రువేగము నాపుకొనుచు నేనంటిని— "లేదు సున్నీ! నిన్నుఁ జూడకుండ నేనెట్లు పోఁగలను? నీవద్దకు వచ్చుచునే యుంటిని; ఇంతలో నీవే యిటు వచ్చితివి."

మదారీలాలు గది బయటకుఁబోయి తన కారును శుభ్రము చేయింపసాగిరి. బహుశః నాకు సున్నీతో మాట్లాడుట కవకాశమిచ్చు దలంపుతోనే యాయనయట్లు బోయె నేమోయని నే నూహించుకొంటిని.

సున్నీ యడిగినది—"అమ్మ క్షేమముగ నున్నదా?"

"ఆ! క్షేమముగనే యున్నది. నీ కిదేమి గతి, యిట్లు తయారయితివి ?"

"గతియేమి, నేనుగూడ బాగుగనే యుంటిని."

"ఏమిటి విశేషము? మీలో మీ కీ పోరుపు లెందుకు వచ్చినవి? గోపాదేవి మనోవ్యథతోఁ గుమిలిపోవుచున్నది. నీవు మృత్యుదేవత నావాహనము జేయుచు కూరికి కూర్కి యారిపోనున్న దీపకళికవలె నుంటివి. వెనుక ముందు లోకింత యోచించి మెలఁగవలయును దల్లీ!"

సున్నీ కన్బొమలు ముడివడినవి—"మీ రనవసరముగ నీ విషయమును దిరిగి ప్రస్తావించుచున్నారు మామయ్యా! నేనొక యభాగ్యురాలనవి నాకు నేను జవాబు చెప్పుకొని తృప్తిఁబొందితిని. ఇఁక దీనిని నివారించుట నా శక్తికి మించిన విషయము. ఆదరణలేని జీవితముకంటె మృత్యువును నే నెంతేని సంతోషముగ నెదుర్కొని యాలింగనముఁ జేసికొనుట మంచిదిగ భావించుచున్నాను. నేను వ్రతమునకు బదులు వ్రతమును గోరుచున్నాను. జీవితమునకు వేఱొక స్వరూపమేదియు నాకు గోచరించుటలేదు. ఈవిషయములో నేదేనొక విధముగ సమాధానపడి కాలము గడపుకొనుట నాకసంభ

వము. దీని ఫలితమును గుఱించి నాకెట్టి విచారమును లేదు. నన్నుఁగూర్చి మీరుగాని, మాయమ్మగాని కించిత్తును పరితపింపవలసిన యవసరము నాకు గనిపించుటలేదు."

"కాని......"

"లేదుమామయ్యా, ఈ విషయములో నిఁక మీరేమియుఁ జెప్పవద్దు. కాదు గూడదని మీరీ ప్రస్తావన నింకను గొనసాగింపఁ దలంతురేని నేనిటనుండి వెడలిపోదును."

'నీవు కొంచెము యోచించి......' అని నేనేదియో చెప్ప మొదలిడితిని, కాని యర్ధోక్తిలోనే యామెయందుకొని "నేనెంతయు యోచించి యొక నిర్ణయమునకు వచ్చితిని. పశువును మనుష్యునిగఁ జేయుట నా శక్తికిమించిన పని" అని తన కఠోరనిశ్చయమును వెలిబుచ్చినది. దీని వెనుక నేను నోరుమూసికొనుట దప్ప నింక మిగిలిన దేమున్నది?

# 5

అది మేనెల. నేను ముస్సోరి వెళ్ళియుంటిని. ఒక దినమున నకస్మాత్తుగ గోపాదేవివద్దనుండితంతివార్త వచ్చినది "వెంటనే రమ్ము. తొందరపనియున్నది"అని. నేను కంగారు పడితిని; కాని యేవిధమైన దుర్ఘటన మాత్రము జరుగలేదని నిశ్చయించుకొంటిని. మరునాఁడే ఢిల్లీ చేరితిని. గోపాదేవి వచ్చి నాముందు నిలువఁబడినది. ఆమెను చూడగనే నా గుండె లొక్కసారి జలదరించినవి. మూక, నిస్పంద, నిష్ప్రాణ

చిత్రప్రతిమవలె నున్నది. కొలఁది దినములలోనే జీవితము చాలింపబోవుచున్న క్షయరోగివలె నున్నది.

నేనడిగితిని—"క్షేమముగ నుంటివా గోపాదేవీ? నేను చాల భయపడితిని."

ఆమె జ్యోతివిహీనమైన కండ్లతో నా వంకకు జూచి యనినది—"నిజమా?"

"సున్నీ క్షేమముగ నున్నదా?"

"ఆ! బాగుగనే యున్నది."

"కేదారనాథుఁడో?"

"అతఁడుగూడ కుశలముగనే యున్నాఁడు."

"అయిన విశేషమేమి!"

"విశేషమేమియు లేదు."

"నీవు తంతివార్త నంపితివి—మఱి విశేషమేమియు లేదనుచుంటివేమి?"

"హృదయము చాల భీతావహమై యున్నది. ఇందు చేతనే పిలిపించితిని. సున్నీ నేదేనొక విధముగ నచ్చఁజెప్పి యిచటకుఁ దీసికొని రావలయును. నేను నా శక్తికొలఁది ప్రయత్నించి విఫలమనోరథనైతిని."

"ఈ మధ్య నేదైన క్రొత్త విశేషము జరిగినదా?"

"క్రొత్త విశేషమేమియు లేదు; కాని యొకవిధముగ క్రొత్తదనియే చెప్పవచ్చును. కేదారుఁడొక నటితోఁ గలిసి యెటకో పారిపోయినాఁడు. వారము దినములనుండి యెచ్చటను వాని జాడలేదు. పోవునపుడు సున్నీతో నీ వున్నంత

వఱకు నీ గడపఁ ద్రొక్కనని జెప్పి పోయెనట. ఆ ఇంటఁ బసిపిల్ల మొదలు మదారీలాలువరకు సున్నీ విషయమున శత్రుత్వముఁ దాల్చినారు. కాని యది మాత్ర మచటినుండి కాలు కదపుటకుఁ గూడ నంగీకరించుటలేదు. కేదారుఁడు తన తండ్రి సంతకముఁ జేసి బ్యాంకునుండి గొన్ని వేల రూపాయలను దీసికొని పోయెననిగూడ వింటిని.”

“నీవు సున్నీని గలిసికొంటివా?”

“ఆ! మూఁడు దినములనుండి నిత్యము బోవు చున్నాను.”

# 6

నేనాకాళ్ళతోడనే మదారీలాలు యింటికిఁ బోతిని. సున్నీ యేవిధముగను రాదను సంగతి నాకుఁ దెలిసినను బ్రయత్నలోపముఁ జేయుటకు మనస్కరింపలేదు; కాని యచటకుఁ బోయి చూతునుగదా—ఇల్లంతయు రోదనధ్వనులతో నిండియున్నది. నా హృదయ మాగిపోయినట్లనిపించినది. శవ యాత్రకు సన్నాహములు జరుగుచున్నవి. ఆ వీధిలోని వారం దఱు వందలకొలఁది గుమిగూడి యున్నారు. ఇంటిలో నుండి ‘అయ్యో! అయ్యో!’ యను నాక్రందన ధ్వనులు వచ్చు చున్నవి. ఎదురుగా సున్నీ శవము గన్పించుచున్నది.

మదారీలాలు నన్నుఁ జూడగనే యున్మత్తునివలె నన్ను గట్టిగ కౌగలించుకొని—“అన్నగారూ, దేవుఁడు నన్ను నిలువున దోఁచివైచినాఁడు. కొడుకు మాయమైపోయినాఁడు; కోడలు

కూడ మాయమైపోయినది; నా జీవితమే సర్వనాశనమైపోయిన దన్నగారూ..." అనుచు బావురుమని యేడువ దొడంగెను.

తరువాత నీ కథయంతయుఁ దెలిసినది— కేదారుఁడు మాయమైపోయినప్పటినుండియు సున్నీ యింకను నుదాసీనయైనది. ఆమె యా దినముననే తన గాజుల నన్నింటిని బగుల గొట్టి వైచుకొనినది. నుదుటనున్న కుంకమను తుడిచివైచుకొనినది. అత్తగా రడ్డగింపగా నామెను దుర్భాషలాడినది. మదారీలాలు నచ్చజెప్పఁబోవఁగ నాయననుగూడఁ గఠినోక్తులాడినది. ఈమె యున్మాదినియైపోయినదేమోయని యందఱ కనుమానము గలిగినది. అందఱు నామెతో మాట్లాడుట మానివైచిరి. నేఁడు ప్రాతఃకాలముననే యమునానదికి స్నానము చేయఁబోయినది. చిమ్మచీఁకటిగ నున్నది. ఇంటనందఱు నింకను నిదురవోవుచున్నారు. ప్రొద్దెక్కిన వెనుక కోడలు తమయింటఁ గన్పింపకబోవుటచే నామెకొఱ కన్వేషింపసాగిరి. రెండుఝాములవేళ యమునకుఁ బోయినట్లు దెలిసినది. అందఱు నటు బర్వెత్తిరి. అచట నామె శవము లభించినది. పోలీసులు వచ్చిరి. శవ పరీక్ష జరిగినది. ఇపుడే శవము నొప్పగించిరి. నా హృదయము స్తంభించి పోయినటులనిపించి యటులనే కూర్చుంటిని. అయ్యో! హతవిధీ! కొలఁది దినముల క్రిందటనే పల్లకి నెక్కివచ్చిన సుందరి నేఁడు నలుగురి భుజములపైఁ బోవుచున్నది.

నేనుగూడ శ్మశానమునకుఁబోతిని. అచటినుండి తిరిగి వచ్చుసరికి పదియైనది. నా కాళ్లు గజగజ వణకుచున్నవి. ఈ సమాచారము వినిన గోపాదేవి స్థితి యేమగునో తెలియదు.

'కొంపతీసి ప్రాణములం గోల్పోవుదుగదా?' యని భయపడు చుంటిని. సున్నీయామె బహిఃప్రాణము! ఆమె జీవన కేంద్రము. ఆమె దుఃఖమయవాటికలో ఈ మొక్క యొక్కటే మిగిలియున్నది. తన హృదయరక్తముతో నా యాశాంకురమును బెంచుకొనుచున్నది. దాని వసంతమును గూర్చియే యెల్ల వేళల నామె తలపోయుచుండునది. ఆ మొలక చిగిర్చి, పుష్పించి, ఫలించును; దాని శాఖలపై శకుంత సంతానములు గూర్చుండి హాయిగా సుమధురగానముల నాలపించునని యామె గనుచున్న బంగారు కలలే యామె జీవనాధారములు! కాని నేడు కఠోరుడైన విధి యామెజీవనసూత్రమును ద్రెంచి పారవైచినాడు. ఇంక నిప్పుడామె జీవితమునకేయాధారమును లేదు. ఆమె సమస్త జీవితాశయముల కేంద్రస్థానము నేడు సర్వశూన్యమైన మరుభూమివలెం గానవచ్చుచున్నది.

హృదయమును రెండు చేతులం బట్టుకొని తలుపుం దట్టితిని. గోపాదేవి యొక లాంతరు చేతంబుచ్చుకొని వచ్చినది. అమె ముఖముపై నాకొక క్రొంత్త యానందరేఖ గోచరించినది.

నా శోకముద్రను జూచి యామె మాతృప్రేమతో నా చేతిని బట్టుకొని యనినది—"నేడు దినమంతయు నీకు నేడ్చుటతోనే గడచిపోయినది. శవముతో చాలమంది వచ్చియుందురు. నేనుగూడ నొకపరి పోయి సున్నీ యంతిమ దర్శనముం జేసికొందునా యనిపించినది. కాని సున్నీయే లేనపుడు దాని శవములో నేమున్నదనిపించినది. పోలేదు."

నేను విస్మయాభిభూతుఁడనై గోపాదేవివైపు జూచుచుంటిని. అయిన నామెకీ శోకసమాచార మందినదా! అయినను నింత శాంతియా! ఇంత యవిచలిత ధైర్యమా! అంటిని—"మంచిపని జేసితివి—పోలేదు. యేడ్చుట తప్ప వేఱేమున్నది."

"ఔను—మఱేమున్నది ?—ఏడ్చుట! ఆ యేడుపిచటనే యేడ్చితిని; కాని నీతో నిజము చెప్పుచున్నాను, హృదయపూర్వకముగా నేడువలేదు. కన్నీ రెటుల వచ్చినదో నాకే తెలియలేదు. నేను సున్నీ మృతి జెందినందులకుఁ బ్రసన్నురాల నైతిని. అభాగిని!...తన మాన మర్యాదలను మాత్రము దీసికొని యీ ప్రపంచమునుండి వీడ్కోలుఁ బుచ్చుకొనినది; లేనిచో నేయే దుర్దశల ననుభవించెడిదో! తన ప్రతిష్ఠను సంపూర్ణముగ నిలుపుకొనినందుకు నాకు మఱింత సంతసముగ నున్నది. భర్తృప్రేమాదరణలు లభింపని స్త్రీజీవిత మంతమైపోవుటయే మంచిది. అన్నయ్యా! నీవు సున్నీ ముఖముద్రను జూచితివా ? చూచినవారందఱు చిరునవ్వు నవ్వుచున్నటు లున్నదని జెప్పుచున్నారు. నా సున్నీ నిజముగ దేవి! ఏ దేవతయో సున్నీ రూపమున నా కడుపున బుట్టి భారత స్త్రీల ప్రతిష్ఠను సువర్ణాక్షరములతో లిఖించి పోయినది. నిజముగ నా సున్నీని దేవత లీసరి కైరావతముపై నెక్కించి యూరేగించుచుందురు. ఇది నా కెంతేని గర్వకారణము. అన్నయ్యా! యేడ్చుచు జీవించుటకే మానవుఁడు నిచ్చగింపఁడు. జీవితములో దుఃఖముతప్ప వేరేమియు లేదని దెలిసిపోయిన వెనుక

నా మానవుడు జీవించి యేమి పాముకొనవలెను? ఎందులకు జీవించవలెను? కడుపుకింత తిని నిదురపోయి, పిమ్మట చని పోవుటకా? నేనిఁక సున్నీని మఱచిపోదునని, దానిని జ్ఞాపకము జేసికొని నేనెన్నఁడు నేడుననని జెప్పను; కాని యవి దుఃఖాశ్రువులు మాత్రముగావు, ఆనందాశ్రువులేయగును. వీరపుత్త్రుని గనిన తల్లి తన పుత్త్రుని వీరగతికి సంతసించును గాని, దుఃఖింపదు. సున్నీ మరణములోనున్న గౌరవము స్వల్పముకాదు. అద్దానిని నేను కన్నీరు కార్చి యెట్లు నిరాకరింపగలను? సమస్త ప్రపంచము తన్ను నిందించిననుసరియే! తన తల్లి మాత్రము తన నభినందించునని దానికిఁ దెలియును. దాని యాత్మకీ యానందముకూడ కలుగకుండ నేను జేయుదునా? రాత్రి చాల ప్రొద్దుపోయినది. పైకిఁ బోయి పరుండుము. నేను నీకు మంచమువాల్చి ప్రక్కవైచితిని; కాని చూడు, ఒక్కడవు పరుండి యేడువవద్దుసుమా! సున్నీ యేమి చేయవలెనో యదియే జేసినది. సున్నీ తండ్రి యున్నచో నేఁడు సున్నీ ప్రతిమను జేసి పూజించెడివాఁడు.”

నేను పైకిఁబోయి పరుంటిని, నా హృదయ భారము తేలికయై పోయినటులనిపించినది; కాని యున్నటులుండి నాకీ సందేహము కలుగసాగినది—“గోపాదేవిలో గానవచ్చు నా ప్రశాంత మామె హృదయకుహరమున దలముకొనిన అపార మనోవ్యథకు రూపాంతరము కాదుగదా?” యని.



# శాంతి

నేను కాఁపురమునకు వచ్చిన క్రొత్తలో వర్తమాన సమాజ స్థితిగతు లేమియు నాకు తెలియవు. అదియొక యజ్ఞానదశ. కట్టు-బొట్టు, మాట-మంతి, రీతి-రివాజులలో నాధునిక సమాజములోని విద్యావిజ్ఞానాది సంస్కారములు గలిగిన సభ్యస్త్రీల పోకడలే లేవు. ఎవరియెదుటికైనను వెళ్ళుటకు సైతము సిగ్గుగా నుండెడిది. చివఱకు అపరిచితలగు కులస్త్రీల యెదుటకుఁగూడ ననగుంఠనము లేకుండ వెళ్లుటకు సంకోచముగ నుండెడిది. నేను కొలఁదిగ మాతృభాషయైన హిందీ నేర్చుకొని యుంటిని; గాని నవలలు నాటకములు మొదలగునవి చదువుటలో నాకభిరుచి యంతగా లేదు.

తీరిక సమయములలోఁ దులసీరామాయణముఁ జదివెడి దానను. రామాయణపఠనములో నామనస్సు లగ్నమయ్యెడిది. అది, మానవకృతిగ నాకుఁ దోపలేదు. భగవానుఁడే స్వయముగ దానిని రచించెనని నా సంపూర్ణ విశ్వాసము. మానవులింతటి బుద్ధిమంతులుగ, సహృదయులుగ నుందురను విశ్వాసము నాకు లేదు. నేను దినమంతయు నేదేనొక యింటిపనిఁ జేయుచుండెడి దానను. ఏపనియు లేనిచో రాట్నముఁ దీసికొని నూలు వడకెడిదానను. వృద్ధురాలైన మా యత్తగారనిన వణకు పుట్టెడిది. ఒక దినమున పప్పులో నుప్పెక్కువైనది. భోజన సమయమున మామగా

రనినారు — "ఉప్పు కొంచెము జాగ్రత్తగఁ జూచి వేయు చుండుము" అని. ఈ మాటలు వినినంత నా హృదయము కంపింప సాగినది. ఎంతటి కటువచనములతో నైన నింతకంటె నధిక వేదన నా కెవ్వరును గలుగఁజేయఁజాల రనిపించినది.

కాని నా యీ యజ్ఞానము మా శ్రీవారి కేమియు నచ్చెడిదికాదు. వారు వృత్తిచే వకీలు. విద్యలో నున్నతో న్నత పట్టములందిరి. వారు నన్ననవరత మత్యధికముగాఁ బ్రేమించెడివారు; కాని యా ప్రేమ మధికభాగము దయా సమ్మిశ్రితము. స్త్రీల రీతి, రివాజులలో, విద్యావిషయము లలో వారి యభిప్రాయములు చాల యుదారములైనవి. వారు తమ యంతస్సునుండి నన్నుఁ గొన్ని వందల గజముల లోతైన గోతిలోఁ బడియున్నటులుజూచి తమలోఁ దామెం తయో ఖిన్నులగుచుండెడివారేమో! కాని, అందు నా బాధ్యతగాని, తప్పిదముగాని యేమియు లేదను సత్యమును గుర్తించి, భారతీయుల యాచార వ్యవహారవిధానములపైఁ జికాకుపడెడివారు. వారికి నా సరసను గూర్చుండి మాట్లాడు టలో నేమాత్రము నానందము గలిగెడిదికాదు. శయనాగా రము జేరునపు డేదైన నొక యింగ్లీషుపుస్తకముఁ దెచ్చు కొని నిద్రవచ్చు వఱకుఁ జదువుకొనుచుండెడివారు. ఎప్పు డైన నే "నేమిచదువుచుంటి"రని యడిగినచో నావైపు కరుణ దృష్టితోఁ జూచి యీ విధముగ జవా బిచ్చెడివారు — "ఏమని చెప్పుదును ? ఇది 'ఆస్కార్ వైల్డ్' రచనలలోకెల్ల సర్వశ్రేష్ఠమైన రచన."

గ్రంథపఠనము గావింపలేకున్నను, నుత్తమ రచనల యందలి రసాస్వాదన సుఖలేశమునైన ననుభవింపఁజాలని, నా యయోగ్యతకు నేను జాల సిగ్గుపడెడిదానను. నన్ను నేనే యేవగించుకొనెడిదానను. ఇంత విద్వాంసుఁడైన యోగ్యపురుషునకు భార్యనగు నర్హత నాకులేదు. ఎవరో మొరటువాఁడగు నడవిమనుజు నింటఁ బడనలసినదానను. శ్రీవారు నాస్థితికిఁ గోపించి నన్ను నిరాదరణ దృష్టితోఁ జూచుటలేదు, నే నెంతయో యదృష్టవంతురాలను— అనుకొనెడిదానను.

ఒకనాటి సంధ్యాసమయమున నేను నా గదిలో నొకచో చాప పఱచుకొని, తూర్పుముఖముగఁ గూర్చుండి రామాయణముఁ జదువుచుంటిని-భరతుడు శ్రీరామచంద్రుని వెదకుటకై బయలుదేరెను. భరతుని కరుణావిలాపము జదివి నంతనే నా హృదయము వికలమైనది! స్వరము గద్గదమైనది నేత్రములనుండి యశ్రుధారలు ప్రవహింపఁజొచ్చినవి. హృదయ ముప్పొంగి పోవుచున్నది. ఇంతలో శ్రీవారు నా గదిలోనికి వచ్చిరి. నేను వెంటనే పుస్తకము మూసివైచితిని. వారి యెదుట నా యజ్ఞానము ప్రకటితము గాకుండ శక్తి కొలఁదిఁ బ్రయత్నించుచుంటిని; గాని వారు పుస్తకమును జూచి యడిగిరి—"రామాయణమేనా?"

నే నపరాధినివలెఁ దలవంచుకొని యంటిని—"ఔను ఇంటి పనులలో నొకించుక తీరిక దొరికినది-పుస్తకము నిప్పుడే తెఱచితిని."

శ్రీవారు—"ఈ పుస్తకము చాల మంచిది, ఉన్నత భావములతో నిండియున్నదనుటలో సందేహమేమియు లేదు; కాని మానవ చరిత్రను ఇంగ్లీషు ఫ్రెంచిలేఖకులు చిత్రించు చున్నంత జక్కగ నిందు జిత్రింపఁబడలేదు. నీ కర్థము కాక పోవచ్చునుగాని చెప్పుటకు నా కేమియు నభ్యంతరములేదు. యూరపులో నేఁడు ప్రత్యక్షవాద (**Realism**) యుగము నడచుచున్నది. వారి—మనోభావముల పతనోత్థానములను గుఱించిన-వాస్తవికవర్ణనలను జదువునపు డాశ్చర్యచకితుల మగుచుందుము. ఇక్కడ మన కవు లడుగడుగునకును ధర్మ మును నీతిని రీతిని దృష్టిలోఁ బెట్టుకొని గ్రంథరచన గావింప వలసి వచ్చుచున్నది; ఇందుచేత వారి భావములలో నస్వా భావికత గానవచ్చుచున్నది; ఇదే లోపము తులసీదాసులోఁ గూడఁ గానవచ్చుచున్నది."

ఆ సమయములో శ్రీవారు జెప్పినది నా కేమియు నర్థముకాలేదు. ఇట్లంటిని—"నాకిదియే యెక్కువ పరమార్థ మనిపించుచున్నది. ఇంగ్లీషు పుస్తకముల నెట్లర్థము జేసికొన గలను?"

శ్రీవారు— "ఆంగ్లగ్రంథమును జదివి యర్థము గావించుకొనుటేమంత కఠినమైన విషయము కాదు. రోజు కొక్క గంటయైనఁ జదువుచున్నచోఁ గొలఁదికాలములోనే సామాన్యమగు నవలను జదువఁదగు యోగ్యత నొందఁగలవు; కాని నీవు నామాట మన్నింపఁగూడదని యొట్టు బెట్టుకొని నట్లుంటివి. నన్నుఁ జూచి సిగ్గుపడవలసిన యవసరము లేదని

యెంతయో బోధించితిని; గాని నీలో నావగింజలో నఱువది యవ వంతుగూడ మార్పురాలేదు. కొంచెము పరిశుభ్రము నలవరచుకొనుమనియు, పరమేశ్వరుఁడు సౌందర్యము నిచ్చినచో, దానిని సర్వవిధముల నలంకరించి యానందింపుమని మనల నాశీర్వదించినాఁడనియే మనము భావింపవలెననియు నీకెన్నెన్నియో జెప్పితిని; గాని నీవు నా యీ మాటల కేమాత్రము విలువ నిచ్చినట్లు గన్పించుటలేదు. లేక బహుశః నావంటి కురూపియైన పురుషునకు నీ వెట్లున్నను నదియే యెక్కువని భావించుచుంటివేమో నాకది తెలియదు. ఇది యంతయు నా యెడ జరుగుచున్న యన్యాయము. నీవు నాకు నిర్బంధపూర్వకముగ వైరాగ్యము నేర్పఁగోరుచుంటివి. నేను రాత్రింబవళ్లు శ్రమపడి సంపాదించుచున్నాను; స్వాభావికముగ నేను నా సంపాదన ముత్తమవిధమున వ్యయముగావలెనని గోరుచుందును; గాని నీ యజ్ఞానము, పూర్వకాలపు భావములు, ప్రవర్ధమాన మగుచున్న నాయుల్లాసాగ్నిపైఁ జన్నీటిని జల్లుచున్నవి. స్త్రీ కేవలము వంటఁ జేయుటకుఁ, బిల్లలఁ బెంచుటకుఁ, బతికి సేవచేయుటకు, ఏకాదశీవ్రతములఁ జేయుటకు నుపయోగపడునది మాత్రమేగాదు; వారి జీవిత చరమలక్ష్య మింతకంటె నెయ్యెరెట్లుత్తమోత్తమమైన యాశయము కలదిసుమా!

"వారు, మానవుల సమస్త సామాజిక మానసిక వికాస విషయములలో సమాన భాగస్వామ్యమున కధికారిణులు. వారి కందఱుమానవులవలె స్వతంత్రులుగా నుండుటకుఁ గూడ నధికారమున్నది. ఒక ఖైదీవలె జీవితమును వెళ్ళఁ

దీయుచున్న నీయీ దీనదశఁ జూచిన నాకుఁ జాల కష్టమగు చున్నది. స్త్రీ, పురుషున కర్ధాంగిగ నందరిచే నంగీకరింపఁ బడినది; కాని నీవు నా మానసిక సామాజికావశ్యకతలలో దేనిని బూర్తిచేయఁజాలకుంటివి. నా ధర్మము వేఱు - నీ ధర్మము వేఱు; నా యాచారములు వేఱు-నీ యాచారములు వేఱు; నా యామోద ప్రమోదములు వేఱు - నీ యామోద ప్రమోదములు వేఱు. జీవితములో నేకార్యమందును నాకు నీనుండి యే విధమైన సహాయము లభింపఁగల యాసలగు పడుటలేదు. ఇతరుల యూహలకందని యిట్టి దుర్దశలో నా జీవిత మెంత దుర్గతిలో నడచుచున్నదో నీవు స్వయముగ నాలోచించినచోఁ దెలిసికొనఁగలవు."

ఇట్లని యచటినుండి శ్రీవారు చనిన పిమ్మట నాలో నేనిట్లాలోచించుకొంటిని— "శ్రీవారు చెప్పినది పూర్తిగా యథార్థము. నే నాయన మెడకొక గుదిబండవలె నుంటిని." ఆరోజునుండి నే నాయన యభిమతానుసారమే నడచుకొన వలెనని దృఢప్రతిజ్ఞఁ జేసికొంటిని. నా యీజన్మకు సార్థకత నా పతిదేవుని ప్రసన్నునిఁ జేసికొనఁ గలుగుటయే గదా!

## 2

ఆధునిక వస్త్రభూషణాదుల నాధునిక పద్ధతిగ నలంక రించుకొనుట నా కిష్టము లేదని యెట్లనఁగలను? ఉన్నది. ఇతర బందఱకు నూతన విలాసానుభూతి యెడ నెంతప్రేమయో

నాకును నంతటి ప్రేమయే యున్నది. పాలపల్లుల వయసు నుండి పండ్లూడిపోవు వయసువఱకు నందఱు నలంకరించు కొన నుత్సహించుచున్నపుడు పదునారేండ్ల ప్రాయమున నున్న యువతినగు నాకు మాత్ర మా కోరిక ఎందుకుండదు? ఈ నైసర్గిక వాంఛతో లోలోన నా మనస్సెంత మథన పడు చున్నను ఈ కోరికను నా హృదయములోపలనే యణచి బెట్టి యుంచెడిదానను.

మా పుట్టినింట నాహారవిహారములు కొంచెము మోటుపద్ధతిగనే యుండెడివి. మా యమ్మ, యమ్మమ్మ గూడ తాము స్వయముగ దారమువడికి సాలెవానిచే వస్త్ర ములు నేయించుకొని యా వస్త్రములనే ధరించెడివారు. బయట డబ్బిచ్చి వస్త్రములుకొనుట చాల తక్కువగ నుండెడిది. నే నెన్నఁడైన గొంచెము పలుచని వస్త్రముల ధరింపఁగోరినను, అలంకారముపై నభిరుచిఁ జూపినను, మా యమ్మ వెంటనే నన్ను వారించి యధికాలకారముల జేసికొనుట పెద్దయింటి యాడుబిడ్డలకు శోభింపదని, ఇటు వంటి యలవాట్లు మంచివిగావని నచ్చఁజెప్పెడిది. మా యమ్మమ్మ నే నెప్పుడైన నద్దము ముందెక్కువ తడవు నిలు చుటఁ జూచినచోఁ గోపించెడిది. కాని యిపుడు శ్రీవారి పట్టుదల నా సంకోచమును సడలింపఁజేసినది. మా యత్త గారును నాడుబిడ్డలును నా నూతనాలంకరణ పద్ధతులఁ జూచి ముఖముఁ జిట్లించుకొనెడివారు. కాని నేనిఁక వారిని లక్ష్యపెట్టుట మానివైచితిని. శ్రీవారి పరిపూర్ణ ప్రేమదృష్టిని సంపాదించుటకొఱకు నేను చీవాట్లనుగూడ సహింపఁగలను.

ఇపుడు వారి మనోభావములు, నా మనోభావము లోకయంత స్తునకు రాసాగినవి; ఆయన యత్యంత ప్రసన్నచిత్తులై కను పింపఁ జొచ్చిరి. నా కొఱకాయన (ఫాషనబుల్) అత్యంతా ధుని కాలంకార శోభితములగు చీరలు, నతిసుందర పుష్ప గుచ్ఛ చిత్రితములైన జాకెట్లు, తళతళ మెఱయు చెప్పులు, సున్నితమైన లేసుపని జేయబడిన 'స్లిప్పర్లు' దెచ్చుచుండిరి. కాని నేనీ వస్తువులను ధరించుకొని యెవరియెదుటకు వెళ్లు దానను గాను. ఈ వస్త్రాలంకారములన్నియు శ్రీవారి ఎదుట ధరించుటకు మాత్రమే యుపయోగించుచుండుదానను. నే నీవిధముగ నలంకరించుకొనుటఁ జూచి వారత్యంత ప్రస న్నచిత్తు లయ్యెడివారు. స్త్రీ, తన భర్తయానందము కొఱ కేపనిఁ జేయఁజాలదు? ఇపుడింటిపనులు జేయుట నాకు మనస్కరించుట లేదు. నాకాలములో నధికభాగ మలంకరించు కొనుటయందును, పుస్తకావలోకనమునందును గడచిపో సాగినది. ఆధునికపుస్తకములపై నాకభిరుచి యేర్పడఁ జొచ్చినది.

శ్రీవారికిట్టి వినోదదాయినిగ వర్తించుచున్నను; మా యత్తమామల యెడ నాకుఁగల గౌరవదృష్టి నాలో నింకను జాగరితమైయున్న కారణమున, వారి ముందునుండి గౌను, బూట్లు ధరించి వెళ్ళు సాహసము నాకుఁగలుగుట లేదు. కాని వారు చెప్పెడి శిక్షాపూర్ణమైన యాదేశోపదేశములు మాత్రము నాకయిష్టముగ నుండెడివి. నేననుకొనెడిదానను: నాభర్త ప్రతిమాసము వందలకొలఁది రూప్యములు సంపా దించుచున్నపుడు నే నీయింటిదాసినై యెందుల కుండవలెను?

నా యిచ్ఛానుసారము — స్వచ్ఛందముగ నేనేపనైనను, నెంతటి పనినైనను జేయుదునుగాక; నన్నాజ్ఞాపించుటకు వీరెవరు? వీరి కా యధికారమేమున్నది? నాలో నాత్మాభిమానము వృద్ధికాసాగినది. ఒకవేళ అత్తగారు నాకేదైన పని జెప్పినచో నేనవశ్యము నేదేనొక లేనిపోని వంకఁబెట్టి చేయకుండఁ దప్పించుకొనెడిదానను. నేను నా నేపథ్య రచనా కార్యమున మునిఁగి యున్నపుడు—నాకే దేని పని చేయఁ దీరిక లేదన్నపుడు—ఏ పనినైన నీవే చేయవలయునని నన్ను నిర్బంధింప వీరల కేమి యధికారముగలదను నూహ నా మానసవీథిఁ బయనిడఁ జొచ్చినది.



ఒకరోజున మాయత్తగారనినది—"ప్రొద్దుట ఫలహారమునకుఁ గొంచెము సెనగపప్పు సాతాళింపుము" అని. ఆమాటలను నేనువినియు విననట్లుగా నచటినుండి వెడలిపోతిని. ఆమె కొంతసేపటివఱకు నాకొఱకెదురు జూచినది; కాని నేనెంతకును నాగదిలోనుండి బయటకు రాకపోవుట వలన నామెకుఁ గోపము వచ్చినది. ఆమె చాల ముక్కోపి. అత్యల్ప విషయమునకుఁగూడ కోపగించుకొనుచుండును. ఆమె తన యత్తగారి పెత్తనమును, ప్రతిష్ఠను నిలుపుకొనుటకు నన్ను కేవలమొక బానిసవలెఁ జూచెడిది; కాని తన కొమార్తెలతో మాత్రమెల్లపుడు నతిసౌమ్యముగ వ్యవహరించెడిది; కాని నేనుమాత్రము, వారలనామె నెత్తిని బెట్టుకొనుచున్నదని యెంచుదును.

క్రోధపూరితయై యానాఁడామె నా గదిగుమ్మము లోనికి వచ్చి యనినది—"నేను నిన్ను సెనగపప్పు సాతాళింపుమని జెప్పితిని, జేసితివా?"

నేను కొంచెము కోపముగనంటిని–'నాకిపుడు తీరిక లేదు'.

"అయిన కాలిపై గాలు వేసికొని హాయిగ కూర్చుండుట యే నీయుద్దేశ్యమా? చదువవేసిన నున్నమతి పోయినదట! క్రొత్తగా నేర్చుకొనిన చదువు మహిమయాయిది? ఈమధ్య నీలో నింతటి మార్పుగుపడుటకు హేతువేమి? ఏమి చూచుకొని యీ గర్వమింతయును? నాభర్త సంపాదించుచున్నాఁడు, నేనెందుకు పనిచేయవలెనని భావించుచుంటివా యేమి? కలనైన నట్లు తలంపకుము! నీపతి లక్ష సంపాదించును గాక; ఈయింటి యజమానురాలను నేనే! నేఁడు వాఁడు నాల్గు డబ్బులు సంపాదింపగనే నీకప్పుడే యీయింటి యజమానురాలిని గావలెనను బుద్ధి పుట్టినది; కాని వానిని పెంచి పెద్దఁ జేయుటకు నీవేమియు రాలేదు, నేనే వానికి విద్యాబుద్ధులఁ జెప్పించి యింతవానినిఁ జేసితిని. ఓహో! నిన్న మొన్నటి కుఱ్ఱదానవు. ఇప్పటినుండియే యింతయహంకారమా! గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినదట!"

నాకేడుపు వచ్చినది, నోటివెంట నొక్కమాట గూడ వెగలలేదు. శ్రీవారాసమయమున మేడపైగదిలోఁ గూర్చుండి యేదియో చదువుకొనుచుండిరి. ఈ మాటలన్నియు నాయన వినిరి. వారికిఁ జాలకష్టము కలిగినది. రాత్రి యాయన యింటికి వచ్చిన వెనుక నిట్లనిరి—"చూచితివా నేఁడమ్మ క్రోధము?

ఇది చాల యన్యాయము, ఇందువలననే స్త్రీలజీవితము చాల కష్టభూయిష్టముగఁ గన్పట్టును. ఇట్టి మాటలకుఁ గురియైన వారిహృదయములో నెంతవేదన కల్గునో, తెలిసికొనుట యసంభవము–జీవితమే భారమగును—హృదయము తూట్లు పడిపోవును. ఆపస్తేజోవాయువులను బొందజాలని మొక్క యేవిధముగఁ జాలిపోవునో, అదేవిధముగ స్త్రీల యాత్మోన్నతి–వికాసము నిలిచిపోవుచున్నవి. మనయిండ్లలో నిది యొక పెద్దదురాగతము. నేనామె కుమారుఁడను, ఆమె యెదుట నోరు విప్పఁజాలను. నాపైనామెకుఁ బెద్దయధికారముగలదు. ఇందువలన, నేనామెకు వ్యతిరేకముగ నొక్క మాట యనుటకూడ నాకుఁ దలఁగొట్టివైచినంతటి పని యగును. నీవుగూడ నీబంధనమునకుఁ గట్టుబడవలసియే యున్నది. ఆమె యనుమాటల నన్నిటిని నీవు 'కిమ్మ'నకుండ విని సహించి యూరకొన్నచో నాకుఁ జాలదుఃఖము కలుగును. ఆదుఃఖభార మధికమైనపుడెప్పుడైన నేను విషముఁ గూడ పుచ్చుకొనవచ్చు.

"ఇట్టిస్థితిలో రెండే రెండు మార్గములున్నవి. ఎల్లపుడు నమ్మబెట్టు చీవాట్లు సాధింపులు సహించుచునైన నుండవలె–లేదా నీవేదైన నన్యమార్గము నన్వేషింపవలె! అమ్మస్వభావము మారునని యాశించుట మాత్రము పూర్తిగ భ్రమయేగాని వేఱుగాదు. నీవేమార్గము ననుసరింపఁ గోరుచున్నానో చెప్పుము!"

నేను భయపడుచు నంటిని—"మీ రెటు లాజ్ఞాపించిన నటులే చేయుదును. ఇకనుండి చదువను వ్రాయను

మానివైతును. ఆమె యేమిచెప్పిన నదియే చేయుదును. ఇందువలన నామె ప్రసన్నురాలైనచో నటులనే కానిండు — చదువు సంధ్యలనేర్చి నేనేమి జేయుదును గనుక ?"

"కాని నాకిది యిష్టములేదు. అమ్మ నేడారంభించిన యీ నగవే రోజురోజునకు వృద్ధియగుచుండును. నేను నిన్నెంత నాగరిక తరుణిగ సువిచారశీలగఁ జేయఁ బ్రయత్నించెనో, యామెకంత చెడుగుగ గన్పట్టును. ఆమె క్రోధమంతయు నీమీదనే ప్రసరించును. తన యౌవనకాలము నాటి వాతావరణ మిప్పుడు మారిపోయినదను సంగతి యామెకుఁ దెలియదు. భావనాస్వాతంత్ర్యమును, కాలానుసరణమును నామె యధర్మములుగనే భావించును. నేనొక యుపాయ మాలోచించితిని, ఏదైన వేఱొక పట్టణమునకుఁ బోయి యచట కాపురముఁ బెట్టుద మనుకొను చున్నాను. నాకిచ్చట సరియైన ప్రాక్టీసుగూడ లేదు. దీనితో వేఱొక వంక వెదుకవలసిన యవసరముగూడ నుండదు."

నేను శ్రీవారి యీ యభిప్రాయమునకు వ్యతిరిక్తముగ నేమియుఁ జెప్పలేదు. ఒంటరిగ నుండవలసివచ్చునను భయము కలిగినను వెనువెంటనే స్వతంత్రముగ జీవింపవచ్చునను నాశకలిగి మనస్సును పులకింపఁజేసినది—భయమును బోద్రోలినది.

ఆ దినమునుండియు నత్తగారు నాతో మాట్లాడుట మానివైచినది. పనివారు - ఇరుగు పొరుగు వారలు - ఆడుబిడ్డలు-మొదలగు వారందఱును నన్నుఁ బరిహసింప

మొదలిడినది. ఇది నాకుఁ జాల వెగటుగ గన్పించినది. ఇంత కంటె నామె నన్ను నాలుగు దిట్టినను నేనంతగ బాధపడు దానను కాను. క్రమముగ నాకామెపైఁగల గౌరవభావము నశించిపోసాగినది. నాపై నన్నిటికంటె గురుతర దోషారోపణ మొకటి గావింపబడినది. నేను శ్రీవారిపై నేదో సమ్మోహన మంత్రము ప్రయోగించితినఁట! అందుచేతనే మంత్రబద్ధమైన నాగమువలె శ్రీవారు నా కనుసన్నల మెలఁగుచుండిరఁట; కాని యథార్థము మాత్ర మిందుకుఁ బూర్తిగ వ్యతిరిక్తము.

కృష్ణాష్టమి పండుగ వచ్చినది. ఇంటనందఱు వ్రతము జేయుచుండిరి. నేనుగూడ నెప్పటివలెనే వ్రతముఁ జేయఁ బూనితిని. శ్రీకృష్ణపరమాత్మ జననము రాత్రి పండ్రెండు గంటలకు! మేమందఱముఁ గూర్చుండి జంత్రవాద్యముల మేళవించి పాటలఁ బాడుచు పరమాత్మను భజంచుచుంటిమి. శ్రీవారీ యసభ్య కార్యనిర్వర్తనమునకుఁ బూర్తిగ వ్యతిరేకులు; భజన పాటల మాట యటుండగ, హోలీ దినమున వసంతోత్సవమునఁగూడ వారు పాల్గొనరు. రాత్రి యొంటి గంట యైనపిమ్మట నేను వారి గదిలోనికి వెళ్ళినపుడు నాకిట్లు బోధింపసాగిరి—"ఈ విధముగ శరీరమును గష్టపెట్టుట వలన నేమి ప్రయోజనము? కృష్ణుఁడు మహాపురుషుఁడను మాట యథార్థమే! ఆయనను బూజించుట మన కర్తవ్యమే! కాని యీ భజన పాటలవలనఁ బ్రయోజన మేమున్నది? ఈ యార్భాటమువలనఁ బుణ్య మెంతమాత్రమును రాదు.

పుణ్యకార్యములసఁగా సత్యము, నీతి, నియమవర్తనము; గాని యాడ్బాటములు ప్రదర్శనములు కావు."

శ్రీవారు స్వయముగ నీమార్గము ననుసరించుచున్నారు. ఆయన భగవద్గీత నెంతయో గొనియాడుదురు; గాని దాని నెన్నఁడుఁ బారాయణముఁ జేయరు. ఉపనిషత్తులఁ బ్రసంసించుచుండ వారినోటివెంట ననృతవృష్టియే గురియును! గాని వారెన్నఁడు నే యుపనిషత్తును జదువుచుండగ నేను జూడలేదు. ఆయన హిందూధర్మమందలి గూఢతత్త్వజ్ఞానమునకు ముగ్ధులగుదురు; కాని దానిని సమయానుకూలముగ గ్రహింపరు. విశేషించి వేదాంతమే భారతదేశ మధోగతికిఁ బోవుటకు మూలకారణమని భావింతురు. వారందురు—"ఈవేదాంతమే మనలను నాశనమొనర్చినది! మనము ప్రపంచ పదార్థము లన్నింటిని తుచ్ఛమైనవిగా భావింపసాగితిమి; దాని ఫలిత మిప్పటికిఁ గూడ ననుభవించుచునే యున్నాము. ఇప్పుడు కాలము మహోన్నత స్థానమునకుఁ జేరినది. నోరుమూసికొని కూర్చున్నచో నేమియుఁ జరుగదు. ఎక్కడికక్కడ సంతృప్తి నొందు స్వభావమే భారతదేశమును ధ్వంసము జేసివైచినది." అని.

ఆ సమయమున వారికి జవాబుచెప్ప సామర్థ్యము నాలో నెక్కడ నున్నది? వారా సమయమునఁ బాశ్చాత్య నాగరికతావ్యామోహితులై యుండిరను విషయమిప్పుడు దెలియుచున్నది. ఇప్పుడు వారా వ్యామోహమును బూర్తిగా విడనాడిరి. ఆ యుద్రేకమిప్పుడు చల్లబడి పోయినది.

# 3

తరువాతఁ గొన్నిదినములకు మే మలహాబాదుకు వచ్చితిమి. శ్రీవారు నాకంటె నాలుగుదినములు ముందే వచ్చి యొక మేడ నద్దెకుఁదీసికొనిరి. ఇల్లంతయుఁ జక్కఁగా నలంకరింపఁబడియున్నది. మా కయిదుగురు నౌకర్లుండిరి—ఇద్దరు స్త్రీలు, ఇద్దరు పురుషులు, ఒక వంటవాఁడు. ఇప్పుడు నేనింటి పనులన్నిటినుండి విముక్తిఁ బొందితిని. ఏమియుఁదోచని సమయము లందేదయిన నింగ్లీషు నవల నొకదానిఁ దీసికొని జదువుకొనుచుందును.

ఇత్తడి కంచుపాత్ర లింటఁ జాలతక్కువగ నున్నవి. పింగాణిపళ్లెములు గాజుపాత్రలు అలమరలలో సర్దబడి యున్నవి.

భోజనములు బల్లలమీఁదనే జరుగుచున్నవి. శ్రీవా రెంతయు నానందముతో భోజనముఁ జేయుచుండెడివారు. బల్లపై భోజనముఁ జేయుటకు మొదట నాకుఁ గొంచెము సిగ్గుగ నుండెడిది; గాని మెల్లమెల్లగ బల్లపై భోజనము సేయుపద్ధతి కలవడితిని. మా కొక యందమైన గుఱ్ఱము, ఒక బగ్గీ యున్నవి. మే మెచ్చటికైన, నడిచివెళ్లుటఁ బూర్తిగ మానివైచితిమి. ఎవరినైనఁ గలిసికొనుటకుఁ బది యడుగులు వెళ్ళవలసియున్నను, బండి సిద్ధము చేయింపబడుచుండును. శ్రీవారనుచుండెడివారు—"ఇదియే నాగరికత" అని.

శ్రీవారి యాదాయ మింకను గరిష్టపరిమితి నందు కొనలేదు సరిగదా చాల తక్కువగనే యున్నది. సరిగ ఖర్చు

లకుగూడఁ జాలుటలేదు. ఎన్నఁడైన నేనాయనను విచార గ్రస్తులై యుండెగఁ జూచినచో—"ఆదాయ మింత తక్కువగ నున్నపుడు ఖర్చు నింత యెక్కువగఁ బెంచుకొను టెందులకు? ఏదైన చిన్నయింటి నద్దెకుఁ దీసికొనుఁడు. ఇప్పుడునె 'కర్లతోఁ' బని జరుగఁగలదు." అని యేమో చెప్పఁబోవుదును. కాని యొకటి రెండు వాక్యములు పూర్తిగాక పూర్వమే శ్రీవారు నామాటలకు నవ్వుచు ననెడివారు— "నా లేమిని నాయంతట నేనే యేల చాటుకొనవలెను? దారిద్ర్యమును బ్రకటించుకొనుట దరిద్రుఁడగుటకంటెఁ గూడ నెక్కుఁడు దుఃఖదాయకము. మనము నిర్ధనులమను సంగతి మరచిపోవుదము. లక్ష్మితిరిగి మనయొద్దకుఁ దనంతఁదానే పర్వెత్తుచు వచ్చును. ఖర్చులు పెంపొందుట, అవసరములు పెరుగుట నివి రెండును ద్రవ్యోపార్జనమునకుఁ బ్రథమ సోపానములు. ఇందువలన మనలో నిద్రాణమైయున్న గుప్తశక్తులు జాగృతములై వికాసముఁ బొందును. అప్పుడే మనము ధైర్యముతోఁ గష్టముల నెదుర్కొనుచు జీవనరంగమున పురోగమింప సమర్థుల మగుదుము. సంతృప్తి యనునది దారిద్ర్యమునకు నామాంతరము!"

తదుపరి **మా** ఖర్చులు శ్రావణమాసములోఁ బెట్టిన పొట్లపాదువలె—మర్వాడిసాహుకారు నొద్దఁదెచ్చిన యప్పువలె— దినదినమునకు బెరిగిపోవుచున్నవి. వారమునకు మూఁడు దినములు తప్పక సినిమాకు బోవలసినదే! వారమున కొక పర్యాయము తప్పకుండ మిత్రులకు విందుసేయు నాచార మొకటి యారంభించితిమి. క్రమముగ నాలో—

'సుఖభోగమే మానవుని జీవితలక్ష్య' మను భావము బలపడ సాగినది—భగవంతునకు మానవులు తన్నుపాసింపవలెనను కోరిక లేదు. ఆయన మనకీ యుత్తమోత్తమ వస్తుసముదాయము నంతను ననుభవించి యానందించుటకే యిచ్చి యున్నాడు. ఆయన దయతో మనకిచ్చినదానిని భోగించుటే సర్వోత్తమమైనపరమేశ్వరారాధన— ఇవి యానాటి నామనోభావములు.

ఒక క్రిస్టియను వనిత నాకుం జర్మనుభాషను సంగీతము నేర్పుటకు వచ్చుచుండెడిది. మా యింటికొక 'పియానో' కూడ నిలిచి కొనిరాబడినది. ఈ యానందములలో మునిగి నేను 'రామాయణము'ను 'భక్తమాల'ను మఱచిపోతిని. ఆ గ్రంథములు నేడు నాకప్రియములైనవి. దేవతలపై నమ్మకముగూడ క్రమముగ సడలిపోయినది.

క్రమ క్రమముగ నాకచటి పెద్దయుద్యోగులగు వారందఱితోడను స్నేహసంబంధములు వృద్ధిగాంచుచొచ్చినవి. ఇది పూర్తిగ నొక క్రొత్త సమాజము! ఈ రీతి రివాజులు, ఆహార విహారములు, ఆచార వ్యవహారములు నాకు సర్వత్ర విలక్షణముగ గన్పట్టసాగినవి. ఈ సమాజమున నేను నెమలి పింఛ మందలి కాకివలె నుంటిని. ఈలేడీల సంభాషణ లొక్కొకప్పుడు సినిమాలను గుఱించియు, గుఱ్ఱపు పందెములతో సంబంధించియు సాగుచుండెడివి; ఒకొకప్పుడు టెన్నిసు, వార్తా పత్రికలు, గొప్పగొప్ప లేఖకుల రచనలు గుఱించి నడచెడివి. వారి చాతుర్యమును, బుద్ధితీవ్రతను చురుకుదనమును చాపల్యమును జూచి నేనాశ్చర్యచకితనగుదును. వారితో జ్ఞాన

రోచిస్సులుమూర్తీభవించిన...వాయనిపించెడిది. వారందఱు శిరోగుంఠనము లేకుండగనే బయటకుఁ బోవుచుందురు. వారి సాహసముఁజూచిన నాకాశ్చర్యముకలిగించును. వారపుడపుడు నన్నుఁ గూడఁ దమతోఁ దీసికొనిపోవఁ బ్రయత్నించుచుందురు; కాని లజ్జాభిభూతనై నేను బోఁజాలకుంటిని. ఆ 'లేడీ' లెన్నడును విచారగ్రస్తలై యుండుట నేఁజూడలేదు.

మిస్టర్ దాస్ చాల జబ్బుగనున్నాఁడు; కాని మిసెస్ దాస్ ముఖముపై చింతారేఖ లేశమాత్రమును లేవు. మిస్టర్ బానర్జీ సైనిటోరియములో క్షయవ్యాధికిఁ జికిత్సనొందుచున్నాఁడు; కాని మిసెస్ బానర్జీ నిత్యము 'టెనిస్' ఆటకుఁ బోవుచునే యున్నది! ఈ వయస్సులోనున్న నాలో నీ వాతావరణ మెటువంటి పరిణామములఁ గలుగఁ జేయుచున్నదో నేనే యెఱుంగుదును!

ఈ లేడీల రీతి నీతులలోఁ గల ఒక ప్రబలాకర్షణశక్తి నన్ను లాగుకొని పోనారంభించినది. వారెల్లప్పుడు నామోద ప్రమోదములయెడ నుత్సుకలై యుండుటఁ జూచి నేనుగూడ వారివలెనే నిస్సంకోచముగా వర్తింపవలె ననిపించును. వారి యింగ్లీషు సంభాషణలు విని నాకు వారందఱు దైవాంశ సంభూతు లనిపించును. నేను గూడ నిట్టి మనుగడ నలవరచుకొనఁ బ్రయత్నించుచుంటిని.

ఈలోపుననే నాకొక ఖేదజనకమైన యనుభూతి కలుగఁ జొచ్చినది; శ్రీవారు పూర్వముకంటె నన్నధికముగ నాదరించుచున్నను, నన్నెల్లపుడు 'డియర్-డార్లింగ్' మొదలగు పద

ప్రయోగములతోఁ బిలచుచున్నను, నాకు వారి మాటలలో నొక విధమైన కృత్రిమాడంబరము గోచరించెడిది. ఈ మాటలు వారి హృదయమునుండి గాక నాలుక చివరనుండి మాత్రమే వచ్చుచున్నటు లనిపించెడిది. వారి ప్రేమాదరణ ములలో, హృద్గతభావముల స్థానమున నలంకార మెక్కువగ నున్నది; కాని యింకను ఆశ్చర్యకరమైన విషయ మొక్కటి గలదు—నాకు శ్రీవారి యెడలఁ గల పూర్వపు శ్రద్ధాభక్తులు సన్నగిలిపోయినవి. ఇపుడు వారికిగల్గు శిరోవేదన వలన నాకు హృదయవేదన గల్గుటలేదు. నాలో నాత్మగౌరవ మావర్భవించినది. ఇపుడు నేనొకానొక పురుషుని యుపాసిక నను భావముతోఁగాక, నాక రత్నమునలె, నా హక్కులలో నొకటి యను భావముతో శరీరాలంకరణముఁ జేసికొను చుంటిని. నాకుఁ గూడ నా సౌందర్యముపై గర్వము కలుగ సాగినది. నేను మఱొకరి కొఱకుఁ గాక నాకొఱకే నేను జీవించుచున్నాను. త్యాగసేవాభావములు నాహృదయములో నుండి వెడలిపోసాగినవి.

నేనిప్పటికిని పరపురుషులనుండి తప్పుకొనియే తిరుగు చుంటిని. కాని హృదయములో మాత్రము నా సౌందర్యము నందఱుఁ గొనియాడుచుండగ విని యానందింపవలెనని యువ్విళులూరుచుందును. ఒక రోజున 'మిష్టర్ దాస్' నుఱి కొందరు సభ్యపురుషులు శ్రీవారివద్ద కూర్చుండియుండిరి. నాకును వారికిని మధ్య కేవల మొక పరదామాత్ర మడ్డుగ నున్నది. నేను సంకోచముగ సిగ్గుగ నున్నందుకు శ్రీవారు

చాల సిగ్గుపడుచుండెను. తన నాగరికతకు నిది యొక పెద్ద ఆటంకముగ భావించుచుండెను. బహుశః ఆయన — నా భార్య హాసములోగాని వస్త్రభూషణాద్యలంకార రచనములోగాని యెవరికిని దీసిపోదు; కేవలము నామె యింకను సిగ్గుపడుచుండుట వలననే వాటుఁ జేసికొనుచున్నదని మిత్రులకు సూచనప్రాయముగఁ జెప్పుకొనుచుండెను. ఇందుచేతనే కాఁబోలు — వారి మిత్రులు నన్ను, నా వస్త్రభూషణాదులను జూచుట కవకాశముఁ గల్పింపగోరి, నన్నుఁ జీటికి మాటికి నేదేనొక నెపమున పరదావద్దకుఁ బిలువసాగిరి.

కొన్ని దినములకుఁ బిమ్మట నా సంకోచము వదలి పోయినది. అలాహాబాదు వచ్చి పూర్తిగ రెండు సంవత్సరములు గడచినపిదప నేను శ్రీవారివెంట పరదా లేకుండ షికారునకుఁ బోసాగితిని. షికారు తరువాత 'టెనిస్' వంతు వచ్చినది. చివఱకు 'క్లబ్'కుఁ బోవుటతో నా నాగరకతా పిపాస పరాకాష్ఠనందినది. ప్రారంభమున నాకీ "టెనిస్" క్రీడ, క్లబ్బు సభ్యత ఏదో యొక తమాషాగాఁ గనుపించెడివి. 'టెనిస్' క్రీడకు వచ్చు వారందఱు వ్యాయామము కొఱకుఁగాక కేవలము ఫ్యాషన్‌నిమిత్తమే వచ్చుచున్నట్లు లనిపించెడిది. వారు 'టెనిస్' ఆట నెన్నఁడు మఱచెడివారు గారు. వారు నడచుటలో, పరువెత్తుటలో, దుముకుటలో, పనులన్నిటిలో నేదో కృత్రిమత్వము — నటన గన్పించెడివి. ఈ యాటల ప్రయోజనము వ్యాయామముఁ గాదనియు, కేవల మిదియొక ప్రదర్శనమనియు దెల్లమగుచుండెడిది.

క్లబ్బు పరిస్థితి యింతకంటెను విచిత్రముగ నున్నది. అదియంతయుఁ బూర్తిగ భేషజము, మొరటుదనము, అస్వాభావికము! అచటివారందఱుఁ గొన్ని యెన్నికైన యింగ్లీషు పదములఁ బ్రయోగించుచుండుట కలవడినారు. అవి యెంతయు రసహీనములుగ నుండెడివి. అనావశ్యకముగఁ దెచ్చిపెట్టుకొనిన చిరునవ్వులు వారి కొక పరిపాటియైనది. స్త్రీల నిర్లజ్జాప్రవర్తనము, పురుషుల భావహీనమైన నాటకీయ ప్రాజ ప్రారంభములో నా కెంతేని జుగుప్సఁ గలిగించెడివి. సమూహల జూచిన నెవరిని జూచిన హాస్యాస్పదమైన ఇంగ్లీషు పద్ధతుల యనుకరణము దృగ్గోచరమగుచుండెను కాని క్రమక్రమముగ నేను గూడ నా వాతావరణమునకే యలవడి, వారినే యనుకరింప సాగితిని. ఈ ప్రదర్శనములపై నుండు నాసక్తి - యుత్కంఠ మానవుల మనస్సులపై నెంత శక్తివంతముగఁ బనిచేయునో నాకిపు డనుభవమైనది. నేనిపుడు నిత్యము క్రొంగ్రొత్త పద్ధతులతో సింగారించుకొని క్లబ్బులో ప్రతి వ్యక్తి కండ్లలోనికి చొచ్చుకొని పోవలెనను నాకాంక్షతోఁ బ్రతినిత్య మొక విలక్షణ వస్త్రాలంకరణముచే నొకవిలక్షణ సుందరరూపమును దాల్చుచుంటిని.

నా కిపుడు శ్రీవారి సేవాశుశ్రూషలపై కంటె నా శృంగారాలంకరణలపై నెక్కుడు శ్రద్ధాసక్తులుఁ గలుగ సాగినవి. కడకీ శృంగారాభిరుచి యొక నిషావలె నన్నావరించినది. ఇంతియే కాదు, ఇతరులవలన నా సౌందర్య ప్రశంసలను వినుచుండుటతో నాకుఁ గర్వముతోఁగూడిన ఆనందానుభూతి గలుగఁజొచ్చినది. నాలోని లజ్జాశీలము హద్దులు

చెదరిపోయినవి. ఒకానొక సమయమున నా శరీరమును గగుర్పడఁజేసెడి పరపురుష దృష్టిపాతములు — విషము గ్రాగ నన్నుద్రిక్తపరచెడి హాస్యోక్తులు నేఁడు నాకున్మాద ప్రాణ హర్షమును కలిగించుచున్నవి. కాని యెన్నఁడైన నే నాత్మపరిశీలనకుఁ బూనికొనినచో నత్యంత భయావహము లగు భావనా పరంపరలకు లోనయ్యెడిదానను. ఈ నావ యేదరిఁ జేరునో! అప్పుడప్పుడు క్లబ్బుకుఁ బోగూడదనిపించెడిది; కాని క్లబ్బు సమయము సమీపింపగనే నన్నేదో యదృశ్యశక్తి సన్నద్ధను జేసి దోడ్కొని పోయెడిది. క్రమముగా నేను బూర్తిగ పరవశనై పోతిని. నాలోని సత్కల్పనలతి దుర్బలములై పోయినవి.

# 4

**మఱి** రెండు సంవత్సరములు గడిచినవి. ఇపుడు శ్రీవారి స్వభావములో నొక విచిత్రమైన మార్పు రాసాగినది. ఆయన చాల నిరుత్సాహులుగ విచారగ్రస్తులుగఁ గన్పట్టసాగిరి. నాతో చాల తక్కువగ మాట్లాడుచుండిరి. ఏదేనొక మహా వ్యాధిపీడితులో లేక ఘోరవిచార పీడితులో యైనట్లగుపడుచుండిరి.

ఇప్పటికి ఒక మాసము రోజుల క్రితము వఱకు వంద పనులున్నను వదలిపెట్టి తప్పక క్లబ్బుకు పోయెడివారు. క్లబ్బుకు పోకున్న వారికి నిదుర పట్టెడిదికాదు, తెల్లవారెడిది

కాదు; కాని యిపుడధిక కాలము తమగదిలో 'ఈజీచైరు'లోఁ గూర్చుండి వార్తాపత్రికలు పుస్తకములు చదువుకొనుచుండిరి. విషయ మేమో నాకేమియు బోధపడలేదు.

ఒకనాడు శ్రీవారికి తీవ్రమైన జ్వరము వచ్చినది, రోజంతయు స్పృహలేకుండ బడియుండిరి. కాని నాకాయన వద్ద గూర్చుండుటకు మనస్కరింపలేదు. నా మనస్సొక నవలా పఠనముపై లగ్నమైయున్నది. ఆయన వద్దకు వెళ్ళుచుంటిని; గాని మరుక్షణముననే తిరిగి వచ్చివేయుచుంటిని. 'టెనిస్' సమయమైనది, వెళ్లుదునా మానుదునా యను సందర్భములో బడితిని. చాలసేపటి వఱకు మనసులో నొక పెద్ద యుద్ధము జరిగినంత పనియైనది. చివఱకు నే నీ నిర్ణయమునకు వచ్చితిని–"నేను 'టెనిస్'కు పోకుండ నిచటఁ గూర్చున్నంత మాత్రమున వీరి వ్యాధి తగ్గదు; కాన నేనిచట గూర్చుండి యుండుట కేవలము నిరర్థకము."

ముఖమండనము ముగించుకొని, యెప్పటివలె మేలి వస్త్రముల ధరించి, రాకెట్ చేతఁబుచ్చుకొని క్లబ్బునకుఁ జేరితిని. అచట నేను మిసెస్‌దాస్, మిసెస్ బాగ్‌డిలతో శ్రీవారి పరిస్థితిఁ జెప్పి సజలనేత్రనై గూర్చుంటిని. అందఱు కోర్టులోనికిఁ బోసాగిరి. మిస్టర్‌దాస్ వచ్చి నన్నుఁగూడ రమ్మని చెప్పగ, నేనొక చల్లని నిట్టూర్పుఁబుచ్చి కోర్టుజేరి యాడఁబోడంగితిని.

నేటికి మూఁడు సంవత్సరములకుఁ బూర్వము శ్రీవారికిదే విధముగ జ్వరము వచ్చినది. నేను రాత్రియంతయు

వానికి వినుచునే యుంటిని. హృదయ మెంతేని వ్యాకుల పడినది. ఏను లేచి సుఖముగ గూర్చుండు సుదిన మేనాఁ డే కెంచునాయని తహతహ లాడితిని. వీరికి బదులుగ నాకు జ్వరము వచ్చిన బాగుండునుగదా యనిపించినది. కాని, యిప్పుడు హృదయము స్నేహశూన్యమై పోయినది — ఆరాట మెక్కువైనది. ఒంటరిగ కూర్చుండి యేడ్చునోర్పు నాలో నశించిపోయినది నేనప్పటివలె రాత్రి తొమ్మిది గంటల కింటికిఁ దిరిగి వచ్చితిని. (శ్రీ)వారికి జ్వరతీవ్రత కొంచెము తగ్గినట్లు గన్పించినది. ఆయన నాపై నొకసారి నీరస దృష్టితోఁ జూచి వెనుకకుఁ దిరిగి పండుకొనిరి; నేనుగూడఁ బండుకొంటిని; కాని నా స్వార్థపరత్వమునకు—నా ప్రమోదాసక్తికి నా యాత్మ నన్ను ధిక్కరింప సాగినది.

ఇప్పుడు నే నింగ్లీషు నవలలను జదివి యర్థము జేసికొనఁగలుగుచున్నాను. మే మేవిషయమును గుఱించి మాట్లాడినను, ఆ సంభాషణ ముత్కృష్టముగను జిజ్ఞాసాపూర్ణముగను నడచుచున్నది.

ఇపుడు మా సభ్యతాదర్శము చాల యుచ్చ శ్రేణికిఁ బోయినది. మాకు మా మిత్రమండలితో సంబంధము లేని వారిని గలిసికొనుట చిన్నతన మనిపించెడిది. మాకంటె క్రింది తరగతి వ్యక్తులతో మాటలాడుట అవమానముగఁ దోచెడిది. సేవకులను కేవలము మా సేవకులని మాత్రమే భావించుచుంటిమి. మాకు వారి స్వవిషయ వ్యవహారములతో నేమాత్రమును సంబంధము లేదు. వారి సామాజికార్థిక విషయములకు

దూరముగనే యుండి వారిపై మాకుఁగల యధికారముల నమలుజరుపఁ గోరుచుంటిమి. వారు మమ్ము యజమానివలె (మహారాజువలె) భావించి గౌరవింపవలెనని యాశించుచుంటిమి. క్లబ్బులో సభ్యురాండ్రు కాని భారతస్త్రీలయెడ నాకేవగింపు కలుగుచున్నది. వారిలో సభ్యత యేమాత్రము లేదనిపించుచున్నది.

శ్రీవారి యారోగ్యము మరుదినమునకూడఁ గుదుటఁబడలేదు. నేనాదినమున క్లబ్బుకుఁబోలేదు; కాని నాటినుండి మూఁడు దినములవఱకు జ్వర మెంతమాత్రమును తగ్గకపోవుటచేతను, మిసెస్ దాస్ ఒక నర్సును పిలిపింపుమని జీటికి మాటికి యాదేశించుటచేతను; నేనుగూడ నందులకొడంబడితిని. ఆ దినమునుండి రోగి సేవాశుశ్రూషలనుండి విముక్తినొందుటచే నెత్తిమీఁదనుండి పెద్దభారము తొలగినంత సంతసము కలిగినది. నేను మరిరెండు దినములుగూడ క్లబ్బుకు పోలేదు; గాని నా మానస మెల్లప్పుడును క్లబ్బు కాలక్షేపముల మీఁదనే లగ్నమై యుండెడిది; ఇంతియే కాదు, భీమతాపూర్ణమైన నా యీ త్యాగమునకు నాకే కోపమువచ్చెడిది.

ఒకనాఁడు మధ్యాహ్నము మూఁడు గంటలవేళ నేను కుర్చీపైఁబరుండి యింగ్లీషు పుస్తకముఁ జదువుకొనుచుంటిని. అకస్మాత్తుగ 'శ్రీవారి జ్వరమసాధ్యమై పోయినదో?' అను నాలోచనము నా మనస్సులో మెఱుపువలెఁ బుట్టినది. కాని యీ యాలోచన వలన నాకు లేశమాత్రముఁగూడ దుఃఖము కలుగలేదు, ఈ శోకమయ కల్పనవలన నేను మనస్సులో

నాపందింప సాగితిని. మిసెస్ దాస్, మిసెస్ నాయుడు, మిసెస్ శ్రీవాస్తవ్, మిసెస్ ఖరే, మిసెస్ శర్మా మొదలైన వారందఱు నన్నూరడింప వత్తురు. వారందఱను జూచి నేను సజలనేత్రనై యనెదను—"అక్కలారా! నేను సర్వనాశనమైపోతిని—అయ్యో!సర్వనాశనమైపోయితిని. ఇపుడు నా జీవిత మర్ధరాత్రివేళ భయంకర వనములోని—లేక—శ్మశానములోని దీపకళికాసదృశముగ నున్నది. కాని నా యవస్థకు మీరు దుఃఖింపకుఁడు. నాకుఁ గల్గిన యీ యనర్థమును ఆ మహాదాత్మ మోక్షప్రాప్తి కొఱకు భగవంతుని బ్రార్థించుచు ధైర్యముగ సహింతును" అని.

చివఱకు నేను మృతశరీరముతోఁ బాటు శ్మశానమునకుఁ బోవునపుడు ధరింపవలసిన వస్త్రమును గుఱించి కూడ నిశ్చయముఁ జేసికొంటిని.

ఈ సంఘటనముతో నూరంతయు మార్మ్రోగిపోవును [illegible]లోని వారందఱు నాకు సంతాపసందేశములు పంపుదురు. నే నా సందేశములకు జవాబుగఁ బత్రికలలో నీ విధముగ నొక ప్రకటన గావింతును—"నేను మిత్రుల సంతాపసందేశములకు విడివిడిగ జవాబులు పంపఁజాలకపోయినందులకు విచారించుచున్నాను. హృదయము వ్రయ్యలై పోయినది. ఇప్పుడది శోకవహనమునకు దక్క మఱియొందులకు పనికిరాదు. నా యెడల తామందఱుఁ జూపిన సానుభూతికి నే నెంతయుఁ గృతజ్ఞురాలను. మీరెల్లఱకు నేను వినయపూర్వకముగ నివేదించుకొనున దేమనఁగా—మీరం

దటు గూడ 'మృతుని యాత్మకు సద్గతిగల్గింపు'మని పరమేశ్వ రుని బ్రార్థింతురుగాక." నే నీ విధముగ నామనస్సులో నొక శోకపూర్ణ వ్యాఖ్యానమును రచించుకొంటిని.

నే నీ యాలోచనలలో నిమగ్నుడనై యుంటిని. ఇంతలో నర్సువచ్చి 'బాబుగారు మిమ్ములను పిలచుచున్నా'రని చెప్పినది. అది నేను క్లబ్బుకుఁబోవు సమయము. ఇపుడాయన నన్ను బిలిపించుట నాకేమాత్రము నిష్టముగ లేదు. కాని జేయునది లేక యెటు లెటులో వారి వద్దకుఁ బోతిని. శ్రీవారికి జ్వరమువచ్చి సుమారొక మాసము గడచిపోయినది. వార త్యంత దుర్బలులై పోయిరి. నావైపు వినయపూర్ణదృష్టితోఁ జూచి కండ్లనీరుఁ బెట్టుకొనిరి. నాకు వారిపై దయగలిగినది. కూర్చుండి ధైర్యముఁ జెప్పుచునంటిని —"ఏమి చేసెదను? వేఱొక డాక్టరును బిలువమందురా?"

శ్రీవారు క్రిందకు జూచుచు నత్యంత కరుణ భావ ముతో ననిరి—"ఇచ్చట నా కెన్నటికిని నీరోగము సయము గాదు; నన్ను మాయమ్మ వద్దకుఁ జేర్పుము" అని.

నేనంటిని—ఇచటకంటె నచట మీకెక్కుడు మంచి చికిత్స జరుగఁగలదని భావించుచుంటిరా?"

శ్రీవారనిరి—"నా మనస్సెందుచేతనో మాతృదర్శ నము కొఱకు తహతహ లాడుచున్నది. నేనచట నెట్టిచికిత్స లేకపోయినను స్వస్థత నొందఁగల ననిపించుచున్నది."

నేను—"ఇది కేవలము మీ భ్రమమాత్రమే గాని వేఱుగాదు."

శ్రీవాసు—"అయిన కావచ్చు; కాని నా యీవినయపూర్వక విజ్ఞాపనను నంగీకరింపుము. నే నీరోగము వలనఁ గాదు, ఈ జీవితము వలననే దుఃఖితుఁడ నగుచుంటిని".

నేనాశ్చర్యముగ నాయనవైపుఁ జూచితిని.

శ్రీవాసు తిరిగియనిరి—"ఔను, నా కీ జీవితము పైననే విరక్తికలిగినది. దేనిని స్వచ్ఛమైన నిర్మల జలాశయమని భావించి నేను బరువెత్తితినో యది యెండమావులతో నిండిన యెడారిభూమి యను విషయమిపుడు గ్రహింపఁ గల్గితిని. నే నీ విధమైన జీవిత బాహ్యరూపమును జూచి మోహించితిని. కాని యిపుడు నాకు దీని యాంతరంగిక స్థితిగతులన్నియు సుబోధకమగుచున్నవి. ఈనాల్గు సంవత్సరములు నే నీ విలాసమయ జీవితోపవనమున బాగుగఁ బరిభ్రమించితిని; కాని యెచట జూచినను నంతయుఁ గంటకావృతమైయున్నది. ఇచట హృదయమునకు శాంతిగాని, యాత్మకానందముగాని లేదు. ఇదియొక యున్మాదముతో అశాంతితో స్వార్థపూర్ణ విలాసముతో గూడిన జీవనము. ఇచట నీతిలేదు, ధర్మములేదు, సానుభూతిలేదు, సహృదయతలేదు. దేవుని ముఖముజూచి నన్నీ యగ్నికుండమునుండి రక్షింపుము. ఒకవేళ నేయుపాయము లేనిచో మాయమ్మకొక యుత్తరము వ్రాసి పడవేయుము. ఆమె తప్పక వచ్చును. తన యభాగ్య పుత్రుని దుఃఖమును నామె చూచి సహింపఁజాలదు. ఆమె కింకను నీసొసైటీ గాలి తగులలేదు. ఆమె తప్పక రాగలదు. ఆమె వాత్సల్యపూర్ణమైన దృష్టి, స్నేహపూర్ణమైన శుశ్రూష నాకు

నంద యౌషధములకంటె నెక్కుడుగ పనిచేయును. నా నేత్రము లేజ్యోతిని జూడఁదపించుచున్నవో, యా జ్యోతి యామె ముఖమండలముపైఁ బ్రకాశమాన మగుచుండును. ఆమె హృదయములో స్నేహమున్నది, విశ్వాసమున్నది. ఒకవేళ నేనామె యొడిలోఁ జనిపోయినను నా యాత్మకు శాంతి తప్పక లభింపగలదు.

నే నిదియంతయు జ్వరతీవ్రము వలనఁ గలుగుచున్న ప్రలాపమని భావించితిని. నర్సును బిలిచి చెప్పితిని—"నీవు వీరి టెంపరేచరు చూడుము. నేనిప్పుడే డాక్టరు వద్దకుఁ బోవుచుంటిని." నా హృదయ మొక యజ్ఞాత భయముచేఁ గంపింప సాగినది. నర్సు ధర్మామీటరుఁ దీసికొని శ్రీవారి సమీపమునకుఁ బోయినదో లేదో యామె చేతినుండి యా యంత్రము నాయన లాగికొని నేలకువైచి గొట్టిరి. అది తునాతునకలైపోయినది. తిరిగి నావైపున కవహేళనాపూర్ణమైన దృష్టితోఁ జూచుచు ననిరి—"క్లబ్బునకుఁ బోవుచుంటినని స్పష్టముగ నెందుకుఁ జెప్పవు? నీ వీ వస్త్రధారణమంతయుఁ జేసికొని, గౌను నందులకేగదా ధరించితివి? మంచిది, అచట నుండి షికారుగా డాక్టరువద్దకుఁ బోయినచో నగ్ని ప్రజ్వరిల్లు బిందువుకడకు టెంపరేచరు జేరినదని జెప్పుము."

నేనింకను నధికముగ భయభీతనైతిని. నా హృదయ మొక కరుణాపూర్వకమైన విచారముతో నిండిపోయినది. కంఠము రుద్ధమైపోయినది. శ్రీవారు కనులు మూసికొనిరి. వారి శ్వాసక్రియ వేగముగ సాగుచున్నది. ఎవరినైన డాక్టరు

నడక్కఁ బనుపఁగోరి గుమ్మమువైపు నడిచితిని. ఇటువంటి కఠినోక్తిని విని స్వయముగ నెటులు బోవుదును?

ఇంతలో శ్రీవాసు లేచికూర్చుండి వినీతభావముతో ననిరి—"శ్యామా! నేను నీతో నొకవిషయము ముచ్చటింప గోరుచున్నాను. రెండుసప్తాహములనుండి యీ విషయము మనసులో నున్నది; కాని సాహసించి చెప్పలేకున్నాను. నేఁడు చెప్పివేయుటకే నిర్ణయించుకొంటిని. నేను తిరిగి నాయింటికిఁ బోయి ఆ పూర్వజీవితమునే గడపఁగోరుచుంటిని. ఇపుడు నా కీ నూతన జీవితముపై రోఁత జనించినది, ఇదే నా వ్యాధికి ముఖ్యకారణము. నేను శారీరక కష్టము వలనఁగాక మానసిక రోగము వలననే బాధపడుచున్నాను. నేను తిరిగి నిన్ను యథాపూర్వ లజ్జావతిగ, నతమస్తకయై చరించు దానిగ, పూజా పునశ్చరణలఁ జేయుచు, రామాయణపఠనము జేయుచు, స్వయముగ నింటిపనులఁ జేయుచు, రాట్నము నడపుచు, పరమేశ్వరునియందు భయభక్తులుకలిగి సంచరించు చుండు దానిగ—పతిభక్తి పరిపూర్ణయైన స్త్రీగఁ జూడఁ గోరుచున్నాను. నీవు నన్ను హతాశునిఁ జేయవనిగూడ విశ్వసించుచున్నాను. నిన్ను సంపూర్ణముగ నాదానను జేసికొనవలెనని, నేను సంపూర్ణముగ నీవాఁడను గావలెనని యభిలషించు చున్నాను. చెప్పుము, శీఘ్రముగా నీ మనోగతము నెఱింగింపుము—అంగీకారమేనా! నీవెల్లప్పుడు నాయాజ్ఞలఁ బాలించుచు వచ్చితివి. ఈ సమయములో నిరాశునిఁ జేయ

వలదు; లేకున్న నా యీ కష్టమునకు, శోకమునకు నెంతటి భీషణ పరిణామమైన గలుగవచ్చు."

నేను వెంటనే యే జవాబును చెప్పఁజాలక పోతిని. మనస్సులో నాలోచింప సాగితిని—ఈస్వతంత్ర జీవనములో నెంత సుఖమున్నది? ఈయానందమచట నెట్లులభింపఁగలదు? ఇంతకాల మీస్వతంత్ర వీచికలలో విహరించి తిరిగి యా పంజరములోనికే పోదునా! అదే విధముగ బానిసనై బ్రతుకవలెనా? వీరిన్నినాళ్లు నాకీ స్వాతంత్ర్యపాఠముల నెందులకు నేర్పిరి? ఇంతకాలముగ దేవతలను, రామాయణమును, పూజా పునశ్చరణలను, వ్రతోపవాసములను ఎందుకు నిరసించిరి–అవహేళన జేసిరి? ఇపుడు నేను వాటినన్నిటిని మఱచి పోయిన వెనుక, వాటినన్నిటిని మిథ్యగ భావింపసాగిన పిమ్మట తిరిగి నన్నాయంధకార కూపముననే బడవేయఁ గోరుచున్నారేల ? నేను వీరి యిచ్ఛానుసారమే నడచుచున్నాను. ఇందు నా యపరాధ మేమున్నది? కాని శ్రీవారి ముఖముపై గోచరించుచున్న యొకవిధమైన దీనతాపూర్ణ వివశత్వమును జూచి నేనాయన విజ్ఞప్తిని ప్రత్యక్షముగ నిరాకరింపఁ జాలకపోతిని, నేనంటిని—"మీాకిచట కలిగిన గష్టమేమున్నది?" అని.

నేనాయన హృదయ భావముల లోఁతుఁ దెలిసికొనఁ గోరుచుంటిని.

శ్రీవారు తిరిగి లేచి కూర్చుండి నావైపు కఠోర దృష్టితోఁ జూచుచుననిరి–"ఈ ప్రశ్నకు జవాబు నన్నడుగుట కంటె నీ హృదయమునే యడిగినచో బాగుగా నుండెడిది.

మూఁడు సంవత్సరములకుఁ బూర్వము నీ దృష్టిలో నేనే స్థానమున నుంటినో, ఇపుడుగూడ నీ దృష్టిలో నే నదే స్థానమున నుంటినా? నేను నీకంటె నెక్కుడు విద్యాప్రాప్తినంది, ఎక్కుడు బుద్ధిమంతుఁడనై, ఎక్కుడు విషయగ్రహణము జేసినవాఁడనై నీదృష్టిలోఁ బదచ్యుతి నందినపుడు-నీవీ విషయము ననుభవింపక బోయితివిగాక; కాని నేను మాత్రము స్వయముగ నీ యనుభూతిని పొంది జెప్పుచున్నాను-ఆ నాగరకతాభావములే నీ పతన కారణములు కాలేదని యెట్లనుకొనగలను! కాదు, ఇంతియేగాదు, నీహృదయముపై నాభావములింకను నధికభీషణ పరిణామములఁ గలుగఁజేసిననుటకుఁ బ్రత్యక్ష చిహ్నములు గన్పించుచున్నవి. నీవు నిన్ను బాహ్యాలంకార విలాసము లనెడి సుడిగుండములోఁ బడవైచుకొంటివి. కాని నీ వీ విషయమును లేశమాత్రముఁగూడ గ్రహింపకపోయితివి. సభ్యత, స్వేచ్ఛాచారము నను పెనుభూతము స్త్రీల కోమల హృదయము నెంతయో సుగమముగ వశపఱచుకొను నను నమ్మకము నాకిపుడు సంపూర్ణముగఁ గల్గినది. నేటికి మూఁడు సంవత్సరములకుఁ బూర్వము నన్నీ స్థితిలో విడచి యే పొరిగింటికైన గానవినోదములకుఁ బో సాహసించెడిదానవా? నేను మంచముపై బడియుండగ నీ వెవరియింటికైనఁ బోయి కేరింతలు గొట్టఁగల్గితివా? స్త్రీల హృదయ మధికారమును కోరును. కాని యీ నవీనాధికారవాంఛ కంటె, నా పురాతనాధికార వాంఛయే నా కెన్నియో నుడుంగులు మేలనిపించు చున్నది.

ఆ యాధిక్యతయొక్క ఫలితము ఆత్మిక శక్తిరక్షాభ్యు
దయకరము—హృదయ పవిత్రతా ప్రదాయిని. కాని యీ
యాధిక్యత యొక్క పరిణామము నీచత, నిర్లజ్జత, డాంబ
దర్పములు, విశృంఖలత్వము ! ఒకవేళ నీ వాగనుయోగమునో
మిస్టర్ దాస్ సమ్ముఖమునందీవిధముగ నవ్వుచు మాట్లాడి
నచో నేను నిన్నైనఁ జంపివైచెడి వాఁడను, లేక నేనైన
విషపానముఁ జేసివైచెడి వాఁడను; కాని నిర్లజ్జతయే ఇటు
వంటి జీవితమునకు ప్రభావతత్వము. నేను సర్వమునుజూచుచు
సహించుచుంటిని, ఈ న్యాయ నన్నుఁ జైతన్యవంతుని జేయక
బోయినచో, బహుశః యింకను సహించుచునే యుండెడి
వాఁడను. ఒకవేళ నీవిచటనే యున్నను నాకు సంతో
షము కలుగదు. కారణమేమన నీ హృదయ మిచ్చట లేదను
భావము నన్ను బాధించుచునే యుండును. ధనమే మాన
మని, ఇంద్రియవాంఛా సాఫల్యమే సభ్యతయని, భ్రష్టతయే
స్వాతంత్ర్యమని చెప్పుకొనెడి యీ యైంద్రజాలిక వాతావర
ణమునుండి నన్ను నేను తప్పించుకొన నిశ్చయించుకొంటిని.
చెప్పుము, నా ప్రస్తావన మంగీకారమేనా ?"

నా హృదయముపై వజ్రపాతము జరిగినట్లనిపించినది. శ్రీవారి యభిప్రాయము నాకు సంపూర్ణముగ హృదయంగమమైనది. పూర్వకాలపు లజ్జాస్వభావమింకను నా హృదయమున నొకింత మిగిలియున్నది. హృదయములోఁ జెను తుపాను రేగి నన్నుఁగలచివైచినది. సహింపరాని బాధచే నా హృదయము క్షోభించినది. లజ్జ పునర్జీవనమందినది. అంతరాత్మ ఘోషించినది—నేనిప్పుడు పూర్వపుదాసను గాను.

నేనా దినములలో నీయనను నా యిష్టదైవముగ భావించు చుంటిని, వీరి యాజ్ఞ నాకు శిరోధార్యముగ నుండెడిది; కాని నేడాయన నాదృష్టిలో నొక సాధారణ మానవమాత్రుడు. మిస్టర్ దాస్ రూపము నా కనులముందు గిఱుక్కున దిరిగినది. నిన్న నా దురాత్ముడనిన మాటలు నా హృదయములో నెట్టి పరవశత్వము గలుగఁ జేసినవో తలంచుకొనినంతనే నా శిరస్సు సిగ్గుతో వ్రాలిపోయినది. శ్రీవారి యాంతరంగిక స్థితి వారి ముఖమండలముమీదనే ప్రకాశమాన మగు చున్నది. స్వార్థము, విలాసవాంఛ నా హృదయమునుండి దూరమైపోయినవి. వాని స్థానములలో జ్వలించుచున్న యక్షరములలో లిఖింపబడినట్లీమాటలు గోచరించినవి—
"నీ బాహ్యాకములో - వస్త్రభూషణములలో నవశ్యము నున్నతినందితివి, నీలో నీస్వాత్వముల గుఱించిన జ్ఞానము గల్గినది. నీలో జీవితసుఖభోగేచ్ఛ యధికమైపోయినది; నీవిప్పుడు శకిగల్గినవి, దృఢహృదయవు, శిక్షాసంపన్నవుగూడ నైతివి; కాని నీయాత్మబలము మాత్రము సర్వనాశనమై పోయినది. కారణమేమి? నీవు నీ కర్తవ్యమును విస్మరించి తివి."

నేను రెండు చేతులు జోడించి శ్రీవారి చరణము లపై వ్రాలిపోతిని. కంఠము రుద్ధమైపోయినది; నోటివెంట నొక శబ్దముగూడ బయటకు రాలేదు, అశ్రువులు ధారగఁ బ్రవహింపసాగినవి.

ఇపుడు నేను తిరిగి నా యింటికివచ్చితిని. అత్తగారు నన్నిపుడధికముగ నాదరించుచున్నది. శ్రీవారు సంతుష్టులుగ గోచరించుచున్నారు. వారిప్పుడు నిష్టతోఁ బ్రతిదినము సంధ్యా వందనము గీతాపారాయణముఁ జేయుచున్నారు.

మిసెస్ దాస్ వద్దనుండి యప్పుడప్పుడుత్తరములువచ్చుచున్నవి. అవి అలహాబాదు సొసైటీకి సంబంధించిన క్రొత్త వార్తలతో నిండియుండును. మిస్టర్ దాస్, మిస్ భాటియాల సంబంధమై పుకారులు బయలుదేరినవి. నేనీ యుత్తరములకు జవాబులుమాత్ర మిచ్చుచుంటిని; గాని యివిరాకుండ నుండవలెననియే గోరుచుంటిని—నేను మరచిపోఁగోరుచున్న దినముల నివి మఱల జ్ఞాపకముఁ జేయుచున్నవి.

నిన్న శ్రీవారు చాల క్రొత్తపుస్తకముల నగ్నిదేవుస కాహుతి గావించిరి. అందు 'ఆస్కార్ వైల్డ్' రచించిన పుస్తకములెన్నియో యున్నవి. ఇప్పుడాయన యింగ్లీషు పుస్తకములఁజాలతక్కువ జదువుచున్నారు. వారిపుడు 'కార్లాయిల్' 'రస్కిన్' 'ఏమర్సన్'ల రచనలు వినా మఱేపుస్తకముఁ జదువుచుండగ నేఁ జూడలేదు. నాకుమాత్రము రామాయణ మహాభారతములను జదువునపుడు పూర్వపుటానందమే గల్గుచున్నది. చరఖానిపుడు బూర్వముకంటె నెక్కువగఁ ద్రిప్పుచుంటిని.

—o—

# గృహస్వామిని

శివదాసు తాళపుచెవులను కోడలైన రామప్యారీ కొప్పగించి సాశ్రుగద్గదుఁడై యనినాఁడు—"అమ్మాయీ ఇఁక నీ యింటిబాధ్యతయంతయు నీది. భగవానుఁడు నా సుఖమును సైపలేకపోయినాఁడు. కానిచో చేతికక్కఱకు వచ్చిన కుమారుని నాకు లేకుండఁ జేయునా? వానికి బదులు పనిచేయవలసినవాఁడొకఁడు కావలెనుగదా! ఒక నాగలి తగ్గించినచో పని జరుగదు. నే నొనర్చిన పాపకర్మమునకు ఫలముగ భగవానుఁడు నా కీ శిక్ష విధించినాఁడు. ఆ భారమును నేనే భరింతును-బిరజూ యరకను నేనే వహింతును. ఇఁక సంసారము దిద్దుటకు, నీకంటె నా కింకెవరున్నారు? ఏడువకు తల్లీ! దైవేచ్ఛ యట్లున్నది. విధివిధానము తప్పదు. మన మేమి చేయఁగలము? విచారింపకుము. బిరజూ చనిపోయినాఁడు. నే నుంటినిగదా!"

రామప్యారీ, రామదులారీ యిరువురు నొకేతల్లిబిడ్డలు ఈ యిరువురి వివాహములు బిరజూ, మథుర అను నిరువురేకోదరులతో జరిగినవి. అప్పసెల్లెండ్రిరువురును పుట్టినింటి యందువలె నత్తవారింటను ప్రేమతోఁ నానందముతో నున్నారు. శివదాసు పింఛను పుచ్చుకొనినాఁడు. రోజంతయు నరుగుపైఁ గూర్చుండి బాతాకాని సాగించును. పచ్చగనున్న

తన పరివారమునుజూచి లోలోన మురియును. సాధారణ ముగ ధార్మిక చర్చలు సాగించును. కాని, విధివైపరీత్యము! బెరజూ జబ్బుపడినాఁడు. నేఁటి కాతఁడు దివంగతుఁడై పదు నైదు దినములైనది; కర్మకాండలు ముగిసినవి. నిజమైన కర్మ వీరుని పగిది, శివదాసు మఱల జీవనసంగ్రామమున నడుము బిగించినాఁడు. అతని మనసు నందెంత దుఃఖమున్నను ఆతని కంటివెంట నీరు వెడలలేదు. నేఁడు తన కోడలిని చూచి నప్పుడుమాత్ర మాతని నేత్రములు చెమ్మగిలినవి. కాని మనసును చిక్కఁబట్టి, రుద్ధకంఠముతో నాశ్వాసించినాఁడు. గృహస్వామినియై విధవ తన దుఃఖమును మఱచునని తలఁచె గాబోలును ! అందువలననే యాతఁ డింటి తాళపుచెవులు కోడలి కిచ్చినాఁడు. వైధవ్య వ్యథను స్వామిత్వగర్వముతో నడంచవలె నని తలఁచినాఁడు.

రామప్యారీ పులకితస్వరముతో నన్నది "మామయ్యా! అదేమిమాట ? మీరు చాకిరి చేయుటయా ! నే నింటివద్ద పెత్తనము చేయుటయా ! ఏదియో పనిచేయకున్న తోఁచదు. పనిపాటలలో కాలమిట్టె గడచును. ఊఱక కూర్చుండినచో దుఃఖముతప్ప నేఱుండదు."

శివదాసు నచ్చఁజెప్పినాఁడు—"అమ్మా ! విధి విధా నము తప్పింప తరముగాదు. దుఃఖించుటవలన శరీరమును కృశింపఁజేయుటతప్ప వేరొండు ప్రయోజనముండదు. ఇంటి వద్ద మాత్రము పనులకు లోటుండునా ? చుట్టపక్కములు సాధుసన్యాసులుఁ అతిథులు నెవరో యొకరు వచ్చుచునే

యుందురు. వారిని సత్కరించుట కైనవరైన నొకరింటివద్ద నుండక తప్పదుగదా!”

రామప్యారి తప్పించుకొనుట కెంతయో ప్రయత్నించినది. కాని, శివదాసు వినలేదు.

## 2

శివదాసచటినుండి వెడలిపోయిన పిమ్మట రామప్యారి తాళపుచెవులను చేతఁగొన్నది. వెంటనే యామె మనమున నొకవిధమైన గౌరవభావము—శాఘ్యత యుదయించినవి. ఆ కొలఁదిసేపామె పతివియోగ దుఃఖమును మఱచినది. తన చెల్లెలు, మఱది యిరువురును పనికి వెళ్ళినారు, శివదాసింట లేడు. తా నేకాంతమున నున్నది. ఇఁక నిశ్చింతగ సామాను కొట్టు తెరువవచ్చును. ఆ గది యందేమున్నదో—అందలి యైశ్వర్యమేమో చూడవలెనను నుత్కంఠ జనించినది. ఆగది లోనికి తానెన్నడు నడుగిడి యెఱుఁగదు. ఎవరి కేమియ్యవలసి వచ్చినను, శివదాసు తానే స్వయముగ గది తెఱచెడివాఁడు. పనియైనంతనే తాళమువైచి తాళపు చెవులను బొడ్డున కట్టుకొనెడివాఁడు. అప్పుడప్పుడామె తలుపుసందులోనుండి చూచెడిది—కాని, యా చీఁకటియందామె కేమియు కాన్పించెడిది కాదు. ఆ పరివారమున కా గది యింద్రజాలమునవలె నుండెడిది—దానినిగుఱించి యందరును విభిన్నకల్పనలతో నుండెడివారు. రామప్యారికి నేఁడా రహస్యమును భేదించుట

నవకాశము చిక్కినది. ఎవరును రాకుండుటకై యామె వీధి తలుపు బిగించినది—ఎవరైనఁ జూచినచో నిష్కారణముగ నా గది తెఱచిన దేమని యనుమానింతు రేమో! ఆ పిమ్మట వణకు చున్న చేతులతో గది తెఱచినది. ఎవరైన వీధి తలుపుతట్టుదు రేమోయని యామెగుండె వేగముగ కొట్టుకొనుచుండెను. లోపలి కడుగిడినంతనే యామెకు తన చీరెలతో, నగలతో నిండిన పెట్టెను తెఱచినంత సంతోషము కలిగినది. కుండలలో బెల్లము, పంచదార, గోధుమలు మున్నగు పదార్థములు నిండియున్నవి. ఒకమూల పెద్ద పెద్ద వంటగిన్నెలున్నవి. ఎన్నడైన పెండ్లిండ్లకు, ఇతర కార్యములందు మాత్రమే వాటి నుపయోగింతురు. ఎవరికైన నవసరము కలిగినచో నాల్గుదినము లెరువిత్తురు. ఒక గూటియందు శిస్తురశీదులు, నోట్లు మున్నగు కాగితములకట్ట గొండున్నది. లక్ష్మీదేవి యజ్ఞాతరూపమున నచ్చట దాగియుండెనా యన్నట్లున్న దా యైశ్వర్యము! ఆ యైశ్వర్యచ్ఛాయలో నామె యొక యరగంటసేపు ఆత్మతృప్తి నందినది, క్షణక్షణము నామె హృదయమున మమత్వభావము పెరిగిపోవుచుండెను. ఆ గదినుండి బయటకు వచ్చినంతలో నెవరో మంత్రోచ్చాటన మొనరించినట్లు పూర్వసంస్కారమంతయు మాఱిపోయినది.

అదే సమయమున నెవరో వీధితలుపు తట్టిరి. వెంటనే యామె గదితలుపులు బిగించి వీధితలుపు తెఱచినది. పొరుగింటియిల్లా లొకరూపాయి బదులుకొఱకై వచ్చినది.

రామప్యారీ తిరస్కారభావముతో నన్నది—"పిన్ని గారూ! ఇంటిలో కాని డబ్బుకూడా లేదు. కర్మకాండల కంతయు ఖర్చైనది."

ఈ మాటల కాశ్చర్యచకితయైన దా యిల్లాలు. శివ దాసు నింట నొక రూపాయియైన లేకుండుటయా? ఇయ్యది నమ్మదగిన మాటయేనా? వందలకు వందలిచ్చి పుచ్చుకొను శివదాసు ధనమంతయు కర్మకాండలకు వెచ్చించెనా? ఈ మాటలు శివదాసు నోటినుండి వెడలియున్నచో నామె కాశ్చర్యము కలిగెడిదికాదు. రామప్యారి సరళస్వభావయని గ్రామమున ప్రశస్తియున్నది. ఆమె తఱచుగ శివదాసు కంట బడకుండ నిరుగుపొరుగువారికి బదుళ్ళిచ్చుచుండును. నిన్ననే ప్రక్కయింటి జానకమ్మకు సేరుపాలు పోసి పంపినది. అంతే కాదు—ఆమె తన నగలనుసైత మెరవిచ్చుచుండును. కృపణుఁడైన శివదాసునింట నిట్టికోడ లడుగుపెట్టినందుల కా యూరి వారు నిచ్చలు మెచ్చుచుందురు.

ఆశ్చర్యముతో నా యిల్లాలన్నది–"ఎంతయో యవసరముండి వచ్చినాను. నీకును తెలియును–చీటికిమాటికి చేయి జాపు స్వభావముకాదు నాది. ఒకబాకీ తీర్చవలసివచ్చినది–మానిసివచ్చి వాకిట నిలఁబడినాఁడు. ఒకరూపాయి యిమ్ము–ఈ బెడద తొలగిపోవును. ఒక వారములో తిరిగి యిత్తును. అడుగుట కిం కెవరున్నారు?—నీవు తప్ప?"

రామప్యారి యే మాత్రమును మెత్తబడలేదు.

ఆమె వెడలినంతనే రామప్యారి వంటపనులు ప్రారంభించినది. ఇంతకుపూర్వ మామెకు బియ్యము చెరగుట, గడ్డ క్రేముట యనిన తలనొప్పి. వంటయింటిలో నడుగుపెట్టుట యనిన సురెకంబ మెక్కినట్లుండెడిది. అప్పసెల్లెండ్రిద్దరును కొంతవరకు వెనరికివారు తప్పించుకొన ప్రయత్నించెడివారు. అప్పుడు శివదాసు వచ్చి యనెడివాఁడు—ఈ నాఁడిఁక వంట లేదా యేమి?—అని. అప్పుడిద్దరిలో నెవరో యొకరు లేచెడివారు. రొట్టెలు తయారయ్యెడివి—అవి రొట్టెలుకావు—పిడకలను తలపించును. ఆరొట్టెలే మొగవాండ్ర మొగమున వేసెడివారు—ఎడ్లకు దానా వేసినట్లు. కాని—నేటి పరిస్థితి యట్లుకాదు. రామప్యారి మనస్ఫూర్తిగ వంటపనిలో నిమగ్నయైనది. నేఁ డామె గృహస్వామిని!

బయటకే తెంచి చూచినది—ఎటు జూచినను పెంట కుప్పలే! అందరు గోళ్లుగిల్లుకొనుచు కూర్చుందురు — ఆ మాత్రము బాగుచేయలేరా? గుమ్మమెట్లుండవలె? గుమ్మము చూచినంతనే యానందము కలుగవలె! ఇట్లున్నచో గడప త్రొక్కుటకే యసహ్యముగనుండును. వారికి తోఁపదు— చెప్పఁబోఁగోపము! అరే! అదేమి! పాపమా యావు కుడితి తొట్టివద్ద నిలఁబడి యున్నదేమి?

ఆమె తొట్టిలోనికి తొంగి చూచినది—దుర్గంధము—హు—! ఎన్ని దినములైనదో! తొట్టి కడిగి నీరు మార్చలేదు. ఈ నీరు త్రాగి యావు బ్రతికినట్లే! తమ పొట్ట నిండినచాలును! ఎవ రెట్లుపోయిన తమ కేమి? పాలుమాత్ర మందఱకుఁ గావలె!

ముసలాయన గుమ్మమువద్ద చుట్టలు కాల్చుచుఁ గూర్చుం డును—తొట్టికడిగి నాలుగు బిందెలు నీళ్లుపోయుఁడు. పాలే రున్నాఁడు—కేవలము దద్దమ్మ — కానికి కొరగానివాఁడు. తిండికి ముందు తయారు—పనియన్న పెనుభూతము! ఃవాని విషయమేమో నేఁడు తెలిసికొనవలె! ఉన్నచో నుండును— లేనిచో పోవును. పనివాళ్ళకు కఱవు రాలేదు—పనిలేక తిరుగువారు చాలమంది యున్నారు.

ఆమె కిఁక తోఁచలేదు-కడవ తీసుకొని నీటికిబయలు దేరినది.

శివదాసు పిలిచినాఁడు—"నీళ్ళు కావలెనా అమ్మాయీ! తొట్టినిండ నున్నవి!"

"తొట్టిలోని నీరు కంపుకొట్టుచున్నది. ఎన్నాళ్ళ నుండియో నిలువయున్నవి. అదిగో చూడండి!— ఆవు తొట్టెలో ముట్టె పెట్టుటలేదు — ఫర్లాంగుదూరమున నున్నది."

శివదాసు నిగూఢముగ నవ్వుకొనినాఁడు—తనలో. కోడలిచేతినుండి కడవను గైకొని తానే బయలుదేరినాఁడు.

## 3

కొన్ని నెలలు గడచినవి. రామప్యారి యధికారమునాటి నుండియు నిల్లు కలకలలాడుచున్నది - వసంతాగమనము వలె! ఇంట బయట-ఎటు చూచినను చక్కని కార్యకౌశ లము. సద్భావచిహ్నములే కానవచ్చుచున్నవి. రామప్యారి

గృహయంత్రాంగములన్నియు సరిగ పనిచేయునట్లు సంచాలన మొనర్చుచున్నది. భోజనము-పూర్వపు భోజనముకంటెను విలువగలది. ఆ భోజనముగూడ నియమిత సమయమునకు పూర్తి కావలసినదే! పాలు, పెరుగు సమృద్ధిగ నున్నవి-పనిగూడ సమృద్ధిగనే యున్నది. ఆమె విశ్రమింపదు.—ఇతరులను విశ్రమింపనీయదు. ఇంటిలో లేనివస్తువులేదు-ఏ వస్తువు కావలసివచ్చినను నింటిలో నుండితీరవలసినదే! మనుష్యులే కాదు—జంతువులుసైత మారోగ్యముగ నున్నవి. వెనుకటి యా చింపిరిగుడ్డలన్నియు మాయమైనవి. ఇక నింటి మొత్తమునకు సుఖమునకు నగ్రణ్యమై, మలిన వేషమున నున్నది—రామస్వామి యొక్క కృషియే! ఐనను, ఇంటిలో నందఱకునామె యనిన మంటయే! చెల్లెలు, మఱదిమాత్రమే కాదు—అప్పుడప్పుడు శివదాసుగూడ నామెపై విసుగుకొనును. జాము ప్రొద్దుండగనే నిదుర లేచుట వారికిష్టముండదు. పని యనిన దాగికొందురు ఐనను రామస్వామి లేనిచో సంసారము సాగదని యందరు నొప్పుకొందురు. కాగా—అప్పసెల్లెండ్రిరువురి మధ్యను వెనుకటి యాత్మీయత మృగ్యమైనది.

ప్రాతఃకాలము. రామములారి చేతి మురుగు లూడదీసి తన యప్పగారి ముందు విసరికొట్టినది-మూతి ముడిచి-కోపముతో నన్నది-—"నీనినిగూడ గొంపోయి యా గదిలో బంధించి తాళము వేయుము,"

రామప్యారి మురుగులను చేతఁగొని యనినది-"చెప్పి తినిగదా! చేతికి డబ్బు వచ్చినప్పుడు చేయింతునని! ఇవి యేమంత యఱిగిపోయినవి?——నేఁడే తీసి పారవేయుటకు?"

దులారి పోట్లాడుటకు సిద్ధపడియే వచ్చినది. అనినది- "నీచేతికి డబ్బువచ్చుట, మురుగులు తయారగుట-రెండును జరిగినట్లే! చేతిలో డబ్బు ఎన్నడు నుండదు. ముడిమీద ముడివేయుట యనిన నీకు మహానందము!"

రామప్యారి నవ్వెన దీ మాటలకు-"ముడిమీద ముడి వేసి దాచుచున్నానా! ఎవరికొఱకు? నీకొఱకేగదా! నాకెవ రున్నారు? నాయదృష్ట మేనాఁడో బుగ్గయైనది."

"నీవు తినిన నేమి - తినకున్న నేమి? కావలసినంత పెత్తనమున్నది. తిండిగుడ్డలు తప్ప నాకేమున్నది? నాకు నీ లెక్కలు డొక్కలు తెలియవు. నాకు కావలసినవి మురుగులు."

"డబ్బు దగ్గఱ లేనప్పు డేమిచేయను?"అనినది వినోద భావముతో రామప్యారి.

"నాకేమియు తెలియదు. నాకు మురుగులు కావలసి నదే!"

ఇదేవిధముగ నింటిలోనివారందరును రామప్యారిపై తమ యవసరములకుగాను గంతులు వేయుదురు. పాపమామె వారి కేకలన్నియు నవ్వుచు సహించును. స్వామిని ధర్మమే యదిగదా! అందరి కేకలను సహించుట-వారి కల్యాణము నకై పాటుబడుట! ఆ స్వామిత్వమను కవచముపై కేకలు

త్రిల్లు, గంతులు పనిచేయవు. తాను యజమానురాలనను జ్ఞానము యీ యాఘాతమువలన మఱింత బలపడును. ఆమె గృహసంచాలిక యాయె! అందఱు నామెవద్దనే తమతమ బాధలు చెప్పికొందురు. కాని యామె యిష్టము వచ్చినట్లే జరుగును. ఆమె సంతోషమున కయ్యదియే చాలును.

గ్రామము వారందరు నామెను ప్రశంసింతురు—పాప మేమంత పెద్దవయసు? ఇంటిని చక్కగ దిద్దును. మరియొక వివాహము చేసికొని సుఖింపలేకనా? పాపమీయింటికొఱకు జీవితమంతయు ధారపోయుచున్నది. ఎవరితోడను నవ్వుచు మాటాడనైనను మాటాడదు, మనిషి పూర్తిగ మారిపోయి నది—అని.

కొన్నిదినములకు రాముదులారి మురుగులు తయా రయి వచ్చినవి. రామిప్యారియే కంసాలి యింటిచుట్టును తిరిగి తిరిగి చేయించినది.

సాయంకాలమైనది. దులారి, మధుర యింటికివచ్చి నారు. రామప్యారి క్రొత్తమురుగులను చెల్లెలి కిచ్చినది. దులారి సంతసమునకు మేరలేదు. గబగబ మురుగులు ధరించి పరుగిడి వసారాలలోనున్న భర్తకు చూపించుచున్నది. రామ ప్యారి గుమ్మము ప్రక్కన దాగియుండి యా దృశ్యమును వీక్షించుచున్నది. ఆమె నేత్రములు సజలములైనవి. దులారి తనకంటె మూఁడేండ్లు మాత్రమే చిన్నది. కాని ఇరువురిలో నెంత భేదమున్నది! ఆమె కనులు వారిమీదనే యున్నవి— ఆదంపతులయానందము, ప్రేమాశ్లేషము, సౌభాగ్యదృష్టులు—

రామప్యారి రాపడి నిలుచుండి పోయినది. క్రమముగ నా క్షీణ దీపకాంతిలో వారిరువురును నామె దృష్టినుండి మాయ మైరి. ఇక నామెకు తన యతీత జీవనలీలలు-ఒక్కటొక్క టిగ-సూక్ష్మ రూపములలో-స్మృతిపథమున మెఱసినవి.

ఇంతలో శివదాసు పిలిచినాఁడు - అమ్మాయీ! ఒక అణా యిమ్మా! పొగాకు తెప్పించవలె!-అని.

ఆమె తన్మయతకు భంగము కలిగినది. కన్నులు తుడుచుకొనుచు గదిలోని కేఁగినది.

# 4

**ఒ**క్కటొక్కటిగ రామప్యారి నగలన్నియు చేజారి పోవుచున్నవి. గ్రామమున నందరు తన యింటిని సంపన్న గృహముగ నెంచవలెనని యామె కోరిక. ఆ మహాత్వా కాంక్షకుఁ దగిన మూల్య మర్పింపవలెనుగదా? ఇంటి మరమ్మ తులకు-పచ్చికపాటలకు-చుట్టపక్కముల వ్యవహారములకు-రోగములకు నొప్పులకు-అన్నిటికిని డబ్బు కావలసినదే! ఖర్చు లెంతతగ్గించినను తప్పనిసరియైనపుడు తననగలయందొకదానిని తీసి యిచ్చును. చేజారిన వస్తువు తిరిగి వచ్చుటకల్ల! నిజమున కీ ఖర్చుల నెన్నిటినో తప్పించుకొనవచ్చును. కాని పరువు ప్రతిష్ఠల విషయము వచ్చినపు డామెచేతికడ్డుయుండదు- గ్రామమున పరువు పోయినచో నెన్నియున్న నేమి? లోకులు తననేయందురుగదా! తన చెల్లెలివద్దను నగలున్నవి-మఱిది

వద్దను నొకటిరెండు వస్తువులున్నవి-కాని యామె వారి వస్తువులను ముట్టదు-ఇంకను వారు బ్రతికి బట్టకట్టవలసిన రోజులు ముందున్నవిగదా యని.

దులారి కొక పిల్లవాఁడు పుట్టినాఁడు. రామప్యారి వాని జన్మోత్సవము వైభవముగ చేయవలెనన్నది.

శివదాసంగీకరింపలేదు—"ఇప్పుడేల? భగవానుఁడు తిన్నగ చూచినచో పెండ్లి పేరంటములు ముందున్నవి. ఆనాఁడు చేయవచ్చును."

ఉత్సాహపూర్ణమైన రామప్యారి మనసంగీకరింపలేదు. అన్నది-"అదేమిమాట? తొలిచూలు పిల్లవాని విషయమున వైభవముగ జరుగక పోయినచో మరెప్పుడు? నామనసొప్పదు. లోకులేమందురు? నేను మిమ్ములనేమియు నడుగను. అంతయు నేనే చూచుకొందును."

"మఱల నగలకెసరు పెట్టుదువు—అంతియేగదా!"—శివదాసు విచారముతో ననినాఁడు—"ఇట్లైనచో పూచిక పుల్ల మిగులదు. ఎన్నియో చెప్పినాను—అప్ప, చెల్లెలు, అన్న, తమ్ముఁడు, మఱది ఒకరికొకరు కారని—నామాట వినవు. మనదగ్గర నాలుగు డబ్బులున్నపు డందరును వత్తురు. ఆ పిమ్మట ముఖము చూడరు.

ఇట్టి ముసలివారి మాటలు చాల వినినానన్నట్లు మాటతిప్పి యనినది రామప్యారి-"మనవారైనవారు మనముఖము చూడకున్నను మనవారే! నాధర్మము నాది—వారి ధర్మము

వారిది. నా ధర్మము నేను నెఱవేర్చుకొనవలె. చనిపోవు
చప్పుడు కట్టుకొని పోవుదునా యేమి ?"

వైభవోపేతముగ జరిగినది—జన్మోత్సవము. పురిటిశుద్ధి
నాఁడు చుట్టపక్కములకు, ఇరుగుపొరుగువారికి విందొసఁగి
నాఁడు. భోజనము లొనర్చి యెవరియిండ్లకు వారేఁగినారు.
పగలంతయు పలసియున్న కారణమున రామప్యారి చాప
ముక్క పఱచి నడుము వాల్చినది—కునుకు పట్టినది. అదే
సమయమున మిఱది యింటిలోనికి వచ్చినాఁడు. నవజాత
శిశువును చూచుట కాతని మనసు తహతహ పడుచున్నది.
దులారి పురిటిగదినుండి బయటకు వచ్చినది. గర్భిణీ యవస్థ
యందామె శరీరము క్షీణించి, మోము కాంతివిహీనమైనది.
నేఁడామె మోమున స్వాస్థ్యము గోచరించుచుండెను.
మాతృత్వగర్వము - ఆనందము నామె యందొక నూత్న
స్ఫూర్తిని గొనివచ్చినవి. బాలెంత నియమములు - పౌష్టిక
భోజనము—వీనివలన దేహము నునుపెక్కినది. భర్తయామెను
గదిలోఁ జూచినాఁడు. పండుకొనియున్న రామప్యారినిఁ జూచి
యామె నిద్రపోయినదని తలఁచినాఁడు. భార్యను సమీపించి
శిశువును ఒడిలోనికిఁ దీసికొని ముద్దు పెట్టుకొనినాఁడు.

సవ్వడి యైనంతనే రామప్యారికి మెలకువ వచ్చినది.
సగము కనులు మూసినది. అర్ధనిమీలిత నేత్రములతో నా
యానందక్రీడలఁ గాంచుచున్నది. తల్లిదండ్రు లొకరి తరు
వాతనొకరు శిశువును ముద్దాడుచున్నారు — కౌఁగలించు
కొను చున్నారు. అదియొక స్వర్గీయమైన దృశ్యము! రామ

ప్యారిలోని తృష్ణ-లాలస క్షణకాలము తాను స్వామిని నను విషయమును మఱపించినది. కళ్ళెముతో కట్టబడిన నోరు— శక్తికిమించిన బరువు — కాతు కొరడాదెబ్బలు—వీని బాధతో పరుగిడుచు, నకస్మాత్తుగ సకిలింపు విని చెవులు నిక్కించిన గుఱ్ఱము-తన పరిస్థితిని మఱచి పెగిలిరాని స్వరముతో సకిలించి సమాధాన మిచ్చును. ప్రస్తుతము రామప్యారి స్థితి సరిగనట్లే యున్నది. పంజరబద్ధమై-మూకమై— నిశ్చేష్టమైయున్న యామెలోని మాతృత్వము-సమీపమున వినిపించిన మాతృగీతమును విని-జాగృతమైనది. దుఃఖభూయిష్ఠమైన ఆ పంజరమునుండి విముక్తిఁ బొందుటకు రెక్కలల్లార్చుచున్నది.

రాఘుర యనినాఁడు-"వీఁడు నా బిడ్డఁడు" అని.

దులారి బిడ్డను హత్తుకొనినది—"అవును మరి! మీరేగదా నవమాసములు మోసినది! శిక్ష యనుభవించునది నేను—నాన్న యని పిలిపించుకొనుట మీరు!"

"నా పిల్లవాఁడు కానిచో నా పోలిక యెట్లొచ్చినది? ముఖము-రంగు-అంతయు నా పోలికయే! అవునా?"

"అయిన నేమాయె? వితనములు కోమటింటివైనంత మాత్రమున పండిన పంట కోమటిదికాదు గదా!"

"మాటలలో నీ కెవ్వరును దీటురారు. వీఁడు పెద్దవాఁడైనచో హాయిగ పరుపుపై గూర్చుండి చుట్ట కాల్చుకొనును. నన్ను పలుకరించువారుండరు."

"మాబాబు పెద్దచదువులు చదువును-పెద్ద యుద్యోగము చేయును. మీవలె నెద్దులవెంబడి తిరుగఁడు. పెద్దమ్మగారితో జెప్పవలె—ఉయ్యాల కావలెనని."

"ఇఁకనుండి మఱి చీకటితో లేవనద్దు. బండచాకిరి కూడ మానుము."

"ఆ యమ్మవారు బ్రదుకనిచ్చినా ?"

"పాపము! నాకామె యెడ దయ గలుగుచున్నది. ఆమె కేమున్నారు? మనకొరకేగదా యెముకలు విరుచుకొనుట! అన్నయ్యయే యున్నచో ముగ్గురు బిడ్డల తల్లియయ్యెడిది."

రామప్యారి కంఠమున నశ్రువేగ మెక్కువైనది—దాని నాపుటలో నామె నిలువెల్ల కంపించుచున్నది. విధి వంచితమైన తన జీవితము ఎడారిగా తెలనున్నది. ఆ మండు టెండలో — ఆ కాలిన యిసుకలో సంతసోద్యానమును పెంచుట కామె వ్యర్థప్రయత్న మొనరించుచున్నది.

ఇంతలో శివదాసు వచ్చినాఁడు-"అమ్మాయీ! నిద్రపోతివా? భజంత్రీల కేమియు పెట్టలేదట. ఏమని చెప్పను ?"

# 5

మఱికొన్ని దినములు గడచిపోయినవి—శివదాసు గూడ చనిపోయినాఁడు. దులారికి మఱి యిరువురు పిల్లలు పుట్టినారు. ఆమెకు సమయమంతయు నాపిల్లల పోషణతోడనే సరిపోవుచున్నది. వ్యవసాయమంతయు కూలీలమీఁద నాధారపడియున్నది. మధుర మంచి పనివాఁడే! కాని సం

పాలకుఁడు కాఁడు-పనిచేయించు టాతనివలన కాదు. మొదట అన్నగారి యజమాయిషీలోఁ బనిచేసినాఁడు. ఆ పిమ్మట తండ్రి చెప్పుచేఁతలలో మెలఁగినాఁడు. ఆతనికి వ్యవసాయ సూత్రములు తెలియవు; అతని పనిలోనికి—పని పాటలు చేయుటకంటె—నిచ్చకములాడుటలో నేర్పరులైనవారే వత్తురు. అందువలననే రామస్వామి రోజుకు రెండు మూఁడు పర్యాయములు పొలముకూడ వెళ్ళవలసి వచ్చుచున్నది; అనుకొనుటకుమాత్ర మామె నేఁడుగూడ స్వామినియే!—కాని, నిజమున కాయింటి దాసి. కూలీల కామె యనిన మూతి విరుపే! జమీందారు నౌకర్ల దబాయింపులుగూడ నామె సహింపవలె! భోజన విషయమునగూడ సంయమనముఁ జూపవలసివచ్చినది — అవునుమఱి-పిల్లల కెప్పుడు నేదో యొక తినుబండారముండవలె. దులారి పిల్లలతల్లి — ఆమెకు పుష్టినొసంగు ఆహారము కావలె! మధుర యింటి యజమానివోఁగదా! వానిని కాదనువారెవరు? ఇంక మిగిలినది రామస్వామియే! ఆ యింటిమొత్తమున నామెయే పనికి మాలినది—ఆమె తినినను తినకున్నను హాని యుండదు. ముప్పదియేండ్లకే యామెజుత్తు నెఱసినది—నడుము వంగినది—నేత్రజ్యోతి క్షీణించినది—అయినను నామె సంతోషమునకు లోటులేదు. స్వామిత్వ గౌరవము వీటిని కప్పిపుచ్చినది—వలాస్త్రి పట్టినవలె.

ఒకనాఁడు మఱది రామస్వామితో ననినాఁడు—"వదినా! మా యూరు వదిలిపోవలెనని యున్నది. ఇచట సంపాదన

కనిపించుటలేదు. ఎంత చాకిరిచేసినను పొట్టకే చాలకున్నది. తూర్పుదేశమునుండి యెవరో వచ్చినారు. అచట రోజుకు రెండు మూఁడు రూపాయల కూలి యున్నదట, నాలుగైదు సంవత్సరము లచటనున్నచో నాలుగుడబ్బులు వెనుక వేయవచ్చును. పిల్లజెల్లను పెంచి పెద్దలను చేయవలెను గదా? పిల్లలకొఱకైనను నాలుగురాళ్లు వెనుక వేయ వలెనుగదా!"

దులారి సమర్థించినది, భర్త మాటలను—"చేతిలో నాలుగు డబ్బులున్నచో పిల్లలకు చదువు చెప్పించవచ్చును. మనరోజు లెట్లో గడచినవి–పిల్లలనైనను మానవుల నొనర్ప వలెనుగదా!"

రామప్యారి యీ మాటల కాశ్చర్యచకితయైనది. అని మేషదృక్కులతో వారి మోముల వీక్షించుచున్నది. ఇంతకు ముందిట్టి మాటలెన్నడును వారినోట వినలేదు. వీరికి నేఁడీ పిచ్చి పట్టినదేమి? బహుశః తనవలననే వారీ నిర్ణయమునకు వచ్చిరేమో యనుకొనినది—"మీ రిచటినుండి వెడలుట నా కిష్టములేదు. ఆ పైన మీయిష్టము. పిల్లల చదువు సంధ్యల కిచటను నొక పాఠశాల యున్నది. రోజులన్నియు నిట్లే యుండునా? రెండు మూఁడు సంవత్సరములు అదృష్టము కలిసివచ్చి నాలుగుగింజలు రాలినచో నిచటమాత్ర మేమి లోటుండును?"

మఱది యనినాఁడు—"ఇన్ని దినములనుండి లేని దింక ముందుండునని నమ్మకమేమున్నది? ఇట్లే రోజులు గడచిపోవును—ఆ పైన మనము చేయగలిగినదేమి? నా

మోపికకూడ దినదినమును సన్నగిలుచున్నది. ఇంక నీ వ్యసనాయము చూచువారెవరు? పిల్లలనుకూడ నిట్లే గాను గెద్దులకోలె త్రిప్పజాలను. వారిజీవితమును నాశన మొనర్ప లేను."

రామప్యారి కన్నీరు నింపినది—"ఇంటివద్ద గంజి లభించునప్పుడు పాలకై పరువెత్తరాదు. నా వలన నేమైన నిబ్బందిగ నున్నచో మీ సంసారము మీరే చక్కదిద్దు కొనుడు; నా కింతముద్ద యిడిన పడియుందును."

మంది యార్ద్రకంఠముతో ననినాడు—"వదినా! ఏమి మాటలివి? నీవలననేగదా సంసార మీమాత్రమైనను సాగినది. లేనిచో నేనాడో పాతాళమున కేగియుండెడిది; ఈ సంసారము కొఱకై నీ సర్వస్వము నర్పించి, చేతులు కడిగికొని కూర్చుంటివి. నేను గ్రుడ్డివాడను కాను— అన్నియు చూచుచునే యున్నాను, మమ్ము పోనిమ్ము. భగవానుడనుగ్రహించినచో మఱల సంసారము చక్క బడగలదు. నీ ఖర్చుకు డబ్బు పంపుచుందుము."

"అయినచో మీరేగుడు! ఈ పిల్లలనుగూడ దేశ దేశము లెందుకు త్రిప్పుట?"

దులారి యనినది—"అదేమిమాట అక్కయ్యా! ఈ పల్లెటూరిలో పిల్లల చదుపుసంధ్య లెట్లుసాగును? పిల్లలు లేనిది ఈయనకు తోచదు. మాటిమాటికి పరుగెత్తుకొని వత్తురు. సంపాదన రైలుచార్జీలకు సరిపోవును. ఇతరచోట్ల నొంటరిగనున్న నెంతఖర్చగునో సంసారముతో నున్నను నంతేయగును."

"అయిన నేనొక్కతెనే యిచటనుండి చేయునదేమి? నన్నుగూడ వెంట గొనిపొండు"

దులారి కామెను వెంట గొనిపోవుట యిష్టములేదు. కొన్ని దినములపాటు జీవితానందము ననుభవింపవలెనని యామె కోరిక—పరదేశ మేఁగినను నీబంధనము వెంట యేల? ఆమె వెంటనున్న చో నిల్లు వదలిన సుఖమేమున్నది? అనినది-"అక్కయ్యా! నీవువచ్చుట కభ్యంతర మేమున్నది? కాని యిచటి వ్యవహారమంతయు నాశనమగును. నీవున్నచో జాగ్రత్తగ నిర్వహింతువు."

ప్రయాణ ముహూర్తమున కొకరోజు ముందుగ రామప్యారి రాత్రి యంతయు మేల్కొని పిండివంటలు తయారుచేసినది. ఆమె యీ యింటి కేతెంచిన నాటినుండి యొక్క దినమైనను నొంటరిగ నుండి యెఱుగదు. ఆ భయంకర తరుణ మాసన్న మగుచున్నకొలఁదియు నామె మనసులో దిగులెక్కువైనది. మఱది సంతోషముగ నున్నాఁడు-దులారి ప్రసన్నురాలై కాన్పించుచున్నది-పిల్లలు ప్రయాణపు సందడిలో-ఆనందములో—నన్నుగూడ మఱచినారు. ఆమె యనుకొనినది-తానుకూడ నిట్లే నిర్ద్వంద్వముగ నుండవలెనని, మోహమును-మమకారమును దూరముగ త్రోసి వేయవలెనని. కాని యీ ప్రయత్నము-వారందరును తనకు దూరమగుచున్నారను భావము, ఆమె మనసును సంక్షుభిత మొనర్చుచుండెను. దులారిమాత్రము తిరునాళ్ళ కేగుచున్నట్లు సంతోషమున నుప్పొంగుచుండెను. క్రొత్తదేశమును

క్రొత్తమనుష్యులను, క్రొత్తవస్తువులను చూడవచ్చునను సంతోషమామెను నిజముగ క్రియాశూన్య నొనరించెను. ప్రయాణపు పేర్పాట్లన్నియు రామస్వామి నెత్తిన బడినవి— చాకలి యింటినుండి గుడ్డలన్నియు వచ్చినవా? లేదా? ఏవో గిన్నెలు కావలసివచ్చును? ప్రయాణపు ఖర్చుల కెంత పైకము కావలె? పిల్లవానికి దగ్గు వచ్చుచున్నది, రెండవ వానికి విరేచనము లగుచున్నవి. వారికి మందులు నూరవలెను—ఇట్టివే యామెకు వేయి పనులు! పిల్లల తల్లి కాకున్నను దులారికంటె నామెయే శిశుపోషణమున నేర్పరి. "చూడు! అమ్మాయీ! పిల్లల నెక్కువగ చావబాదవలదు. అదే పనిగ కొట్టినచో పిల్లలు మొద్దుబారిపోదురు—సిగ్గు లేనివారగుదురు. పిల్లలతోఁబాటు మనముగూడ పిల్లలమై పోవలె!—వాళ్ళతో నవ్వవలె-ఆటలాడవలె! నీవు హాయిగ పండుకొనవలెనని పిల్లలను కదలనీయక మెదలనీయక నిర్బంధింపఁగూడదు. వారికేదో పని చూపుచుండుము. పిల్లల విషయములో వెయ్యి తిట్లకంటె నొక మట్టిబొమ్మ యనేక రెట్లు ప్రయోజనకారి." దులారి యామె యీ యుపదేశములను విమనస్కయై విన్నది—ఆమెకు పిచ్చియెత్తి వాగుచున్నదా యనునట్లు.

వారి ప్రయాణపురోజు రామస్వామికి పరీక్షాదినము. ఆ దృశ్యము చూడకుండనుండుట కెచటికైనను పోవలెనను కొన్నది. ఆహా! ఒక గడియలో నిల్లంతయు శూన్యమగును! దినమంతయు తానొంటరిగ కూర్చుండవలసివచ్చును. ఎవరితో మాటాడును?—నవ్వును? ఈ యాలోచనము వచ్చినంతనే

యామె నిలువెల్ల కంపించెను. ఆ సమయమున [illegible] కొలఁదియు నామె [illegible] మనే [illegible] కొంతపడి రోదనము చేసెను. [illegible] యత్నించెను—'నాకు [illegible] ఏదియో!—అనుకొనుటకు మాత్రమే!—నా వాళ్ళని! అంతవఱకే సంబంధము! ఎవరెని బలవంతము చేయగలము? పరాయివాళ్ళకొరకెంత కొట్టుకొని చచ్చినను వాళ్ళు మన వాళ్ళు కానేకారు. నూనెలో నీటి నెంతకలిపినను వది వేఱు గనే యుండును' అని. పిల్లలు క్రొత్తబట్టలు ధరించి నవా బులవలె నున్నారు. ఆమె వారిని ముద్దుకొనుటకై దగ్గరకు తీయ యత్నించెను. పిల్ల లేవపు మొగము పెట్టి విప్పించు కొనిపోయిరి. తన పిల్లలుకూడ నిట్టి సమయమున నిష్ఠురులై పోదురని యామెకు తెలియదు.

పది గంటలకు గుమ్మమువద్ద నొక యెద్దులబండి వచ్చి ఆగినది. పిల్లలు ముందుగనే యెక్కి కూర్చుండిరి. ఇరుగు పొరుగువారు చాలమంది వచ్చిరి—చూచుటకు. వారిందఱు నీ సమయమున వచ్చుట రామప్యారికి కష్టము కలిగించినది. మఱల నొక్క పర్యాయము కౌగలించుకొని యశ్రుతర్పణ మీయవలె ననుకొన్నది. [illegible] చేతులు జోడించి—'నాయనా! నా విషయము కనుగొనుచుండుము! నీకంటె నా కెవరున్నారు?' అని చెప్పదలఁచినది. కాని యీ గందరగోళ ములో నామె కట్టి యవకాశము లభింపలేదు. వారికప్పుడు

బండి యెక్కిరి. రామప్యారి ద్వారమువద్ద కన్నీటితో నిలువబడి యున్నది. వారిని ఊరిబయటివఱకు సాగనంపవలెనను స్పృహయే లేదామెకు—అంతటి దుఃఖవివశురాలయిపోయిన దామె!

## 6

కొన్నిదినములవఱకును రామప్యారి మూర్ఛితస్థితిలో నున్నట్లుండెను—ఇంటినుండి యడుగు బయటపెట్టదు—పొయ్యి వెలిగింపదు—స్నానాదికములుగూడ లేవు. పాలేరు మాటి మాటికి వచ్చి యనెడివాడు—"లెండు! కాలుచేతులు కడిగి కొని భోజనము చేయుడు! ఎన్నినాళ్ళని యిట్లు పడియుందురు!" అని. ఈ విధమైన సాంత్వనవచనము లిరుగు పొరుగు వారుకూడ చెప్పుచునే యుండిరి. కాని—వారి యోదార్పులో నొక విధమైన ఈర్ష్య భాసించుచున్నది. పాలేరు మాటలలో నిజమైన సానుభూతి వ్యక్తమగుచున్నది. ఆ పాలేరు పనికి దొంగ—నిదురబోతు—నాత్తొండు! రామప్యారి యతనిపై మాటి మాటికిని కోపించుచుండెడిది. ఒకటిరెండు పర్యాయములు వానిని పనినుండి తొలగించినది—కాని మరది బ్రతిమాలుటవలన మరల పనిలోనికి పిలిచినది. నేడుకూడ వాని సాంత్వన వచనము లామెకు నచ్చుటలేదు—వీడు పనిలోనికిపోడేమి? నా చుట్టు నేల తిరుగును? కాని వానిపై కేకలు వేయుట కామె మనసొప్పుటలేదు—ఆమెకిప్పుడు సానుభూతి కావలెను—సాంత్వనములతో నామె దప్పి కొంతతీరును. కంటకాకీర్ణమైన చెట్టున నున్న ఫలములను సైతము వదలిపెట్టజాలముగదా!

క్రమక్రమముగ మనశ్శాంతిగూడ తగ్గినది. జీవిత వ్యాపారము [illegible] ప్రారంభమైనది. ఏ లావాదేవి భారమంతయు నామెపై బడినది. కొందరు సలహా లిచ్చినారు–ఎద్దుల నమ్మివేయుమని–వ్యవసాయ మెత్తివేయుమని! కాని యామె గర్వము పరాజయము నంగీకరించుట కిష్టపడనీయలేదు. పనులన్నియు వెనుకటివలెనే జరుగుచున్నవి. మఱదివద్దనుండి ఉత్తరములు పత్రములు లేవు.—అమె యభిమానము మఱింత తీవ్రరూపమును దాల్చినది–'తనమీదనే యాధారపడి యున్నదని తలఁచినాఁడు కాఁబోలు! తనకే యింతపెట్టగలను! ఆతనివద్దనుండి యుత్తరము వచ్చినంతమాత్రమున నా కొరిగిన దేమి? నావిషయ మాతనికి పట్టనప్పు డాతనివిషయము నాకును ననవసరమే!'

ఇప్పు డింటిపను లెక్కువలేవు. పగలంతయు నామె పొలముపనులు చూచుచుండును. దోసతోట వేసినారు. బాగుగా కాచి, అమ్ముడుపోయినవి. ఇదివఱలో పాలన్నియు నింటికే సరిపోయెడివి—ఇప్పుడమ్మకము ప్రారంభమైనది. ఆమె మనోవృత్తియందొక విచిత్రమైన మార్పు వచ్చినది. ఇప్పుడామె చక్కని వస్త్రములు ధరించును, తల దువ్వుట జడ వేసికొనుట మున్నగు విషయములందు పూర్వపుటుదాసీనభావము పోయినది–శ్రద్ధ కలిగినది. ఆభరణములపై నభిమచి హెచ్చినది. డబ్బు చేతికందినంతనే తాకట్టులోనున్న తన నగలను విడిపించుకొనినది. భోజనమునగూడ శ్రద్ధ వహించుచున్నది. ఇంతకుఁబూర్వ మా తటాకము పొలము

"మీమాటకు రెండువైపుల పదునుండును. తెలియక పోయి నచో నూరకుండవలె! రేపటికి చెఱకు పడి యుండనేయున్నది- మోటఁ దోలవలె! నేఁడు మూఁడింటిలో నీవు అనుగంటినది. చీకటిలో నేను పోకున్న మఱియొక రాక్రమింతురు. ఇఁక వారము రోజులవఱకు గొల్లు గిల్లుకొనుచు కూర్చుండవలె! ఈ వారములో చెఱకుతోట యెండిపోవును!"

ఆమె వాని సరళస్వభావమునకు నవ్వుకొని యన్నది- "అరె! నిన్ను నేనేమంటిని? పిచ్చివాఁడా! కొంత ఓపిక నుంచుకొని పని చేయుచుంటిని—శక్తినంతను ధారపోయ వలదంటిని! మూల పడినచో నేమగును?"

"నేనా? మూలపడునది? ఇరువది సంవత్సరములనుండి తలనొప్పిగూడ నెఱుఁగను-ఇఁక ముందేమగునో తెలియదు. తెల్లవాఁరులు పనిచేయుమనినను చేతును."

"నేనేమెఱుఁగుదును? ఇదివఱకు నీవే నెత్తిన చేతులు బెట్టుకొని కూర్చుండెడివాఁడవు. అడిగినచో జ్వరము వచ్చినదని, కడుపునొప్పియని యనెడివాఁడవు!"

వాఁడు సిగ్గుచెందుచు ననినాఁడు—"అవి వెనుకటిరోజులు! యజమానులు నెత్తిన కూర్చుండినప్పుడు! ఇప్పుడా భార మంతయు నాపై నున్నదిగదా! నేనిపుడుగూడ చేయకున్నచో వ్యవసాయము సర్వనాశనమగును!"

"నేనుమాత్ర మిప్పుడు అధికారము చలాయించుట లేదా?"

"మీరా పెత్తన మేమున్నది ? ఒకటి రెండు పర్యాయములు కొన్నాళ్లకో పోలమువస్తావు. రోజంతయు నక్కడ నుండవుగదా !"

ఆమె యాతని నిష్కపట వర్తనమునకు ముగ్ధురాలైనది—"సరే! ఇంత ప్రొద్దుపోయి పొయ్యి వెలిగింతువా? పెండ్లి చేసికొనవేమి ?"

పాలేరు కాలుసేతులు కడిగికొనుచు ననినాఁడు—"మంచిమాటయనినారు! నాపొట్టకుదిక్కు లేదు!–పెండ్లియా! మాటకు సగము నా పొట్టకే కావలె ! రోజుకు రెండు సేర్లు కొనవలసినదే! ఇప్పుడు తగ్గుటకు వీలులేదు."

"సరే! నేడిచట భోజనము చేయుము ! ఎంత తిన గలవో చూచెదను !"

పాలేరు పులకితుఁడై యనినాఁడు—"ఈ శ్రమవలదు! ఒక్కొక్క రొట్టె అర్ధసేరుండవలె ! అట్లయిన తిందును. నేనంతే చేయుదును. రెండేరెండు రొట్టెలు–సేరు పిండితో ! నిప్పులపై కాల్చి తిందును. వాటికిఁ గోడు మజ్జిగ, ఉప్పు, లేక ఉల్లిపాయ–ఏదో యొకటి యున్న చాలును."

"నేఁడు నీకు పల్చని రొట్టెలు పెట్టుదును."

"అయిన తెల్లవారులు తినుచుండవలసివచ్చును !"

"చాలులే ! వాగుడు ! మాటాడక వచ్చి కూర్చుండుము !"

"ఎడ్లకు నీళ్లు పట్టి వత్తును."

# 7

ఈమధ్య వారియువురికిని పొత్తు కలియుచున్నది.

రామప్యారి యనినది—"ఈ సంవత్సరము గోధుమ వేయవద్దు—వర్షము వచ్చిన మునిగిపోవును—వర్షము కురియకున్న నెండిపోవును. జొన్న, కంది, సజ్జ వేయుదము. గోధుమ కాకున్న మునిగిపోయిన దేమున్నది?"

పాలేసు తన విశాలస్కంధమున పాఱ నుంచుకొనుచు ననినాఁడు—"అందరిచేలు పండినచో నా చేనును పండును, అందరిచేలు మునిగిపోయిన నాదియు మునిగిపోవును! . మన మేమి తక్కువతింటిమి? బాబుగారున్న రోజులలో రెండెకరములకు తక్కువ గోధుమ వేయలేదు. బరజూ మరియొక యెకరము పెంచినాఁడు. మధురకూడ ప్రతి సంవత్సరము కొద్దియో గొప్పయో గోధుమ వేయుచునేయున్నాఁడు. ఇఁక నేనేనా తీసివేసినవాఁడను? ఏమైనను రెండెకరములు వేసి తీరవలసినదే!"

"ఆనాఁడైనచో నింటివాళ్లు—ఇరువురు యువకులుండెడి వారు."

"నేనొక్కఁడనే యిరువురితిండి తినుచున్నాను—అట్టిచో నిరువురు చేయు పనిని చేయవలదా?"

"చాలులే! అన్నియునబద్ధములే! రెండు సేర్లు—మూఁడు సేర్లు తిందునందువు! మాటలకేమి?—అర్ధ శేరుకూడ తినుట లేదు."

"ఒకరోజున కొలిచినచో తేలిపోవును గదా!"

"కోపించినావటే! మొగవాడవు—వినువాడవు! చెప్పుచున్నాను—గోష్ఠి నా నేయవద్దు, కూరలు వండకుము. నీవాకుడనే యాతన పడినది!"

"పరమాత్మా! యాతనపడుచున్నది నేనేగదా! ఈ నిర్బంధమున్నదెందులకు?"

ఆమె యాతనసి బుజముపై నున్న పాజ తీసుకొని అన్నది—"నీవిపుడు దినాల్లు గంటలు చెరువువద్ద పడియుందువు నాకీచట విసుగు!— తోచదు!"

విసుగు, తోచకపోవుట, యనునేమియో వానికెఱుంగడు. పని లేనిచో పడి నిద్రపోవును. ఇఁక తోచకపోవు టెక్కడ? అనినాఁడు—"తోచనిచో పడి నిద్రపొమ్ము! నే నింటివద్ద నున్నచో నింకను విసుగుపుట్టును! నేను పని లేకుండ నింటివద్ద నున్నచో నెప్పుడును తిండియావయే! మాటలలో నాలస్యమగుచున్నది. వర్షము వచ్చునట్లున్నది."

ఆమె విధిలేక అనినది—"సరే! రేపటినుండి పొమ్ము! నేటి కచటనే యుండుము."

అతఁడసమంజసుఁడైనాఁడు—"సరే కూర్చుంటిని! ఇఁక చెప్పుము—నీవు చెప్పఁదలఁచిన దేమియో!"

ఆమె వేళాకోళముగ నన్నది—"చెప్పుట కేమున్నది? నీవు పెళ్ళి వేల చేసికొనకుంటివో యడుగదలచినాను? ఒంటరిగ బాధపడుచున్నాను—అప్పుడొకరికిద్దరు కావచ్చును."

వాఁడు సిగ్గిలుచు ననినాఁడు—"నీవు బలేమాట యని నావు! నేనవని పెండ్లి చేసికొనవలె? నగలకొఱకు ప్రాణము

తీయు దానిని చేసికొనినదో నీకే నా గతి తెలియును."

"ఆ మాత్రము నగలు కొనుటకై ... సొమ్ము కలదు నా కెరుకను! బహుమతి పెట్టినావు."

"నగ లడుగరాదనుట లేదు—నా సామర్థ్యము మాత్రము తెలియరాదు. నీ కెన్నడైన నగ లడిగితినా? పైగా నీ నగ లన్నియు నితరుల కొరకు ధారపోసితివి."

ఆమె కపోలము లించుక యరుణములైనవి – "సరే! ఇంకేమి కావలె?"

"నీకు కోపము వచ్చునేమో!"

ఆమె నేత్రములం దొక లజ్జారేఖ పొడసూపినది—"కోపమువచ్చుమాట లైనచో నిజముగనే కోపము కలుగును."

"అయిన, నే చెప్పను."

ఆమె యాతని వెనుకకు నెట్టి యనినది—"ఎందుకు చెప్పవు? నేను చెప్పించినచో వినెదను."

"ఆమె నీవలె నుండవలెనని నా కోరిక – నీ వలెనే గంభీర – సంభాషణలో చతుర – ఎంత చేతనైనది – నీవలెనే పొదుపు నేర్చినది – ప్రసన్నముఖియై యుండవలె! నిజముగ నట్టి స్త్రీయే లభించినచో పెండ్లి చేసికొందును. లేనిచో నిట్లే పడియుందును."

ఆమె ముఖము లజ్జారుణమైనది. ఆమె రెండడుగులు వెనుకకు తగ్గి యన్నది—"నీవు బలే గొంటెవాడవు! నవ్వుచునే ఉన్నదంతయు చెప్పివేసితివి."

—౭—

# గృహనీతి

తల్లి కుమారుని ముందు తనకోడలిపై నేరముల దూకాణము పఱచినపుడు– ఇక నీవనుస యాగనట్లు కనిపించినపుడు ఆరిపోట్టులతో నలసి, విసిగి – పగలంతయు నలసి సొలసి యున్న కారణమున విసిగికొని, – కుమారుఁడు తల్లితో ననును —— "ఇంతకు నేమందువు ? ఆడుదానికుపదేశము లిచ్చుచు కూర్చుండుటయేనా నాపని ? అది నీపని ! ఆమెను నీవు కొట్టుము, తిట్టుము, శిక్షింపుము! నీ వొనర్చిన ప్రయత్నము వలన నది మనిషియైనచో నా కంతకంటె సంతోషమేమున్నది? ఆమెకు మంచిచెడ్డలు తెలియవని, బుద్ధిలేదని, వినయము లేదని, నాతో మాత్రము చెప్పవద్దు. ఆమెను కోపపడి నేర్పుము!"

తల్లి :– అబ్బో! నోటినుండి మాటరానీయదు – మీఁద పడి కఱచును. ఏదియో! దాని ముందెట్లో గౌరవము దక్కించుకొనుచు బ్రతుకుచున్నాను – ఎవరిముందును నన్ను తిట్టకుండుటకై – అంతేచాలును.

కుమా:– అయిన నిందు నాతప్పేమున్నది? దానికి నేను నేర్పుట లేదుగదా– నిన్నెదిరింపుమని !

తల్లి :– మఱియెవరు నేర్పుచున్నారు ?

కుమా:– నీవు అన్యాయము చేయుచున్నావు.

తల్లి:- అన్యాయముకాదు - నిజమే! ఉన్నదున్నట్లే చెప్పుచున్నాను. నీ లోకువవాచిదో యది రెచ్చిపోయినది. అది నీ వద్దకువచ్చి కంటతడిపెట్టినప్పుడు - చాడీలు చెప్పినప్పుడు- ఎన్నఁడైనను, నీవు అమ్మయెడల వినయవిధేయతలతో నుండుమని చెప్పితివా? నీవేదాని క్రింద తొత్తువై పోయినావు. దాని కహంభావము- నా మగఁడు సంపాదించుచున్నాఁడు- నేను మహారాణిని, యింకొకరికేల లొంగియుండవలెను?- అని. మగనాఁడు లోకువ యీయనిచో నాఁడుది యెన్నఁడు నింత నెత్తికెక్కదు.

కుమా:-అయిన నా మీఁద నేనేమియు సంపాదించుట లేదనియు, దద్దమ్మననియుఁ జెప్పమందువా? మఱియామె నన్ను నీచునిగ భావింపదా? తన భార్య తనను సంపాదనపరుఁడు, యోగ్యుఁడు తేజస్వియని తలఁచవలెనని ప్రతి పురుషుఁడును కోరుకొనును. ప్రతినాఁడును వాస్తవ స్థితికంటె తన సామర్థ్య తన గొప్పతనము నెక్కుడుగ వ్యక్త మొనరించును. కాని, నే నెన్నఁడు నట్లుచేయను - ఆమె యెదుట గప్పాలు కొట్టను. కాని భార్యముందు నా గౌరవమును పాడుచేసికొనుటయు నా కిష్టము లేదు.

తల్లి:-నీ వెంత శ్రద్ధగ, చిరునవ్వులతో నా యీమాటలు విందువు- మఱి నెత్తికేల యెక్కుదు? నీగౌరవమును పాడుచేసికొనుట నీ కిష్టము లేదు. నీ భార్య నా గౌరవమును నాశనమొనరించుట నీ కిష్టమే! ఏమి పాపమొనర్చితినని నా కీ శిక్ష? ఎన్నెన్ని ఆకాంక్షలతో-ఎన్ని కష్టములకోర్చి నిన్ను పెంచితినో

భగవంతుఁ డెఱుఁగును ! నా తిండి, గుడ్డలకొఱకు చూడలేదు-
నీతిండి, నీ గుడ్డలకొఱకే తాపత్రయపడినాను. చచ్చి దేనిస్వర్గ
మందున్నారో !-వారి ప్రేమకు చిహ్నమవీవు! నాయభిలాష
లకు కేంద్రమవీవు! నీచదువుకు వేలకొలఁది నా నగలర్పించి
తిని. విధవవద్ద నింతకుమించి యేముండును ?—అందులకే
యీ ఫలితము !

కుమా :-నావలన నీకు కావలసిన దేమియో నాకర్థ
మగుటలేదు. నన్నేమి చేయుమందువు? నీ యుపకారమునకు
ఋణము దీర్చుకొనగలనా? నీవునాకు చదువేకాదు చెప్పించి
నది-జీవనదాన మొనర్చితివి-సృష్టించితివి. నాకై నీ నగలనే
కాదు ప్రాణము మొనర్చినది - నీ రక్తమునిచ్చి యింతవాని
గావించినావు! నీకడుపున నంద పర్యాయములు పుట్టినను
ఋణము తీరదు. నాబుద్ధిపూర్వకముగ-నీకోరికకు విరుద్ధముగ
నే నెన్నఁడు నేమియుఁ జేయను. సంపాదించినది - కొద్దియో
గొప్పయో-నీ చేతియం దుంచుచున్నాను. ఇక నేనేమి చేయ
వలె? ఏమి చేయగలను? ఈశ్వరుఁడు నిన్ను, నన్ను ఈవిశ్వ
మునే సృష్టించినాఁడు. ఆతని ఋణమేవిధముగ మనము
తీర్చగలుగుచున్నాము? తీర్చగలమా? అతని పేరుగూడ తల
చుటలేదే! ఆతనిని భజించినంతమాత్రమున నాతని ఋణము
తీరిపోవునా? తల్లి ఋణము నేకుమారుఁడును తీర్చలేఁడు-
చక్రవర్తియైనను నగుగాక! నిన్ను సంతోష పెట్టగలను-నీకు
బాధ గలుగునట్లు నే నెన్నఁడును ప్రవర్తింప లేదు.

తల్లి :—నన్ను సంతోష పెట్టుచున్నావా? ఈ యింట నొక దాసివలె నున్నాను. మీ రాణిగారికి నా విషయమే పట్టదు. నేనును నొకప్పుడు కోడలినే! రాత్రిపూట ఒక గంటసేపు అత్తగారిపాదము లొత్తెడిదానను. ఆమెకు పాలు కాచియిచ్చి, ప్రక్క వేసి, యామె పండుకొనినపిమ్మట నా పడక! మీ యావిడ తొమ్మిది గంటలకే పుస్తకము చేతబట్టి గదిలోనికేగి కూర్చుండును. గాలికి కిటికీలు రెండును తెఱచి హాయిగ చదువుకొనును. నేను చచ్చినను బ్రతికినను నా దొరసానికి పట్టదు. ఇందులకేనా నేను నిన్ను కని, పెంచి, పెద్ద చేసినది ?

కుమా :—నీవు నన్ను పెంచి పెద్దచేసినావు – కావున నాచే సేవచేయించుకొనవలె ! నీ కీ విషయము నాతో నెన్నఁడు నన లేదు. నాస్నేహితులు చాలమంది యున్నారు, వారెవరును తల్లి శరీరమును గ్రుద్దుట నేను చూడలేదు. నా కర్తవ్యభారమును నా భార్యపై నుంచుటయేల ? తనంత తా నామె నీకు సేవ చేసినచో నాకు పరమసంతోషము ! నా దృష్టిలో నామె గౌరవ మినుమడించును — ఆమె నింకను ప్రేమింతును. ఒకవేళ ఆమె నీకు సేవచేయకున్నచో నీ నామెయెడ విముఖురాలవు కానలసిన పని లేదు. ఆమె స్థితిలో నేనున్నను నిట్లే చేసియుందును. అత్తగారు నన్ను తన కుమారైవలె ప్రేమించినచో నామెను నెత్తిన పెట్టుకొందును—నా భర్తకు తల్లియని కాదు—తల్లివలె నన్ను ప్రేమించును గావున ! కాని కోడలు అత్తగారి కాళ్లు పిసుకుట నాకు నచ్చదు. కొంతకాలము క్రిందటి

వఱకును భార్యలు భర్తల పాదము లొత్తెడివారు. నేటికిని ఆ యాచారము పోలేదు. కాని నా భార్య నాపాదము లొత్తుచో నాకు సిగ్గుకలుగును. నే నామెకు చేయజాలని సేవా శుశ్రూషల నామెనుండి పొందుటకు నా కిష్టములేదు. ఈ పాదములొత్తు ఆచారము. భార్య కేవలము దాసిగ పరిగణింపబడిన కాలమునకు చిహ్నమాత్రము! నేడు భార్యాభర్త లిరువురును సమానులే!—నా దృష్టిలో మాత్ర మింతియే!

తల్లి:—ఇవి యన్నియు బోధించి దాని నీ స్థితికిఁ దెచ్చి నావనియే నేననునది. నాపై నేదియో వైరము సాధించు చున్నావు. దీనివంటి సిగ్గులేనిది, పెద్ద చిన్న తారతమ్యము లేనిది, కటువాదిని, ప్రపంచములో నుండదు. ఈ దొరసాని యే పల్లెలో పెరిగినదో - ఆదరసత్కారములే తెలియవు. ఇరుగుపొరుగు ముత్తైదువ లనేకమంది వత్తురు. గదినుండి బయటకు రాదు. ఆగదిలోనికి వెళ్ళినను గాడిదవలె మంచ ముపైనుండి లేవదు. పాదాభివందన మనునది మొదలే లేదు!

కుమా:— ఆ యిరుగుపొరుగు ముత్తైదువలు నీతో మాట్లాడుటకు వత్తురు. మీరేనో విషయములు మాట్లాడు కొనుచుందురు. నీ కోడలు మీ సంభాషణలో జోక్యము కలిగించుకొనుట అజ్ఞానమని నా యుద్దేశ్యము. అది తన స్నేహితురాండ్రతో మాట్లాడుచున్నప్పుడు పిలువనిదే నేనచటికేఁగను. ఇది నేటి శిష్టాచారము.

తల్లి:—నీవు ప్రతిమాటకు దాని పక్షమే వహింతువు!— ఏమి మందుపెట్టినదో తెలియదు. ప్రతి విషయమందును

జోక్యము కలిగించుకొనవలెనని యెంచినావు! కాని, పెద్దల నాదరింపవలెనుగదా!

కుమా :- ఏ విధముగ?

తల్లి :- చెంగు పట్టుకొని వారి పాదములకు నమస్కరింపవలె! సత్కరింపవలె! విసరవలె! ఈ విధముగ చేసినప్పుడే కోడండ్రకు గౌరవము! అందరును 'మంచిపిల్ల' అందురు. లేనిచో ఫలానావారి కోడలు గర్విష్ఠియనియు మూతిముడుచుకొని కూర్చుండుననియు నందురు.

కుమా :- (ఆలోచించి) అవును! నిజమే! దానికీ విషయము బోధింతును.

తల్లి :- (సంతసించి) నిజము చెప్పుచున్నాను రా నాయనా! మంచముమీదనుండి లేవదు. ఇరుగుపొరుగు వారందరు గుసగుసలాడుదురు–దానికి సిగ్గులేదాయె! సిగ్గుతో నేను చచ్చిపోవుచున్నాను.

కుమా :- దాని ప్రతిపనికి బాధ్యత నీ వెందుకు వహింపవలెనో నాకర్థమగుట లేదు. ప్రతి దినము ఆఫీసులో నాకు చీవాట్లే! ప్రతి దినము సంజాయిషీ లివ్వవలసినదే! నా ప్రవర్తన మిట్లున్నను నీవు నే ననిన ప్రేమింతువు!–నా యెడ సానుభూతిం జూపుదువు! ఆఫీసర్లకు నా యెడ వైరభావమా? లేక నన్ను వెంటాడవలెనను పిచ్చియా? నా కపకారము చేయవలెనను తలంపున్నదా?– లేదు. ఆఫీసుపనిలో నాకు జాగ్రత్త తక్కువ. పొరపాట్లెక్కువ. బద్ధకము, నిర్లక్ష్యము

గూడను! ఆఫీసరు కాస్తచాలైనచోపత్రికచదువుకొందుము- లేదా పేకాట ప్రారంభింతుము. ఇది పేకాటసమయము కాదని, చేయవలసిన పని చాల పడియున్నదనియు మాకు తెలియదా? తెలియును—కాని, అదియొక విధమైన నిర్లక్ష్యము! ఎవరును లక్ష్యపెట్టరు. 'ఆఫీసరు కోపపడును-నాలుగు కేకలు వేయును. ఇంతేగదా! ఆ కొలఁది సేపు తల వంచుకొనినచో తీరిపోవును' అనుకొందుము. నే నిన్నితప్పులు చేయుచున్నను నీవు నా పక్షముననే మాట్లాడుచున్నావు. నాతప్పులను క్షమించి నీవు కావలెన్నచో మా ఆఫీసరును ద్వీపాంతరము పంపగలవు!

తల్లి:- (ఉబ్బిపోయి) నా బిడ్డను శిక్షించిన వానిని పూజింతునామఱి?

కుమా:- ప్రతిబిడ్డఁడును తన తల్లినుండి యిట్టి దయనే యాశించును. తల్లులందరు నిట్లే తమబిడ్డల దోషములను కప్పిపుత్తురు. కాని మఱి కోడండ్రవిషయమున వారి హృదయములింత కఠోరమగుటకు కారణమేమో నా కర్థమగుట లేదు. నీ కోడలి నితరులు దూషించినపు డామెతరఫున క్షమాపణ వేడుట, ఆమె గౌరవమును కాపాడుట, నీ మాతృస్నేహ ధర్మము! మఱి యితరు లామెను దూషించునప్పుడు నీవు వారి మాటలను బలపఱతు వేల? ఆమె నవమానించునప్పుడు నీ కేల సంతోషము కలుగవలె? నేను మాత్రము ప్రతి పెద్దవానిని, ప్రతి బ్రాహ్మణుని పూజించుచున్నానా? నా హృదయమున శ్రద్ధాభావ ముదయింపనిదే నే నెవరిముందును తలవంచను. జాత్తు నెఱసినంత మాత్ర

మున, ముఖము ముడుతలు పడినంత మాత్రమున, నడుము వంగినంత మాత్రమున నెవఁడును నాదరపాత్రుఁడు కాఁడు. యజ్ఞోపవీతము, పెద్దబొట్టు, శర్మ, శాస్త్రి యను నుపాధిగో గూడిన పేరును నున్నంతనే పూజ్యుఁడుకాఁడు. నాదృష్టిలో నిట్టి పరంపరాగత గౌరవము లపరాధములే! ప్రతి విషయమున, మనోవాక్కాయ కర్మములం దెవఁడు యోగ్యుఁడో యట్టివానినే నేనాదరింతును-గౌరవింతును. స్వార్థచింతన, మోసమే ధ్యేయముగా గలవానిని, లంచములు- స్తోత్రములే జీవనసాధనములుగ నెంచువానిని, వాడు పితామహుని యాయుర్దాయము కలవాఁడైనను నేను ప్రణమిల్లను. నీవు దానిని నా యహంకారమందువు! కాని నే నేమి చేయ గలను? మనసు నతముకాదు. అట్లే నీకోడలి మనసునందును నా యిరుగుపొరుగువారియెడ నిట్టి భావములే పాదుకొని యుండవచ్చును. వారిలో నలుగురయిదుగురను నే నెఱుఁగుదును-మూర్తులు పెద్దవే! మనసు, భావములు సంకుచితములు! ఒకతెకు పంనిందయే పని! వేఱొకతెకు పరస్తోత్రమే జీవిక! మఱియొకతె నోరువిప్పిన భరింపలేము! అందఱు నీర్ష్యాసూయలతో ప్రమగ్గువారే! అందువలననే వారి గృహములు నరక సదృశములై యున్నవి! అట్టి స్త్రీలకు నీకోడలు నమస్కరింపనిచో నే నామెను దోషినిగా భావింపజాలను.

తల్లి:- చాలులే నాయనా! ఆపు! ఈ దొరసాని యికముందు నీచేత ఊడ్పించి, గిన్నెలు తోమించి, వంట చేయించనిచో నన్నునుము? ఆడువారిని నెత్తికెక్కించుకొనుట మంచిదికాదు. ఈ నిర్లజ్జతకుఁగూడ నొక హద్దుండవలె!

పెద్దది–అత్తగారు వంటచేయుటయు, కోడలు నవలలు చదువు కొనుచు కూర్చుండుటయునా ?

కుమా:–నిజముగ తప్పే! నీవు వంటచేయుటయు నది నవలలు చదువుటయు నా కేమాత్రమును నిష్టములేదు. ఆ నవలలు ప్రేమచంద్రువైనను నగుగాక ! కాని, యొక విషయము గూడ నాలోచింపవలె!–ఆమె పుట్టినింట నెన్నఁడు వంటచేసి యెఱుఁగదేమో ! అచట వంటవాఁడున్నాఁడు. పొయ్యివద్ద కేఁగినంతనే తలనొప్పి వచ్చుచో నామెను బలవంతము చేయుటయు మంచిదికాదు. మన యింటిస్థితిగతు లర్థమైన కొలఁదియు నామెయే సరిపుచ్చుకొని పోవునని నా యుద్దేశ్యము. డబ్బుగలవారి కిచ్చి చేయకపోవుట యామె తల్లిదండ్రులతప్పు. కొంతతప్పు మనదికూడ నున్నది – మన నిజస్థితిని దాచి ధనికులవలె నటించుట ! మన మానాఁడట్లు నటించి నేఁడేమొగము పెట్టుకొని యంట్లుతోము మందుము? వంట చేయుమందుము? మనము వారిని మోసగించినాము – దాని ఫలిత మనుభవింపవలె ! ఈ నాటికైనను మన నిజస్థితిని వినయముతో, సహానుభూతితో వప్పుకొనుటయే మేలు! అట్లయినచో నామె–'పోనిమ్ము! ధనములేకున్నను, మనుష్యులైనను మంచివాళ్ళు దొరికినా'రని సంతసించును. ఆమాత్రము తృప్తికూడ లేనిచో దానికెంత బాధ కలుగునో నీవే యూహింపుము ! మన మొగము చూచియే యసహ్యించుకొనవచ్చును !

తల్లి:–దాని పుట్టింటివారు వంద పర్యాయములు మన కాళ్ళచుట్టును తిరిగినారు. నేనువారివద్దకుబోయియాచింపలేదే!

కుమా :- అవును ! వారికి పిల్లవాఁడొకఁడే కావలసి వచ్చినాఁడు. మఱి మనకో ? పిల్ల, డబ్బు రెండును కావలసి వచ్చినవి.

తల్లి :-ఇంతకంటెను గొప్పధనికులే మన సంబంధము కావలెనని కాళ్ళు అఱిగిపోవునట్లు తిరిగినారు.

కుమా:-అవును ! మనము ధనికులవలె నటించితిమి గాన! నిజస్థితి తెలిసినచో తిరిగి చూచెడివారు కారు.

తల్లి:-మీ యత్తవారంత పెద్ద ధనికులాయేమి ? ఆ ప్లీడరీ కాస్త సాగుచున్నచో ధనికులే ! నీ మామగారి తండ్రి గుమాస్తాగిరి చేయుట నే నెఱుఁగుదును! అమ్మ పుట్టింటి విషయము నేనమాను దగ్గఱా పొగడుట ! వంటచేసిన తలనొప్పి వచ్చునట! పెద్దయింటిపిల్లలు బీదయింటికి వచ్చినవారున్నారు. ఆయింటికి తగినట్లే నడచుకొనుచున్నారు. కూర్చుండి తమ యదృష్టమున కేడ్చుటలేదు. అసలిది యీ యింటిని తన యిల్లని భావించినగదా !

కుమా :-నీవట్లు భావింపనిచ్చినగదా ! తెల్లవారినది మొదలు తిట్లు, మూతిముడుపులు, సాధింపులతో గూడిన కొంప సేవకమాత్రము తనదని యెట్లు భావింతును? ఇల్లనిన స్నేహము ప్రేమ, సహానుభూతి లభింపవలె ! మేనానుండి దిగినంతనే యే పిల్లయు నత్తగారిని తల్లివలె భావింపదు. అత్తగారు తన తల్లివలెనే తనను ప్రేమించినచో నామెయు నత్తగారిని తల్లివలె చూచుకొనును.

తల్లి:- బాగున్నది-ఆపుము! కడుపుమండుచున్నది! ఈ కాలపు పిల్లలే యింత! భార్యను చూచినంతనే దానికి దాసులైపోదురు. ఈ దిప్పకాయ లేమంత్రములు నేర్చుకొని వచ్చెనో! అవును! జాము ప్రొద్దెక్కువఱకు పడి నిద్రపోవుట గూడ కోడంద్రలక్షణమే! ఇట్టిదాని ముఖముగూడ చూడ రాదు.

కుమా:- నేనుగూడ నాలస్యముగనే లేచుచున్నాను గదమ్మా! మఱి నన్నెన్నఁడును తిట్టలేదేమి?

తల్లి:-నీవు ప్రతి విషయమునను నీతో వంతు లెత్తువు!

కుమా:- అది దానియెడ నన్యాయము! ఆమె యీ యింటిని తనదని భావించువఱకు నామె యీ యింటి యతిథియే! అతిథి హోదాయే యామెది! మన మతిథులను గౌరవింపవలె! వారి దోషములతో మనకు నిమిత్తములేదు.

తల్లి:-పగవారికైనను నిట్టి కోడలు వలదురానాయనా!

కుమా:- అయిన నామె యీ యింట నున్నట్లే!

తల్లి:- ఏమి? ప్రపంచమున నాడువారు కఱవైరా?

కుమా:- ఆడువారికి కఱవులేదు - కాని దేవీస్వరూపిణులు మాత్రము కఱవే!

తల్లి:-ఛీ! ఇట్టి యాడుదా?నిద్రపోయినచో బిడ్డఁడేడ్చి యేడ్చి శోషవచ్చినను కదలదు. పండువంటి బిడ్డను తీసికొని పుట్టింటికేఁగి మూఁడు నెలలకు వచ్చినది-బిడ్డఁడు సగమైనాఁడు.

కుమా:- అయిన నామె బిడ్డనిపై నున్నంత ప్రేమ నీ కామెపై లేదన్నమాట. ఇయ్యది ప్రకృతినియమమునకు విరుద్ధము. ఆమెకు మమకారములేదందువు-అదియామెదోషము. ఆమె బాధ్యత నీకేల? తన బిడ్డను తన యిష్టమువచ్చినట్లు పెంచుకొను స్వాతంత్ర్య మామెకున్నది. ఆమె నీ సలహా యడిగినచో సంతోషముతో నిమ్ము. లేనిచో మనదేమి పోయినదని యూఱకొనుము. తల్లులందరు తమ బిడ్డలను ప్రేమింతురు - ఆమెమాత్ర మెందుకు ప్రేమింపదు?

తల్లి:-కళ్ళతో నన్నియుఁ జూచుచు నోరు మూసికొని కూర్చుండవలె నన్నమాట! కొంపకు నిప్పంటుకొనఁజూచుచు నూఱకుండవలె నన్నమాట!

కుమా:- ఈ యింటిని త్వరలో పీఁడిపోవు దానవు నీవు! ఆమె యింకను కొంతకాల ముండునది. ఈ యింటిని గూర్చిన లాభనష్టముల యాలోచన మామెకే యెక్కువ యుండవలె! నేను చేయగలిగిన దేమున్నది? కోపపడగలను- కాని నామాటను లక్ష్యముసేయక మాటకుమాట సమాధాన మిచ్చినచో సాధనాంతర మేమున్నది?

తల్లి:- రెండు దినములు మాట్లాడకున్నచో నమ్మ వారు త్రోవకువచ్చును. పట్టినదెయ్యము వదలిపోవును.

కుమా:- నా కా నమ్మకము లేదు. నే నామెతో మాట్లాడకున్నచో నామెయు నాతో మాట్లాడదు. ఇంకను వేధించినచో పుట్టినింటి కేఁగును.

తల్లి :- దేవుఁడారోజు నెప్పుడు చూపునో! దీని తల దన్నిన సంబంధము తెత్తును.

కుమా:- ఆవచ్చునది దీని తలదన్ననదే కావచ్చును!

[అకస్మాత్తుగ కోడలువచ్చి నిలఁబడును. మాతాపుత్రు లిరువురు నిశ్చేష్టులగుదురు-బాంబు పడినట్లు! రూపవతి, సుకుమారి, గర్విష్టి-శాసనము చేయుటకే పుట్టినదా యన్నట్లున్నది. కపోలము లెఱ్ఱబాఱినవి-అధరములపై నివసిక్తమైన చిరునవ్వు-కండ్లలో వ్యంగ్యపూర్ణమైన పరిహాసము భాసించుచున్నది.]

తల్లి :- [తన సంకోచమును దాచుచు] నిన్నెవరు పిలువ బంపినారు ?

కోడలు:- ఏమి ? ఇచట జరుగుచున్న తమాషా చూచి నేను మాత్ర మానందింపరాదా ?

కుమా:-తల్లి కొడుకుల మధ్య నీజోక్య మనవసరము! [కోడలి ముఖముద్ర యకస్మాత్తుగ కఠోరమైపోయినది.]

కోడలు :- చాలును! కట్టిపెట్టుఁడు! తన భార్యను నిందించుచుండగా వినుచు నూరకుండువాఁడు భర్త యనిపించుకొనుటకు యోగ్యుఁడు కాఁడు-పతి ధర్మమున 'అఆ'లు గూడ నేర్వలేదన్నమాట! నా ముందు మిమ్మెవరైనను నిందించినచో-మా యమ్మయైనను సరియే!-నోరు మూసివేయుదును. మీరు మాయింటికి వచ్చినపుడు మీరు చూచితిరి గదా!- అందఱు మిమ్ము పొగడవలసినదే! చిన్నవారి నుండి పెద్దవారినఱకు నందఱు సేవకులవలె మీ వెంట తిరుగు

చుందురు. సాధ్యమైనచో మీకొలకు కొండమీది కోతినైన దింపుదురు. అందుకు ప్రతిఫలముగ నాకిచట లభించునవి సాధింపులు, దెబ్బపోటుపులు, తిట్లు! మాయింటివద్ద మీరాలస్యముగ లేచినచో నెవరేమనినారు? ఫలానావారికి నమస్కరింపలేదని, ఫలానావారికి పాదాభివందన మాచరింపలేదని, యెవరైన ననినారా? మానాయనగా రెన్నడును ఫలానావారి కాళ్లు పిసుకుమని వారి గుడ్డలు ఉతుకుమని యెన్నడుననరే? మీరిచట నా విషయమున నిట్లు ప్రవర్తింతురేమి? నేను మీ సహధర్మచారిణినై జీవనసంగినినై వచ్చితినిగాని దాసిగారాలేదు. మీరు నా నెత్తినెక్కి నన్ను నడిపించుట నే నట్లు నడచుట యనునది సహధర్మిణి పనికాదు. నా చేతనైనంతవఱకు మీతో కలిసి నా కర్తవ్యమును నిర్వహించుట నా విధి. కర్తవ్య నిర్వహణమునకు ప్రేరణ మంతరాత్మలో పుట్టవలె! దెబ్బ పోటుపులతో, సాధింపులతో కాదు! నాకు నేర్పదలచుకొనినచో తల్లివలె నేర్పవలె! అట్లయినచో నేర్చుకొందును. బలవంతముగ, నన్ను బంధించి అమృతము త్రాగింప బూనినను నేను గుటక వేయను. నే నెన్నడో యీ యింటిని నాదిగ భావించి యుందును. నాకర్తవ్యము నెన్నడో యెఱిగియుందును. సేవాశుశ్రూష లేనాడో నేర్చుకొని యుందును. కాని యిచట ప్రతిక్షణము సూదిపోట్లనాయె! 'నీవీయింటిదాసివి, నీ కీ యింటితో సంబంధము లేదు, నీవు బానిస' వన్నట్లు ప్రవర్తించుచుండనార క్తముడికిపోవును! ఏనాడో నా ప్రాణములు తీసి సుఖె వదలుదురు.

తల్లి :-వింటివా మీ దొరసానిగారి మాటలు ! ఈమె దాసిగా కాదు—రాణియైవచ్చినది ! మన మిరుపురము సెరికి సేవకులము ! మనపై శాసించుట యామెగారి పని. ఆమె కేమియు పని చెప్పరాదు-నేనే చావవలె ! నీవా మహారాణి యెదుట నోరు కదల్పలేవు — ఆమెయనిననే నీకు వణకు పుట్టును.

కుమా:-అమ్మా, శాంత భావముతో నాలోచింపుము! దాని మాటలు నేను కాకపోయిన వినువారెవరు ? నీ కా మాత్రము సానుభూతియు లేదా ? మా నాయన బ్రదికి యున్నప్పుడాయన మాత్రము నీమాట వినలేదా ? నిన్ను ప్రేమించినారా లేదా? మఱి, నేను నాభార్యమాటలు వినుటలో విచిత్రమేమున్నది? నీకేల కష్టము కలుగవలె !

తల్లి :—అయ్యో! నాయనా! నీభార్య యెదుట నన్న వమాన పఱతువా? ఇందులకేనా నిన్ను పెంచి పెద్దచేసినది ? నాకు చావు రాదాయె !

[ కన్నీరు తుడుచుకొనుచు, కోపముతో వెడలి పోవును. భార్య భర్త లిరువురు కుతూహలముతో నామెవైపు చూచుచుందురు—శీఘ్రముగ వారిలో సానుభూతి యుదయించెను. ]

భర్త:—మాతృహృదయము......

భార్య :—మాతృహృదయము కాదు—నారీ హృదయము......

భర్త :—అనగ ?

భార్య:—చివఱివఱకు పురుషుని సాయముకావలె ! ప్రేమకావలె! కాని ఆతనిపై మఱియొక స్త్రీ ప్రభావమును చూచి యీర్ష్యతో మండుచుండును.

భర్త:—ఏమిటీ పిచ్చివాగుడు ?

భార్య:—యథార్థమే !

భర్త:—నీదృష్టికోణము పూర్తిగతప్పు. ఈవిషయము నీవు 'అత్త' వైనప్పుడుగాని నీకర్థము కాదు.

భార్య:—నేను 'అత్త'ను కానే కానక్కరలేదు. పిల్ల వానికి చేతులు, కాళ్ళువచ్చినచో పెండ్లిచేసికొనును—ఇల్లు చూసికొనును—కోడలితో నాకు పనేమి ?

భర్త:—నీ పిల్లవాఁడు యోగ్యుఁడు కావలెనని, నీ కోడలు గృహలక్ష్మివలె నుండవలెనని, వారిరువురి జీవితములు సుఖముగ నుండవలెనని నీకు మాత్రము కోరికయుండదా ?

భార్య:—నేను మాత్రము తల్లినికానా ?

భర్త:—'తల్లి' 'అత్త' ఈ యిరువురికిని నంతరమేమి?

భార్య:—భూమ్యాకాశములకున్నంత! తల్లి ప్రేమించును అత్త శాసించును. ఎంత దయావతియైనను. సహనశీలయైనను సత్వగుణప్రధానురాలైనను 'అత్త' యైనంతనే యీనినఆవు పోలె గంతులు వేయును. పుత్రునిపై నెంత ప్రేమయో, కోడలిపై నంత శాసనము చలాయింపఁ జూచును. నాపై నాకును నమ్మకము లేదు—అధికారమద మెవరికుండదు ? 'అత్త'ను కాఁగాఁదనిదే నానిశ్చయము. ఆడువారి బానిస

తనము అత్తలపై నాధారపడి యున్నది. అత్తలు లేనినాఁడు ఆడుదానికి బానిసతనమే యుండదు.

భర్త:- కొంచెము సహజధోరణిలో ప్రవర్తించినచో మాయమ్మపై నీ వధికారము చలాయింపగలవని నానమ్మకము. మామాటలు వింటివా?

భార్య:- విననక్కరలేదు-వినకుండనే తెలిసికొంటిని-మామూలేగదా!-కోడలి గోల!

భర్త:- కాదు-కాదు! నీ వనుకొనినది తప్పు. మాయమ్మ స్వభావములో నేఁడు గొప్పమార్పు వచ్చినది. ఆ మార్పు అభూతపూర్వము! ఆమె తన కఠోరస్వభావమునకు తానే బాధపడినది—ప్రత్యక్షముగ కాదుగాని, ఆ ఛాయలు గోచరించినవి. నీ వాలస్యముగ లేచుచుందువనియే నేటివఱకు నామెకు నీపైకోపము. నేఁడు పెందలకడ లేచినచో నీకుజలుబు చేయునేమో యను దిగులుపట్టినది. నీ కొఱకు వేడినీరు పెట్టెద ననుచున్నది.

భార్య: (సంతోషముతో) నిజమేనా?

భర్త: అవును. నాకే యాశ్చర్యముగ నున్నది.

భార్య: అయిన నేను పెందలకడనే లేచెదను — నాకేమియు జలుబు చేయదు—కాని మీరన్నది అబద్ధము కాదుగదా?

భర్త: ఇఁక నీ యనుమానమునకు మందేమున్నది? ప్రతివానికిని తా నొనర్చిన అన్యాయముల కేనాఁడైనను దుఃఖము కలిగితీరును.

భార్య: బాగుబాగు! ఇఁక చీఁకటితో లేచెదను. పాప మామె నా కొఱకేల శ్రమపడవలె? నేనే వేడినీరు పెట్టికొందును. చేయఁదలఁచుకొనినచో చేయఁజాలని దేముండును?

భర్త: ఆమె మాటలు విన్నకొలఁది నేదియో దైవిక శక్తి యామె స్వభావమును మార్చివేసినట్లున్నది. నీ అమాయికత్వమున కెంతయో జాలిపడుచున్నది. ఇదివఱ కింటికి వచ్చిన పెద్ద ముత్తైదువులతో మాటాడదని, నమస్కరింపదని యనెడిది నేఁడు తెలిసికొనినదికాఁబోలు—ఈవయసులో నున్నవారందరిట్లే యమాయికులుగ నుందురని! లేక తన చిన్నతననే జ్ఞాపకము వచ్చినదో!—"చిన్నతనము! సింగారించుకొనుటకు, తినుటకు, ఆడుటకు ఇదేగదా సరియైన వయసు! ఈ ముసలి ముత్తైదువుల కేమి? పనియా? పాటయా? ఎప్పుడు నవ్వుచునేయుందురు. వారేమంత గొప్పవారని! వారి కాళ్ళుపట్టుకొని తిరుగుటకు?" నేటి ధోరణి యిది!

భార్య: నాకు సంతోషముతోఁ బిచ్చి యెత్తుచున్నది.

భర్త: నేనే నమ్మజాలకపోతిని. కలయా యనిపించినది.

భార్య: ఇప్పుడు త్రోవకు వచ్చినది.

భర్త: ఏదియో దైవికప్రేరణ యనుము!

భార్య: ఏమైనను నేపటినుండి సరియైన కోడలిని కావలసినదే! అలంకరించుకొనుచున్నానను విషయ మెవరికిని తెలియరాదు. సినిమా వారమున కొకరోజు చాలును. పెద్దవాళ్ళకు నమస్కరించినంత మాత్రమున పోయిన దేమి? ఆశీర్వదింతురు—మంచిదానవనందురు!

భర్త:- ఆమె సినిమా పేరెత్తనేలేదు.

భార్య:- సినిమా లనిన మీకిష్టము. కాని యిక నుండి మీరుగూడ వెళ్లుటకు వీలులేదు.

భర్త:— కాని నీవు చదువుకొనినదానవు. గొప్ప వంశమున పుట్టినదానవు - అజ్ఞానులైన ముసలివాళ్ళకు నమస్కరించుట, పాదాభివందన మాచరించుట బాగుండదు.

భార్య:— చదువుకొనుటకు ప్రయోజన మితరులను చులకనగ చూచుటయా? వృద్ధు లెంత మూర్ఖులైననేమి? లోకానుభవ ముండునుగదా! వినయవిధేయతలవలననే కుల గౌరవము వృద్ధియగును గాని తలబిరుసుదనమువలనగాదు.

భర్త:—ఇంతలో నామె యిట్లు మారిపోయినదేమా యని నా కాశ్చర్యముగ నున్నది. కోడండ్రు అత్తలకు కాళ్లు నత్తుట, గుడ్డలుదుకుట యనిన గిట్టకున్నది. కోడలు దాసి కాదుగదా 'అత్తకాళ్లు ఒత్తుటకు'- అనును.

భార్య :— నామీద ఒట్టు ?

భర్త:—అవును. నిజమే! కాగా నీచేత వంటకూడ చేయింపదట. పొగవలన తలనొప్పి వచ్చుచో నామెను బాధించుటేల? వంటమనిషిని పెట్టుమనుచున్నది.

భార్య:—(సంతోషమును పట్టజాలక) ఆకాశమున కెగిరిపోవుచున్నాను. ఇట్టి యత్తగారి చరణోదకమువలన పవిత్రుల మగుదుము! మఱి మీరడుగ లేదా? - 'నేటివఱకు నామె నెందులకు సేధించినా'వని ?

భర్త :- అడుగక ఊరకొందునా ? 'గ్రుడ్డిదాననై తిని, ఇన్ని దినములనుండియు నేను వండితినిగదా! ఆమె యెందులకు వండరాదు ?' అను భావముతో నన్నదట. తాను నిర్ధనుని కుమార్తెయని, నీవు సంపన్నుని బిడ్డనని తెలిసికొనినదట.

భార్య:- పాపము! ఆమె మనసు చాల మంచిది.

భర్త:- ఏమియు లేదు! కొంచెము పూర్వపు పద్ధతులు! అంతే !

భార్య:- వాటివలన బాధలేదు. మనము పుట్టి పెరిగిన వాతావరణమును ఒక్కసారిగ మార్చలేము. తాను పుట్టి పెరిగిన ఆచారవ్యవహారములను వదలివేయుట కష్టమే! ఆమెయేకాదు - ఎవరును చేయజాలరాపని! ఆమె నిజముగ నౌదార్యవతియే! మీరు వంటమనిషివి పిలువవద్దు. డబ్బుకు బాధపడవలె! జీతము పెరిగినప్పుడు చూచుకొనవచ్చును. నేనే వండుదును. నలుగురు ముగ్గురికి వండుటయు నొక వంటయేనా నావలన నీక నామెకు సుఖమేమున్నది? నాకన్నియు తెలియును. కాని, నాపై నధికారము చలాయింప జూచునప్పుడే నాకు కోపము వచ్చును.

భర్త :- నీవు రాత్రిపూట వెళ్ళి యామె పాదము లొత్తుటమాత్రము నాకు నచ్చదు.

భార్య:- నచ్చుటకేమున్నది? నాపై నామెకింత యభిమాన మున్నపుడు నేనామాత్రము చేయుట లెక్కలోనిదా? ఆమె పాదము లొత్తినచో నాకై ప్రాణములే యర్పించును.

కొడుకు కోడండ్రవలన సుఖము పొందవలెనుగదా! పెద్దలను సేవించిన తప్పేమున్నది ? వాళ్ళు మనపై నధికారము చలా యించినచో కోపము వచ్చును. ఆమె నాచేత పాదము లొత్తించుకొనునా? వట్టిది—నేనందుకు సిద్ధపడినచో కీర్తి వచ్చును.

భర్త:- ఆమెకు నీ ఖర్చు లిదివఱకువలె కోపమును కలిగించుటలేదు. ఇకనుండి డబ్బు నీ చేతి కిమ్మనినది.

భార్య:- కోపము వచ్చి కాదుకదా !

భర్త:- కాదు ! కాదు ! ప్రేమతో నన్నది. తన చేతిలో నుండుటవలన నీకేమైన నిబ్బంది కలుగుచున్న దేమో యని యామె భయము. నీకామె నడుగుటకు సిగ్గుగనుండును. అందుచే నీ యవసరములను తగ్గించుకొనవలసి వచ్చును !

భార్య:- వలదుబాబూ! నాకిగొడవవద్దు! మీరాబజే కొద్ది. త్వరగా ఖర్చయిపోయినచో నెల గడుచుటయే కష్ట మగును. కొద్దిలో జాగ్రత్తగా గడపుట ఆమెకే తెలియును. నా కేమంత పెద్ద యవసరము లున్నవి? ఆమెను ఏడిపించు టకే మధ్య మధ్య డబ్బు కావలెనని యడిగెడిదానను. నా వద్ద నొక వందయో, యేబదియో నెప్పుడు నుండును. నాన్నగారి వద్దనుండి యుత్తరము వచ్చునప్పుడు కవరులో నైదో, పదియో యుండనే యుండును. కాని నేను ఖర్చు తగ్గించుకొనవలె! నాన్నగారు మాత్ర మెంత కాలమని పంపుదురు? ఆయనపై నిట్టి పన్ను విధింపు మాత్ర మేమంత మంచిది ?

భర్త:- చూచితివమ్మా! అమ్మ నిన్నెంత ప్రేమించునో!

భార్య :- మీరును చూడుడు—నే నామె కెంత సేవచేతునో!

భర్త:- కాని ప్రారంభించిన దామెయే!

భార్య :- భావమునందు మాత్రమే! ఆచరణలో ప్రారంభము నాదే! వంట చేయవలె - వేళయైనది. నేను వెళ్లుచున్నాను. నేఁడేమైన ప్రత్యేకమైన పిండివంటలు కావలెనా ?

భర్త:- నీ చేతి మామూలు భోజనమే మృష్టాన్నమగును.

భార్య:- మీరు మఱియు కొంటెవారై పోవుచున్నారు.

# గొప్పయింటిపిల్ల

వేణీమాధవసింహుఁడు గౌరీపురమునకు జమీందారు. ఆతని పితామహుఁడు చాల సంపన్నుఁడు. గ్రామమందలి పెద్ద చెఱువు, గుడి—(వాటికి మరమ్మతుచేయుట కూడ నేఁడు కష్టమే!)—ఆతని కీర్తిస్తంభములవలె నున్నవి. ఆ గుమ్మము ముందు ఏనుఁగులుండెడివని యందురు—కాని నేఁడాస్థానమున ముసలి గేదె మాత్రమున్నది—అస్థి పంజరముతప్ప నేమియు లేదు; బహుశః పాలుమాత్రము బాగుగనిచ్చుచుండి యుండ వచ్చును—కారణ మేమన నెవరో యొకరు చెంబుపుచ్చుకొని దాని ప్రాణములు తీయుచునే యుందురు. వేణీ మాధవుఁడు తనయాస్తిలో సగభాగము ప్లీడర్లకే ధారవోసినాఁడు. ప్రస్తుత మాతని యాదాయము సంవత్సరమునకొక వెయ్యిరూపాయలకు మించదు. ఆతని కిరువురు కుమారులు. పెద్దవాని పేరు శ్రీకంఠసింహుఁడు—కొన్ని దశాబ్దముల పరిశ్రమచేసి ప్రయత్నించి బి. యే. పట్టమునందినాఁడు. ఇప్పుడొక ఆఫీసులో నుద్యోగము. చిన్నవాఁడు బిహారీసింహుఁడు—బొద్దైనశరీరము! నిండుమొగము! విశాలమైన వక్షము! ఉదయమే రెండు సేర్ల గేదెపాలు త్రాగివేయును. శ్రీకంఠుని స్థితి యిందులకు విపరీతము. కనుల కింపైన ఈ గుణములను బి. యే. అను రెండక్షరములకు కంకిత మొనర్చినాఁడు. ఈ రెండక్షరములే యాతని శరీరమును కృశింప జేసినవి—ముఖమును కాంతిహీన మొనర్చినవి. అందువలననే వైద్యగ్రంథములపైన నాతని కభి

రుచి మెండు. ఆయుర్వేదౌషధము లనిన నెక్కువ నమ్మకము. ఉదయము సాయంత్రము నాతని గదియందు కల్వముల కర్ణ మధురనాదము విన్పించును. లాహోరు, కలకత్తాలోని వైద్యులతో నెల్లప్పుడు నుత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండును.

శ్రీకంఠుడి యింగ్లీషు పట్టమును పొందినను, ఇంగ్లీషు వారి సామాజికాచార విచారములనిన మోజులేదు — వాటిని నిందించుచుండును గూడను. అందువలననే గ్రామములో నాతనికి గౌరవమెక్కువ. దశరాత్రులందు రామలీలోత్సవము లందుపాల్గొనును. నాటకములలో నేదేనొకపాత్ర నభినయించును. గౌరీపురమున రామలీలోత్సవములకు జన్మదాతయే యతఁడు! ప్రాచీన హైందవసభ్యతను స్తుతించుట యాతని ధార్మికత్వమునందలి ప్రధానాంగము. సమిష్టి కుటుంబములనిన నెక్కువయిష్టము. ఒక కుటుంబమున కలసి మెలసి యుండుటకు సామాన్యముగ స్త్రీలిచ్ఛగింపకపోవుట, దేశమునకు జాతికిగూడ హానికరమని యాతని యుద్దేశ్యము. అందువలననే నా గ్రామమందలి స్త్రీలాతనిని నిందింతురు. కొంతమంది యాతనిని శత్రువుగ నెంచువారును (స్త్రీలలో) లేకపోలేదు. ఈవిషయమున నాతనికి భార్యతోడనే యభిప్రాయభేదమున్నది. అత్తమామలతో, నాఁడుబిడ్డలతో, మఱఁదులతో పడనందువలన కాదు—ఈర్ష్యవలనను కాదు—ఎంత సరిపెట్టుకొనుచున్నను జీవించుట కష్టమైపోయినప్పుడు నిత్యము పోట్లాడుటకంటె ఎవరి సోలెడు వారు విడిగ కాచుకొని త్రాగుట మంచిదని యామె యభిప్రాయము.

ఆనంది యభిజాత్యము గలది. ఆమెతండ్రి యొకచిన్న యాస్థానమున నిలాకాదారు. విశాలమైన భవనము, ఒక యేనుఁగు, మూడు కుక్కలు, వేటపక్షులు, గాజుచిమ్నీలు, ఆనరరీ మాజిస్ట్రేటు పదవి, ఋణము—(ప్రతిష్ఠితుఁడైన ఇలాకాదారుని కుండవలసిన లక్షణములు) — అన్నియు నున్నవి. పేరు భూపసింహుఁడు. ఉదారచిత్తుఁడు — ప్రతిభాసంపన్నుఁడు! కాని దురదృష్టము—పురుష సంతానము లేదు. ఏడుగురు ఆఁడపిల్లలు పుట్టినారు. భగవంతుని దయవలన నందరు జీవించియున్నారు. ఆ మొదటి యుద్రేకములో — హెచ్చుగా—వెనుక ముందు చూడక ముగ్గురి వివాహములు చేసివేసినాఁడు. కాని, పదునైదు వేల ఋణము తేలిన తరువాత కండ్లు తెఱచినాఁడు — కొంచెము చేయి వెనుకాడినది. ఆనంది నాల్గవపిల్ల. ఆమె తన అప్పసెల్లెండ్రందఱి కంటెను రూపవతి—గుణవతి. అందువలననే తండ్రి కామెయనిన మిక్కిలి ప్రేమ. సుందరమైన సంతానమును తల్లిదండ్రులు గూడ నెక్కువ ప్రేమింతురేమో! భూపసింహుఁడు ధార్మిక సంకటములోఁ బడినాఁడు—ఈపిల్ల వివాహమెట్లు? అని. ఋణము పెరుగుట యిష్టము లేదు—తాను దరిద్రుఁడ ననుకొనుటకును నిష్టములేదు. ఒకనాఁడు శ్రీకంఠసింహుఁ డాతని వద్ద కేదో చందాకై వచ్చినాఁడు—నాగరీ ప్రచారిణీసభకు చందాకై కాఁబోలును! భూపసింహుని కాతని స్వభావము నచ్చినది. మహోవైభవోపేతముగ నానందినిచ్చి యాతనికి వివాహ మొనరించినాఁడు.

ఆనంది యత్తవారింటికి వచ్చినది. ఇచటి పద్ధతు లన్నియుఁ గ్రొత్తగ నున్నవి. తనకు చిన్నతనము నుండియు నలవాటైన వైభవోల్లాసము లిచట లేవు. ఏనుఁగులు గుఱ్ఱములు లేకపోయిన పోవుగాక! అందమైన పక్షులైనను లేవు. చక్కని పట్టుపిట్టలు వెంట తెచ్చినది — కాని విహరించుట కుద్యానమేది? ఇంటికి కిటికీలు లేవు, నేలపై తివాచీలు లేవు, గోడకు పటములు లేవు. మామూలు గ్రామీణుని యింటి వలె నున్నది. కాని యానంది కొలఁదిదినములలోనే యీ పరిస్థితుల కలవాటు పడినది. తానెన్నఁడు విలాస సామగ్రిని చూచియే యెఱుఁగ నట్లున్న దామె.

## 2

**ఒక**నాఁడు మధ్యాహ్నము బిహారీసింహుఁడు రెండు పిట్టలను తీసికొనివచ్చి వదినగారితో ననినాఁడు 'త్వరగా వండుము! ఆకలి వేయుచున్నది.'

ఆనంది అప్పటికే వంటచేసి యాతనికై ప్రతీక్షించు చున్నది. ఇప్పుడు వానిని క్రొత్తకూర వండ మొదలిడినది. ముంతలో చూచినది — నెయ్యి పావటాకు కంటె నెక్కువ లేదు. గొప్పయింటిపిల్ల — పొదుపు తెలియదు. ఆ నేతి నంతను మాంసములో వేసినది. బిహారీసింహుఁడు భోజనమునకు కూర్చుండెను — పప్పులోనికి నేయి లేదు; అడిగినాఁడు — "పప్పులోనికి నేయి వేయలేదేమి?" అని.

ఆనంది యన్నది- "ఉన్నదేదో మాంసములో వేసినాను."

బిహారీ బిగ్గరగా ననినాఁడు- "మొన్న నేగదా నేయి తెచ్చినది! రెండు రోజులకే వైపోయినదా?"

ఆనంది సమాధాన మిచ్చినది - "నేటికి ఒక నవటాకు మాత్రమే దానిలో నున్నది. ఆ కొంచెము కూరలో పడినది."

ఎండిన పుల్ల శీఘ్రముగ నుండునట్లు, ఆకలి గొన్న వాఁడు స్వల్ప విషయమునకైనను కోపగించును. బిహారీకి వదినగారి మాటలు కోపకారణములైనవి—"పుట్టినింట నేతి కాలువలు ప్రవహించుచున్నవి గాఁబోలును!"

ఆడది తిట్లు సహింపగలదు. దెబ్బలుగూడ సహింపగలదు. కాని పుట్టినింటివారిని నిందించుటను మాత్రము సహింపలేదు. ఆనంది ముఖము త్రిప్పి యన్నది—"ఏనుగు చచ్చినను వేయి వరహాలే! ఈమాత్రపు నెయ్యి మా యింట పనివాళ్లే త్రాగుదురు" అని.

బిహారీసింహుఁడు మండిపోయినాఁడు. పళ్లెము విసరి కొట్టినాఁడు-"నాలుక కోసివేయ బుద్ధిపుట్టుచున్నది."

ఆనందికిఁ గూడ కోపము వచ్చినది - ముఖమెఱ్ఱబాఱినది - అన్నది—"ఆయన ఉన్నచో నేఁడుసంగతి తెలిసెడిది."

నిరక్షరాస్యుఁడైన, మూర్ఖుఁడైన, బిహారీ సహింపలేకపోయినాఁడు. ఆతని భార్య సామాన్య గృహస్థుని కుమార్తె. తన యిష్టము వచ్చినప్పుడామెకు దేహశుద్ధి చేయుచుండును.

వెంటనే పాదుక నొకదానిని తీసి ఆనందిపైకి విసరినాఁడు – "ఎవనిని చూచుకొని గర్వించుచున్నావో వానికిగూడ నా తడాఖా చూపింతును! - జాగ్రత్త!"

ఆనంది చేతితో నా పాదుక నాపినది - నెత్తికి తగుల లేదు. కాని వ్రేలికి మాత్రము దెబ్బతగిలినది. క్రోధముతో - గాలికి చలించు నాకువలె - వణకుచు గదిలోని కేఁగినది. ఆడుదాని బలము, సాహసము, మానమర్యాదలు భర్తవరకే! స్త్రీ తనభర్తయొక్క బలమును పురుషత్వమును జూచియే గర్వించును. ఆనంది యా యవమానము నప్పటికెట్లో మ్రింగి యూరకొన్నది.

## 3

శ్రీకంఠసింహుఁడు ప్రతి శనివారము నింటికి వచ్చు చుండును. ఆనంది రెండు దినములవఱకు కోపసదనమున నున్నది. భోజనము చేయలేదు. భర్తకొఱకు నిరీక్షించు చున్నది. చివఱకు శనివారమునాటి సాయంకాలమున కాతఁడు మామూలుగ నింటికి వచ్చినాఁడు. బయట కూర్చుండి కొంత సేపు దేశకాల సమాచారములు, క్రొత్త వ్యాజ్యములను గూర్చియు మాట్లాడినాఁడు. ఈ కబుర్లు పదిగంటల వఱకు సాగుచునే యున్నవి. గ్రామీణులకీ వార్తాలాపములున్నచో తిండితిప్పలుగూడ నక్కరలేదు. శ్రీకంఠునకు వారిని తప్పించు కొనుటయే కష్టమయ్యెను. ఈ రెండుమూడు గంటలకాలమును

నానంది యతికష్టముగ గడపినది. భోజనము వేళ యైనది. పంచాయతీ ప్రారంభమైనది. ఒంటరిగ జూచి బిహారీ యని నాఁడు–"అన్నయ్యా! కోంచెము జాగ్రత్తగ నోరు దగ్గర పెట్టుకొని మాట్లాడుమని వదినతో చెప్పుము! లేనిచో నేదియో యనర్థము తప్పదు!"

వేణీ మాధవుఁడు కుమారుని పక్షమున సాక్ష్యమిచ్చి నాఁడు– "ఆఁడుపిల్లలు అందును కోడండ్రు – మగవారిని నీవెంతయనిన నీవెంతయనుట మంచిదికాదు."

బిహారీసింహుఁడనినాఁడు "ఆమె గొప్పయింటి బిడ్డ కావచ్చును! మనము మాత్రము తక్కువవారమా?"

శ్రీకంఠుఁడు వ్యథితస్వరముతో ననినాఁడు – "అసలు విషయమేమి?"

బిహారీ యనినాఁడు ఏమియులేదు. వ్యర్థముగ పోట్లాటకు సిద్ధమగును. పుట్టినింటివారిముందు మనమామెదృష్టిలో పనికిమాలినవారివలె గన్పట్టుచున్నాము. మనలను లెక్క చేయదు."

భోజనమైన పిమ్మట శ్రీకంఠుఁడు ఆనందివద్ద కేఁగి నాఁడు. ఆమె కూర్చుండి యున్నది. శ్రీకంఠుఁడు కొంచెము తీక్ష్ణముగనే యున్నాఁడు. ఆనంది యడిగినది "మనసు బాగుగానున్నదా?"

"బాగుగనే యున్నది. కాని నీవేదో యింటిలో నుపద్రవము తెచ్చి పెట్టినావే!"

ఆనంది కోపముతో కనుబొమలు ముడిచినది. శరీర ముడికిపోవుచున్నది. "మీతో చెప్పినవాఁడెవఁడో దగ్గఱకు వచ్చినచో మొగము బ్రద్దలుకొట్టుదును" అన్నది.

శ్రీకంఠుఁడనినాఁడు "ఎందులకంత కోపము? విషయ మేమో చెప్పుము!"

"ఏమని చెప్పుదును. నాకర్మమిట్లు కాలినది. లేనిచో నొక మూర్ఖుఁడు, పొట్టపొడిచిన నక్షరముముక్క లేనివాఁడు, జవానుపనికైనను కొరగానివాఁడు పాదుకతో నన్నుఁగొట్టి పలుకుచుండునా?"

"ఏమిజరిగినదో సరిగ జెప్పుము! నాకు విషయము తెలియవలెనుగదా! నాకేమియు నర్థము కాలేదు."

"మొన్న మీ ముద్దుతమ్ముఁడు మాంసపుకూర వండ మనినాఁడు. గిన్నెలో నెయ్యి నవటాకుకంటె నెక్కువలేదు. ఉన్నదంతయు నేను కూరలో వేసినాను. భోజనమునకు కూర్చుండి 'పప్పులోనికి నెయ్యియేది?' అని యడిగినాఁడు. ఇంకేమున్నది? ఇఁక నా పుట్టింటివారిమీఁద పడినాఁడు. నాకు కోపమువచ్చి యనినాను 'మాపుట్టింట నీ మాత్రపు నెయ్యి పనివాళ్ళే త్రాగుదురు. ఎవరికిని నింత యజపట్టదు' అని. ఈ మాట కాదుర్మార్గుఁడు పాదుక విసరికొట్టినాఁడు. చేతితో నాపకున్నచో తలబ్రద్దలయ్యెడిది. నిజమో అబద్ధమో ఆతనినే యడుగుఁడు!"

శ్రీకంఠుని కనులెఱ్ఱబాఱినవి. అనినాఁడు "ఇంతవఱకు వచ్చినదా వీని సాహసము?"

ఆనంది స్త్రీస్వభావానుకూలముగ నేడ్వసాగినది- కన్నీరు వారి తెప్పలక్రిందనే యుండును గదా ! శ్రీకంఠుఁడు శాంత స్వభావుఁడు—ధైర్యశాలి. ఎప్పుడో గాని యాతనికిఁ గోపము రాదు. కాని స్త్రీల కన్నీరు పురుషుని క్రోధాగ్నిని ప్రజ్వలింపజేయుట కాజ్యమువలె పనిచేయును. తెల్లవారులు నాతనికి నిద్రపట్టలేదు—ఉద్విగ్నతవలన కునుకు రాలేదు. ఉదయమే తండ్రివద్ద కేఁగెను. అనినాఁడు—"నాన్నా! ఇఁక నే నీ యింటిలో నుండజాలను" అని.

తన మిత్రులెందఱో యీ విధముగ నన్నప్పుడు శ్రీకంఠుఁడు వారిని వారించినాఁడు. కాని దురదృష్టము ! తానే యిట్టిమాట యనవలసి వచ్చినది. ఇతరుల కుపదేశము చేయుటెంత సులభము !

వేణీమాధవుఁ డులికిపడి యడిగినాఁడు "కారణము?"

"నాగౌరవాగౌరవములను గుఱించి గూడ నాలోచించు కొనవలెను గాబట్టి ! ఈ యింట నన్యాయము, మొండితనము పెఱిగిపోవు చున్నది. పెద్దవారిని గౌరవింప వలసినవారే యెదురుతిరుగుచున్నారు. నేనొకచోట నౌకరును—ఇంటివద్ద నుండుటకు వీలుపడదు - ఇచట నాభార్యపై పాదుకలు-చెప్పులు విసరుచుందురు. మాటదైన చో నెట్లో సహింపవచ్చును — ఒకటికి రెండనవచ్చును. మామీద చెప్పులు విసరుచుండగా నోరు మూసికొని పడియుండుట అసంభవము !"

వేణీమాధవుఁడు సమాధానము చెప్పలేక పోయి నాఁడు. శ్రీకంఠుఁడెల్లప్పుడు తండ్రిని గౌరవించును. నేఁడా తని రూపముఁజూచి తండ్రి పెదవి కదల్పలేక పోవుచున్నాడు. అతి కష్టముపై-"నాయనా! నీవు బుద్ధిమంతుడవై యుండియు నిట్లనుచున్నావేమి? ఆడువారిట్లే సంసారములను నాశన మొనర్తురు. వాళ్ళను నెత్తికెక్కించుకొనుట మంచిదికాదు." అనినాఁడు.

"నాన్నా! ఆవిషయము నే నెఱుఁగుదును. తమ దయవలన నేనంత మూర్ఖుఁడనుకాను. మీరెఱుఁగుదురు—ఈవిధముగ విచ్ఛిన్నమైపోనున్న సంసారముల నెన్నిటిని నేను కుదుట బడవేసితినో! కాని, భగవానుని ముందు నాభార్య గౌరవమునకు బాధ్యుఁడను నేను. ఆమెయెడ నిట్టి పాశవిక వ్యవహారమును నేను సహింపలేను. బిహారీని నేను శిక్షింప కుండుటే పదివేలనుకొనుఁడు."

వేణీమాధవునకు గూడ కొంచెము వేడి యెక్కినది- "బిహారీ నీ తమ్ముఁడు. వానివలన పొరపాటు జరిగినచో వాని చెవి పట్టుకొనుము. కాని......"

శ్రీకంఠుఁడు — "బిహారీని నాసోదరుఁడని నేను భావింపలేను."

"ఆఁడుదానిమాట వినియా?"

"కాదు—వాని క్రూరత్వము, అవివేకము - కారణ ముగ!"

ఇరువురును కొంతవడి మాటాడలేదు. తండ్రి కుమారుని కోపమును శాంతింపజేయ నెంచుచున్నాఁడు — కాని బిహారీ తప్పుపని చేసినాఁడని మాత్రమంగీకరింపఁడు. అదే సమయమున గ్రామీణులు కొందరు హుక్కా వంకపెట్టుకొని వచ్చిచేరినారు. శ్రీకంఠుఁడు భార్యపక్షము వహించి తండ్రితో పోట్లాటకు సిద్ధమైనాఁడని విని చుట్టుప్రక్కల స్త్రీలు చాల సంతసించిరి. అ సంసారపు నీతి నియమములఁజూచి, సుఖమును జూచి యోర్వలేని వారెందఱో యా గ్రామమున నున్నారు. శ్రీకంఠుఁడు తన తండ్రిమాట కెదురు చెప్పఁడు—కాన అతఁడు దద్దమ్మయని వారి యభిప్రాయము. చదువుకొనినాఁడు—కాని పుస్తకములోని పురుగు! వేణీమాధవుఁడాతని సలహాలేనిది యేపనియు జేయఁడు-వట్టి మూర్ఖుఁడు! ఈమహాపురుషుల వాంఛ నేటి కీడేరినది. హుక్కా కొఱకొకఁడు, శిస్తురశీదు చూపించు వంకతో నొకఁడు వచ్చినారు. వేణీమాధవుఁడనుభవజ్ఞుఁడు. వీరి యుద్దేశ్యమును కనిపెట్టినాఁడు-ఏమైనను సరే, ఈ మూర్ఖులు నవ్వుట కనకాశ మీయరాదని నిశ్చయించుకొనినాఁడు. మృదువుగ ననినాఁడు—నాయనా! నీవు చెప్పినది కాదనను! నీయిష్టము వచ్చినట్లు చేయుము. చిన్నవాఁడు తప్పేచేసినాఁడు."

అనుభవరహితుఁడైన అలహాబాదు పట్టభద్రుఁడు తండ్రి మాటను గ్రహింపలేకపోయినాఁడు. వాగ్వర్ధనీ సభలలో తన మాటనే పట్టుకొని వ్రేలాడుట యాతనికలవాటు-ఈ సమయస్ఫూర్తులాతనికిఁ దెలియవు. తండ్రి యే యుద్దేశ్య

ముతో నీమాట యనినాఁడో యాతనికి బోధపడలేదు. అని నాఁడు–"నేను బిహారీతోపాటు ఈయింటిలో నుండజాలను."

వేణీమాధవుఁడు — "నాయనా! బుద్ధిమంతులు మూర్ఖుల విషయమై పట్టించుకొనరు. వాఁడేమియు తెలియని మూర్ఖుఁడు. వాఁడు తప్పుచేసినప్పుడు నీవు పెద్దవాఁడవై వానిని క్షమింపనలె!"

"వాఁడొనర్చిన యీ దుర్మార్గమును నేను సహింపజాలను. వాఁడో లేక నేనో—ఎవరో యొకరే యీయింటిలో నుండవలె. వానిపై మీకెక్కువ ప్రేమయున్నచో నాకు సెలవిండు. నాబ్రదుకు నేను బ్రదుకుదును. నేనే యుండవలెనని యున్నచో వానినిపొమ్మనుఁడు.ఇదియే నాచివరినిశ్చయము!"

బిహారీసింహుఁడు గుమ్మము ప్రక్కన నిలువబడియన్నగారి మాటలు వినుచున్నాఁడు. అన్నగారి నాతడెంతయో యాదరించును. శ్రీకంఠుని యెదుట మంచముపైఁ గూర్చుండుటకుఁగూడ నెన్నఁడును సాహసింపఁడు. తండ్రినిగూడ నింత గౌరవింపఁడు. అన్నగారికిగూడ తమ్మునిపై హృదయపూర్వకమైన ప్రేమమున్నది అతఁడెన్నఁడును తమ్ముని కోపపడి యెఱుఁగఁడు. అలహాబాదునుండి వచ్చినప్పుడు తమ్మునికొఱ కేదియో యొకటి తెచ్చుచుండును. ఆతని వ్యాయామోపకరణములన్నియు నన్నగారు చేయించినవే! గడచిన సంవత్సరము నాగపంచమినాఁడు తన తమ్ముఁడు గొప్ప వస్తాదును చిత్తొనర్చినపుడు శ్రీకంఠుఁడు గోదాలోనే యాతనిని కౌగలించుకొనెను—ఐదు రూపాయలు బహుమతి గూడ

నిచ్చెను. అట్టి యన్నగారి నోటివెంట నిట్టి హృదయ విదారకమైన మాటలు వినినంతనే బిహారీకి గ్లానిజనించినది- వెక్కి- వెక్కి- యేడ్వసాగినాఁడు. ఆతఁడు తానొనర్చిన దౌష్ట్యమునకు పశ్చాత్తప్తుఁడగుచున్నాడు - సందేహము లేదు. అన్నగారు రేపు వచ్చుననగా నాతనిగుండె వేగముగ కొట్టుకొన నారంభించినది. అన్నగా రేమనునో! ఆతని యెదుటి కేఁగుట యెట్లు? అన్నగారితో మాట్లాడు టెట్లు? కన్నెత్తియన్నయ్యను చూచు టెట్లు? అన్నగారు తనను పిలిచి హితోపదేశ మొనరించు ననుకొనినాఁడు. అందుకు విరుద్ధముగ నేఁ డన్నగారు నిర్దయుఁడైనాఁడు. తాను మూర్ఖుఁడే! కాని అన్నయ్య మాత్రము తన యెడల నన్యాయ మొనరించుచున్న ట్లాతని హృదయము ఘోషించుచున్నది. అన్నగారు తననుచాటుకు పిలిచి నాలుగు చీవాట్లు పెట్టినచో - అంతేకాదు - నాలుగు లెంపకాయలు వేసి యున్నచో తన కింతటి దుఃఖము కలిగియుండెడిది కాదు. కాని అన్నగారు-'నేను వాని ముఖము చూడను,' అనుట బిహారీ సహింపలేక పోయినాఁడు. అతఁడేడ్చుచు నింటిలోని కేతెంచినాఁడు. గదిలోని కేఁగి వస్త్రములు ధరించినాఁడు, కన్నీరు తుడ్చికొనినాఁడు. గుమ్మమువద్ద కేఁగి వదినతో నని నాఁడు-"వదినా! అన్నయ్య నాతోగూడ నీ యింటిలో నుండ కూడ దనుకొనినాఁడు. నా ముఖము చూచుటకైన నిష్టము లేదట. నేనే వెడలిపోవుచున్నాను. ఇక అన్నయ్యకు ముఖము చూపను. తప్పు చేసితిని - క్షమింపుము!"

ఇట్లనుచుండగా డగ్గుత్తిక నొందరినది.

## 4

సరిగ బిహారీ తలవంచుకొని ఆనంది యున్న గది గుమ్మమువద్ద నిలబడియున్న సమయముననే కనుసైగజేసి శ్రీకంఠుడు వచ్చినాడు - నిలబడియున్న తమ్ముని జూచి ముఖము ప్రక్కకు త్రిప్పుకొనినాడు. తొలగి ప్రక్కకు పోయినాడు ఆతనిపొడయే గిట్టనట్లు!

ఆనంది బిహారీపై ఫిర్యాదు చేసినది-కాని యిప్పుడామె పశ్చాత్తాప పడుచున్నది. స్వతస్సిద్ధముగ నామె దయావతి. ఆమె యీ విషయ మింతవఱకు వచ్చునని తలచలేదు. 'ఇంత కోపిష్ఠి యైనారేమి?' అని భర్తపైననే విసుగుకొను చున్నది మనసులో! మఱియొక భయమామెను పట్టుకొని నది- భర్తవచ్చి అలహాబాదునకు ప్రయాణము కమ్మనిన చో నేమిచేయవలె? ఈస్థితిలో నున్న యామెవద్దకు బిహారీవచ్చి- "నేను వెళ్లుచున్నాను. తప్పుచేసితిని. క్షమింపుము!" అని నంతనే యేమాత్రమైన కోపము మిగిలియున్నచో నదియు మాయమైపోయినది. ఆమె కేడుపు వచ్చినది. మనోమాలి న్యమును కడిగివేయుటకు కన్నీటిని మించిన సాధనము లేదు.

శ్రీకంఠునిజూచి యానంది యన్నది-"మీ తమ్ముడు బయట నిలబడి యేడ్చుచున్నాడు."

"అయిన నన్నేమి చేయమందువు?"

"లోనికి పిలవండి! నాముఖము మండిపోను! - ఇది యొక పోట్లాట తెచ్చిపెట్టినాను."

"నేను పిలవను."

"తరువాత పశ్చాత్తాప పడవలసివచ్చును. పాప మాతఁడు సిగ్గుపడుచున్నాఁడు! ఎచటికైనను లేచిపోవునేమో!"

శ్రీకంఠుఁడు లేవలేదు. ఇంతలో మఱల బిహారీ యని నాఁడు—"వదినా! అన్నయ్యకు నా నమస్కారములని చెప్పుము! అన్నయ్య నా ముఖము చూడదలఁచలేదు—నేనును నా మొగము చూపను."

ఈ మాటయని బిహారీ యచటినుండి బయలుదేరి నాఁడు. ఆనందియే గదిలోనుండి బయటకేతెంచి యాతని చేయి పట్టుకొని యాపినది. బిహారీ వెనుకకు తిరిగి కన్నీరు కార్చుచు ననినాఁడు "నన్ను పోనిమ్ము!"

"ఎక్కడికి పోదువు?"

"నా ముఖమెవరికిని కనపట్టని చోటుకు—"

"నేను పోనీయను."

"నేను మీతోఁగూడి యుండుటకుఁ దగినవాఁడను కాను."

"నామీఁద ఒట్టు! ఒక్క అడుగిచటినుండి ముందుకు వేయవద్దు!"

"ఏమైనను సరియే! అన్నయ్య హృదయము నా యెడ పూర్వమువలె స్వచ్ఛమైననేగాని నే నీ యింట క్షణమైనను నుండను."

"భగవంతుని సాక్షిగ చెప్పుచున్నాను—నీ మీఁద నా మనసులో నెట్టి మాలిన్యమును లేదు." అన్నది ఆనంది.

ఈ దృశ్యముతో శ్రీకంఠుని హృదయము నీరై పోయినది. బయటకేతెంచి బిహారీని కౌగలించుకొనినాఁడు; అన్నదమ్ము లిరువురును వెక్కి వెక్కి యేడ్చినారు కొంతతడవు. బిహారీ యనినాఁడు—"ఇకనుండి యెన్నఁడు 'నీ ముఖమును చూడను' అని మాత్రమనవద్దు! ఆమాట తప్ప మీ రేశిక్ష విధించినను నా కిష్టమే!"

శ్రీకంఠుఁడు గద్గదుఁడై యనినాఁడు "బాబూ! ఈ విషయము మఱచిపోమ్ము! అట్టి దుర్ఘటనలు రాకుండ భగవానుఁడు కాపాడుగాక!"

వేణీమాధవుఁడు బయటినుండి వచ్చుచు సోదరు లిరువురిని గాంచి యానంద పులకితుఁడైనాఁడు. అన్నాఁడు—"'గొప్పయింటి పిల్లలిట్లే యుందురు. నాశనమైపోవనున్న కాపురములను బాగుచేయుదురు'."

గ్రామమున నీవృత్తాంతమును వినిన వారందఱును ఆనంది చూపిన ఔదార్యమును ప్రశంసించిరి "గొప్పయింటి పిల్ల లిట్లే యుందురు!" అని.

—(౦)—

# అప్పచెల్లెండ్రు

అప్పచెల్లెండ్రిరువురును రెండు సంవత్సరముల తరువాత నొక బంధువుల యింటివద్ద కలిసికొనిరి. కొలందిసేపు కంటతడి పెట్టిన పిమ్మట అప్ప—రూపకుమారి చెల్లెలివైపు చూచినది. రాణుదులారి—క్రిందనుండి పైవఱకు—శరీరమునిండ నగలే! ఆమె ప్రత్యంగము వికసించినట్లున్నది. స్వభావములో నొకవిధమైన హుందాతనము వచ్చినది. మాటలలో నేర్పఱి యైనది. అమూల్యమైన బెనారస్ చీర, మఖమల్ జంపరు—ఆమె రూపమును మఱింత వెలుగొంద జేయుచుండెను——చిన్నతనమున జుట్టు విరియబోసికొని, అమాయికరాలై, పిచ్చిదానివలె తిరిగిన రాణుదులారియేనా యిది? రూపకుమారి తన చెల్లెలి నామె వివాహమున జూచినది — రెండు సంవత్సరముల పూర్వము! ఆనాఁడు సైత మామె వేషమున నంతయంతరము లేదు. ఇదివఱకటికంటె కొంచెము పొడవైనది—కాని యట్లే బలహీనముగ, అమాయికగ, మూర్ఖురాలుగ, చీటికిమాటికి కోపించు ఉడుకుబోతుగ నున్నది. నేటి స్థితి పూర్తిగ భిన్నమైనది. మొగ్గగనున్నది వికసించినది. ఇంతటి యంద మింతవఱ కేమూల దాగియున్నదో! కాదు—ఇది నాభ్రమ—దృష్టిలోని లోపము! ఇది రూపముకాదు—కన్నుల నాకర్షించు శక్తిమాత్రమే! ఇంతటి యాకర్షణ మెచటిది? — పట్టు మఖమల్ వస్త్రములు, బంగారు నగలు! వీటివలన వచ్చినది! అసలురూప మెచటికి పోవును? అయినను కన్నులామెవైపునకే పోవుచున్నవి. చాలసుందరి స్త్రీ

లున్నారచట. కాని వారిలో నీ యాకర్షణము—ఇంద్ర జాలము లేదు.

ఎచటనైన నద్దము దొరికిన బాగుండును-తన ముఖము గూడ చూచుకొనును. తన రూపమున కెంతవఱకు మెఱుఁగు పెట్టుటకు వీలుండునో యంతకంటె నెక్కువగనే మెఱుఁగులు పెట్టినది రూపకుమారి-కాని యా రూప మిప్పుడామె స్మృతి పటమునుండి చెఱిగిపోయినది. అద్దాని సూక్ష్మమైన ఆభాస మాత్రము హృదయపటమున గోచరించుచున్నది. ఆమెకు మఱల తన రూపమును చూచుకొనవలెనను వ్యగ్రత హెచ్చినది. ఈ పర్యాయము తులనాత్మక దృష్టితోఁ జూచును. రామదులారియందీ యాకర్షణ మెచటినుండి వచ్చినదో దానియంతు కనుగొని తీరవలెను. ఆమెవద్ద అలంకరణ సామగ్రితోఁబాటు చిన్న యద్దముకూడ నున్నది. కాని పది మందిలో నద్దము చేతఁబట్టి అలంకరించుకొను నలవాటా మెకు లేదు. చూచినవారేమైన ననుకొందురు. ఈ గదులం దెచటనో అద్దముండి తీరును డ్రాయింగురూములో తప్పక నుండును. ఆమె లేచి డ్రాయింగురూములోని కేఁగినది. అచటి నిలువుటద్దములో తన రూపమును జూచుకొన్నది. అప్పు డచట నెవరును లేరు. పురుషులందఱు నింటిముందున్న దొడ్డిలో నున్నారు. ఆడవాళ్లు పాటలలో లీనమైయున్నారు. ఆమె విమర్శనా దృష్టితో ప్రత్యంగమును, ఒక్కొక్క అవ యవమందలి ప్రతి విలాసమును జూచెను. ఆమె యంగ విన్యాసము, ఆమె ముఖకాంతి నిష్కళంకముగ నుండెను. కాని యా ప్రొత్తఁదనము, ఆ మాదకత, ఆ మాధుర్యము

మాత్రము కానరావు. అవును! లేవు! ఆమె తన్ను దా మోసగించుకొనలేదు. కారణమేమి? రామదులారి నేఁడు వికసించినది; తాను వికసించి చాల కాలమైపోయినది. కాని యంతమాత్రమున నామె మనసు సమాధాన పడలేదు. తాను రామదులారికంటె నేమాత్రమును తక్కువగ నుండ రాదు. అసలే మగవాళ్లు వట్టి మొద్దులు! యథార్థమైన సౌందర్యమును కనిపెట్ట జాలువాఁడెవఁడును లేఁడు. వారికి కావలసినది యౌవనము, చాంచల్యము. హావభావములే! కండ్లుండియు గ్రుడ్డివారే! రూపమునకు వీటికిని సంబంధ మేమి? అవి అన్నియు వయసువలన వచ్చిన విచిత్రములే! వయసును కాలమునుగూడ నతిక్రమింపజాలినదే రూపము! తన వస్త్రములలో రామదులారిని నిలబెట్టినచో నీ యాకర్ష ణమంతయు మాయమైపోవును-దయ్యమువలె కన్పించును. కాని ఈ గ్రుడ్డివారి కా విషయము తెలియదు-అదేపనిగ నామె ముఖము చూచుచుందురు.

కాని రామదులారి యత్తవారింటివారేమంతటి భాగ్య వంతులు కారు. పెండ్లికి వారు గొనివచ్చిన నగలు మున్న గునవన్నియు నిరాశాజనకములుగనే యున్నవి. గొప్పతన మేమియు కానరాలేదు. దాని మామగారొక జమీందారు వద్ద నౌకరు. పిల్లవాఁడు కాలేజీలో చదువుచున్నాఁడు. ఈ రెండు సంవత్సరములలో నింత డబ్బెచటనుండి వచ్చిపడినది? ఏమో! ఈ నగలన్నియు నెవరి వద్దనైన నెరువు దెచ్చిన దేమో! గుడ్డలు గూడ యెరువు దెచ్చినవే యైయుండును.

కొంతయుండి స్త్రీలకు తమ యదార్థ స్థితికంటె నెక్కువగ ప్రదర్శింపవలెనను కుతూహలముండును. అదే విధముగ నిదియును నెరువు తెచ్చినదేమో! అయిన నా గొప్పదన మామెకే యుండనిమ్ము! నాకిట్టి గొప్పదనము లవసరము లేదు. నే నిట్లుండుటే నాకు పదివేలు! ఈ ప్రదర్శనమను రోగము మితిమీరుచున్నది. ఇంటిలో ముంగ మెతుకుండదు! మగవాడు నూప్పది రూపాయల జీతమునకు రాత్రింబవళ్లు పాటులపడియు చుండును–కాని దొరసానిగారు మాత్రము అలంకరించుకొని రాజకుమారివలె తయారగు చుండును. చిల్లర దుకాణపువాని చీవాట్లు సహించును. దర్జీవాని డిశాయింపులు సహించును. ఋణదాతలను ప్రాధేయ పడుదురు, ప్రతిమాలుదురు. భర్తను నేధించి, అలిగి, ఏడ్చి పనిరాని పాట్లన్నియు బడుదురు. ఎందులకు? ఈ ప్రదర్శన మను రోగమును వ్యక్తమొనరించుటకు! ఇంటివద్ద వాళ్లెంత విసుగు జెందినారో దీని స్వభావమునకు! ఇచట సిగ్గులేక దొరసానివలె కులుకుచున్నది. ఎందరు నవ్విన దానికేమి? అన్నియు బలాదూర్! ఆమెకు వీటితోఁ ప్రయోజనము లేదు. తాను బజారున నడచునపుడు జనులందరు గుడ్లొప్ప గించి తన్ను జూచనలె! అదియే యామెకుఁ గావలసినది. రాముడులారి మూడు నెనరివద్దనో నగ లెరువు తెచ్చి యుండును సిగ్గులేని ముఖము!

రూపకుమారి మోము ఆత్మసమ్మానము వలననొకింత యరుణమయ్యెను. తనవద్ద నగలుచీరెలు లేకపోయిన నేమాయె! నాతోనొకరివద్ద కేగి లజ్జాభిమానములు వదలిపెట్టవలసిన గతి

ఆతని యాత్మమూల్య మొకవంద యుండును! ఐదువందలు మాత్రమెన్నడును కాదు.

ఆమె పరిహాసభావముతో నన్నది-"ఏజెంటు పనిలో నింత జీతము బత్తెము లభించుచో నీ కాలేజీలీపాటికి మూసి వేయ లేదేమి? అనవసరముగ విద్యార్థులందరు తమ జీవిత ముల నాశన మొనర్చుకొనుచున్నారే!"

రామదులారి తన సోదరి యుడుకుబోతు తనమునకు సంతసించుచు ననినది-"అక్కయ్యా! నీ విచట నే పొరబడు చున్నావు. ఎం. ఏ. అందరును ప్యాసు కాగలరు. కాని, ఏజంటుపని కెవరో యొక రేగాని పనికిరారు. అయ్యది భగ వంతుని వరదానము! జీవితమంతయు చదివిన ప్రతివాడును ఏజంటుగా పనికిరాడు. డబ్బు సంపాదించుట వేరు, మహా పండితుడగుట వేఱు! తనవద్దనున్న సరుకుపై నితరులకు నమ్మకము కల్గించుట, ఇంతకంటె మంచి నాణ్యమైన సరుకు ఇంత చౌకగ మరెచ్చటను లభింపదను విశ్వాసమును కల్గిం చుట, సామాన్యమైన పనికాదు. గొప్పగొప్ప ఉద్దండుల నెదుర్కొన వలసి వచ్చును. మహారాజుల మనసు మార్చ వలసి వచ్చును. ఎన్నియో చేసినగాని సరుకు అమ్ముడుపోదు. మామూలు మనుష్యులైనచో నా మహారాజుల దర్శనమైనను కాదు. ఒకవేళ దర్శనమైనను వారిముందు నోరుపెగలదు. మొట్టమొదట వారికిని సిగ్గుగనే యుండెడిది. ఇప్పుడా విద్యలో పారంగతులైనారు. రాబోవు సంవత్సరము మరికొంత యభి వృద్ధి యుండును."

రూపకుమారి నాడులలో రక్త సంచార మాగిపోయి నట్లైనది. నిర్దయమైన మిన్నువిఱిగి మీఁద పడదేమి? పాషాణ హృదయమైన నీపృథ్వి బ్రద్దలుకాదేమి! ఇదేమి న్యాయము?- రూపమతి, బుద్ధిమతి, ఇంగితజ్ఞ, పతివ్రత, మాతృస్నేహ పూర్ణయైన రూపకుమారికి - సూక్ష్మములో మోక్షమన్నట్లు సంసారమును దిద్దుకొనిపోవు రూపకుమారికీ దుర్గతియేమి? గర్విష్ఠియు, వివేకహీనయు, చంచలయు, మాటాడుట చేత గానిదియు, నిన్నటినఱకును చింపిరితలతో తిరిగిన రామ దులారి రాణియైపోవుటా? ఇదెచ్చటి న్యాయము? కాని రూప కుమారి యందింకను నాశయున్నది. కొలఁది కాలములోనే తన మనసునకు శాంతి లభించు మార్గము కన్పట్టవచ్చును!

అదే పరిహాస స్వరముతో ననినది - "అయిన నిఁక నుండి నెలకు వెయ్యి రూపాయలు వచ్చునన్న మాట!"

"వెయ్యికాదు! కాని, ఆరువందలకు లోటులేదు."

"ఎవఁడో గ్రుడ్డివాఁడు దొరికినాఁడు కాఁబోలును యజమాని !"

"అక్కయ్యా! వ్యాపారస్థులెన్నఁడును గ్రుడ్డివారు కారు. వారికండ్లు మన యందరి కండ్లకంటెను తీక్ష్ణముగ నుండును. ఆరువేలు సంపాదించి యిచ్చినచో నప్పుడుగాని ఆరువంద లీయరు. ప్రపంచము నంతను దోచునట్టి షావుకారు నెవరు దోచుకొనగలరు?"

పరిహాసముతో పని జరుగలేదు. రూపకుమారి యిక అవమానమను వస్త్రమును ప్రయోగించినది - "నాకేమంత

మంచి యుద్యోగముగా దోఁచుటలేదు. నిత్యము అబద్ధము లాడుచుండవలె! అంతయు మోసపు కూఁడు!"

రామములారి బిగ్గఱగ నవ్వినది. తాను అప్పగారిపై సంపూర్ణ విజయము నందినది "అట్లనచో నీ వకీళ్లు, బారిష్టర్లు వీరందరును మోసగాళ్ళే! తనపార్టీ ప్రయోజనము కొఱకు వారెన్నియైనను జేయుదురు. అబద్ధపు సాక్ష్యములు, ప్రమాణములుకూడ చేయించవలసినచ్చును. మఱి, అట్టి వీడర్లనే మనము నాయకులనుగా దలఁచుచున్నాము. జాతీయసభలకు పంపుచున్నాము—గౌరవించుచున్నాము—బ్రహ్మరథము పట్టుచున్నాము! వారికై ధనము కురిపించుచున్నాము. వీధులకు వారిపేర్లు పెట్టుచున్నాము. సంస్థలకు వారిపేర్లు పెట్టుచున్నాము. నేఁడేకాదు—పూర్వమునుండియు ధనమునకున్న మహిమయే యిట్టిది! ఆ డబ్బు యేవిధముగ వచ్చినదని యెవఁడును జూడఁడు. డబ్బుగలవానిని పూజించును. ఇది లోకపుతీరు! పురదృష్టవంతులు, అయోగ్యులు పిఱికిపందలు మాత్రము నీతి, సదాచారము, ఆత్మ అను పేర్లు చెప్పుచు కన్నీళ్లు తుడుచుకొనుచుందురు. ప్రపంచములో నీతి, సదాచారము ఎవనికిఁగావలె?"

రూపకుమారి మాటాడలేకపోయినది. తన బాధతోఁబాటు, రామములారి తెలకంటె గంపన్నరాలను విషయము నంగీకరింపవలసి వచ్చినది—తప్పదు! అనాదరము వలన పరిహాసము వలన తనసంకుచితహృదయమును మాత్రమే ప్రదర్శించుకొనగలదు. దీనివలన ప్రయోజనమేమి? ఏదియో

వంక పెట్టుకొని దులారి యింటికేఁగి యామె నిజస్థితిని జూడ వలె! నిజముగ దులారి లక్ష్మీప్రసన్నయైనచో రూపకుమారి తన యదృష్టమున కేడ్చుచు కూర్చుండవలసినదే! ప్రపంచమున న్యాయమునకు, విశ్వాసమునకు తావులేదని తలఁచును!

కాని యింతమాత్రమున నామెకు సంతోషము కలుగునా? ఇచట నిజమైన విశ్వాసపాత్రుఁడెవఁడు? అన్యాయము చేయుటకుఁ దగిన యవకాశము దొరకనివాఁడే! అట్టి యవకాశమును సృష్టించుకొను బుద్ధిబలముగాని, మనోబలముగాని లేనివాఁడే! తన భర్తకు 75 రూపాయల జీతము. ఒక పాతిక రూపాయలు పైనలభించినచో పుచ్చుకొనడా? ఆతని మంచితనము, నమ్మకము సమయముదొరకనంత వఱకే! అట్టి యవసరమే లభించిననాఁడు మంచితనము, సత్యపరాయణత, నీతినియమములు నన్నియు మాయమగును. తనభర్త యట్టి యన్యాయపు సొమ్ము తెచ్చినచో వలదని వారించునంతటి నైతికబలను తనలోమాత్ర మున్నదా? వారించుటటుండ, పైపుతట్టి భర్తను ప్రశంసించును. ఇప్పుడు భర్త ఆఫీసునుండి వచ్చువేళకు ముఖము ముడుచుకొని కూర్చుండును. భర్త ఆ విధముగ సంపాదించి తెచ్చుచో రూపకుమారి భర్త కెదురువోయి స్వాగతమిచ్చి లోనికి గొని తెచ్చును. జేబులు వెదకును.

దొడ్డిలో మేజువాణీ జరుగుచున్నది. రామదులారి యుత్సాహముతో పాడుచున్నది. రూపకుమారి వసారాలో నుస్సురనుచు కూర్చున్నది—ఆమె కేలనో తలనొప్పిగనున్నది.

పాటలతో, నృత్యములతో నామెకు ప్రయోజనములేదు. ఆమె యభాగ్యురాలు. ఏడ్చుటకే పుట్టినది !

రాత్రి తొమ్మిదిగంటలైనది. అతిథులందరు సెలవు తీసికొనుచున్నారు. రూపకుమారి కూడ లేచినది. బండి పిలువబోవుచుండగా రాముదులారి యనినది–"బండి దేనికి అక్కయ్యా ? నన్ను దీసికొనిపోవుటకు కాదు వచ్చును. నాతోరమ్మ ! నాలుగురోజులు మా యింటనుండి వెళ్ళ వచ్చును. నేను బావగారికి కబురుపంపుదును–నీకై యెదురు చూడకుండ !"

రూపకుమారి ప్రయోగించిన ఈ చివరియస్త్రము గూడ విఫలమైపోయినది. రాముదులారి యింటికేగి యామె నిజస్థితి నెఱుంగవలెనను కోరిక గూడ మాయమైనది. ఇక నింటికేగి ముసుగుపెట్టుకొని పరుండుటే మంచిది. ఈదారి ద్ర్యముతో నితరుల యిండ్లకేగుటేల? అనినది–"నాకిప్పుడు తీరికలేదు. పిల్లలు గోలచేయుచుందురు. మరియొకప్పుడు వత్తును."

"ఏమి ? ఈ రాత్రికి గూడ నుండజాలవా ?"

"వీలులేదు."

"సరే! ఎప్పుడు వత్తునో చెప్పుము! బండిపంపుదును!"

"నేనే కబురు చేతును."

"నీకు జ్ఞాపకముండదు. సంవత్సరమైనది !—పొరబాటునగూడ నన్ను తలంచలేదు. అక్కయ్య పిలుచును,

వెళ్లుదమని కొండంత యాశతో నుంటిని. ఒక పట్టణములో నున్నను మనమిరువురము కలిసికొని సంవత్సరము దాటి పోయినది. దగ్గఱనున్న ప్రయోజనమే లేకపోయె!”

ఇంటిపనుల వలన తీరిక లభించుట లేదనుట కంటె రూపకుమారి యేమనఁగలదు? దులారిని పిలువవలెనని చాల పర్యాయము లనుకొనినది, కాని సమయము దొరకలేదు.

ఇంతలో నకస్మాత్తుగ దులారి భర్త గురుసేవకుఁడు వచ్చి వదినగారికి నమస్కరించినాఁడు. పూర్తిగ ఇంగ్లీషు వేషము—నోటిలో పైపు, చేతికి బంగరు గడియారము, కండ్లకు బంగరుకమ్ముల జోడు, సివిలియన్ వలె నున్నాఁడు. ముఖమున హుందాతనముతోఁబాటు పెద్దమనిషి తరహా యుట్టిపడుచున్నది. ఆతఁడింత రూపవంతుఁడని రూపకుమారి యనుకొనలేదు. ఆతని శరీరముపైనున్న వస్త్రములు చక్కఁగ నున్నవి.

ఆశీర్వదించి యనినది—“నేఁడిచటికి రాకున్నచో మిమ్ము కలిసికొనుట పడెడిదికాదు.”

“ఇదియొక నింద మాపై! మీరు పిలిచినప్పు డెన్నఁడైన నేను రాలేదా?” అనినాఁడు నవ్వుచు గురుసేవకుఁడు.

“నీవు అతిథివై యుండఁదలఁచుచున్నట్లు నేనెఱుఁగను. మాదిమాత్రము నీ యిల్లుకాదా? బొట్టుపెట్టి పిలువవలెనా యేమి?”

రూపకుమారికి వారియెడ ఈర్ష్యాభావమున్నను మృదు మధురమైన భాషతో, స్నిగ్ధమైన సంభాషణ సాగించుచున్నది.

వారే తన్ను బ్రతిమాలునట్లు మాటాడుచున్నది. తానెంత తెలివిగ మాట్లాడుచున్నదో తానే యెఱుంగును.

గురుసేవకుఁ డుదారభావముతో ననినాఁడు-"అవును! వదినా! నిజముగ నాదేతప్పు! నే నా దృష్టితో నాలోచింప లేదు. నేటికి మా యింటివద్ద నుండుము!"

"కాదు! నేఁడు వీలులేదు. మరియొకప్పుడు వత్తును. పిల్లలు గోలచేయు చుందురు."

రామదులారి యనినది- "నేనెంతయో చెప్పి చూచితిని—ప్రయోజనము లేకపోయినది."

అప్పచెల్లెండ్రిరువురు కారులో వెనుక సీటులో కూర్చుండిరి. గురుసేవకుఁడు నడుపుచున్నాఁడు. కొలఁది సేపటిలో రామదులారి యిల్లు వచ్చినది. దులారి అప్పగారిని దిగుమని మఱల బ్రతిమాలినది. కాని యామె వినలేదు. చివరకు దులారి అప్పగారిని కౌగలించుకొని సెలవు తీసికొనినది. గురుసేవకుఁడు కారు నడిపినాఁడు. రూపకుమారి దిఙ్మ్రాంతముగ దులారి యిల్లు చూచినది. ఆ నగ్నసత్య మొక శలాకవలె నామె హృదయమునఁ గ్రుచ్చుకొనినది.

కొంతదూర మేఁగిన పిమ్మట గురుసేవకుఁ డనినాఁడు- "వదినా! ఏదియో యొక మంచిత్రోవ చూచికొనినాను. నాలుగేండ్లపాటు ఇట్లే పనిచేసినచో నొకమనిషినగుదును."

రూపకుమారి సానుభూతితో నన్నది- "రామదులారి చెప్పినది. దేవునిదయవల్ల సుఖముగ నుండవలె! కాని కాలు సేతులు కూడదీసికొనుము!"

"వదినా! యజమానికి తెలియకుండ దమ్మిడీ ముట్టు కొనను. నమ్మకము, పెద్దమనిషి తరహా, ఈరెండును నున్నప్పుడే డబ్బు విలువ! నమ్మకము పోయిన పిమ్మట ధనముండి యేమి లేక నేమి? నాకట్టి పాపపు సొమ్ము పనికిరాదు. పైగా ఎవరి కన్ను కప్పుదును? సమస్తము నా చేతిలోనే యుండె! యజమాని లేనేలేడు. అతని భార్య యున్నది-విధవ. ఆమె సమస్తము నాకే యొప్పగించినది. ఆ వ్యాపారము నేను నిర్వహింపనిచో నాశనమైపోయెడిది. నే నుండగ యజమాని మూడు నెలలు మాత్రమే జీవించియున్నాఁడు. కాని మనిషిని తేలికగ కనిపెట్టు స్వభావమాతనిది. నన్ను వందరూపాయలకు నియమించినవాఁడు ఒక నెలలోనే 250 చేసి వేసినాఁడు జీతము. మీ పెద్దల దయవలన మొదటి నెలలోనే పన్నెండు వేల రూపాయల పనిచేసినాను."

"ఏమిపని?" రూపకుమారి నిరుద్దేశ్య పూర్వకముగ నడిగినది.

"మిషన్ల ఏజన్సీ! అనేక రకములైన మిషన్లు తెప్పించుట, అమ్మట."- చల్లని సమాధానము.

ఇంతలో రూపకుమారికి తన పాపిష్ఠి కొంప ప్రత్యక్షమైనది. గుమ్మమునద్ద నొక గ్రుడ్డిలాంతరు మిణుకు మిణుకు మనుచున్నది. భర్త ఉమానాథుఁడు గుమ్మమువద్ద పచారులు చేయుచున్నాఁడు. కాని రూపకుమారి గురుసేవకుని లోనికి రమ్మని బలవంతము చేయలేదు. మర్యాదకొఱకొకపర్యాయ

మన్నది–కాని బలవంతము చేయలేదు. ఉమానాథుఁడు గురుసేవకుని చూడనేలేదు.

రూపకుమారి కా యిల్లు గోరీల దొడ్డివలె నున్నది–తన యదృష్ట మీ విధముగ బ్రద్దలైన దన్నట్లు! ఒక తివాచీ లేదు, ఫర్నిచరులేదు, చాపలు చట్టుబండలు ఏమియులేవు! రెండు మూడు విరిగిపోయిన ముక్కాలిపీటలు, అంగములన్నియు శిథిలమైపోయి వార్ధక్యమున నూగులాడుచున్న టేబిలు; నాలుగైదు పూర్వకాలపు నులకమంచములు–ఇదీ యాయింటి సొగసు! నేటి యుదయము వఱకు రూపకుమారి యీ యింటిలోనే సుఖముగా నున్నది. కాని యిప్పుడా కొంప యామెను కరవబోవుచున్నట్లున్నది. పిల్లలు 'అమ్మా' యనుచు మూగిరి, వారిని వెనుకకు నెట్టినది. ఆమె కసలే తల నొప్పిగ నున్నది, ఎవరితోడను మాటాడదు, ఆమెను మాటాడింపరాదు. ఇంటిలో వంటలేదు. ఎవరు వండుదురు? పిల్లలు పాలు త్రాగినారు. ఉమానాథుఁడు తిండి తినలేదు. రూపకుమారి వచ్చి వండిపెట్టునని ఎదురు చూచుచున్నాఁడు; కాని యామెకు తలనొప్పిగ నున్నది. ఇఁక బజారు పోవలె! గత్యంతరము లేదు. రూపకుమారి తిరస్కార సూచకమైన స్వరముతో నన్నది—"ఇంతవఱకును నాకై యెదురుచూచు టెందులకు? నే నీ వండివార్చు ఉద్యోగము చేతునని వ్రాసి యీయలేదు. నే నీ రాత్రికి రాకుండ నచటనే యున్నచో? వంటమనిషిని పెట్టరాదా? జీవితాంతము! నన్నే చంపవలెనా?

ఉమానాథుఁడు విస్మయాహతనేత్రుఁడై యామె వైపు జూచినాఁడు. ఆమె కోపమునకుఁగారణ మాతనికిఁ దోఁచలేదు. రూపకుమారి యెల్లప్పుడును నిరాపదమైన సహకారము నొసంగినది తనకు. నిరాపదమే కాదు—సాను భూతి పూర్ణమైన సహకారము నొసంగినది. అతఁడనేక పర్యాయములు వంటమనిషి విషయమును ప్రస్తావించినాఁడు; కాని యామెయే—'నేను కూర్చుండి చేయునదేమి? పదిరూపా యలు ఖర్చు పెంచుకొనినందువలన ప్రయోజనమేమున్నది? ఆ నాలుగు డబ్బులున్నచో పిల్లల పాలకైనను వచ్చును." అని వారించెడిది.

నేఁడీవిధముగ కోపముతో, నిర్మమకారముతో చెప్పుచున్నది.

తనతప్పు లేదనునట్లు ఉమానాథుఁడనినాఁడు—"వంట మనిషిని పెట్టుమని నే ననేక పర్యాయములు చెప్పినాను."

"మఱి వంటమనిషిని పిలిచి యెందులకు పెట్టలేదు? నేను వెడలగొట్టుదుననియా?"

"అవును! పొరపాటే జరిగినది."

"మీ రెన్నఁడును మనస్ఫూర్తిగ ననలేదు," రూప కుమారి మఱింత కోపముతో నన్నది—"కేవలము నన్నూర డించుటకు మాత్రమే యప్పుడప్పుడు వంటమనిషిని పెట్టు మనినారు. మీ మనసులోని రహస్యమును తెలుసుకొన జాలనంతటి యమాయకురాలను కాను. నా సుఖమును గూర్చిన విషయము మీకెన్నఁడునుపట్టలేదు. చక్కటి దాసి దొఱికినదిగదా యని సంతసించినారు—నాలుగు మెతుకులు తిని

పడియుండునని తలంచినారు. తిండి, గుడ్డతప్ప వేఱేమియు నక్కర లేదు! అది యైనను మాఖర్చులుపోను మిగిలినచో! 75 రూపాయలు నా నెత్తిన గొట్టి యీ సంసారపు ఖర్చంతయు భరింప మందురు. ఎన్నెన్ని ఖర్చులు తగ్గించుకొని, ఎంత నోరు కట్టుకొనవలసివచ్చుచున్నదో నాకే తెలియును. ఇంక కట్టుకొనుటకు మంచిగుడ్డ లెక్కడివి! నాజీవితమంతయు నిర్లనాశనమై పోయినది. ప్రపంచమున భార్యకొఱకు కొండమీది కోతిని దింపు భర్తలనేకులున్నారు. అంత దూరమేల? గుమాస్తాకుని జూడుడు! మీకంటె తక్కువయే చదివినాడు. వయసులోనను మీకంటె చిన్నవాడు. నెలకు 500 సంపాదించుచున్నాడు రాముడుగారి దొరసానివలె నున్నది. నాకకీ 75 రూపాయలే ఘనముగ నున్నది. ఈ గంజినీళ్ళకే సంతృప్తి! ఈ మగపుటక పుట్టుటయే వ్యర్థము! ఆడుజన్మ యైనచో బాగుండెడిది. ఆడువాండ్ర మనసులో నెట్టికోరిక లుండునో తెలిసికొనజాలని మగవాడు! స్వార్థపు! ఈపాటు సంసారమును భుజమున వేసికొని యీదుటకు నేనుంటినిగదా! మీకేమి? మీకు మాత్రము మంచి తిండి, మంచి గుడ్డలు కావలె! పురుషులు గదా! సంపాదించుచున్నారాయె! నే నెట్లుండిన మీకేమి?"

కొన్ని నిమిషములవఱకు నీ వాగ్బాణ పరంపర యిట్లే సాగినది. ఉమానాథుడు మిన్నక వినుచుండెను. తా నెఱింగినంతలో రూపకుమారి కెట్టిలోటును కలుగనీయలేదు. తన జీతము తక్కువయైన మాట వాస్తవమే! అది తన వశములోనిది కాదు. తా నేమి చేయగలడు? మనస్ఫూర్తిగ

పనిచేయును, అధికారులను మెప్పించును. ఈ సంవత్సరము ఆఫీసరుగారి పిల్లవానికి నాగా లేకుండ సంవత్సరమంతయు చదువు చెప్పినాఁడు - ఆయన సంతోషించు ననియేగదా ! తా నింకేమి చేయగలడు ? రూపకుమారి కోపకారణము నాతఁడు గ్రహించినాఁడు. గురుసేవకుఁడు నిజముగ నైదు వందలు సంపాదించుచున్నచో నదృష్టవంతుఁడే ! ఇతరుల యదృష్టమును జూచి యేడ్చిన ప్రయోజనమేమి? అదృష్టము కొలది నాతనికట్టిభాగ్యము కలిసివచ్చినది. అందఱకు నట్లు కలిసివచ్చునా? నిజముగ గురుసేవకుఁడు 500 సంపాదించు చున్నాఁడో లేక డాబుసరియో తెలిసికొనవలె! నిజముగ నాతఁడైదువందలు సంపాదించుచున్నను రూపకుమారి తన్ను దెప్పుట కామె కధికార మెక్కడిది? రూపకుమారికంటె అందమైనదానిని, శీలవతినిచూచి యామెను తాను నిందించి, తిట్టినచో నెట్లుండును? రూపకుమారి యందమైనదే! మృదు భాషిణియే! త్యాగమయియే! కాని యామెకంటెను నంద వతులు, మృదుభాషిణులు, త్యాగస్వరూపిణులు లేరా? అట్లని తానును రూపకుమారిని నిందింపవలసినదేనా ?

ఒకప్పుడు రూపకుమారికంటె అందమైనస్త్రీ యాతని దృష్టిలో లేదు-కాని యాతని యా యున్మాదము తగ్గి చాల కాలమైనది. భావుకత్వమును వీడి వాస్తవిక జగత్తులో నాతఁడడుగిడి చాల కాలమైనది. వైవాహిక జీవనము బాగుగ ననుభవమునకు వచ్చినది. ఒకరి గుణదోషము లొకరికి తెలిసినవి. ఇఁక సంతోషము, తృప్తిలోనే వారికి సుఖము !

రూపకుమారి తెలివిగలదైనను నీ నగ్నసత్యమును గుర్తింప లేకున్నది.

అయినను నాతనికి రూపకుమారి యెడల సానుభూతియే కలిగినది. అతఁ డుదారస్వభావుఁడు! కల్పనాశీలి! ఆమె కటు వచనములకు సమాధాన మొసంగలేదు. అమృతమువలె మ్రింగినాఁడు. తన సోదరి దర్జా చూచి యామె మనసులో నొక్క క్షణము నిరాశతోఁ గూడిన అన్యాయపూర్ణమైన దుఃఖభావనలు కలుగుట సహజమే! ఆమె సన్యాసిని, విరాగిని కాదుగదా—చలింపకుండుటకు !

ఈ విధముగ తన మనసును సమాధానపఱచుకొని, గురుసేవకుని విషయ మెఱుంగవలెనని నిశ్చయించుకొనినాఁడు.

## 2

ఒక వారము దినములవఱకు రూపకుమారికి మానసిక శాంతి లేదు. మాటిమాటికిని విసిగికొనును. పిల్లపై కోపగించును. భర్తను దెప్పుచుండును, తన యదృష్టమునకు వగచును. ఇంటి చాకిరి మాత్రము తప్పుటలేదు—కాని నేఁ డా పనియం దానందములేదు. వెట్టిచాకిరి చేయుచున్నట్లున్నది. తనకాత్మీయ సంబంధమున్న పురాతన వస్తుసముదాయమును నేఁ డామె కన్నెత్తి చూచుటలేదు. ఇదివఱ కా వస్తువులను జాగ్రత్త చేయుటయం దామె యత్యంతాసక్తిఁ జూపెడిది.

ఇంటిలో నొక పనివాఁడున్నాఁడు. ఇంటి గొడవ గృహిణికే పట్టనప్పుడు వాఁడుమాత్ర మేల పనిచేయును? ఎచట నున్న వస్తు వచటనే పడియున్నది. వాటిని జాగ్రత్తచేయువా రెవరు? అంతయు నస్తవ్యస్తముగ నున్నది. పిల్లలకు తల్లితో మాట్లాడుటే భయమైపోయినది. ఉమానాథుఁ డామె నీడనుజూచిన నులికిపడుచున్నాఁడు. వడ్డించిన దేదియో తిని ఆఫీసుకుపోవును. ఆఫీసునుండి తిరిగివచ్చి యా పిల్లల నిరువురను వెంటగొని షికారు పోవును. రూపకుమారితో మాట్లాడుటయన మందు సామానునకు నిప్పంటించుటయే! కాని, ఆతఁడు గురుసేవకుని విషయమై యాచూకీ తీయుచునే యున్నాఁడు.

ఒకనాఁ డుమానాథుఁడు ఆఫీసునుండి వచ్చినాఁడు. ఆతని వెంట గురుసేవకుఁడుగూడ నున్నాఁడు. రూపకుమారి నేఁడే అసహాయోగము మాని ఊడ్చుటకై బల్లలు వగైరా సర్దుచున్నది. ఇంతలో గురుసేవకుఁడు లోని కేతెంచి నమస్కరించినాఁడు. రూపకుమారి చిన్నబుచ్చుకొనినది. ఆమె కుమానాథునిపై మ్రింగివేయవలెనన్నంత కోపము వచ్చినది. ఇతని నేల గొనివచ్చినాఁడు? ముందు చెప్పలేదు, చేయలేదు-వెంటబెట్టుకొని వచ్చినాఁడు. ఈస్థితిలోఁ జూచి యాతఁడేమనుకొనును? ఈ మనిషి తెలివెల్లప్పుడు నింతియే! తానేదో గౌరవమును కాపాడుకొనుచు బ్రతుకుచున్నది. ఆ గౌరవమును బజారులో బెట్టుచుండును భర్త! ఏమాత్రమును సిగ్గు లేదు. మానాభిమానములు వదలి వేసినారు. నేనేమి చేసితినని నన్నీ విధముగ నవమానింపవలె?

ఆశీర్వదించి కుశలమడిగి కుర్చీ వేసినది. గురుసేవకుఁడు ఆసీనుఁడగుచు ననినాఁడు-"నేఁడు మాఅన్నగారు విందునకు పిలిచినారు. ఆయన పిలిచినచో వచ్చెడివాఁడనుకాను. మీా వదిన పిలువమనినదని చెప్పినారు. ఇఁక తప్పనిసరియైనది."

రూపకుమారి మాట కలిపినది, గృహకలహమును దాచవలసి వచ్చినది—"అవును. ఆనాఁడు నీతో మాటాడుటకే వీలుపడలేదు. మనసైనది...మాటాడవలెనని."

గురుసేవకుఁడు గది నాల్గువైపులను కలయఁజూచి నాఁడు- "ఈ పంజరమున మీాకు చాలబాధగా నుండి యుండును."

ఈ యువకుఁడెంతటి సురుచిహీనుఁడో, అరసికుఁడో రూపకుమారి కర్థమైనది. ఇతరుల మనోభావముల నాదరించుటయే యెఱుఁగడు. ప్రపంచమున నందరు భాగ్యవంతులే కారని గూడ తెలియదు. లక్షకొక్కఁడెచటనో యుండును ఇట్టి భాగ్యశాలి! ఇట్టివానిని భాగ్యశాలియని యేలయనవలె? అనేకమందికి తిండిలేనప్పుడు నలుగురి భోగవిలాసాదు లోక సౌభాగ్యమా? అనేకులు ఆకలితోఁ జచ్చుచుండ నలుగురైదుగురు మృష్టాన్నము లారగించుట సిగ్గులేనితనము, హృదయహీనత యనిపించుకొనునుగాని అదృష్టము కానేరదు!

కొంచెము కోపముతో నన్నది-"పంజరములోనుండుట బోనులో నుండుటకంటె మేలు! పంజరములో నమాయకములైన పక్షులుండును. బోనులో ఘాతుక మృగము లుండును."

గురుసేవకుఁడా వ్యంగ్యమును గ్రహింపలేదు- "నాకీ యింటిలో నూపిరి యాడుటలేదు. మీకొఱకై మాయింటి దగ్గఱలో నొక యిల్లు చూతును-పెద్దయిల్లు! మీవద్ద అద్దె తీసికొనను. ఇల్లు మా యజమానురాలిది. ఆమెకు చాల ఇండ్లున్నవి-వందలు! అన్నియు నా యధీనమందేయున్నవి. నాయిష్టము వచ్చినవారి కీయవచ్చును. అద్దె తీసికొనుట, మానుట నా యిష్టము! మీకొఱకొక మంచియిల్లు చూతును. మీ రచటికి వచ్చినచో కృతజ్ఞుడను!"

రూపకుమారి గ్రహించినది - మహాశయుఁడు మైక ములో నున్నాఁడని. అందువలననే యిట్లు వాఁగుచున్నాడు. తీక్ష్ణముగ చూచినది—కనులు మూతలు పడుచున్నవి—బుగ్గలు వాచియున్నవి. మాటకూడ తొట్రుపడుచున్నది. తరుణ సౌందర్యపూర్ణమైన మోము యిట్లున్నదీనాఁడు! ఆతనిముఖమున సిగ్గులేదు. రూపకుమారికసహ్యము కలిగినది.

ఒక్కక్షణమాగి మరల వాఁగుడు ప్రారంభించినాడు- "మీకు విధేయుఁడను. అవును! చిత్తము! నాకు పెద్దవదిన గారు మీరు. మీకొఱకు నా ప్రాణములుసైత మర్పింతును. మీకొఱకు ఒక యిల్లుకాదు-వంద యిండ్లు మాట్లాడుదును. నేను మిసెస్ లోహియాకు మేనేజరును-ఏజంటును. అంతయు నాచేతిలో నున్నది. అంతా! నేనేమిచెప్పిన నది కండ్లుమూసి కొని యంగీకరింప వలసినదే! తన కుమారునివలె చూచు కొనును. నన్ను మొదట 20 రూపాయలకు నియమించినది- 20 రూపాయలకు ! ఆమె ధనికురాలు, ఆమె కంతటి ధన మెచటినుండి వచ్చుచున్నదో యెవరికిని తెలియదు _ నాకు

తప్పు! అది దొంగవ్యాపారముచేయును-దొంగవ్యాపారము! ఎవరితోడను చెప్పవద్దు! దొంగతనముగ నల్లమందుఅమ్మును! లక్షలు సంపాదించును! ఇప్పుడదే వ్యాపారము నేనును చేయుచున్నాను. ప్రతి పట్టణమునందును మాకు రహస్యముగ ఏజంట్లున్నారు. మిసెస్ లోహియా నన్నీవిద్యలో పారంగతుని చేసినది. అవును! నన్నుఅరెస్టుచేయుట కెవరికిని దమ్ములులేవు! పెద్ద పెద్ద ఆఫీసర్లందరు నా స్నేహితులే! వారి నోళులందు నోట్లకట్టలు కుక్కి మాట బయటకు రానీయను. నోరెత్తుటకు పేలులేదు. పగలే ప్రత్యక్షముగ అమ్మెదను. ఒక వెయ్యి లంచమిచ్చినట్లు లెక్కలలో వ్రాయుదును. ఇచ్చునది దైదువందలే! మిగిలనది స్నేహితులకు—జల్సా! ఈ చేతితో వచ్చును! ఆ చేతితో ఖర్చగును! ముసలిముండ రామనామంచేస్తూ కూర్చుండవలసినదే! కొంపలంటుకుపోయినను కదలదు, మెదలదు. నా చేతికి అడ్డులేదు. నామాట కెదురులేదు. (జేబులోనుండి నోట్లకట్టతీసి) ఇదిమీ పాదపూజ కుపయోగింపవలె! ఆశీర్వదింపుడు—ఇట్లే దర్జాగా జీవితము గడచిపోవలెనని! నీతి, సదాచారముల నుపాసించువారిని కుబేరుడు కాలితో తన్ని వేయును. డబ్బుకై మానమర్యాదలను వదలిపెట్టువారినే లక్ష్మి వరించును. నన్ను దురాత్ముడనవద్దు! నే నేమంత పెద్ద ధనికుడను? ఈ ధనికులందరును దోపిడిగాండ్రే! ఖచ్చితమైన, పక్కాదొంగలు! రేపు నావద్ద ధనమున్నచో నొకసత్రము కట్టింతును. ఇక చూడుడు! లోకము నన్నెంత ప్రశంసించునో! నాకా డబ్బెచటినుండి వచ్చెనో అడుగువాడెవడు? ఎంతటివాని

నైనను పిలిపించి ప్రశంసలందగలను. మిసెస్ లోపిందయాకు పెద్దలందరును జేరి "ధర్మవిభూషణ" అని బిరుదొసంగినారు–ఈతుచ్ఛులు, స్వార్థపరాయణులు, కడుపుకక్కుర్తిగాండ్రు! ఆ ముసలిముండవంటి నీచురాలు ప్రపంచమున నుండదు. ప్రపంచమే యొక దోపిడి! వకీలున్నాఁడు! అరగంట వాఁగి అయిదువందలు కొట్టును. డాక్టరున్నాఁడు! ఒక చీటీవ్రాసి వెయ్యికి బిల్లు చేతికిచ్చును! జూదగాఁడున్నాఁడు! స్పెక్యులేషనులో లక్షలార్జించును! వారి సంపాదన మంచి సంపాదనయైనచో నాదియు మంచి సంపాదనయే! అవును! మంచి ఉచితమైన సంపాదనయే! నాదృష్టిలో భాగ్యవంతులనిన గౌరవములేదు! వారెంతటి చేతిదెబ్బగాండ్రో నే నెఱుఁగుదును. ప్రపంచములో, కళ్ళలో దుమ్ముకొట్ట గలిగినవాఁడే గొప్పవాఁడు–వాఁడే సఫలుఁడు! బీదవాళ్ళ కడుపుకొట్టి భాగ్యవంతులగుట సమాజమందలి పరంపరాగతమైనపరిపాటి. నేఁజేయునదియు నదియే!—అందఱును చేయునదియే! జీవితోద్దేశ్యమే విలాస మనుభవించుట! చేతనైనంతవఱకు దోఁచి యనుభవింతును. ముసలితనములో దానధర్మములు చేతును. రోజులు బాగున్నచో నాయకుఁడ నగుదును. జూదమాడి యెందఱు కోటీశ్వరులైనారో లెక్కించి చెప్పమందురా? ఎందఱు ఆఁడవాళ్ళ దుకాణము తెఱచి లక్షాధికారులైనారో చెప్పమందురా?...

ఇంతలో నుమానాథుఁడు వచ్చి యనినాఁడు–"గురుసేవక్! ఏమిటిది? పద! టీత్రాగుము! చల్లారిపోవుచున్నది!"

తాను ప్రకృతస్థుఁడైనందులకు నిదర్శనముఁ జూపు చున్నాఁడా యనునట్లు గురుసేవకుఁ డులికిపడి లేచినాఁడు. కాని కాళ్లు తొట్రుపడి క్రిందపడినాఁడు. మఱలలేచితూలుచు, పడుచు-లేచుచు బయట కేఁగినాఁడు. రూపకుమారి బరువు తొలగినట్లు నిట్టూర్చినది. అచట నున్నంతసేపు ఆమె క్రియాశూన్య యైపోయినది. గదిలోని గాలి స్తంభించినట్లున్నది. చక్కటి మనోహర రూపమును దాల్చి యామె యెదుట నిన్నిదినములనుండియు ప్రత్యక్షమైన ప్రేరణలు నేఁడు వాస్తవికమైన, భీభత్సమైన, అసహ్యమైన రూపముతో ప్రత్యక్షమైనవి. నేటివఱకును త్యాగము, సాధుత్వము, నిరాడంబరముతోఁ గడిచిన నామె జీవితమున నీ మోసములు, కపటములు, స్వార్థము, తుచ్ఛత ప్రవేశించినవి - చక్కటి యుపవనమున గజఘటలు ప్రవేశించినట్లు! ఎంతటి భోగ విలాసముల కొఱకైనను తన మానమర్యాదల మూల్యముగ నిచ్చుట యామె కిష్టములేదు. నేఁడు రామదులారి యదృష్టముతో తనయదృష్టమును పోల్చుకొనదు. తనస్థితియే తనకు సంతోషము! ధనికుల మనిపించుకొనవలెనని, భోగవిలాసాదులలో మునిఁగి ఆత్మనాశన మొనరించుకొనుచున్న రామదులారిపై నామెకు దయకలిగినది. కాని, పాపము దులారి యేమి చేయఁగలదు? గురుసేవకుఁడు మాత్ర మేమిచేయఁగలఁడీ ధనము పూజింపబడు సమాజమున, బ్యాంకుఅకౌంటు-

డాబు దర్పములుచూచి మనిషికి విలువకట్టు సమాజమున, అడుగడుగు ప్రలోభనములతో నిండిన సమాజమున! ఆదుష్ట సమాజవ్యవస్థ ఈర్ష్య, ద్వేషము, దోపిడి, నీచత్వము మున్నగు దుష్టశక్తులనే ప్రకోపింపఁజేయును. గురుసేవకుఁడు, రామదులారి, యీ యిరువురును నా ప్రవాహములో చిక్కుకొని కొట్టుకొని పోవుటలో నాశ్చర్యములేదు.

సరిగ నదే సమయమున సుమానాథుఁడు వచ్చి యనినాఁడు-"గురుసేవకుఁ డిచట కూర్చుండి వాఁగుచున్నా డేమిటి? నేను వానిని పంపివేసితిని. వానికొఱకు పోలీసులు వెదకుచున్నా రేమో యని భయము కలిగినది. ఇనుముతోఁ బాటు అగ్నికి సమ్మెట పెట్లన్నట్లు నా మీదకుగూడ వచ్చునని భయపడి పంపివేసినాను."

రూపకుమారి క్షమాపణ వేడుచున్న దృష్టితో నాతని వైపు చూచి యనినది–"ఏమున్నది? తన దొంగవ్యాపారమునుగూర్చి వాఁగుచున్నాఁడు."

"నన్నుగూడ మిసెస్ లోహియాను కలిసికొనుమని చెప్పినాఁడు."

"వలదులే! ఈ గుమాస్తాగిరియే చాలును! అదే మనకు పదివేలు!"

"కాని యీ గుమాస్తాగిరిలో ఆ విలాస మెక్కడ నున్నది? ఒక సంవత్సరముపాటు సెలవుపెట్టి ఆ ప్రపంచమునుగూడ చూడవలె!"

"మీవద్ద ధనము లేనంతవఱకే మీయీ భావములిట్లు నిలిచి యుండును. మీ కెచటినుండియైన నాలుగైదులక్షలు వచ్చిపడినచో మీరిట్లుండరు - మీ భావములును మాఱి పోవును. ధన మనునదొక యభిశాపము వంటిది. జ్వాలాముఖి ప్రబద్ధమైనప్పుడే బాహ్యశాంతి యడుగున నెంతటియగ్ని దాగియున్నదో వ్యక్తమగును. ఇంటిలో ధనమునునింపి నాయెడల వారి కర్తవ్యమును నెఱవేర్చినట్లుభావించుచున్నారు. ఇక నా యసంతుష్టికి కారణములేదని వారి భావము. కాని యీ భోగవిలాస సాధనములన్నియు మృతాత్మ తృప్తికై భూమిలో పాతిపెట్టు పదార్థముల వంటివని వారికి తెలియదు."

కావస్‌జీ కీ మాటలు నేడు క్రొత్తగ నున్నవి. ఆతని యనుభవమును బట్టినే టివఱకాతని యభిప్రాయము స్త్రీ భోగవిలాస కాంక్షిణి యని. ఆమెకై ప్రాణము లర్పించినను, ఎన్ని బాధలు సహించినను స్త్రీకి పట్టదు-ఆమెకు కావలసినది యెండు గడ్డికాదు, దానాకావలె, పచ్చిగడ్డికావలె! ఈమె నిజముగ దేవత వంటిది! విలాసము లామెసమ్ముఖమున తుచ్ఛములు! మధురమైన ప్రేమ, రసమయమైన స్నేహమును కాంక్షించుచున్నది. ఆతనికి చక్కిలిగింత పెట్టినట్లయినది.

ఆమె మఱల ప్రారంభించినది——"వారి ప్రవర్తనము నా సహనము నతిక్రమించినది. నామనసులో విద్రోహజ్వాలలు బయలుదేరినవి. ధర్మములు, శాస్త్రములు, మర్యాద ఇవి యేవియు నన్ను రక్షింపఁజాలని స్థితికి వచ్చితిని. ప్రపంచమునఁ నెందఱు విధవలు లేరని మనసునఁ తృప్తిపడుచ

యత్నింతును. కాని మనసునకు శాంతి కలుగకున్నది. తనతో పోటీకి రంగమున ప్రవేశింపుమని ఆతఁడు నాపై సవాలు చేయుచున్నట్లనిపించుచున్నది. ఇంతవఱకును నేనాతని సవాలును లెక్కచేయలేదు. కాని యిప్పుడు పరిస్థితి తల మునుక లైనది—ఏదో యొక గడ్డిపోచయైనను నా కాధారముకావలె! ఆయన తలఁచినట్లే జరిగితీరును. మీరాయనకు మిత్రులు. మీవలన నైనచో చెప్పిచూడుఁడు! ఈ మర్యాదయను సంకెల లింకెన్ని రోజులో భరింపలేను."

కావస్‌జీ భావిస్వర్గనిర్మాణ మొనరించుకొనుచున్నాఁడు—"అట్లే! తప్పక చెప్పిచూతును! అయ్యది నా ధర్మమేనాయె! కాని నామాట విందురను ఆశ కన్పట్టదు. నేను దరిద్రుఁడను. నా మాటకొక విలువ యుండునా?"

"మామూలుగ నాపై దయచూపుచునే యుందురు. కాని నాకు వారి ప్రవర్తనము నచ్చలేదు."

"మీరన్ని దినములు సహించినారు. నాకదేమిక్కలి యాశ్చర్యముగ నున్నది. మఱియొక స్త్రీయైనచో నొక్క దినమైనను సహింపదు."

"కొలఁదిగనో గొప్పగనో ప్రతిపురుషునకు నిట్టి యలవాటుండును. కాని అట్టి పురుషుల భార్యలు గూడ నట్టి స్వభావముగల వారుగనే యుందురు – కర్మణా కాకపోయిన మనసాయైనను! నేను వారి నెల్లప్పుడు ఇష్టదైవమువలె నుపాసించినాను."

"పురుషుఁడా మంచితనమును గ్రహింపఁజాలకపోయి నప్పుడింక చేయునదేమి? అతఁడు మనసులో మఱియొక విధముగ నాలోచించు చున్నాఁడేమోయని నాభయము!"

"ఇంకేమని యాలోచింతురు?"

"మీరూహింపజాలరా?"

"సరే! అదియా విషయము! నాతప్పేమున్నది?"

"సింహాము - మేకపిల్ల కథ వినలేదా?"

ఆమె మాటాడలేదు. శపూర్జీ కారునచ్చుట కనిపించినది. ఆమె కావస్‌జీ వైపు వినయముతో, ఆజ్ఞాసూచకమైన దృష్టితోఁ జూచి లోనికేఁగినది. శపూర్జీ కారునుండి దిగినాఁడు. కనులెఱ్ఱబారినవి. చిఱునవ్వుతో కావస్‌జీ నద్దకేతెంచి చేయి కలిపినాఁడు. భార్య కనులెఱ్ఱబారినవి - భర్త కనులును ఎఱ్ఱబారియున్నవి. ఏడ్చుటవలన నవి! రాత్రి యంతయు మేల్కొని యుండుటవలన నివి!

# 3

శపూర్జీ టోపీ నంకెకు తగిలించుచు ననినాఁడు.-"క్షమింపుము! రాత్రి యొక మిత్రుని యింటివద్ద నిద్రించితిని. అచట విందు జరిగినది. భోజనము లాలస్యమైనది - ప్రొద్దుపోయి యిపుడింటికి వెళ్లుట దేనికని యచటనే యుండిపోతిని."

కానన్‌జీ వ్యంగ్యముగ నవ్వినాఁడు - "విందెచట? మారిపోర్టు సమాచారమీయలేదే! చెప్పాఁడు! వ్రాసి కొందును" జేబునుండి నోటుబుక్కు తీసినాఁడు.

శపూర్జీ కొంచెము జాగరూకుఁడైనాఁడు - "ఏమంత పెద్ద విందుకాదు. నలుగురైదుగురు మిత్రులు కలిసి చేసి కొనిన విందు."

"అయినను వార్త ప్రకటింపవలసినదే! మీ వంటి గౌరవనీయులున్న విందు సామాన్యమైనదా? విందు చేసిన వారి పేరేమి?"

"మీ కాశ్చర్యము కలుగదుగదా?"

"చెప్పండి."

"మిస్ గౌహర్!"

"మిస్ గౌహరా?"

"అవును! ఆశ్చర్య పడినారేమి? పగలంతయు రూపాయలు అణాలు పైసలతో సతమతమైన పిమ్మట ఆ మాత్రపు మనోరంజనమునకు నా కధికారములేదా? ఆ వినోదముగూడ లేకున్నచో బ్రతుకే దుర్భరమగును."

"నే నంగీకరింపను."

"ఎందువలన?"

"ఇట్టి మనోరంజనము కట్టుకొనిన భార్య యెడల అన్యాయమని నా యుద్దేశ్యము."

శపూర్జీ కృత్రిమముగ నవ్వినాఁడు-"చచ్చుమాటలు! నేటిసమాజమిట్టి బంధనముల నంగీకరింపదని తెలిసికొనుఁడు."

"నేటి సమాజము గడచినతరముకంటె నెక్కువ పరిష్కృతమైనదని నా యుద్దేశ్యము. ఇప్పుడు స్త్రీలయధికారము నంగీకరించుచున్నాము."

"అయిన స్త్రీలు మగవారిపై నధికారము చలాయింతురా ?"

"అవును! పురుషులు స్త్రీలపై చలాయించినట్లు."

"నే నంగీకరింపను. పురుషుఁడు స్త్రీపై నాధారపడి లేడు. స్త్రీ పురుషునిపై నాధారపడియున్నది."

"అనగా స్త్రీ తన పొట్టకూటికై పురుషునిపై నాధారపడియున్నదని మీ భావమా ?"

"మీ రా మాటలలో వ్యక్తము చేయదలఁచినచో నా కభ్యంతరము లేదు. రాజనీతిలోనవలెనే సమాజనీతి యందు సైతము అధికారమను కళ్లెము, ధనము చేతిలో నున్నది!"

"దైవయోగమువలన పురుషునకు సంపాదన లేక, స్త్రీ సంపాదించుచున్నప్పు డామె యిష్టము వచ్చినరీతిని మనోరంజనమునకై ప్రయత్నింపవచ్చునా ?"

"స్త్రీకి నేనట్టి యధికార మీయఁజాలను."

"అది యన్యాయము !"

"కాదు! స్త్రీని ప్రకృతియే బంధించినది. ఏ విధమునను స్త్రీ పురుషునివలె స్వచ్ఛందముగ నుండఁజాలదు. శరీరబలమున, పశుబలమున పురుషునికి సాటిరాదు. ఒకటి

మాత్రము నిజము–గృహిణీత్వమును వీడి, అప్రాకృతికమైన జీవితము నాశ్రయించినచో నామె యే పనినైనను చేయుఁ గలదు."

"మీ రనంటివారు, స్త్రీలు తప్పనిసరియై యట్టి యప్రాకృతిక జీవితమును గడుపునట్లు ప్రవర్తించుచున్నారు."

"స్త్రీలు పురుషుల యాధిపత్యమును స్వీకరింపని రోజులు వచ్చునని నేను తలఁపను. చట్టములు, నాగరికత నాకు తెలియదు. పురుషులు స్త్రీలపై నెల్లప్పుడును అధికారము చలాయించిరి, చలాయింతురు."

అకస్మాత్తుగ కావస్‌జీ ధోరణి మార్చినాఁడు. ఈ కొలఁదిసేపటిలో నతఁడు గొప్ప కూటనీతిజ్ఞుఁడై పోయినాఁడు. ప్రశంసాసూచకమైన దృష్టితో శపూర్జీవైపు చూచినాఁడు–"అయిన మన యిరువురి భావములు నొకటే! మిమ్ములను పరీక్షించితిని. నేనుకూడ స్త్రీని గృహిణిగ, తల్లిగ, స్వామినిగ నంగీకరింతును. కాని, స్వతంత్రురాలినిగ చూడఁజాలను. స్త్రీ స్వచ్ఛందప్రవృత్తి గలదైనచో నా యింట స్థానముండదు. ఇంతక్రితమే మిసెస్ శపూర్జీ మాటలు విని ఆశ్చర్యపడినాను. స్త్రీ తన మనసున నిట్టి విద్రోహాత్మకమైన భావములకు చోటీయునని కలలోఁగూడ తలఁచలేదు."

శపూర్జీ మెడ నిక్కించినాఁడు. శ్వాసవేగము హెచ్చినది. కుర్చీనుండి లేచినాఁడు–"ఓహో! శీరీ యిప్పుడీ పద్ధతికి దిగినదన్నమాట! ఇప్పుడే మీ యెదుటనే యడుగుదును. ఏదియో యొకటి తేలిపోవలె! నేనామెను లక్ష్యముచేయను.

ఆమెనేకాదు, ఎవరిని లక్ష్యముచేయను. కృతఘ్నురాలు! సమవేదనా శూన్యురాలు! నా సుఖమును చూడలేనిది! ఆమె గుప్పిటలో నుండవలెనని కాఁబోలు! శపూర్జీయా యామె చెప్పుచేతులలో నణగి మణగి యుండువాఁడు? పాపము, తెలియదుగాఁబోలు! నేనొక్క సంజ్ఞ చేసినచో నిట్టి శీరీలు వందమంది నాయెదుట హాజరగుదురు - నన్ను పూజింతురు; నేఁజెప్పినట్లాడుదురు. నే నీమె కొనగూర్చిన సుఖముల నే పురుషుఁడును తన భార్యకు సమకూర్పఁడు. నేను... నేను..."

తా నవసరమును మించి మాట్లాడుచున్నట్లు తోఁచెఁ నది. శీరీ యొసర్చిన ప్రేమపూర్ణమైన సేవలు జ్ఞప్తికి వచ్చినవి. కొంచెమాగినాఁడు-"ఇప్పటికైనను నామె తెలివిగ ప్రవర్తింపవచ్చును. నా కామెను కష్టపెట్టవలెనని లేదు. ఆమెకు చేతనైనది నన్ను నిందించుటయే! అంతకుమించి ముందునకుసాగు ధైర్యమామెకు లేదని నే నెఱుంగుదును. స్త్రీలను సమాధానపఱచుట కష్టమైన పనికాదు. నాకీ పద్ధతి బాగుగా తెలియును."

"నా పద్ధతులు వేఱు."

"కావచ్చును. మీవద్ద మాటలు తప్ప వేరేమియు లేవు. నావద్ద లక్ష్మీదేవి యాశీస్సులున్నవి!"

"మనసులో విద్రోహభావ ముదయించినపుడు లక్ష్మీ కటాక్షమైనను పనిచేయదు."

శపూర్జీ యాలోచించుచు పలికినాఁడు-"మీ యుద్దేశ్యముగూడ నిజమే కావచ్చును."

# 4

కొన్ని దినముల పిమ్మట కావస్ జీ, శీరీ యిరువురును పార్కులో కలిసికొనినారు. అతఁడిట్టి తరుణమునకై వేచి యున్నాఁడు. అతని స్వర్గనిర్మాణము పూర్తియైనది. ఆ స్వర్గ రాజ్యమున శీరీని ప్రతిష్ఠించుట మాత్రమే మిగిలియున్నది. ఆశుభదినమునకై యాతఁడువ్యగ్రుఁడగుచున్నాఁడు. భార్యను పుట్టినింటికి పంపి వేసినాఁడు. అతఁడు పంపున దేమిటి? ఆమెయే కోపగించి వెడలిపోయినది. శీరీ తనదారిద్ర్యము నాహ్వానించు చున్నప్పుడు గుల్ శన్ వెంటబడి ఆమెకు సేవ యేలచేయవలె? తొందరగపోయి శీరీకి అభివాదన మాచరించినాఁడు-"అక స్మాత్తుగ కలిసినారు. నేఁడు మీ యింటికి రావలెననుకొను చున్నాను."

శీరీ దెప్పుచు నన్నది-"మీం కొఱకెదురు చూచి కన్నులు కాయలు కాచినవి. మౌఖికమైన సానుభూతి మాత్రమే మీకును చేతనగును. ఇన్ని దినములనుండి యెంత యేడ్చితినో మీ కేమి తెలియును?"

కావస్ జీ, పట్టుచీరె తళతళలో మెఱసిపోవుచున్న, నామె యుత్కంఠతోఁ గూడిన ముఖముద్రను గాంచినాఁడు. ఆతనిహృదయము క్రియాశూన్య మగుచున్నది. చిరపరీక్ష యందు తీర్ణుఁడైన పిమ్మట జీవితప్రశ్న భయంకరరూపమున సాక్షాత్కరించిన విద్యార్థివలె నున్న దాతనిస్థితి! ఆపరీక్షల దాగుసమయాంతరే నాకొన్ని దినములు సాగిన నెంతబాగుండెు

డిది? ఆ స్వప్నము ముందీ సత్య మెంత భయంకరముగ నున్నది! నేటివరకును కావస్ జీ తేనెటీఁగ కూడబెట్టిన మధువును త్రాగినాఁడు. ఇప్పుడా తేనెటీఁగ తన మోముచుట్టును పరిభ్రమించుచున్నది–కుట్టునేమో యని భయము!

క్షీణస్వరమున ననినాఁడు–"ఈ విషయము విని నాకు దుఃఖము కలుగుచున్నది. శపూర్జీ కెంతయో బోధించితిని."

శీరీ యాతని చేయి పట్టుకొని బెంచిపై కూర్చుండఁబెట్టెనది–"ఆయన కిఁక బోధించి ప్రయోజనము లేదు. ఆయన కాళ్ళచుట్టుతిరుగుటకు నాకుమాత్ర మేమిగతిపట్టినది ? ఇఁక నా కొంపలో నడుగుపెట్టనని నిశ్చయించుకొంటిని. ఆయనకు కోర్టు కెక్కవలెనని మనసుగనున్నచో నెక్కవచ్చును–నేనును సిద్ధమే! నాకిష్టములేనివానితో నుండుట కీశ్వరుఁడైనను బలవంతము చేయఁజాలఁడు. ఇక కోర్టు లేమిచేయును? మీరు నా కాశ్రయ మిచ్చినచో మీ దాసనై యుందును. మీ కంతటి ఆత్మబలము లేకున్నచో మరియొక త్రోవ దొరకకపోదు. నిజము చెప్పండి! ఆ సానుభూతియంతయు మాటలవరకేనా?"

కావస్ జీ నిబ్బరముతో ననినాఁడు – "కాదు! కాదు! నీపై నాకెంత ప్రేమ యున్నదో భగవంతుఁ డెరుఁగును. నా హృదయమున నీకు స్థానమున్నది."

"మరి నీ భార్య నేమిచేయుదువు?"

"విడాకులిత్తును."

"అదియే నాకు కావలసినది. నేను నీతోవత్తును. ఇప్పుడే! శపూర్జీతో నా కెట్టి సంబంధమును లేదు."

కావస్‌జీ మనసు కంపించుచున్నది—"కాని యచట నింకను నెట్టి యేర్పాటును చేసికొనలేదు."

"నా కొఱ కెట్టియేర్పాట్లును నక్కఱలేదు. నీవే నాకు చాలును! ఒక టాక్సీ మాట్లాడుము! ఇప్పుడే వత్తును."

కావస్‌జీ టాక్సీకొఱకు బయలుదేరినాఁడు. ఏకాంత ముగ నాలోచించుకొనుట కాతనికిఁ గొంత వ్యవధి చిక్కినది. వివేకముపై నావరణముగప్పి మానవుని గోతిలోనికి త్రోసి వేయునట్టి యా యుత్సాహమద మిప్పుడాతనిలో లేదు. ఏమాత్ర మైన నున్నను, ప్రస్తుత మదికూడ మాయమైపోయినది. ఏ యుచ్చులో తాను మెడ దూర్చుచున్నదియు నాతఁ డెఱుం గును. తన సర్వస్వము నాశన మొనర్చుటకై శపూర్జీ శక్తి వంచన లేక ప్రయత్నించును. తనభార్య - గుల్‌శన్-తన్ను లోకమున నప్రతిష్ఠ పాల్జేయును. ఈ విపత్తులన్నియు నాతఁడు సహించును. శపూర్జీ నోరు కట్టుటకు కావలసిన సామగ్రి యాతనివద్ద నున్నది. తన భార్యనుగూడ స్త్రీ సమాజమున నోరెత్తుటకు వీలు లేకుండ చేయుటకుఁ దగిన కారణములాతని వద్ద నున్నవి. కాని యొకటే భయము-శీరీ చూపుచున్న యీ ప్రేమ యెన్నినాళ్లుండును? నేటివరకు నామె యాతని సౌజన్య మునేచూచినది. న్యాయము, సత్యము, ఔదార్యముతోగూడిన నాతని మాటలనే విన్నది. కాని తన సౌజన్యము, తన ప్రతిభ- దారిద్ర్యదేవతకు నిలయమైన - తనయింటికి వచ్చిన పిమ్మట నామెపై పని చేయునా? మృష్టాన్నములు లేకున్నను మానవుఁడు మాయూలు భోజనముతోఁ దృప్తిపడగలఁడు. సామాన్య

భోజనముకూడ లభింపక, ఎండుగడ్డి ముందువైచినచో జితేం ద్రియులైనను సహింపఁజాలరు. శీరీ తన్ను ప్రేమించుచున్నది. కాని, ప్రేమతోఁగూడిన ఆ త్యాగమునకు సైతమొక హద్దు కలదుగదా! భావుకతతోఁ గూడిన ఉన్మాదమున నాలుగు దినములు సహించును. ప్రత్యాఘాతములముందు భావుకత యెన్నినాళ్ళు నిలచును? ఈయాలోచనతో కావస్‌జీ కంపించి నాఁడు. నేటివరకామె రాణివాసమున నున్నది. ఇప్పుడొక పూరిగుడిసెలో నుండవలె. తివాచీలుండవు, ఫర్నిచరుండదు, నౌకర్లుండరు, కార్లు లేవు. తన జీతములో సగమామెకు సంగీతము నేర్పు ఉపాధ్యాయునికే చెల్లింపవలె! శపూర్జీ నుఁతెంత నీచమున కొడిగట్టినచో గాడీలతో తన్నింపవచ్చును! దెబ్బలకు తాను భయపడఁడు! అందువలన నాతనికి ప్రతిష్ఠయే కలుగును! కాని శీరీ భోగలాలసతను తృప్తిపరచుటెట్లు? ముసిలిముండ— నంటమనిషి సామాన్య భోజనము గొనివచ్చి యెదుటనుంచినచో శీరీ ముఖమున నెట్టి విరాగపూర్ణమైన ఛాయలు గోచరించును? ఆమె యాభోజనము చూచి తనను, తన దారిద్ర్యమును తిట్టుట కుపక్రమించినచో? లాభము లేదు! సౌజన్యముతో నభావమును నింపజాలము. ఆ సమయమున నామె రూప మెంతభయంకరముగ నుండును!

ఇంతలో నొక కారు కనిపించినది. అందు శపూర్జీ యున్నాఁడు. చేయెత్తి కారు నాపినాఁడు. పరుగెత్తి శపూర్జీ నడిగినాఁడు— "ఎచటికి పోవుచున్నారు?"

"షి కారుకు,"

"శిరీఖాను పార్కులో నున్నారు. ఆమెనుగూడ గొంపోవుడు!"

"ఈ యింటిలో నడుగు పెట్టనని నాతో పోట్లాడి వచ్చినది!"

"ఇట్టి స్థితిలో మీరు షికారుకు వెళ్లుచున్నారా?"

"ఇంటిలో కూర్చుండి ఏడ్వవలెనా?"

"ఆమె చాల దుఃఖించుచున్నది."

"నిజమా?"

"అవును! ఒకటే యేడుపు!"

"బహుశః బుద్ధి వచ్చినదేమో!"

"మీరామె నోదార్చినచో మీవెంట వచ్చును."

"నే నోదార్పకపోయినను నామె యూరడిల్లునో లేదో పరీక్షింపఁదలఁచితిని."

"నా కేమియు పాలుపోవుటలేదు. నాపై దయఁదలఁచి యామె నోదార్చి గొంపొమ్ము! నమస్కారము చేతును."

"ఈ ఓదార్పులను నటనలందు జీవితమందలి కొలఁది యానందమును నాశన మొనర్చుకొనజాలను."

కారు వెడలిపోయినది– కర్తవ్యభ్రష్టునివలె కానస్‌జీ యచటనే నిలుచబడినాఁడు. ఆలస్యమగుచున్నది. తానుగూడ నామెను మోసగించితి ననుకొనునేమో! ఆమెవద్ద కేఁగుట యెట్లు? తన గుడిసెలో నామెను ప్రతిష్ఠించుట హాస్యాస్పదముగఁదోచుచున్నది. ఆకుటీరము గుల్‌శన్ కేతగును. కోపగించుకొనును. విసిగుకొనును, తిట్టును, కాని నేళకింత ముద్ద పడ

వేయును. చిరిగిన గుడ్డలు కుట్టిపెట్టును, అతిథులను సంతోష ముగ నాదరించును. ఏదైన స్వల్పవస్తువు తెచ్చియిచ్చినను నుబ్బిపోవును. నీ యంతది లేదన్నచో నెంత చాకిరియైనను చేయును. కాని కోపమెక్కువ. మాటమాటకు మండిపడును. ఆ స్వభావమే యాతనికి గిట్టదు. ఆ నాఁడామె తన చెల్లెలి పుట్టినరోజున నేదైన కానుక పంపవలెనన్నది. ఇంకేమున్నది? దానితో తుపాను రేగినది. తానా సమయమున సంపాద కీయము వ్రాయుచున్నమాట నిజమే! కాని తనకు సంపాద కీయ మెంత ముఖ్యమో, ఆమెకు తనసోదరికి పంపవలసిన కానుకయు నంత ముఖ్యమే! తాను విసిగికొను టెందులకు? డబ్బు లేనిచో తియ్యని మాటలతో చెప్పవలె–'ప్రేయసీ! చేతిలో డబ్బులేదు, నాలుగైదుదినములలో నెచటనైన చూతును' అని. ఆవిధముగ చెప్పినచో నోరెత్తెడిది కాదే! నాలుగు సాధింపులు సాధించినను తనకు వచ్చిన లోటేమి? తానుతన రచనలందెంత సంయమమును చూపును! శిష్టా చారమును ప్రదర్శించును! మఱి భార్యపై నెందులకు కోప గింపవలె? తన యధీనమున నున్నదిగదా యని! మూతి ముడుచుకొని నాలుగు దెబ్బలను, ఇంతేగదా యని! మనము బలవంతుల వెనుక తోకాడించుచు తిరుగుదుము. చిత్తము చిత్తమందుము! మనకై తన సర్వస్వము నర్పించువారిపై నొంటికాలిపై లేచుచుందుము!

·

ఇంతలో నకస్మాత్తుగ నొక బండి వచ్చుచుండెను. దగ్గరకు వచ్చినంతనే యందుండి యొక మహిళ దిగినది.

అరే ! గుల్‌శన్ ! అతఁడు గబగబ ముందున కేఁగి కరస్పర్శ చేసినాఁడు–"ఎచటనుండి వచ్చితివి? నీ విషయమే ఆలోచించుచున్నాను."

ఆమె గద్గదకంఠముతో ననినది–"నీ కొఱకే బయలు దేరితిని. సాయంకాలము వసారాలో కూర్చుండి నీ యుత్తరము చదువుచున్నాను, ఎప్పుడు కునుకు పట్టినదో తెలియదు. దుస్స్వప్న మొకటి వచ్చినది. భయముతో మెలకువ వచ్చినది. నిన్ను కలిసికొనుటకై బయలుదేరితిని. ఇచట నిలబడినావేమి? ప్రమాద మేమియు లేదుగద? త్రోవలో నా గుండె దడదడ లాడినది."

కావన్‌జీ యామె నాశ్వాసించినాఁడు–"నేను క్షేమముగ నున్నాను. ఆ దుస్స్వప్న మేమిటి?"

"నీ వొక స్త్రీ కేదియో మాట యిచ్చినట్లు, ఆమె నిన్ను లాగికొనిపోవుచున్నట్లు కలగంటిని."

"ఎంత పిచ్చికల! నమ్మినావా! ఎన్ని పర్యాయములు చెప్పినాను–స్వప్నమనునది ఆలోచనా పూర్ణమైన మానసిక క్రీడయని ?"

"నీవు నావద్ద దాచుచున్నావు. ఏదియో జరిగినది! నీ ముఖ కవళికలే చెప్పుచున్నవి! ఈ సమయమున నిచట నిలబడి యుంటివేల? ఇది చదువుకొను సమయము గదా!"

"ఏమియు లేదు. కాస్సేపు షికారు వచ్చితిని."

"అబద్ధ మాడుచున్నావు. నామీద ఒట్టుపెట్టి చెప్పుము!"

"నీవు నమ్మకున్నచో నేనేమి చేతును?"

"ఒట్టు పెట్టుకొన వేమి?"

"ఒట్టు అనునది నా దృష్టిలో అబద్ధమును సమర్థించుట యన్నమాట."

ఆమె యాతనిని తీవ్రదృష్టితోఁ జూచినది – "సరే! ఇంటికి పద!"

"మఱల నాతో పోట్లాడుదువా?"

"గవర్నమెంటుతో పోట్లాడుచు, ఆ ప్రభుత్వము క్రిందనే నీవు జీవించుటలేదా? నేనును నీతో పోట్లాడుదును–నీతోనే జీవింతును."

"ప్రభుత్వమునకు లోబడి జీవించుచున్నానని నే నను కొనుటలేదే!"

"నోటిమాటల కేమి? నీలోని ప్రతియణువు నీవిషయ మంగీకరించును. లేనిచో ఈపాటికి జైలులోనుండియుందువు."

"సరే! నీవు పద! నేను కొంచెము సేపాగి వత్తును."

"నేను మాత్రము ఒంటరిగ పోను. నీ విచట నిలువ బడి యేమిచేతునో చెప్పుము!"

ఆమె నచటినుండి పంపివేయుట కాతఁడెంతయో యత్నించెను. కాని యామె పట్టుదలగూడ హెచ్చెను. చివ అకు విధిలేక శిరీ, శపూర్జీల కలహావృత్తాంత మామెకు జెప్పెను. ఈ నాటకమున తాను ధరించిన భూమికను మాత్రము చాల తెలివితేటలతో కప్పిపుచ్చెను."

"అయిన నీ కీ పిచ్చిగూడ పట్టినదన్నమాట!"

"పిచ్చి యేమిటి? నేనేమి చేసినాను? నా మిత్రుని భార్య నా సహాయము నపేక్షించినపుడు తిరస్కరించుట మానత్వమనిపించుకొనునా?"

"ప్రియా! అబద్ధమాడుటకు చాల తెలివి తేటలు కావలెను. నీ కట్టి తెలివి తేటలు లేవు–తెలిసినదా! మాటాడక శీరివద్ద కేగి మొక్క నమస్కారము చేయుము! సుఖముగా నింటికేగుమని చెప్పుము. ఎవరికిని సుఖమనునది పూర్తిగలభింపదు. భగవంతుఁడట్టి పక్షపాతమును చూపఁడు. గులాబిపూవునకు ముండ్లుండును! సుఖ మనుభవింపవలె నన్నచో దుఃఖములతోఁగూడ కలిపి యనుభవింపవలెను. సుఖముతో కలిసియున్న దుఃఖములను వేరుచేయుటకుఁ దగిన సాధనము నింకను విజ్ఞానశాస్త్రము కనిపెట్టలేదు. కష్టపడకుండ డబ్బు సంపాదించువారికి విలాసములే గోచరించును. ప్రపంచమునందలి సమస్త భోగములను కొనివేయుట కుపకరింపనిచో నది ధనమే కాదుగదా! శపూర్జీకున్న మార్గములు శీరికి మాత్రము లేకపోయెనా? ఆమెతో "శపూర్జీ యింటిలో నుండుము, అతని ధనము ననుభవింపుము, ఆఁతడు మఱచినట్లే నీవును నాతని భార్యవను మాట మఱచిపొమ్ము. కుమిలి కృశించుటమాని భోగవిలాసములననుభవింపు" మని చెప్పుము. నీవేనొకపర్యాయము చెప్పితివి–ఒకానొకప్పుడు ఫ్రాంసులో ధనిక స్త్రీలదే సమాజముపై సధికారమని. వారిభర్తలన్నియు చూచియు నోరుమూసికొనెడివారని. అదిరోఁ ధన ప్రసాదము!

పద! నీవు చెప్పజాలనిచో నేనే చెప్పెదను. విలాసవంతుని భార్య విలాసిని కానిచో నది యామె పిరికితనమన్నమాట!"

కావన్‌జీ చకితుఁడై నాఁడు - "నీవును ధనము నుపాసింతువుగదా!"

గుల్‌శన్ సిగ్గుపడినది — "అదియే జీవితమున నభిశాపము! మన సర్వనాశన మొనర్చునట్టి, మన కశుభము లొడగూర్చునట్టి వస్తువు కొఱకే మనము ప్రాకులాడుదుము. నేను చాలకాలము మానాయనగారి యూరిలో నుంటిని- చుట్టును రైతులు, కూలీలు నుండెడివారు. పాపము! పగలంతయు చెమటోడ్చి సాయంకాల మింటికి చేరెడివారు. విలాసమనునది పేరునకైనను కానవచ్చెడిది కాదు. ఈపట్టణములందు ప్రతి పెద్దకొంపయందును నిదే యేడుపు! అందరు నన్యాయముగ సంపాదించుచు నస్వాభావికమైన జీవితము గడుపుదురు! నీకుగూడ నెచటినుండియైన ధనము లభించినచో నీవుగూడ శపూర్జీ వైపోదువు. సందేహము లేదు."

"అప్పుడు నీవుకూడ, నింతకుపూర్వము నీవు చెప్పిన మార్గము ననుసరింతువు! అవునా?"

"కాదు-అవును!"

—(o)—

# సహగమనము

రెండు శతాబ్దములకు పైగా గడచిపోయినది! కాని చింతాదేవి పేరుమాత్ర మీనాటికిని స్మరింపఁబడుచున్నది. బుందేలుఖండమున నొక నిర్జనప్రదేశమున నేటికిని మంగళ వారమునాడు వేలకొలఁది స్త్రీ పురుషులు చింతాదేవిని పూజింతురు. ఆనాడా నిర్జనప్రదేశము మనోహర గీతములతో ప్రతిధ్వనించును. చుట్టుప్రక్కల నున్న గుట్టలన్నియు స్త్రీల చిత్రవిచిత్రములైన వస్త్రములతో శోభించుచుండును. ఒక యెత్తైన గుట్టపై దేవీమందిరము నిర్మింపఁబడినది. అద్దాని కలశముపై నెగురుచుండు రక్తధ్వజము చాల దూరమునకు కనపట్టుచుండును. గుడి చాల చిన్నది–ఒక్కసారిగ నిరువురు మనుష్యులు పట్టుటయే కష్టము. లోపల విగ్రహము లేదు. ఒక చిన్న వేదికమాత్ర మున్నది. క్రిందనుండి దిబ్బపైనున్న గుడివఱకు ఱాళ్ళతో నిర్మించిన మెట్లున్నవి. త్రొక్కిసలాటలో జనులు పడిపోకుండుటకై మెట్ల కిరువైపులను గోడ కట్టినారు. అచటనే చింతాదేవి సహగమనము చేసినది! లోకాచార ప్రకారము భర్త చితిలోగాదు – భర్త శరీర ముతోఁగాదు, ఆతని యాత్మతో సహగమన మొనరించిన దామె! ఆ చితిపై భర్తశరీరము లేదు– ఆతని మర్యాద భస్మీభూత మైపోవుచుండెను. ఆమె భర్త చేతులు జోడించి ప్రక్కనే నిలువబడి యున్నాడు. కాని యామె భర్తవైపు కన్నెత్తి చూచుటలేదు.

# 2

యమునాతటమున కాలపియనునదొక చిన్న పట్టణము. చింతాదేవి యా పట్టణమందలి యొక బొందిలీవీరుని కొమార్తె. తల్లి చిన్నతనముననే మరణించినది. పిల్లను పెంచిపోషించు భారము తండ్రిపైఁబడినది. అయ్యవి యుద్ధదినములు. యోధులకు కవచము విప్పుటకైనను తీరిక లేకుండెను — గుఱ్ఱము మీదనే భోజనము! జీనుపైఁగూర్చుండియే కునుకు తీయవలె! ఆమె బాల్యకాలమంతయు తండ్రితోఁబాటు యుద్ధక్షేత్రమునందే గడచినది. తండ్రి యా బాలిక నొక గుహలోగాని చెట్టుచాటునగాని దాఁచి యుద్ధక్షేత్రమున కేఁగెడివాఁడు. చింత యెట్టి జంకును లేక మట్టితో కోటలను నిర్మించి మఱల పాడుచేయుచుండెడిది. ఆమెకు బొమ్మరిండ్లే కోటలు! ఆమె బొమ్మలకు గుడ్డలు లేవు. ఆమె సైనికుల బొమ్మలను తయారొనర్చి యుద్ధక్షేత్రమున నిలిపెడిది. ఒక్కొక్కనాఁ డామె తండ్రి సాయంకాలమునకుఁ గూడ తిరిగి వచ్చెడివాడుకాడు. కాని యామె యేమాత్రమును భయపడెడిదికాదు — భయమున నేమియో యామె యెఱుఁగదు. ఆ నిర్జనప్రదేశమున ఆకలిదప్పికలతో రాత్రియంతయు నట్టే కూర్చుండి యుండెడిది. ఆమె నక్కలు ముంగిసలు, తోడేళ్లు మున్నగు జంతువుల కథలు విననేలేదు. యోధులవలన వీరుల ఆత్మోత్సర్గ గాథలే వినినది — ఆదర్శవాదిని యైనది.

ఒకపర్యాయ మామెకు మూడుదినములనఱకు తండ్రి జాడ తెలియలేదు. ఆమె యొక పర్వతగుహాలోఁ గూర్చుండి తనలో తాను శత్రువు లేవిధముగను కనిపెట్టజాలని కోటను నిర్మించుకొనుచున్నది. పగలెల్ల నా దుర్గచిత్రమును గుఱించియే యాలోచించును, రాత్రియంతయు నా దుర్గమును గూర్చిన కలలే కనును. మూడవనాటి సాయంకాల మామె తండ్రి యనుచరులు కొందరామెవద్ద కేతెంచి యేడువసాగిరి. చింత యాశ్చర్యపడి—"నాన్నగారెచటనున్నారు? మీరి ట్లేడ్చెద రేమి?" అని యడిగినది.

ఆ ప్రశ్న కెవ్వరును సమాధాన మీయలేదు. వారు రొమ్ములు బాదుకొనుచు నేడువసాగిరి. తన తండ్రి వీరస్వర్గ మలంకరించినాడని చింత తెలిసికొనినది. ఆ పదమూడేండ్ల బాలిక కంటినుండి యొక్క కన్నీటిచుక్క యైనను వెడల లేదు—మోము మలినము కాలేదు—నిట్టూర్పు సైతము వెలువడ లేదు. నవ్వి యిట్లనినది—"ఆయన వీరస్వర్గ మలంకరించి యుండ మీరంద ఱేల్లేడ్చుచున్నా రేమి? వీరులకిట్టిమృత్యువు కంటె నదృష్ట మేముండును? వీరులకు తమ పరాక్రమమున కింతకంటె నెక్కుడు పురస్కార మేమి లభించును? ఇయ్యది యేడునవలసిన సమయము కాదు. ఆనందింపవలసిన సమయము!"

సైనికుఁడొకఁడు చింతితస్వరముతో—"మా కిప్పుడు నిన్ను గుఱించిన చింతయే పట్టి పీడించుచున్నది. ఇంకనుండి నీ వెచట నుందువు?" అనెను.

"మీరీ విషయమై చింతింపవలదు. నేను నా తండ్రికి కొమార్తెను, ఆయన చేసిన పనియే నేనును చేతును. తన మాతృభూమిని శత్రువులబారినుండి రక్షించుట కాయన ప్రాణము లర్పించినాఁడు. నాకయ్యదియే యాదర్శము. మీరు మీ వారలనందఱను సిద్ధము చేయుడు. నాకొక గుఱ్ఱమును ఆయుధములను నిచ్చిన చాలును. భగవంతుని దయవలన నే నెవ్వరికిని తీసిపోకుండ నుందును గాక! ఒక వేళ యుద్ధక్షేత్రమునుండి నేను వెనుదిరిగినచో నన్ను పొడిచి చంపివేయుఁడు. నేను మిమ్ములను ప్రార్థించున దిదియే! పదండి! ఆలస్యము వలదు!"

చింతాదేవి నోటినుండి వెలువడిన ఈవీరవచనములకు సైనికులాశ్చర్యపడలేదు. ఈ కోమలమైన బాలిక యీ సంకల్పమును ధృఢముగ నాచరింపఁగలదా యను సందేహము మాత్రము కలిగెను.

# 3

ఐదు సంవత్సరములు గడచినవి. ఆ ప్రాంతమంతయు చింతాదేవి ప్రశస్తిప్రాకిపోయినది. శత్రువుల కాళ్లు తేలి పోయినవి. ఆమె సజీవవిజయమూర్తి! ఆమె బాణములకు, తుపాకి గుండ్లకు ఎదురుగ జంకుగొంకులులేక నిలబడుటను జూచినప్పుడు సైనికుల కుత్తేజనము కలుగును. ఆమె యెదుట వారు అడుగు వెనుకకెట్లు వేయఁగలరు? కోమలాంగియైన నాఁడుది ముందునకుసాగుచుండ పురుషుడెట్లు వెనుకకుతగ్గును?

సుందరసుదతీమణులముందువీరుల పరాక్రమము జేయమగును. ఆమె వచనబాణములే వీరులకు ఆత్మసమర్పణమునకు గుప్త సందేశము! ఆమె క్రీగంటిచూపు పిరికిపందకు సైతము పురుషత్వమును ప్రసాదించును. చింతాదేవి కీర్తికాంతులు నలువైపుల నుండియు వీరుల నాకర్షించి సేనను నింపినవి-ప్రాణములతో చెలగాటమాడు భ్రమరములు నలుదెసలనుండి వచ్చి యీ పుష్పముచుట్టును మూగుచున్నవి.

ఆ వీరయువకులందు రత్నసింహుఁడను రసపుత్రయువకు డొకడున్నాఁడు.

చింతాదేవి సైన్యమునందున్న ప్రతివాడును వీరుడే! అందరు నామె మాటపై ప్రాణమిచ్చువారే! ఆమె సంకేతముపై నగ్నిలో దుముకువారే! ఆమె యాజ్ఞయైనచో నాకసమందలి నక్షత్రములను త్రుంపుకొని వచ్చుటకు బయలుదేరువారే! కాని వీరందఱిలోనను రత్నసింహుఁ డగ్రగణ్యుఁడు. రత్నసింహుఁ డితరయువకులవలె గర్విష్ఠి కాఁడు. మోటువాడు కాఁడు. ఆడంబరమనిన నాతనికిఁ గిట్టదు. మిగిలినవారు తమ కీర్తి నింతలు నంతలుచేసి వర్ణించుకొందురు. వారి కాత్మప్రశంసలో నలపురాదు. వారేపనిచేసినను చింతాదేవి మెప్పుదల కొఱకే! వారి ధ్యేయము కర్తవ్యము కాదు— చింతాదేవి! రత్నసింహుఁ డేపనిచేసినను శాంతభావముతోఁ జేయును. స్వీయప్రశంస లేకపోగా నిజముగ తాను సింహమును చంపి వచ్చినను నాతడా విషయమును ప్రస్తావింపఁడు. అతని వినయము, నమ్రభావము, సంకోచపు హద్దులను కలిసినవి. ఇతరుల ప్రేమలో విలాసమున్నది-రత్నసింహుని

ప్రేమలోనున్నది త్యాగము, తపస్సు! మిగిలినవారందరు కమ్మని నిద్రపోదురు. రత్నసింహుఁడు నక్షత్రములను లెక్కించుచు రాత్రిగడపును. ప్రతివాడును చింతాదేవి తనకు దక్కునని ఆశించుచున్నాడు. రత్నసింహునకు మాత్రము నిరాశయే! అందువలననే యాతని కెవరి యెడలను రాగద్వేషములు లేవు. ఇతరులు కొందరు చింతాదేవి ముందు నవ్వుచు సవిలాసముగ మాటాడుచున్నప్పుడు వారి వాక్చాతుర్యమున కాతఁడబ్బురపడును-అతని నిరాశాంధకారము మఱింత దట్టమగును. ఒక్కొక్కప్పుడాతడు తన యసమర్థతకు తానే కోపగించుకొనును—స్త్రీలచిత్తమును మోహింపజేయు గుణములు భగవంతుడు తనకేల ప్రసాదింపలేదు? అతని విషయ మెవరికి గావలె? ఆతని మనోవ్యథనర్థము చేసికొనువారెవరు? తన్ను తాను నిందించుకొనును. అతనికి ప్రదర్శనా సామర్థ్యము లేదు.

అర్ధరాత్రి గడచినది. చింతాదేవి తన గుడారములో విశ్రమించుచున్నది. సైనికులుగూడ దుస్సాధ్యమైన మజిలీని సాధించిభోజనమొనర్చి హాయిగ నొడలు మఱచి పడియుండిరి. ముందొక దట్టమైన అరణ్యమున్నది. ఆ యరణ్యమున కావల శత్రువులు మొహరించి యున్నారు. చింతాదేవి వారు వచ్చుచున్నారని విని గబగబ ముందునకు సాగినది. తెల్లవారినంతనే శత్రువులపై దండయాత్ర ప్రారంభింపవలెనని యామె నిశ్చయించుకొనినది. తమరాక శత్రువులకు తెలియదని యామె విశ్వాసము. కాని అయ్యది కేవల మామె భ్రమ! తన సేన

లోని వాఁడొకఁడు శత్రువులతోఁ గలిసినాఁడు. ఇచటి విషయము లెప్పటికప్పుడు శత్రువులకుఁ జేయుచునే యుండెను. వారు చింతాదేవి నిశ్చింతతో నుండునట్లు - అనుమానము కలుగకుండునట్లు కుట్ర పన్నినారు. రహస్యముగ నామెను హత్యచేయుటకై సాహసికులైన ముగ్గురు సైనికులను నియమించినారు. ఆ ముగ్గురును మాంసుక మృగములవలె మెల్లగ నడవి దాటివచ్చి, చెట్లచాటున నుండి చింతాదేవి యుండు గుడారమెచటనున్నదో పరికింపసాగిరి. సేనయంతయునొడలు మఱచి నిద్రించుచున్నది - వారికి తమ విజయమున నెట్టి సందేహమును లేదు. వారు వృక్షముల చాటునుండి యీవలకు వచ్చి నేలపై మొసలివలె ప్రాకుచు చింతాదేవి యున్న డేరావైపునకు బయలుదేరిరి.

సైనికులందఱు నిద్రించుచుండిరి. అలసియున్న కారణమున పహరా సైనికులు గూడ నిద్రించియుండిరి. ఒక్కవ్యక్తి మాత్రము తన గుడారములో చలికి వణకుచు కూర్చుండి యుండెను. అతఁడు రత్నసింహుఁడు! ఈవిధముగ కూర్చుండి యుండు టాతనికి క్రొత్త కాదు. చింతాదేవి డేరా వెనుకభాగమున దన డేరాలోఁ గూర్చుండి ఈవిధముగ రాత్రియంతయు గడుపుట యాతనికి మామూలే! ఘాతకుల చప్పుడు విని యాతఁడు కత్తి చేపట్టి నిలువఁబడినాఁడు. చూడఁగా ముగ్గురు వ్యక్తులు వంగివంగి, పొంచి పొంచి వచ్చుచున్నారు. ఇప్పు డేమిచేయవలె? కేకలు వేసినచో సైన్యమున గందరగోళము బయలుదేరును. ఆ చీకటిలో సైనికులు తమలోతామే కొట్టు

కొని చనిపోదురు. ఇటు మువ్వురు వ్యక్తులతో తానొక్కఁడే పోట్లాడవలెనన్న ప్రాణభయము! ఎక్కువగ నాలోచించుటకు సమయము లేదు! యోధులకుండవలసిన శీఘ్రనిశ్చయగుణ మాతనిలో నున్నది. కత్తిలాగి యామువ్వురితోడను కలియ బడినాడు. కొంత సేపటివఱకు కత్తులు మ్రోగినవి. ఆపిమ్మట నిశ్శబ్దము! ఆ మువ్వురును నేల కొఱిగినారు. గాయములు తగిలి రత్నసింహుఁడు సైతము మూర్ఛితుఁడై పడిపోయి నాడు.

ఉదయమే చింతాదేవి లేచి చూచినది—నలుగురు పీనులు నేలకొఱగియున్నారు. ఆమెగుండె వేగముగ కొట్టుకొన నారంభించినది. దగ్గరకేఁగి చూచినది-ఆక్రమణకారులు మువ్వురును చనిపోయిరి. రత్నసింహుని శ్వాసయాడుచునే యున్నది. జరిగిన దంతయు నామె గ్రహించినది. నారీత్వము వీరత్వమును జయించినది. తండ్రిచనిపోయినప్పుడుగూడ కన్నీరు వెడలని యామె నేత్రములనుండి నేఁడశ్రుప్రవాహము వెల్లువైనది. ఆమె రత్నసింహుని తల తన తొడపై నిడికొని, హృదయాంగణమున రచించికొనిన స్వయంవరములో నాతని మెడలో జయమాల వేసినది.

## 4

నెలరోజులపాటు రత్నసింహుఁడు కన్ను తెఱువలేదు-చింతాదేవి కన్నుమూయలేదు. ఆమె యాతనినివదలి క్షణమైన నెచటికి నేఁగదు. తన సైన్యపు గొడవలేదు—శత్రువుల

దండయాత్రను గురించిన భయములేదు. తన విశ్వాసములనన్నిటిని రత్నసింహుని కొఱకై బలియిచ్చినది. నెలరోజుల తరువాత రత్నసింహుఁడు కన్ను తెఱచినాఁడు—తాను మంచముపై బడియున్నాఁడు. చింతాదేవి విసరుకఱ్ఱతో విసరుచున్నది. క్షీణస్వరముతో ననినాఁడు—'దేవీ! ఆ విసరుకఱ్ఱ నాకిమ్ము! నీకీ కష్టమేల?' అని.

చింతాదేవి హృదయ మాక్షణమున నపారమైన స్వర్గసౌఖ్యము ననుభవించుచున్నది. నెలరోజులనుండి తానెవని తలగడను కూర్చుండి నిరాశతో నేడ్చుచు గడపినదో ఆతడిప్పుడు మాట్లాడుచుండ నామె యానందమునకు మేరలేకపోయెను. ఆమె ప్రేమ మధురస్వరముతో ననినది—'ప్రాణనాథా ఈపనియే కష్టమైనచో నిఁక సుఖమనునదేది?' 'ప్రాణనాథా' యను నీ సంబోధనమున నేదియో విలక్షణమైన మంత్రశక్తి యున్నది. ఆతని కన్నులొక్కుమ్మడి తళుక్కుమనినవి. జీర్ణమైన యాతని ముఖముద్ర ప్రదీప్తమైనది. నరనరములందును నూత్న జీవనము నిండినది. ఆ జీవనమెంత స్ఫూర్తిమంతము! ఆ జీవనము నందెంతటి ఉత్సాహము, మాధుర్యము, ఉల్లాసము, కరుణ నిండియున్నవి! ఆతని ప్రత్యంగమును నుప్పొంగుచున్నది. ఆతని భుజములందొక యలౌకికమైన శక్తివచ్చినట్లున్నది. ప్రపంచమునంతను తాను జయింపగల ననిపించుచున్నది. ఆకాశములోని కెగురగలఁడు. కొండలఁ బిండి చేయఁగలఁడు! తన యభిలాషలన్నియు పూర్తియైనంత తృప్తి కలిగిన దాతనికి. ఆ క్షణమున

నాతనికిఁక కోరిక యనున దేదీ లేదు—శివుఁ డే తెంచి వరమడుగు మనినను నాతఁడు నిరాకరించును! ఆతని కే కోరికయు లేదు. తనవలె భాగ్యశాలి, సుఖవంతుఁడు, ప్రపంచమున మఱియొకఁడు లేడనిపించినది.

చింతాదేవి యింకను తన మాటను పూర్తిచేయ లేదు. అదే ప్రసంగమున నన్నది-"నాకొఱకై దుస్సహమైన బాధ ననుభవింపవలసి వచ్చినది."

రత్నసింహుఁడు లేచుటకు ప్రయత్నించుచు ననినాడు "తపస్సు చేయనిదే సిద్ధి యుండదుగదా!"

ఆమె తన కోమలమైన చేతులతో నాతనిని పరుండ బెట్టుచు నన్నది-"ఈసిద్ధికై నీవు తపస్సు చేయలేదు. అసత్య మెందులకు? నీవొక స్త్రీని రక్షించితివి. నేను కాకపోయినను, మఱొక స్త్రీయైనను నీ విట్లే రక్షించి యుండెడివాఁడవు. ఆ విషయమున నాకు నమ్మకమే! నేను యథార్థము చెప్పు చున్నాను. నేను ఆ జీవనము బ్రహ్మచారిణిగ నుందునని ప్రతిజ్ఞ చేసినాను. కాని, నేఁడు నీ యాత్మోత్సర్గము నా ప్రతిజ్ఞాభంగ మొనర్చినది. నేను వీరుల యొడిలో పెఱిగి నాను. ప్రాణములను పణమొసంగగల పురుషసింహుని చరణ తలముననే నా హృదయసమర్పణము జరుగగలదు. రసికుల హాసవిలాసములకు, దంభుల డాంబికములకు, తిరుగు బోతుల పన్నాగములకు నా దృష్టిలో విలువలేదు. వారి నటనను కేవలను వినోదమునకై తమాషాగా చూచుచుం దును. నిజమైన ఉత్సర్గభావమును నీ హృదయముననే చూచి తిని-నీకు దాసినైతిని-నేఁడు కాదు, చాల దినములనుండి."

# 5

మొదటి ప్రణయరాత్రి. నలుదైపుల నిస్తబ్ధత యావరించినది. ఆ యిరువురి ప్రేమజీవుల హృదయములందే అభిలాషలు తఱగలవోలె నువ్వెత్తుగ లేచుచున్నవి. నలుగెలంకుల ననురాగమయమైన వెన్నెల వ్యాపించియున్నది. ఆనగవు వెన్నెల తేటలో నధూవరులు ప్రేమాలాపములందు మునింగియుండిరి.

అకస్మాత్తుగ శత్రుసైన్యము కోటపైకి వచ్చుచున్నదను వార్త వచ్చినది. చింతాదేవి యులికిపడినది. రత్నసింహుఁడు లేచి నిలువబడినాడు—గోడకు వ్రేలాడుచున్న కత్తిని చేపట్టినాఁడు.

చింతాదేవి కాతరస్నేహపూర్ణ దృక్కులతో నాతనివైపుఁజూచియన్నది—"కొంతమందిని ఆ వైపునకు బంపుడు! మీరు వెళ్ళవలసిన యగత్య మేమున్నది?" అని.

రత్నసింహుఁడు తుపాకి భుజమున బెట్టుచు ననినాడు—"ఈ పర్యాయము శత్రుసైన్య మసంఖ్యాకముగ నుండునని నా భయము!"

"అయిన నేనును వత్తును!"

"వారు నిలువజాలరను నమ్మకము నాకున్నది. ఒక్కయుదుటున వారిని చెల్లాచెదరొనర్తును. మన ప్రణయరాత్రి విజయరాత్రిగ పరిణమించుటయే భగవత్సంకల్పము."

"ఏలాగో నా మనసు భయపడుచున్నది! మిమ్ము పోనిచ్చుటకు మనసొప్పుటలేదు."

అనురాగపూర్ణమైన, సహజ సరళమైన అనురోధము నకు విహ్వలుఁడై యామెను కౌగలించుకొనినాడు-"ప్రేయసీ తెల్లవారునప్పటికి తిరిగివత్తును."

చింత భర్త మెడలో చేతులు వైచి, కంట తడివెట్టి యన్నది-"ఎన్నాళ్ళకు వత్తురో యని భయమగుచున్నది. నా మనసు మీవెంటనే యుండును. ఏనాటికానాడు కబురు పంపవలెనుసుమా! మీ పాదములకు మ్రొక్కి వేడు చున్నాను - సమయాసమయముల గుర్తించి దండెత్తుడు. శత్రువును చూచినంతనే యొడలు మఱచి విఱుచుకపడుట మీ కలవాటు. సమయాసమయములను గుర్తించి యుద్ధము చేయుడు-ఇదియే నా ప్రార్థనము. నేఁడు మీరు చూపుచున్నట్లే త్వరలో మోము జూపుడు! పోయి రండు!"

చింతాదేవి హృదయము భయముతో నిండిపోయెను. నేటివఱ కా హృదయముపై విజయకాంక్ష యాధిపత్య మొన రించినది. ఆఁడుసింగమువోలె గర్జించి శత్రువులగుండె లవియ జేసిన వీరబాల నేఁడు రత్నసింహుఁడు గుఱ్ఱమెక్కుచుండ తన భర్తను రక్షింపుమని దేవికి మ్రొక్కుకొనుచున్నది. ఆతఁడు చెట్లచాటున కేఁగునంతవఱకు నామె యాతనివైపే చూచు చున్నది. పిమ్మట కోటబురుజుపైనెక్కి గంటల తరబడి యా దిక్కునకే చూచినది. కాని, శూన్యము! ఆ కొండ బండలు రత్నసింహు నంతకుముందే తమలో లీన మొనర్చ

కొనినవి. కాని చింతాదేవికిమాత్ర మాతఁడు ఎదురుగ వెళ్లు చున్నట్లే యుండెను. ఉషః కాలపు లోహితకాంతి చెట్ల సందులలోనుండి తొంగి చూచుచున్నది. అప్పటికామె మోహస్వప్నము భంగమైనది – నలువైపుల శూన్యముని తెలిసినది. ఆమె కంట నీరుపెట్టుచు బురుజుపైనుండి దిగివచ్చి శయ్యపై వ్రాలి మోము కప్పుకొని యేడువసాగినది.

## 6

రత్నసింహుని వెంట వందమందికంటె సైనికు లెక్కువ లేరు. కాని యందఱును సుదృఢులు, సుశిక్షితులు, సంఖ్యా బలమును తుచ్ఛముగ నెన్నువారు, ప్రాణమునిన లెక్కలేని వారు. వారు వీరరసోత్తేజకమైన పాటలు పాడుచు గుఱ్ఱములపై ముందునకు సాగుచున్నారు.

ధీరులార! వీరులార!
స్వాతంత్ర్య యోధులార!
అల్లదిగో శిరమున అగ్ని కిరీటం
అల్లదిగో కరమున ఖర కరవాలం
అల్లదిగో యురమున నెఱీ యురత్రాణం
అగ్ని కిరీటపు ధగ ధగలు
ఖర కరవాలపు చుఱ చురలు
నెఱీ యురత్రాణపు ఛమ ఛమలు

దేశగౌరవము తేజరిల్లగ
శత్రుహృదయముల జెండు జేయగ
అరి కరవాలము లదరిపోవగ
అగ్ని కిరీటపు ఆత్మగౌరవము
ఖర కరవాలపు కాంతుల పుంజము
నెఱి యురస్త్రాణపు నిండు సోయగము
నిలపండీ ! కదలండీ !
వీరులార ! ధీరులార !
స్వాతంత్ర్య యోధులార !

పర్వతములన్నియు వీరి వీరస్వరములతో ప్రతిధ్వనించు చున్నవి. రాత్రి గడచినది. సూర్యుఁడు తన ఆరక్తనేత్రములు తెఱచినాఁడు. ఈ వీరులపై స్వర్ణకాంతుల వర్షించినాఁడు.

ఆరక్తవర్ణ ప్రకాశమున నే యొక కొండపై శత్రుశిబిరములు కానవచ్చినవి.

రత్నసింహుఁడు తలవంచి, వియోగ వ్యథితమైన హృదయము నణచికొని మెల్లగ వెనుక వెనుక వచ్చుచున్నాడు. అడుగు ముందునకు వేయును. మనసు వెనుకకు లాగును. నేఁడు మొదటిసారిగ దుశ్శంక లాతని మానసమున పొడసూపినవి. యుద్ధమునకు పర్యవసాన మేమగునో యెవ తెఱుంగుదురు? ఆతడువదలివచ్చిన స్వర్గసుఖము, ఆతని గతస్మృతులు, హృదయమును వేధించుచున్నవి. సాశ్రుపూర్ణమైన చింతాదేవి నేత్రములు జ్ఞప్తికివచ్చును—కల్లెములాగి గుఱ్ఱమును వెనుకకు

మఱలింపవలె ననిపించును. క్షణక్షణము మనోత్సాహము క్షీణించుచుండెను. ఇంతలో నొక సర్దారుడువచ్చి—"అయ్యా! అటు చూడుడు! ఆ కొండపై శత్రువులు ముకాము చేసినారు. ఇప్పుడు మీ యభిప్రాయ మేమి? మాకు మాత్రము వెంటనే దండయాత్ర ప్రారంభింపవలెనని యున్నది. శత్రువు లొడలు మఱచి నిద్రించియున్నారు. మనము మీదపడినచో కాళికి బుద్ధి చెప్పవచ్చును. ఆలస్యమైనచో వారును మేల్కొందురు—అప్పుడు పరిస్థితి విషమించును. వెయ్యిమందికి తక్కువ యుండరు."

రత్నసింహుఁడు విచారములో శత్రుదళము వైపు జూచి—"అవును! అట్లే కనపించుచున్నది."

"అయిన, పోయి మీద పడుదమా?"

"మీ యిష్టము! కాని శత్రుసంఖ్య యధికముగ నున్నది!"

"పరవా లేదు. మనమింతకంటెను పెద్దసేనలను ఓడించినాము."

"నిజమే! కాని యగ్నిలో దుముకుట మంచిది కాదు."

"అదేమిమాట? సైనికుని జీవితమే యగ్నిలో దుముకుట! మా యాజ్ఞ యగుటయే యాలస్యము! మా పరాక్రమము చూడుడు!"

"మనము చాల అలసియున్నాము. కొంతసేపు విశ్రమించుట మంచిది."

"కాదు. వారికి మన జాడ తెలిసినచో ప్రమాద మగును!"

"అయిన ముట్టడింపుడు!"

క్షణములో సైనికులు కళ్ళెముల నదలించి శత్రు సేనపై దూకినారు. కాని కొండమీదికి చేరినంతనే శత్రువులు ప్రమత్తులై లేరని తెలిసినది. శత్రువుల విషయమై తామను కొనిన విషయము సత్యము కాదు. వారు నేలల్కొని యుండుటే కాదు-సశస్త్రులై కోటపైకి దండెత్తు ప్రయత్నములోనున్నారు! శత్రుసమీపమున కేఁగిన పిమ్మట తమ పొరపాటు తెలిసినది. కాని, ఇఁక యుద్ధము తప్ప గత్యంతర మేమి? అయినను వారు నిరాశ చెందలేదు. రత్నసింహుని వంటి వీరుడుండ వారికి భయ మేమి? ఇంతకంటెను ప్రమాదకరమైన సందర్భములం దాతడు విజయలక్ష్మిని చేపట్టినాడు. నేఁడుమాత్ర మాతడు తన ప్రరాక్రమమును చూపకుండునా? కనులన్నియు రత్న సింహుని వెదకుచున్నవి. కాని యాతని జాడలేదు. ఎచటి కేఁగినాఁడు? ఏమైనాఁడు? ఏమో! ఎవరికిని తెలియదు.

కాని యాతడెచటికిని పోఁజాలడు-తన మిత్రులను నీ కఠినపరిస్థితియందు విడిచి పోఁజాలఁడు. ఇచటనే యెచటనో యుండును. ఓడిపోనున్న పందెమును గెలిపించుట కేదియో యుక్తి నాలోచించుచుండును.

క్షణములో శత్రువులు వీరిని సమీపించిరి. బహు సంఖ్యాకమైన సైన్యముయెదట నీచిన్న సేన యేమిచేయగలదు?

నలువైపుల నుండియు రత్నసింహుని పిలుచుచున్నారు— "సోదరా! ఏమైతివి? ఎటుపోతివి? మాకాజ్ఞ యేమి? చూచితివి గదా శత్రువులు సమీపించినారు! నీవు మాటాడుట లేదు. ముందుకు వచ్చి మార్గము చూపుము. మాకుత్సాహమును కలిగింపుము!"

కాని యప్పటికిని రత్నసింహుఁడు కన్పట్టలేదు. శత్రుదళము వచ్చి నెత్తిన కూర్చుండినది. ఇరుపక్షములందును కత్తులు మ్రోగుచున్నవి. బొందిలీలు ప్రాణములను లెక్కింపక పోరుచుండిరి. ఒకడు ఒకనితో పోరుటయే కష్టము! ఒకడు పది మందికి సమాధానము చెప్పుటయా? అయ్యది యుద్ధము కాదు, ప్రాణములతోడి జూదము! బొందిలీలలో నిరాశాపూర్ణమైన అలౌకిక బలమున్నది. ప్రాణములకు తెగించి పోరాడిరి. వెనుకంజ వేయలేదు. వారిలో నిఁక సంఘటనము లేదు. ఎవడెంత ముందునకు పోయిన పోవును. ఈ యుద్ధ పర్యవసాన మేమగునను చింత యొవరికిని లేదు. ఒకడు శత్రుసేనాపంక్తులను జీల్చుకొనుచు సేనాపతిని సమీపించును. ఒకడు శత్రుసేనాపతి యేనుగుపై నెక్కుటకు ప్రయత్నించుచుండ చంపబడెను. వారి యమానుషిక సాహసమును శత్రువులు సైతము ప్రశంసించిరి. కాని యిట్టి యోధులు పేరును మాత్రమే గడించిరి గాని విజయమును గడింపలేదు. ఒక గంటసేపటిలో రంగస్థలమున యవనికాపాతమైనది. వినోదము పూర్తియైనది. ఒక తుపాను వచ్చినది-చెట్లను, సమూలము

పెకలించినది, నెడలిపోయినది. కట్టుదిట్టముగనున్నచో నీ నూర్గురే శత్రువుల పీచమడచెడివారు. కాని వారి నడుపాజ్ఞలలో నడిపింపవలసిన నాయకుని జాడయేలేదు. విజేతలైన మహారాష్ట్రులు ఒక్కొక్క శవమును పరీక్షించినారు. వారికి రత్నసింహుఁడనిన కన్నెఱ్ఱన! వారిచూపు లాతనినే వెదకును. ఆతఁడు బ్రదికియుండగా వారి కంటికి కునుకు లేదు. వారు కొండలు గుట్టలు వెదకిరి; కాని రత్నము లభింపలేదు. విజయము లభించినది; కాని అసంపూర్ణము !

# 7

నేఁ డేలకో చింతాదేవి హృదయమున ననేక విధములైన శంకలు బయలుదేరినవి. ఆమె యెన్నడును నింతటి దుర్బలురాలు కాలేదు. బొందిలీల కపజయ మేల కలుగునో కారణమామె చెప్పజాలదు, కాని యాభావ మామె హృదయమును పీడుటలేదు. పాపమా యభాగ్యురాలి యదృష్టమున ప్రేమోపభోగమే లిఖింపబడియున్నచో చిన్నతనమున తల్లి చనిపోవునా? తండ్రితోఁబాటు అడవులలో, గుహాలలో నుండవలసివచ్చునా? ఆ యాశ్రయముగూడ నెంతకాలమో లేదు. తండ్రికూడ చనిపోయినాడు. ఆనాటినుండి నేటివఱకు సుఖముగ-విశ్రాంతిగ నొక్కనాడైనను కూర్చుండి యెఱుఁగదు. విధాత తన యీ క్రూర కౌతుకము నింతటితో చాలించునా? అహో ! ఆమె దుర్బల హృదయమున నొక విచిత్రమైన భావముదయించినది-'భగవానుఁడు తన ప్రియుని

సకుశలునిగ నింటికి జేర్చినచో నాతనితోఁబాటు ఏ దూర గ్రామమునకో పోయి పతిదేవు నారాధించుచు జీవితముఁ గడపును. ఈ యుద్ధముల జోలికి పోను. నేఁడు మొదటిసారిగ నారీత్వ మామెలో నుదయించినది.

సాయంకాలమైనది. సూర్యభగవానుఁడు ఓడిపోయిన సైనికుని వలె నేదియో రక్షణస్థానమును వెదకుచున్నాఁడు. ఇంతలో శస్త్రహీనుఁడైన సైనికుఁ డొకఁడువచ్చి యామె యెదుట నిలువబడినాఁడు. చింతాదేవిపై వజ్రపాతమైనట్లున్నది. ఆహతవలె క్షణమూరకుండి, భయముతో సైనికునివద్ద కేతెంచి యాతురముతో ప్రశ్నించినది—"ఎవరెవరు జీవించి యున్నారు!"

"ఎవరును లేరు."

"ఎవరును లేరా? ఎవరును లేరా?"

చింతాదేవి తలపట్టుకొని నేలపైచతికిలబడినది. సైనికుఁడనినాఁడు—"మహారాష్ట్రులు సమీపించినారు."

"సమీపించినారా?"

"చాల దగ్గఱలో నున్నారు."

"అయిన వెంటనే చితిని పేర్పింపుము! తడవు లేదు!"

"మా ప్రాణము లర్పించుట కింకను మేము కొందఱము సిద్ధముగ నున్నాము."

"మీయిష్టము నా కర్తవ్య మింతటితో పూర్తియైనది."

"కోట మూసి వేసి నెలలకొలఁది పోరాడవచ్చును."

"అయిన వచ్చి యుద్ధము చేయుడు. నేనెవ్వరితోడను యుద్ధము చేయవలసిన పనిలేదు."

ఇటు అంధకారము వెలుగును నలిపి నాశనమొనర్చు కొనుచు వచ్చుచున్నది; అటు మహారాష్ట్రులు పచ్చని పొలములను త్రొక్కుచు వచ్చుచున్నారు. కోటలో చితి పేర్చుచున్నారు. దీపములు పెట్టినంతనే చితి యంటుకొనినవి. చింతా సాధ్వి, పదాఱు సింగారములతో - అనుపమ కాంతి పుంజములతో, ప్రసన్నముఖియై అగ్నిమార్గమున పతిలోక యాత్రకు బయలుదేరినది.

# 8

చితికి నలువైపులను స్త్రీపురుషులు గుమిగూడినారు. శత్రువులు కోటను ముట్టడించినారు-ఆ గొడవయే యెవరికిని పట్టదు. శోక సంతాపములతో నందఱి ముఖములు విచారముగ నున్నవి. తలలు వ్రాలినవి. నిన్న యీ ప్రదేశముననే కల్యాణమండపమునిర్మింపఁబడినది. నేఁడదేచోటచితినిర్మింపఁ బడినది. నేటివలెనే నిన్నను అగ్నిజ్వాలలు మిన్నుముట్టినవి! కాని నిన్నటి దృశ్యమునకు, ఈనాటి దృశ్యమునకు నెంతటి వ్యత్యాస మున్నది! అవును! స్థూలదృష్టికి వ్యత్యాసము కాన్పింపవచ్చును. కాని నిజమున కియ్యది నిన్నటి యజ్ఞమునకు పూర్ణాహుతి! నిన్నటి ప్రతిజ్ఞాపాలనము!

ఇంతలో గుఱ్ఱముల డెక్కలచప్పుడైనది. ఎవఁడో సైనికుడు వడివడిగ వచ్చుచున్నాడు. డెక్కల చప్పుడు

ఆగినది. సైనికుడొకడు పరుగు పరుగున నచటికి వచ్చినాడు. ప్రజ లాశ్చర్యచకితులైరి–"ఇతడు రత్నసింహుఁడే!"

రత్నసింహుఁడు చితివద్ద కేఁగి గొప్పగా చు ననినాడు—"ప్రేయసీ! నేనింకను జీవించియున్నాను. ఇదేమి పని?"

చితికి నిప్పంటించినారు. చింతాదేవి చీరనుండి యగ్ని జ్వాలలు వెలువడినవి. రత్నసింహుఁ డున్మత్తునివలె చితిలోనికి దూకినాఁడు. ఆమె చేయిపట్టుకొని యెత్తుకొనుచున్నాడు. జనులు చితిలోని కట్టెలను లాగివేయుచున్నారు. కాని చింతాదేవి మాత్రము భర్తవైపు కన్నెత్తియైనను చూడలేదు; చేతులతో మాత్రము తొలఁగిపొమ్మని సంజ్ఞచేసినది.

రత్నసింహుఁడు తలబాదుకొనుచు ననినాడు—"అయ్యో ప్రేయసీ! ఇది యేమి ఘోరము! నావైపు చూడవేమి? నేనింకను జీవించియున్నాను."

"నీ పేరుమాత్రము రత్నసింహుఁడే! కాని నీవు నా రత్నసింహుఁడవు కావు!" చితిలోనుండి వెలువడిన నీమాటలు!

"నావైపు చూడుము! చూడుము! నేనే–నీ దాసుడను–ఉపాసకుడను! నీ భర్తను!"

"నా భర్త వీరస్వర్గ మలంకరించినాడు."

"అయ్యో! ఇంకేమి చెప్పగలవాడను? ఓ ప్రజలారా! అగ్ని నార్పివేయుడు! దేవి! నేను రత్నసింహుఁడనే! నన్ను గుర్తింపజాలకున్నావా?"

అగ్నిజ్వాలలు చింతాదేవి ముఖపర్యంతము వ్యాపించినవి. అగ్నిలో కనులము వికసించినది. చింతాదేవి స్పష్ట

ముగ నన్నది—"బాగుగ గుర్తించితిని. నీవు నా రత్నసింహుడవు కావు. నా రత్నసింహుఁడు నిజమైన వీరుఁడు! అతఁడాత్మ రక్షణమునకై, తన తుచ్ఛమైన శరీరమును కాపాడుకొనుటకై తన క్షత్రియ ధర్మమును వీడువాడుకాడు. నే నేపురుషుని చరణదాసినైతినో యాతఁడు స్వర్గమున నున్నాఁడు. రత్న సింహుఁని అవమానపరుపనద్దు. అతడు వీరరసపుత్రుడు! రణ క్షేత్రమునుండి పాఱివచ్చి పిరికిపందకాఁడు!"

ఈ యంతిమ శబ్దములు వినిపించునప్పటికి అగ్ని జ్వాలలు చింతాదేవి శిరస్సుపైకి వ్యాపించినవి క్షణములో నా యనుపమరూపరాశి, ఆ యాదర్శ వీరరసోపాసిక, ఆ సాధ్వి యగ్నిలో విలీనమైపోయినది.

రత్నసింహుఁడు ప్రతిభుఁడై యా దుఃఖమయమైన దృశ్యమును జూచుచున్నాఁడు. పిమ్మట ఒక్క నిట్టూర్పు విడచి ఆ చితిలోనికే దూకినాడు.

—o—

# కారాగారము

మాజిస్ట్రేటు విచారణ పూర్తియై మృదుల ఆడువారి జైలునకు వచ్చినది. ఆమె ముఖము ప్రసన్నమై యున్నది. విడుదల కలుగునను ఆశాకుణకిరణము లామె కపోలములపై ప్రతిఫలించుచున్నవి. ఆమెను చూచినంతనే రాజకీయ కైదీల గుంపు చుట్టును మూగినది. 'ఎన్నిసంవత్సరములు వేసినారు?' అని ప్రశ్నలు ప్రారంభమైనవి.

మృదుల విజయగర్వముతో నన్నది – "నేను స్పష్టముగా చెప్పినాను–నేను పికెటింగు చేయలేదు. మీచిత్తము వచ్చినట్లు చేయుడు. నేనెవరిని ఆపలేదు, పట్టుకొనలేదు, త్రోయలేదు. ఎవనిని ప్రాధేయపడలేదు, ప్రార్థింపలేదు. గ్రాహకులెవరును నేనున్నచోటునకు రానేలేదు. కాని నేను దుకాణమువద్ద నున్నమాట నిజమే! చాలమంది స్వయంసేవకులచట బంధింపబడినారు. జనులుమూగినారు. నేనును నిలువబడితిని. అంతియే! ఇన్స్పెక్టరువచ్చి నన్ను అరెస్టు చేసినాడు."

క్షమాదేవికి న్యాయశాస్త్ర ప్రవేశమున్నది–"మాజిస్ట్రేటు పోలీసుల సాక్ష్యముతోడనే తీర్పుచెప్పును. నేనిట్టి కేసులనేకము చూచితిని."

మృదుల ప్రతివాద మొనర్చినది—"నేను పోలీసులదుంప తెంపితిని–పెద్దలు జ్ఞప్తికివచ్చియుండును. నేను కేసులో

—వాద ప్రతివాదములందు పాల్గొన దలఁచలేదు. కాని వారి అబద్ధపు సాక్ష్యములను విని సహింపలేకపోతిని. వారితో వాదమునకు దిగితిని. నేనేమంత తక్కువ తినినదానను కాను. నేను కొలఁదిగనో గొప్పగనో న్యాయశాస్త్ర మెఱుఁగుదును. 'ఈమె యేమియు మాటాడదు, మనయిష్టమువచ్చినట్లు చెప్పవచ్చు'నని తలఁచినారు పోలీసులు, పాపము! నేను ప్రతివాదము ప్రారంభించినంతనే తెల్లమొగము వేసినారు. నే నా ముగ్గురి సాక్ష్యమును అబద్ధమని ఋజువుచేసితిని. ఆ సమయమున నాకెట్టి యుక్తులు తోఁచిననో భగవంతుఁ డెఱుఁగును, మాజిస్ట్రేటు పోలీసు ఇన్స్పెక్టరును చీవాట్లు పెట్టినాఁడు. నాప్రశ్నలకు ఇన్స్పెక్టరు చచ్చు సమాధానము లిచ్చుచుండ మాజిస్ట్రేటు—'ఆమె యడిగినదానికి సమాధాన మిమ్ము! అనవసరపు వాగుడేల?' అనెడివాడు. అయ్యగారి ముఖమింతయయ్యెడిది. వారి నోళులన్నిటిని కట్టినాను. ఇంకను మాజిస్ట్రేటు తీర్పు చెప్పలేదు. కాని వదలిపెట్టునను నమ్మకమున్నది. కారాగారమనిన నాకు భయములేదు—కాని నేను మూర్ఖురాలివలె నేలయుండవలె? అచట మన మంత్రిగారుకూడ నున్నారు—ఇంకను ననేకులు సోదరీమణు లున్నారు. అందఱును విడుదల తప్పదనుచున్నారు."

జైలులోని స్త్రీలామెవైపు ద్వేషపూర్ణమైన దృక్కులతోఁజూచి వెడలిపోయినారు. ఆ స్త్రీలొక్కొక్కరికి సంవత్సరము, ఆరుమాసములు చొప్పున శిక్షవిధించినారు. వారెవరును కోర్టుయెదుట నోరువిప్పలేదు. వారి నీతిలో

ఇయ్యది యధర్మము. మృదుల కోర్టుయెదుట ప్రతివాదము సల్పుటవలన వారి దృష్టిలో చులకనయైనది. శిక్ష విధించిన పిమ్మట అనుభవించుటయే వారి పని! విడుదలయైనచో నిఁక ప్రాయశ్చిత్తమేది?

కొంతదూర మేఁగినపిమ్మట వారిలోనొకతెయన్నది- "ఈ విధముగ నైనచో మనముగూడ విడుదలఁ బొందెడి వారమే! కాని, ఈ కోర్టులలో న్యాయమాశించుట వృథా యని నిరూపించు భారము మనపై నున్నదాయెను!"

వేఱొక దేవి యన్నది—"ఇయ్యది క్షమింపుడని వేడుకొనుటతో సమానమే! పికెటింగుచేయుటకే నెళ్ళినది. లేనిచో నామెకు దుకాణమువద్ద నేమిపని? స్వయంసేవకులు బంధింపబడినారు. పోనిమ్ము! తానెందు కచటి కేఁగినది? ఇప్పుడు మాత్రము నేను పికెటింగునకై పోలేదనును. ఇది మాత్రము క్షమాపణము వేడుట వంటిదే కాదా!"

మఱొక వనిత యనినది—"జైలులో నుండుటకు గుండెలుండవలెను. ఆహా! ఓహో! అనిపించుకొనుటకు, మన్ననలందుట కానాడు వచ్చినది—ఇప్పు డేడుపువచ్చు చున్నది. ఇట్టిస్త్రీలను రాష్ట్రీయ కార్యక్రమముల పొలి మేరకే రానీయరాదు. ఆందోళనమే యప్రతిష్ఠపాలగును వీరివలన!"

క్షమాదేవి యొక్కతె మాత్రమే చింతాధీన మన స్కయై మృదులవద్ద కూర్చుండి యున్నది. ఆమె యొక విప్ల వాత్మకమైన ఉపన్యాసమిచ్చినందున శిక్షింపబడినది. వేఱొక జిల్లానుండి యిచటికివచ్చి నెలదినములైనది. ఇంకను ఎనిమిది

నెలలున్నది విడుదలగడువు. ఇచటనున్న పదునైదుగురు కైదీలలో నెవ్వరితోడను నామె కాత్మీయత కుదురలేదు. ప్రతి చిన్నవిషయముననుతమలోదాముపోట్లాడుకొనుట,శృంగార విలాస సామాగ్రికై లేడీవార్డర్ల చుట్టును తిరుగుట, చుట్టపక్కములను చూచుటకై యుద్విగ్నులగుట, ఆమెకేమాత్రమును నిష్టములేదు. బయటనున్నప్పుడున్న ఈర్ష్యాద్వేషములు, గుసగుసలు, జైలులోగూడ నున్నవి. రాజకీయ కైదీలో నుండవలసిన ఆత్మాభిమానము వారిలో లేదు. అందువలననే క్షమాదేవి వారికి దూరముగనుండును. ఆమెలో నున్న జాతీయభావమునకు, జాతిప్రేమకు నంతులేదు—ఆమెకు కావలసినది దేశమే! ఇతర గొడవ లామెకు పట్టవు. మిగిలిన వారందరు నామెను గర్విష్ఠియందురు. ఆమె యుపేక్షాభావమునకు వారును ఉపేక్షాభావము తోడనే సమాధాన మిచ్చుచుందురు. మృదుల యిచటికి కేతెంచి వారము దినములైనది. ఈ కొలఁది కాలములోనే క్షమాదేవికి మృదులతో స్నేహ మేర్పడినది. ఇతర స్త్రీలయందువలె నామెలో సంకీర్ణభావములుగాని, ఈర్ష్యాద్వేషములుగాని లేవు. ఇతరుల నామె నిందింపదు. వేళాకోళము చేయదు. ఆమెకు శృంగార లాలసలేదు. ఆమె హృదయమున కరుణ యున్నది. సేవాభావమున్నది, దేశప్రేమయున్నది. ఈమెతో నారునెలలపాటు హాయిగ గడచిపోవుననుకొనినదిక్షమాదేవి. కాని దురదృష్టమామె నిచటగూడ వెంటాడుచునేయున్నది. రేపు మృదుల ఇచటినుండి వెడలిపోవును. మజిల తానొంటరి

యైపోవును. ఒక ఘడియ సేపు కూర్చుండి తన బాధను, తన కష్టసుఖములను చెప్పుకొనుట కెవరున్నారు? వీరందరికంఠ్లును నెత్తిపై నున్నవి.

"ఇంకను నెనిమిది నెలలున్నదా సోదరీ?" యని యడిగినది మృదుల.

"ఏదియో యొకవిధముగ గడచి పోవును. కాని, నీ స్మృతి మాత్రము నన్ను బాధించుచుండును. ఈ వారము దినములలోనే నన్ను పూర్తిగ నాకర్షించినావు. నీవు వచ్చిన నాటినుండియు నాకు జైలు జైలువలె లేదు. అప్పుడప్పుడు వచ్చి కలిసికొనుచుండుము!"

క్షమాదేవి నేత్రములందు కన్నీరుబుకుటను చూచినది మృదుల—"అక్కయ్యా! తప్పకవచ్చి చూచిపోవుచుందును. రానిచో నాకేతోఁచదు. భానునుకూడ తీసికొని వత్తును. మీ పెద్దమ్మ పిలిచినదని చెప్పుదును - పరుగెత్తుకొని వచ్చును. నీతో నిజము చెప్పుచున్నాను - నాకిచట నెవరైన జ్ఞాపకము వచ్చుచున్నచో భానుయే! పాపము! కుఱ్ఱవెధవ! ఏడ్చుచుండును! నన్ను చూచి ముందు కొంతసేపు అలక ప్రారంభించును. "నాతో చెప్పకుండ నన్ను వదలిపెట్టి ఎచటి కేఁగినావు? మాయింటిలోనికి రావద్దు పో!" అనును. మహా ఆతతాయి వెధవ! క్షణ మూఱకుండడు, లేచుచునే పాటలు ప్రారంభము!—'జండా ఉంచ్చాలహే అమాలా' 'స్వారాజ్య దేవత గులి జేల్లో ఉన్నది'. ఒకకఱ్ఱ భుజానపెట్టి — 'కల్లు తాగితేపాపం' అనుచుండును వాడియాకారము చూడవలసి

నదే! తండ్రితో నను– 'నీవు బానిసవి!' అని. వారొక ఇంగ్లీషు కంపెనీలో నున్నారు. మాటిమాటికి రాజీనామా యివ్వవలె ననుకొందురు. కాని పొట్టకూటి కేదియో పని చేయక తప్పదాయె! ఆయన కా నౌకరీ యిష్టము లేదు. నిజము చెప్పుచున్నాను – నేను అడ్డగింపకున్నచో నేనాడో యుద్యోగము వదలిపెట్టి యుందురు. పాపము! ఆఫీసుకు పోవలె! భానును కనిపెట్టి యుండవలె! ఏమిచేయుచున్నారో! ఆ కుఱ్ఱకుంక మా అత్తగారివద్ద నుండ నేయుండడు. ఆమెయు పెద్దదైనది. వాడిచుట్టును నెచటికని తిరుగుచుండును? ఒడిలో పడియుండువాడైనచో నిబ్బంది లేదు. అత్తగారు నాపై కోపగించుననియే భయమగుచున్నది. నన్ను చూచుట కొక పర్యాయమైనను రాలేదు. వారే మొన్న జైలువద్దకు వచ్చినపుడు 'అమ్మకు నీమీాద కోపముగ నున్నద'ని చెప్పినారు. మూడు రోజులవఱకును నన్నము నీరు ముట్టలేదట–"ఈపిల్ల ముండ కులగౌరవమును గంగకలిపినది. వంశమునకే కళంకము తెచ్చిపెట్టినది. దుర్మార్గురాలు, దరిద్రురాలు!" ఇది యామె ధోరణి. ఆమె మాటలకు నాకు కష్టములేదు. ఏదియో! పూర్వకాలపు మనిషి! ఆమె మనలో కలసిపోవలెననుట అన్యాయము. పోయి యామెను బ్రతిమాలవలె! ఎంతయో బ్రతిమాలినగాని క్రోధము రాదు. రేపే నాటకము! చూడవలె! బ్రాహ్మణ సంతర్పణ! చుట్టపక్కములకు భోజనములు! మఱి జైలులో నున్నందుకు ప్రాయశ్చిత్తము జరుగవలెనుగదా! తప్పదు! ఏమైనను తల వంచుకొనవలసినదే!

కాని, అక్కయ్యా! నీవుమాత్రము వెళ్ళునప్పుడు మాయింటిలో నాలుగైదుదినములుండి వెళ్ళవలె! నేను వచ్చి నిన్ను వెంటతీసికొని పోదును.

క్షమాదేవి యిట్టి యానందప్రసంగములనుండి వంచితురాలైనది. ఆమె విధవ - యేకాకిని! జలియన్‌వాలాబాగ్‌లో నామెసర్వస్వము దోచుకొనబడినది-పతి, పుత్రుడు ఇరువురును ఆహుతియైనారు. ఆమెకిఁక 'నా' యనువారులేరు. ఆమె హృదయమింకను ప్రాణిమాత్రులను ఆత్మీయులుగ తలఁచునంతటి విశాలముకాలేదు. ఈ పదిసంవత్సరముల నుండియు జాతి సేవలో నామెహృదయము ధైర్యమును, శాంతిని అన్వేషించుచున్నది. ఏ కారణములు, ఏపరిస్థితులు తనసంసారమును నాశనమొనరించినవో, తన యొడిని శూన్యమొనరించినవో, వాటిని సమూలము నాశన మొనర్పవలెనని మనస్ఫూర్తిగ నిశ్చయించుకొనినది. అన్నిటికంటె మించిన త్యాగమునిదివఱకే చేసినది. ఇఁకహోమ మొనర్చుట కామెవద్ద హృదయముతప్ప మిగిలినదేమున్నది? మఱియొకరికైనచో జాతిసేవ యనునది సభ్యతకొఱకు సంస్కారము కావచ్చును; లేదా, యశోపార్జనమునకొఱకు సాధనము కావచ్చును! కాని క్షమాదేవికి మాత్ర మయ్యది ఘోరమైన తపస్సు. సంపూర్ణ నారీశక్తిని, శ్రద్ధను సాధించుటలో నిమగ్నమైనదామె. కాని, ఆకాశమున విహరించు పక్షికి సైతము తన గూడు జ్ఞప్తికి వచ్చును. క్షమాదేవి కట్టి ఆశ్రయమేది? ఇట్టి పరిస్థితులందే క్షమాగుణము సైతము ఆత్మసమవేదన

కాకులము జెందును. ఇచట మృదులనుజూచి ధన్యనై తినని భావించినది. కాని యా నీడకూడ త్వరలో తొలగి పోయినది.

క్షమాదేవి వ్యథిత స్వరముతో నన్నది—"మృదులా! నీ విచటినుండి వెడలిపోయిన పిమ్మట నన్ను మరచిపోదువు. నీకిది రైలులోని పరిచయమువంటిది. ఎచటనైన కనిపించి నచో గుర్తింపనుగూడ గుర్తింపవు. లేదా ఒక చిరునవ్వు నవ్వి 'నమస్తే'యందువు. ప్రపంచపు రివాజే యిట్టిది! ప్రతి వారికి తమ యేడుపుతోడనే సరిపోవును. ఇతరుల కొఱకు గూడ నెవ రేడ్తురు? నీకు మాత్రము నేను లెక్కలో నుండక పోవచ్చును. కాని, నాకు మాత్రము సర్వస్వము నీవే! నీ ప్రియజనులలో గూర్చుండి యప్పుడప్పు డీ యభాగ్యురాలిని గూడ తలచుచుండుము. భిక్షుకునకు గుప్పెడు గింజలే చాలును!"

మరున్నాడు మాజిస్ట్రేటు తీర్పువినిపించినాడు–మృదుల విడుదలయైనది. సాయంకాల మామె యితర స్త్రీలను కలిసి కొని పుట్టినింటినుండి వెడలుచున్నట్లు దుఃఖముతో సెలవు తీసికొనినది.

## 2

**మూ**డు నెలలు గడిచినవి; కాని మృదుల రెండొక పర్యాయమైనను రాలేదు. అనేకులు కైదీలను కలిసికొనుటకు వచ్చుచున్నారు–పండ్లు, తినుబండారములు, కానుకలు తెచ్చి

యిచ్చుచునే యున్నారు. కాని క్షమాదేవిని పలుకరించు వారేలేరు. ప్రతినెల చివఱి శనివారము నాడామె మృదులకై యుదయమునుండి సాయంకాలమునఱకు నెదురుచూచును. బంధుమిత్ర దర్శనమునకై ప్రత్యేకించిన కాలము గడచి నంతనే కన్నీరునింపి, 'యీ ప్రపంచ మే యింత !' యని తన మనసు నూరార్చుకొనును.

ఒకనాటి సాయంకాలమున క్షమాదేవి చూచినది- ఎదురుగ మృదుల వచ్చుచున్నది. ఆ రూపముగాని, ఆకాంతి గాని లేదు. పరుగునపోయి కౌగలించుకొని యేడ్చుచు నన్నది - "నీ స్థితి యిట్లైన దేమి మృదులా? రూప మే మారి పోయినది. జబ్బుపడినావా ?"

మృదుల కండ్లనుండి యశ్రువర్షము ప్రారంభమైనది- "జబ్బు పడలేదు. విపత్తులచే జుట్టబడినాను. నీవు నన్ను లోలోన తిట్టుకొనుచుందువు. ఆ నిష్ఠురమునకు ప్రాయశ్చిత్త మొనరించుకొనుటకే వచ్చితిని - చీకుచింతల నన్నిటిని దూర మొనర్చుకొని వచ్చితిని.

క్షమాదేవి నిలువెల్ల కంపించిపోయినది. అంతస్తల మందలి యగాధమునుండి యుత్తుంగతరంగ మొకటి ఉవ్వెత్తుగ లేచుచున్నట్లు, అందామె గతజీవనము భగ్ననౌకవోలె అటునిటు నూగుచున్నట్లు కనబ్బట్టినది. డగ్గుత్తికతో నన్నది - "సోదరీ! క్షేమమేనా ? మఱల నీవింత త్వరగ నిచటికేల వచ్చితివి ? మూడు నెలలైనను కాలేదే !"

మృదుల చిరునవ్వు నవ్వినది. కాని యాచిరునవ్వులో రోదన మిమిడియున్నది-"అందఱుకుశలమే! - శాశ్వతముగ! ఇఁక నెట్టి చింతయులేదు. జీవితపర్యంత మిచట నుండుటకు సిద్ధమే! నీ స్నేహమునకు, నీ దయకుగల మూల్యము నేఁడర్థమైనది." ఒక నిట్టూర్పు పుచ్చి మఱల ప్రారంభించినది — నీకు బయటి విషయములు తెలిసియుండవు. మొన్న నగరములో కాల్పులు జరిగినవి. పల్లెలలో నేఁడుతుపాకి కొనలతో పన్నులు వసూలు చేయుచున్నారు. రైతులవద్ద డబ్బులేదు - ఎట్లు చెల్లింపగలరు? ధాన్యపుధర రోజురోజుకు పడిపోవుచున్నది. బస్తా నాలుగురూపాయలు ధర! పంటవలన విత్తనముల సొమ్మువూడదు. కూలి యితరఖర్చులు ఆపైన! రైతులు పన్ను లెచటినుండి తెచ్చి కట్టగలరు? ఏమైననుసరే! నిర్బంధముగ పన్ను వసూలు చేయవలెనని ప్రభుత్వపు తాఖీదు. ఇల్లువాకిలి, పొలముపుట్ర సమస్తము వేలము వేసికొనినను రైతులకిష్టమే! కాని అధికారులకు తమ పనితనమును చూపింపవలెనను నుబలాట మెక్కువైనది. వారు ప్రజలను నలిపి నాశనముచేసినను ప్రభుత్వము వారినేమియు ననదు. అంతేకాదు, ప్రభుత్వము అధికారులదౌష్ట్యమును మఱింత ప్రోత్సహించుచున్నట్లు వినినాను. ప్రభుత్వమునకుఁ గావలసినది పన్ను! ప్రజల చావు బ్రదుకులతో దానికి నిమిత్తములేదు. చాలమంది జమీందారులు పన్ను వసూలుచేయలేమని నిరాకరించిరి. వారి సాయమునకై పోలీసులను పంపినారు. భైరోగంజ్ తాలూకా యంతను దోచివేయుచున్నారు. చనిపోనున్నవాఁడే పని

చేయడు? రైతులు ఇల్లువాకిండ్లు వదలి పారిపోవుచున్నారు. ఒక రైతు నింటిలో దూరి పోలీసులు వానిని బాదుచున్నారు. పాప మా రైతు క్రిందపడి దెబ్బలు సహించుచున్నాడు. కాని యాతని భార్యమాత్రము సహింపలేక పోయినది. చావుదగ్గఱకు వచ్చినదేమో, పోలీసులను తిట్టినది. ఇంకేమున్నది? ఒక పోలీసు ఆమెను వస్త్రవిహీనను చేసినాడు. ఏమని చెప్పుదును? సిగ్గగుచున్నది. తోటి సోదరులే యింత నిర్దయులగుట కంటె సిగ్గుచేటున్నదా? ఇక రైతు సహింపలేకపోయినాడు. కడుపునిండ తిండిలేదు. కాని పరిశ్రమ తప్పదు. శరీరములో బలములేదు, మనసులో సాహసము లేదు. కాని మానవ హృదయ మేగదా! పాపము స్పృహ తప్పి పడియున్నాడు. భార్యకేక విని లేచినాఁడు. ఒక్క తన్నుతో నా దురాత్ముని క్రింద పడవేసినాడు. వారిరువురును కలియబడి తన్నుకొనుచున్నారు. ఒక సామాన్య రైతు పోలీసుతో కలియబడుటయా? సహింపఁదగినదేనా? పోలీసులందఱును కలిసి యా రైతును చావబాదిరి. పాపమాతడు చనిపోయినాడు."

ఉమాదేవి యడిగినది—"గ్రామములోని వారందఱును తమాషా చూచుచున్నారా?"

మృదుల తీవ్ర స్వరముతో నన్నది—"సోదరీ! అన్ని విధముల ప్రజలకే చావు? పదిమంది వచ్చినచో పోలీసు లేమందురు? మాతో పోట్లాడుటకు వచ్చినా రందురు. లాఠీలు త్రిప్పుదురు. ఎవడైన కోపముతో నొక ఱాయి విసరినచో నింకేమున్నది ? కాల్పులు సాగింతురు. పదిమంది చని

పోదురు. అందువలననే ప్రజలట్టి ప్రదేశములకు మూగరు. కాని, యూరైతు చనిపోవుటతో గ్రామీణులకొడలు తెలియ లేదు. కఱ్ఱలు పుచ్చుకొని బయలుదేరినారు. పోలీసులను ముట్టడించినారు. నలుగు రైదుగురు కఱ్ఱలతో బాదినారేమో కూడను! పోలీసులు కాల్పులు సాగించినారు. ఇద్దరుముగ్గురు పోలీసులకు చిన్న దెబ్బలు తగిలినవి. వాటికి బదులుగ పండ్రెండుమంది నిండు ప్రాణములను తీసికొనినారు. ఇక క్షతగాత్రుల సంఖ్యను చెప్పనే యక్కరలేదు. ఈ తుచ్ఛుల కీ యధికారమిచ్చిన దిట్టు దుర్వినియోగ మొనర్చుమనియే కాబోలును! గ్రామములో సగము మందిని చిత్రవధచేసి విజయభేరి మ్రోగించుచు వెడలిపోయినారు. గ్రామీణుల మొఱ నాలకించువారెవరు? బీదలు, దయనీయులు, మాటలు రానివారు, అజ్ఞానులు, కాన యెంతమందిని చంపినను పరవా లేదు! పాపమా గ్రామీణులు కోర్టువారి సాయమర్థించుటను విరమించుకొనినారు. పోలీసులను పంపినది ప్రభుత్వమేగదా! ప్రభుత్వము పోలీసులపై చేసిన ఫిర్యాదులను వినునా? కాని, ఫిర్యాదు చేసిననేగాని మానవ హృదయమునకు తృప్తి యుండదు. గ్రామీణులు తమపట్టణవాసులతో ఫిర్యాదుచేయ సంకల్పించుకొనిరి. ప్రజలేమి చేయగలరు?— సానుభూతి చూపుటతప్ప? దుఃఖగాథను విని కంటనీరు పెట్టగలరు! దుఃఖితునకు సానుభూతితోఁ గూడిన అశ్రువులనిన మిక్కిలి ప్రీతి. చుట్టుప్రక్కలనున్న గ్రామీణులు తమ గాథనువిని, కన్నీటినికార్చి, సానుభూతి చూపినచో చాలును—వారికి

దుఃఖోపశన మగును. కాని పోలీసు లా గ్రామమును ముట్టడించి నాలుగువైపులను కాపలా కాయుచున్నారు. ఇయ్యది గాయముపై నుప్పు చల్లుటవంటిది. చావగొట్టును—కాని ఏడువనీయదు ప్రభుత్వము! చివరకు ప్రజ లా శవముల నెత్తుకొని పట్టణవాసులకు తమ కష్టగాథలను చెప్పుకొనుటకు బయలుదేరినారు. ఈ సన్నాహ సమాచారములు ముందుగనే పట్టణముఁ జేరినవి. ప్రజలీ శవములఁగాంచి యుత్తేజితులైనారు. రక్షకభటాధికారి యీశవముల యూరేగింపున కనుమతింపక పోవుటచే ప్రజలింకను నుద్రిక్తులైరి. ప్రజాసమూహము పెరిగిపోయెను. మా వారుగూడ నా సమూహములో నుండిరి. ఎన్నియో చెప్పినాను—"రోజులు బాగుండలేదు; వెళ్ళవ"ద్దని.

"నే నేమియు పోట్లాడుటకు వెళ్లుటలేదు" అనినారు. శవములతో షుమారొక వందమంది వెంటబయలుదేరినారు. అటు అయిదువందలమంది సశస్త్రులైన పోలీసులు వీరి నడ్డగించి నిలిచినారు.—పోలీసులేకాదు—మిలిటరీయే వచ్చినది. ఈ నిరాయుధులముందు కత్తులుత్రిప్పుటకు, తుపాకులు పేల్చుటకు వారికి సిగ్గయినను లేదు. సైనికుల బెదిరింపులకు ప్రజలు వెనుకాడలేదు. ఇంకేమున్నది!-కాల్పుల కనుజ్ఞనిచ్చినారు. ఒకగంట సేపటివరకు కాల్పులు సాగించినారు. ఎందరు చచ్చినారో, ఎందరు గాయపడినారో, యెవరెఱుంగుదురు ? మా యిల్లు రోడ్డుమీదనే యున్నది. నేను డాబాపై నెక్కి ప్రాణములు బిగియఁబట్టి చూచుచుంటిని. మొదటి వరుస కాల్పులకే కొందరు పలాయనము ప్రారంభించిరి. వందల

కొలఁది ప్రాణము లరచేతఁబట్టుకొని కాలికి బుద్ధిచెప్పచుం డిరి. సోదరీ! ఆ దృశ్యమింకను నాకన్నులఁ గట్టినట్లున్నది! అహో! ఎంత భయంకర, బీభత్సదృశ్యమది! ఎంతటి లజ్జా స్పదమైన దృశ్యమది! కాని ఆ పారిపోవువారి వెనుకనే ధీరులు వీరులునైనవారు పర్వతములవలె నిశ్చలులై నిలువఁ బడినారు. నిర్భయముగ చిరునవ్వుతో తుపాకి గుండ్లను తమ వక్షములతో నడ్డుచున్నారు — కాని వెనుకంజమాత్రము వేయరు. తుపాకుల మారణధ్వనులు వినిపించుచునేయున్నవి. తుపాకి ప్రేలినంతనే వేయి కంఠములనుండి యెక్కుమ్మడి 'జయ'నాదములు వెలువడి గగనమున నింగుచున్నవి. అహో! ఆ ధ్వని యందెంతటి యుత్తేజనమున్నది! వెళ్ళి తుపాకుల కెదురుగ నిలువఁబడవలె ననిపించినది. ఆ క్షణమున మరణ మనున దొకక్రీడవంటి దనిపించినది. అత్తగారుభానునెత్తికొని గదిలోనుండి నన్ను మాటిమాటికిని లోనికి రమ్మని పిలుచు చుండెను. నేనులోనికి రాకపోవుటవలన నామెయే భానునెత్తి కొని డాబాపైకి వచ్చినది. అదేసమయమున నొక'స్ట్రెచరు'పై నా హృదయేశుని శవముఁగొని పదిపదునైదుమంది గుమ్మము వద్ద కేతెంచిరి. అత్తగారి దృష్టి వారిపైఁబడినది. ఆమె జరిగిన దంతయు గ్రహించినది. పరుగునపోయి కుమారుని కౌగలించు కొని, ముద్దాడినది-ఆశీర్వదించినది. పిచ్చిదానివలె 'చౌకు' వద్దకు బయలుదేరినది. ఆవైపునుండి యింకను తుపాకిగుండ్లు వచ్చుచునే యుండెను. నేను క్రియాశూన్యనై, స్వామివైపొక సారి,అత్తగారి వైపొకసారి చూచుచు నిలుచుంటిని. అచటి

నుండి కదలలేదు-మెదలలేదు, ఏడువలేదు, భయపడలేదు-నాలో చైతన్యమే నశించిపోయినది.

క్షమ:-ఏమి? అత్తగారు సైత మా ప్రదేశమున కేఁగినదా?

మృదుల:- అవును! అదియే యాశ్చర్యము! తుపాకి ప్రేలుడు విని హడలిపోయెడి యామె—రక్తమునుగాంచి మూర్ఛిల్లెడి యామె సత్యాగ్రహులను త్రోసికొనుచు ముందున కేఁగినది. ఇంకేమున్నది? క్షణములో నామె శరీరము సైతము నేలవ్రాలినది. ఆమె నేలవ్రాలినంతనే సత్యాగ్రహుల సంయమము సడలిపోయినది. వ్రత బంధనములు పీడిపోయినవి. చెప్పరాని యావేశము వారి నావరించినది. వారు బలహీనులే! నిరాయుధులే! కాని ప్రతివాఁడును యుద్రేకమున తానొక యపారశక్తి సంపన్నుఁడనని భావించినాఁడు పోలీసులతోఁ గలియబడినారు. ఈ ప్రజాసమూహము వెల్లువలై వచ్చుటను గాంచినంతనే సైనికులకే భయము కలిగి కాలికి బుద్ధిచెప్పిరి. ప్రాణములఁ దక్కించుకొని పారిపోవుచున్నను వారు తుపాకులను కాల్చుటను మానలేదు. భాను డాబాపై నున్నాఁడు. ఏవైపునుండి వచ్చినదో యొక తుపాకి గుండు వచ్చి నా భానుని వక్షమునఁ దాకినది. నాబిడ్డ యచటనే కూలినాఁడు. కాని యా క్షణమున సైతము నా కండ్లనుండి యశ్రువులు వెడలలేదు. నాముద్దులపట్టిని యొడిలోనికిఁ దీసికొనినాను. ఆ పసికందు వక్షము రక్తమును చిమ్ముచున్నది. నేనిచ్చిన పాలబుణమును నెత్తుటితోఁ దీర్చుకొనుచున్నాఁడు. నా ముద్దుబిడ్డ రక్తముతోఁ దడిసిన వస్త్రములను దాల్చియున్న నే నొక విచిత్రమైన యున్మాదమును

వివశత్వమును ఆనందమును అనుభవించితిని. బహుశః వాని వివాహసమయమున వసంతోదకసిక్తమైన పట్టుపుట్టములఁ దాల్చినప్పుడైనను నంతటి సంతసము కలిగెడిది కాదేమో! బాల్యము, యౌవనము, మృత్యువు! ఈ మూడు మజిలీలను ఒకే యెక్కిలితో నతిక్రమించినాఁడు. బిడ్డను తండ్రియొడిలో పరుండబెట్టితిని. ఇంతలోఁ గొందరు స్వయంసేవకులు అత్తగారి శవమునుగూడ గొనివచ్చిరి—పరుండి చిరునవ్వు నవ్వుచున్నట్లున్నదామె మోము! నన్ను వారించుచునే తానగ్ని ప్రవేశము చేసినది—అదియే స్వర్గమార్గమన్నట్లు! కుమారుని కొఱకే బ్రతికినది-కుమారుని యొంటరిగ నెట్లు వదిలిపెట్టగలదు ?

నదీతీరమున మూడు శవములను నొకేచితిపై నుంచినపుడు నాకు స్పృహవచ్చినది. ఆ చితిలోనికి దుముకవలెననిపించినది. కుటుంబమంతయు నొకేపర్యాయము ఈశ్వర సమక్షమునకు పోవచ్చుననిపించినది. కాని యింతలో 'నీవేమంతటి ఘనకార్య మొనరించినావని యింతటి సన్మానమును కాంక్షించుచున్నావు?' యని యంతరాత్మ ప్రశ్నించినది. సోదరీ! అ చితిలో—మంటలలో నా యత్తగారు భానును ఒడిలో నిడుకొని చిరునవ్వు నవ్వుచున్నట్లు తోఁచినది. నా భర్త నా వైపు మందహాసముతోఁ జూచి—'పొమ్ము! నిశ్చింతతో నీ పనిని నెఱవేర్పుము' అని ప్రబోధించుచున్నట్లు తోఁచినది. ఆహా! ఆ ముఖమున నెంతటి తేజస్సు వెలుగొందినది! రక్తము, అగ్ని, ఈ రెంటియందే మానవులు దేవతలగుదురు!

తలయెత్తి చూచితిని. నదీతీరమున ననేకములు చితులు ప్రజ్వలించుచున్నవి. దూరమున కీ చితావలి, దేవతలు భారత భాగ్య నిర్మాణమునకై పెట్టిన బట్టీలవోలె నున్నవి.

ఆ చితులు భస్మమైన పిమ్మట మే మిండ్లకు బయలుదేరితిమి. కాని నా కా యింటిలో నడుగు బెట్టుటకు ధైర్యము చాలలేదు. నా కది నా యిల్లువలె తోఁచలేదు. నేనిపుడున్న దే నా యిల్లు! లేదా ఆ చితియే నా యిల్లుకావలె! నేనా యింటి తలుపైనను తెఱువలేదు. తిన్నగ మహిళాశ్రమమునకు బయలుదేరితిని. నిన్నటి కాల్పులతో కాంగ్రెసు కమిటీ విద్రోహపూర్ణమైన సంస్థగ పరిగణింపబడినది. కమిటీ కార్యాలయమును పోలీసులు వశమొనర్చుకొని సీలు వేసినారు. అంతటితో నాగక మహిళాశ్రమముపైనను దాడి చేసినారు. ఆశ్రమమునకు సైతము తాళములు వేసినారు. మేమొక చెట్టు క్రిందనే మా కార్యాలయమును ప్రారంభించితిమి. అచటనే మా కార్యక్రమము జరిగిపోవుచుండెను. ఇఁక మమ్ములను గోడ లడ్డగింపఁజాలవు-వాయువువలెనే మేమును స్వతంత్రులము!

సాయంకాల మొక ఊరేగింపును బయలుదేరఁదీయవలెనని నిశ్చయించుకొంటిమి. నిన్నటి రక్తపాతమునకుఁ జిహ్నముగ, మృతాత్మల శాంతికి-సంతోషమునకు ఊరేగింపు అవసరమే గదా! ఊరేగింపువలన ప్రయోజన మేమని కొందఱందురు. ఈ ఊరేగింపువలననే, జాతి జీవించియున్నదని, జాతి భయపడలేదని, యుద్ధక్షేత్రమున నిశ్చలముగ నిల

బడి యున్నదని విపక్షులకుఁ దెలియును. ఓటమి నంగీకరింపని ఆత్మాభిమానమును వ్యక్త మొనరించుట కీ యూరేగింపులే గదా సాధనములు! ఈ కాల్పులకు, ఈయత్యాచారములకు భయపడి మా లక్ష్యమును పీడువారము కామనియు, పాశవికబలమును, స్వార్థమును నాధారముగఁ గొని నిర్మింపఁ బడిన ఈ వ్యవస్థను నిర్మూల మొనరించినగాని విశ్రమింప మనియు విపక్షులకుఁ జూపవలె! అటు పోలీసులుసైతము ఊరేగింపును ప్రతిఘటించి తమ శక్తిని, తమ విజయమును ప్రకటించుకొనుట యవసరమని భావించిరి. బహుశః నిన్నటి సంఘటనము ఉద్యోగుల నైతికజ్ఞానమును జాగృత మొనరించెనని లోకులు భావింపవచ్చునుగదా! ఈ భ్రమను పోగొట్టుట పోలీసుల కర్తవ్యమైనది! 'మీపై శాసన మొనరించుటకే వచ్చినాము. శాసన మొనరించి తీరుదుము. మీ కష్టనష్టములతో మీ సుఖదుఃఖములతో మాకుపనిలేదు' అని చూపించదలఁచినారు వారు. ఊరేగింపును నిషేధించినారు. ఊరేగింపులోఁ జేరినచో కఠినముగ శిక్షింతుమని హెచ్చరించినారు. అధికారుల కండ్ల పొరలను తొలగించు సమాధానమునే ప్రజలిచ్చిరి. సాయంకాల మగుసరికి పదునైదువేలమంది ప్రజలు ప్రోగైనారు. ఈ యూరేగింపునకు నేతృత్వము నాకొప్పగింపఁ బడినది. నాకొక అనిర్వచనీయమైన బలము ఉత్సాహము కలిగినది. ప్రపంచజ్ఞానములేని అబల-ఇంటిలోనుండి బయటి కడుగిడని స్త్రీ, నేఁడు తన ఆత్మీయుల యుత్సర్గము కారణముగ గొప్ప ఆఫీసర్లకు, మహారాజులకు సైతము లభింపని మహోన్నతపదవిని — ప్రజాహృదయ సింహాసనమును

అధిష్ఠించినది. పోలీసులు జీతముకొఱకై వారికిబానిసలైనారు. ఉదరపోషణముకొఱకైన బానిసతనమువారిచే నెట్టిపనినైనను చేయించును. మహారాజులవలనఉపకారము నాశించియో లేక భయమువలననో వారి శాసనమునొదలఁదాల్తురు. ఈయ శేష ప్రజాసమూహము నావలన నేయుపకారము నాశించినది? నావలన నేమైన హాని జరుగునని భయమున్నదా? లేదే! అయినను నాయాజ్ఞను పాలించుటకుసిద్ధమైనది. ఎందువలన? ప్రజలు నా బలిదానము నాదరించుచున్నారు! వారి హృదయములందు స్వాతంత్ర్యేచ్ఛ బలీయమైనది. పరాధీన శృంఖలములను త్రెంపుకొనుటకై ప్రజలు త్వరపడుచున్నారు. అట్టి స్వార్థత్యాగమునకు, స్వాతంత్ర్యేచ్ఛకు, నన్ను ప్రతిమూర్తియని ప్రజలెంచుచున్నారు. అందువలననే నాకీ గౌరవమును ప్రసాదించినారు. నిశ్చితసమయమునకు ఊరేగింపు బయలుదేరినది. వెంటనే పోలీసులు నన్ను బంధించుటకు వారంటు చూపినారు. ఆ వారంటు చూచినంతనే నీవు జ్ఞప్తికి వచ్చితివి. ఆనాడు నీవు నా సానుభూతిని కాంక్షించినావు. నేఁడు నేను నీనుండి సహానుభూతినిఅర్థించుచున్నాను. కాని, నేఁడు నాలో లేశమైనను దౌర్బల్యము లేదు. నేను సమస్త దుఃఖముల నుండి విముక్తిఁబొందితిని. మాజిస్ట్రేటు ఎంతటి కఠినశిక్షను విధించినను నేను సిద్ధమే! నన్ను సమర్థించుకొనుటకు ప్రతివాదములుసలుపను. కారణమేమి? కారాగారమునకు బయట నుండి నేనుచేయగలిగిన దానికంటెకారాగారములోనుండియే యెక్కువచేయగలనని నే నెఱుంగుదును. కారాగారమునకు

బయట పోరపాట్లు జరుగవచ్చును, నోటికి వచ్చినట్లు వాగుట కవకాశమున్నది, సంధిరాయబారముల ప్రలోభన మున్నది, ప్రతిస్పర్ధను గూర్చిన భావములున్నవి. కాని, కారాగార మనునది భక్తిశ్రద్ధలకొక రేఖవంటిది. ఆ గీటును దాటి దుష్టప్రవృత్తులు లోనికి రాజాలవు. ఆరుబయట మండునట్టి యావము తన యుష్ణతను కోల్పోవును. కాని, ఆ యుష్ణమే యంత్రమున నిర్బంధితమై సంచాలనశక్తిని పొందుచున్నది.

ఇంతలో నితర స్త్రీలుగూడ వచ్చినారు. మృదుల వారి నందరిని కలిసికొని యభివాదనము సల్పినది. పిమ్మట 'భారతమాతకు జై' యను జయనాదములు కారాగార భిత్తికల నతిక్రమించి యాకసమున వ్యాపించినవి.



# గృహదాహము

సత్యప్రకాశుని జన్మోత్సవమున లాలా దేవప్రకాశుఁడు చాల ధనము వెచ్చించినాఁడు. ఆతని విద్యారంభ సంస్కారముగూడ నట్టహాసముగనే జరిగినది. అతఁడు షికారు పోవుట కొక చిన్నబండి యుండెడిది. నౌకరు సాయంసమయమున నాతనిని సాయంవిహారమునకుఁ గొంపోయెడివాఁడు. మరియొక నౌకరాతనిని పాఠశాలకుఁ గొంపోయి, యచటనే కూర్చుండి పాఠశాల వదలిన పిమ్మట నాతని నింటికిఁ గొని వచ్చెడివాఁడు. ఎంత బుద్ధిమంతుఁడు! ఎంత తెలివిగల పిల్లవాఁడు! పచ్చని ముఖము, పెద్ద పెద్ద కండ్లు, ఉన్నతమైన మస్తకము, పల్చని ఎఱ్ఱని పెదవులు, నున్నని శరీరము! ఆతనిని చూచినంతనే నోటినుండి 'ఈ బాలుడు చిరాయువై యుండవలె! ప్రతాపవంతుఁడగును' అని వెలువడును. ఆ బాలుని బుద్ధి తీక్ష్ణతకు జను లాశ్చర్యచకితు లయ్యెడివారు. అతనివదనబింబమున నెల్లప్పుడును నవ్వులు చిందుచుండును. ఆతఁడేడ్చుటగాని, మొండిపట్టు పట్టుటగాని యెవ్వరు నెఱుఁగరు.

వర్ష కాలము. దేవప్రకాశుఁడు భార్యతోఁగూడ గంగాస్నానమున కేఁగినాఁడు. నది వరదలుగ నున్నది – అనాథుని కన్నులవోలె! ఆతనిభార్య నీటిలో దిగి యాటలు మొదలు

పెట్టినది. ఒకసారి ముందుకు, ఒకసారి వెనుకకు, వచ్చును. ఒకసారి నీటిలో మునుఁగును. చేతులతో నీటిని చిందగొట్టును. దేవప్రకాశుఁడనినాడు—"చాలును! పైకి రమ్ము! జలుబు చేయును!"

"రొమ్ములోతువఱకు పోఁగలను! తెలిసినదా!"

"కాలు జారును! వద్దు!"

"కాలెందుకు జారును?" ఇట్లనుచునే యామె రొమ్ములోతున కేఁగినది. భర్త యనినాడు - "చాలును! ఇక ముందున కడుగు వేయవద్దు" అని. కాని యామె నెత్తిపై మృత్యుదేవత తాండవ మాడుచున్నది. మఱియొక యడుగు ముందునకు వేసినది. కాలు జారినది. నోటినుండి యొక కేక వెలువడినది. రెండు చేతులు ఆధారముకొఱకు పైకి లేచినవి. మఱల నీటిలో మునిఁగినవి. క్షణములో నామెను నదీదేవత మ్రింగివైచినది. ఒడ్డున నొడలు తుడుచుకొనుచున్న దేవప్రకాశుఁడు నీటిలోనికి దూకినాఁడు. వెంట నున్న నౌకరు మఱికొందరు పల్లెవారుకూడ నదిలోనికి దుమికి వెదకినారు. నిర్మల జాడ తెలియలేదు. పల్లెవారు చాలసేపు మునుఁగుచు వెదకిరి. కాని శవమైనను చేఁజిక్కలేదు. దేవప్రకాశుఁడు శోకముతో నింటి కేతెంచినాడు. సత్యప్రకాశుఁడు తనకొఱ కేమైన తెచ్చినాడేమోయని తండ్రినద్దకు పరుగెత్తినాఁడు. తండ్రి కుమారుని యొడిలోనికి తీసికొనినాఁడు — ఎంత ప్రయత్నించినను దుఃఖ మాగుటలేదు. 'అమ్మయేది?' అని ప్రశ్నించినాఁడు బాలుఁడు.

"నాయనా! గంగాభవాని యామెను విందుకు పిలిచినది."

బాలుఁడు జిజ్ఞాసాపూర్ణమైన దృక్కులతో తండ్రివైపు చూచినాడు – విషయము గ్రహించి – 'అమ్మా! అమ్మా!' యని యేడ్వసాగినాడు.

## 4

మాతృహీనుఁడైన బాలుఁడు ప్రపంచమున నన్నిటి కంటె కరుణాజనకమైన ప్రాణి. దీనాతిదీనములైన ప్రాణులకు సైత మీశ్వరుఁ డాధారభూతుఁడై యుండి ధైర్యముఁ గొల్పును. మాతృహీనుఁడైన బాలకున కా యాధారము గూడ నుండదు. తల్లియే బాలకుని కేకైకమైన ఆధారము! తల్లి లేనివాఁడు రెక్కలు లేని పక్షి !

సత్యప్రకాశున కేకాంతమనిన ప్రీతి యెక్కువైనది. ఒంటరిగ కూర్చుండును. ఇంటియందున్న జీవులవలన లభింపని సానుభూతి యాతనికి వృక్షములవలన లభించెడిది. తల్లి ప్రేమించుచున్నచో నందరును ప్రేమింతురు. ఆ మాతృప్రేమనుండి వంచితుఁడైనాఁడు – అందరు నాతనియెడ నిష్ఠురులైపోయినారు. తండ్రి కనులందా ప్రేమజ్యోతి లేదు. దరిద్రునకు భిక్షమిడువారెవరు?

ఆరు మాసములు గడచినవి. ఒక నాడాతనికి తన యింటికి కొక క్రొత్తతల్లి వచ్చుచున్నదని తెలిసినది. తండ్రి వద్దకు పరుగెత్తి యడిగినాడు—"నాన్నా! క్రొత్తయమ్మ వచ్చునా?" యని.

"అవును నాయనా! ఆమె వచ్చి నిన్నెంతయు ప్రేమించును" అనినాడు తండ్రి.

"నాతల్లి స్వర్గమునుండి తిరిగి వచ్చునా?"

"అవును! ఆమెయే వచ్చును!"

"నన్ను వెనుకటివలె ప్రేమించునా?"

దేవప్రకాశుఁ డేమనిసమాధాన మిచ్చును? కాని సత్య ప్రకాశుఁ డానాటినుండి చాల సంతోషముగ నుండెను. అమ్మ వచ్చును! నన్నెత్తికొని ముద్దాడును. నేనామె నేడ్పిం పను. మొండిపట్టు పట్టను. చక్కని కథలు చెప్పాదును.

వివాహ సమయము సమీపించినది. పెండ్లి ప్రయత్న ములు సాగుచున్నవి. బాలుఁడు సంతోషమును పట్టజాల కున్నాడు-క్రొత్తతల్లి వచ్చునని. పెండ్లి కాతఁడుకూడ వెళ్ళి నాడు. క్రొత్తగుడ్డలు కుట్టించినారు. పల్లకి యెక్కినాడు అమ్మమ్మ లోనికి పిలిచి యొడిలోనికితీసికొని యొకరూపాయి చేతిలోపెట్టినది. అచటనే క్రొత్తతల్లినిచూచినాడు. అమ్మమ్మ తన క్రొత్తతల్లితో నన్నది — "ఎంత మంచిపిల్లవాఁడో చూడుము! వీనిని ప్రేమించి పోషింపుము!" అని.

బాలుఁడు తనక్రొత్తతల్లినిజూచి ముగ్ధుఁడైపోయినాడ పిల్లలుగూడ సౌందర్యోపాసకులై యుందురు. సర్వాభరణ

లంకృతయైన లావణ్యమూర్తి యెదురుగ నిలబడి యున్నది. బాలుడు రెండు చేతులతో నామె చెంగు పట్టుకొని–'అమ్మా!' యని పిలిచినాడు.

ఎంతటి యరుచికరమైన శబ్దము! ఎంతటి అప్రియమైన లజ్జాజనకమైన సంబోధనము! నేటివరకును 'దేవప్రియా' యని సంబోధింపబడిన తమెకి, ఈ బాధ్యతతోఁ గూడిన, త్యాగక్షమాపూర్ణమైన ఈ సంబోధనము నచ్చలేదు. ప్రేమ విలాసాదులతోఁ గూడిన సుఖస్వప్నములఁ గాంచుచున్నదామె! యౌవనకాలపు మాదకతరంగములఁ దేలియాడుచున్నది. ఈ సంబోధన మామె స్వప్నభంగము గావించినది. క్రోపముతో నన్నది -'నన్ను 'అమ్మా' యని పిలువవద్దు!'

బాలుఁడు ఆశ్చర్యముతోఁ జూచినాడు. ఆతని బాల స్వప్నము భంగమైపోయినది. కంటివెంట నీరు కారినది. అమ్మమ్మ యన్నది–"అమ్మాయీ! పిల్లవాడెంత చిన్నబుచ్చుకొనినాడో చూడుము! ఏ విధముగ పిలువవలెనో వానికేమి తెలియును? 'అమ్మా!' యనినాడు. ఇంతలో నీకు కలిగిన ఆఘాతమేమున్నది?" అని.

"నన్ను 'అమ్మా!' యనుటకు వీలులేదు."

**3**

**వి**మాతకు సవతి పుత్రుఁడనిన నీర్ష్యాద్వేషములనుఁ గాగలసేమో నేటివఱకు నే మనోవైజ్ఞానిక పండితుఁడును

నిర్ణయింపలేదు-మనమొక లెక్కయా? దేవప్రియ గర్భముఁ దాల్చినఱకు నప్పుడప్పుడు సత్యప్రకాశునితో మాట్లాడెడిది. గర్భవతి యైనప్పటి నుండియు నామె వ్యవహారము మఱింత కఠోరమైపోయినది. ప్రసవకాలము సమీపించుకొలఁదియు నామె కాఠిన్యము మఱింత పెరిగినది. చంద్రబింబమువంటి పిల్లవాఁడామె యొడిలోనికి వచ్చినాడు. సత్యప్రకాశుని సంతోషమునకు మేర లేదు-ఎగిరినాఁడు-గంతులు వేసినాఁడు. పురిటియింటిలోనికేఁగి శిశువును చూచినాఁడు. పాపాయి దేవప్రియ యొడిలో నిదురించుచున్నాఁడు. సత్యప్రకాశుఁ డెంతో యుత్సాహముతో విమాత యొడిలోనుండి యా శిశువు నెత్తుకొనవలెనని యుబలాట పడినాఁడు. దేవప్రియ కోపముతో రోషముతో నన్నది-"జాగ్రత్త! వీనిని ముట్టు కొనవద్దు! ముట్టుకొనినచో వీపు బ్రద్దలగును!"

బాలుఁడు చిన్నబోయి వెనుదిరిగినాఁడు - డాబాపై కేఁగి యేడ్చినాఁడు. ఎంత అందముగ నున్నాఁడు పాపాయి! కొలఁదిసేపు ఒడిలో కూర్చుండబెట్టుకొనిన నెంత బాగుం డును! నేను పడవేయుదునా? ఆమె నన్నెందుకు విదిలించి కొట్టినది? ఈ విదిలింపుకు కారణము తల్లి జాగ్రత్త గాక మఱియొకటియని యీ యమాయకున కేమి తెలియును?

శిశువునకు జ్ఞానప్రకాశుఁడని నామకరణ మొనరించి నారు. దేవప్రియ స్నానాగారమునకునున్నది. సత్యప్రకాశుఁడు మెల్లగవచ్చి శిశువుపైనున్న గుడ్డనుతొలగించి అనురాగ పూర్ణదృక్కులతోఁ జూడసాగినాఁడు. శిశువు నెత్తుకొనవలె

వని యాతని మనసు తహతహలాడినది. కాని భయమువలన నెత్తుకొనలేదు. ఆ శిశు కపోలములను ముద్దిడుకొనుచున్నాడు. ఇంతలో దేవప్రియ వచ్చినది. పిల్లవానిని ముద్దుపెట్టుకొనుట చూచి మండిపోయినది. దూరమునుండియే కేక వేసినది—'పొమ్మచటనుండి!' అని.

బాలుఁడు దైన్యదృక్కులతో తల్లిని చూచుచు వెడలిపోయినాఁడు.

సాయంకాలము తండ్రి కుమారుని ప్రశ్నించినాడు—"నీవు పాపాయి నేడ్పించుచున్నా వెందులకు రా?" అని.

"నే నేడ్పించుటలేదు. అమ్మయే ఆడించుటకు నాచేతి కిచ్చుట లేదు."

"అబద్ధ మాడుచున్నావు. పాపాయిని గిల్లినావా?"

"లేదు! ముద్దు పెట్టుకొనినాను."

"అబద్ధ మాడుచున్నావు!"

"అబద్ధము కాదు."

దేవప్రకాశునకు కోపము వచ్చినది. బాలుని నాలుగు వాయించినాఁడు. మొదటిసారిగ తండ్రివలన బాలునికి దెబ్బ తగిలినది—ఏ యపరాధము లేకుండగనే! దానితో నతని జీవితమే పూర్తిగ మారిపోయినది.

# 4

ఆ నాటినుండి సత్యప్రకాశుని స్వభావము నందొక విచిత్రమైన మార్పు గానవచ్చినది. తఱచుగ నింటిలోనికి వచ్చుట మానివేసినాడు. తండ్రి వచ్చినచో ముఖము తప్పించును. భోజనమునకు పిలిచినచో, పిల్లివలె పోయి భోజనము చేయును. తన కిది కావలెనని యడుగడు—మాట్లాడడు! ఇదివఱకాతఁడు కుశాగ్రబుద్ధి. ఆతని ప్రవర్తనమునకు, చురుకుఁదనమునకు ఇరుగుపొరుగువారు ముగ్ధులయ్యెడివారు. ఇప్పుడాతడు చదువనిన దాగికొనును. మురికిగుడ్డలు ధరించును. ఇంటిలో నాతనిని ప్రేమించువారే లేరు. ఇతర పిల్లలతోఁబాటు సందుసందులు తిరుగును. గాలిపటము లెగురవేయును. తిట్లుగూడ బాగుగ నేర్చినాఁడు. శరీరము దుర్బలమైపోయినది. ముఖకాంతి మాయమైనది. దేవప్రకాశునివద్దకు వచ్చు చాడీల సంఖ్య యధికమైనది. నిత్యము సత్యప్రకాశునకు తిట్లు చీవాట్లు దెబ్బలు తప్పుటలేదు. ఏదైన పనిపై నింటిలోని కేఁగినచో నందరు దూరముగ నుండుచుందురు.

జ్ఞానప్రకాశునికి చదువు చెప్పుటకు నిత్యము నొక యుపాధ్యాయుడు వచ్చును. దేవప్రకాశుఁ డాతనిని సాయం వాహ్యాళికి గొంపోవును. బాలుఁడు ప్రసన్నవదనుఁడు! దేవప్రియ యాతనిని సత్యప్రకాశుని నీడకూడ సోకకుండ కాపాడుచున్నది. పిల్లలిరువురిలో నెంతభేదమున్నది! ఒకడు చక్కని దుస్తులను ధరించి సచ్ఛీలమునకు వినయమునకు ప్రతిమూర్తి

నోలేనున్నాఁడు. రెండవవాఁడు చింపిపాతలతో, కొంకెపనులతో, దొంగచూపులతో మాటిమాటికి బూతులు మాట్లాడును! ఒకటి ప్రేమపరిప్లావితమైన మొక్క! రెండవది పల్లవహీనమై, నీరులేక మోడువారిన చెట్టు! ఒకనినిఁ జూచిన తండ్రికి సంతోషము పెల్లుబుకును! వేరొకనినిఁ జూచిన నరికాలిమంట నెత్తి కెక్కును.

ఆశ్చర్యమేమన సత్యప్రకాశునకు తన తమ్ముఁడనిన లేశమాత్రమును నీర్ష్య లేదు. ఆతని హృదయమున నేమాత్రమైన కోమలభావము మిగిలియున్నచో నది తమ్ముని యెడల ప్రేమయే! ఆ మరుభూమియందిదియొక్కటే పచ్చఁదనము! ఈర్ష్య సామ్యభావద్యోతకము. సత్యప్రకాశుఁడు తనకంటె తన తమ్ము నెక్కువ యదృష్టవంతునిగ, గొప్పవానిగ భావించును. అతనియం దీర్ష్యాభావమే లోపించినది.

అసహ్యమునుండి యసహ్య ముద్భవించును. ప్రేమనుండి ప్రేమ ముద్భవించును. జ్ఞానప్రకాశుఁడుగూడ నన్నగారిని ప్రేమించును. ఒక్కొక్కప్పు డాతని పక్షమువహించి తల్లితో వాదించును - 'అన్నయ్య చొక్కా చిరిగిపోయినది. క్రొత్తది కుట్టింపవేమి?' తల్లి సమాధాన మిచ్చును— 'వాని కదిచాలును! ఇప్పుడేమున్నది? ఇఁకముందు ఊడదీసికొని తిరుగవలసినదే!' అని. జ్ఞానప్రకాశుఁడు తనకు తల్లిదండ్రు లిచ్చిన డబ్బులుదాచి అన్నకీయబోవును. కాని యాతఁడు తీసికొనఁడు. అతనికి తమ్మునితో నున్నంతసేపును నొక విధమైన శాంతి, ఆనందము లభించును. ఆ కొలఁదిసేపైనను

సద్భావసామ్రాజ్యమున విహరించును. ఆ కొలఁదిసేపును నిద్రాణమైయున్న ఆతనియాత్మ మేల్కొనును.

సత్యప్రకాశుఁ డొక పర్యాయము చాల రోజులవరకు పాఠశాలకు పోలేదు. తండ్రి యడిగినాడు – "పాఠశాలకు పోవుటలేదేమి? నీజీవితాంతము నేపుదుననుకొంటివా?"

"స్కూలు ఫీజు, జరిమానా కలిసి చాల పెరిగిపోయి నది. పేరు కొట్టివేసినారు."

"స్కూల్కు జీత మెందుకు కట్టలేదు? ప్రతి నెల జీత మిచ్చుచున్నాను గదా!"

"ప్రతిరోజు ఏదో చందాలుండును. జీతము చందా లకై యిచ్చివేసితిని."

"జరిమానా యెందుకు వేసినారు?"

"జీతము కట్టనందుకు."

"చందా లెందుకిచ్చితివి!"

"తమ్ము డిచ్చినాడు – నేనును నిచ్చినాను."

"తమ్ముడనిన నేడ్పుగా నున్నదా?"

"తమ్ముడనిన నేనెందుల కేడ్తును? ఇచట మాత్రమే మేము వేఱువేఱుగ నుందుము. బయట కేఁగినచో నిరుపు రము నొకటే! నా దగ్గఱ డబ్బు లేదని చెప్పుట నా కిష్టము లేదు."

"ఏమి! అట్లు చెప్పుటకు సిగ్గగుచున్నదా?"

"అవును! మీకే అప్రతిష్ఠ!"

"అయిన తమరు నా మానమర్యాదలు కాపాడుచున్నా రన్నమాట! చదువనిన నిష్టములేదని యేడువరాదా?

ఒక్కొక్క క్లాసు మూడేసి సంవత్సరములు చదివించుటకు నావద్ద డబ్బులేదు. నీ ఖర్చులు భరింపలేను. జ్ఞాని నీకంటె నెంత చిన్నవాడు! నీకంటె నొక్కే తరగతి తక్కువ! నీవీ సంవత్సరము తప్పక తప్పిపోదువు. వాడు త్తీర్ణుడగును. వాడు నీతో కలిసికొనును. అప్పుడు సిగ్గువచ్చును."

"విద్య యనునది నా యదృష్టమున లేనేలేదు."

"నీ యదృష్టమున నేమున్నది?"

"బిచ్చ మెత్తికొనుట!"

"అయిన బిచ్చమే యెత్తికొనుము. నాయింటినుండి వెడలిపొమ్ము." దేవప్రియగూడ వచ్చినది – "సిగ్గులేదు. మాటకుమాట సమాధానము చెప్పుచున్నాడు."

"బిచ్చ మెత్తికొను దుర్గతి పట్టువానికే చిన్నతనమున తల్లి లేకుండపోవును!" సత్యప్రకాశుఁ డనినాడు.

దేవప్రియ–"ఈ పుల్లవిఱుపు మాటలు నావద్ద పనికి రావు! అప్రతిష్ఠతో చచ్చిపోవుచున్నాను."

దేవప్రకాశుఁడు– "సిగ్గులేని వెధవ! పేరుకొట్టివేయింతును. బిచ్చ మెత్తఁదలచిన-చో బిచ్చ మెత్తికొనుము."

## 5

మఱునాడు సత్యప్రకాశుఁ డింటినుండి వెడలిపోవుటకు సిద్ధమైనాడు. అతని వయసు పదునారేండ్లు. ఇన్ని మాటలు పడిన తరువాత నింటిలోనుండు టాతని కసహ్యమైనది. చేతులు

కాళ్లు రానంతవఱకు, కిశోరావస్థయందలి అసమర్థతవలన సాధింపులు, నిరాదరము, నిష్ఠురత, తిట్లు, దెబ్బలు అన్నియు సహించినాడు. ఇప్పుడు చేతులు, కాళ్లు వచ్చినవి. ఇంకను నీబంధనము లేల? ఆత్మాభిమాన మనునది ఆశవలె చిరంజీవిని!

వేసవికాలము. మధ్యాహ్నసమయము. ఇంటిలోని వారందరును నిద్రించుచున్నారు. సత్యప్రకాశుఁడు తనగుడ్డలు చంకనపెట్టినాడు. చేతిలో నొక చిన్నసంచి తీసికొని బయలు దేరినాడు. ముందు వరండాలోనికి వచ్చినంతనే జ్ఞానప్రకాశుఁ డెదురై – 'ఎచటికిపోవుచున్నావన్నయ్యా?' అని యడిగినాడు.

"వెడలిపోవుచున్నాను. ఎచటనైనను నుద్యోగము చూసికొందును."

"నేను అమ్మతో చెప్పెదును."

"అయిన నీకుకూడ కనిపించకుండ పారిపోదును."

"నీవింటినుండి యేల వెడలిపోవలె? నాపై ప్రేమ లేదా?"

తమ్ముని కౌఁగలించుకొని సత్యప్రకాశుఁ డనినాడు– "నిన్ను వదలి వెళ్ళుటకు మనసొప్పుట లేదు. కాని, యిచట నావిషయ మెవరికిని పట్టదు. ఇచట నుండుట సిగ్గుచేటు. ఎచటనైనను నాలుగు డబ్బులు సంపాదించుకొని పొట్ట పోసికొందును. నేనింకెందుకు పనికివత్తును?"

"నీవనిన అమ్మకెందుకింత కోపము? నీతో మాట్లాడ వద్దనును?"

"అది నాయదృష్టము! ఏమని చెప్పను?"

"చదువు సంధ్యలలో శ్రద్ధ చూపవేమి?"

"ఎట్లు చూపఁగలను? నా విషయ మెవరికి కావలెను? పోనిమ్ము! తిప్పలు పడుదును! ఇంతేగదా! యనుకొంటిని."

"నన్ను మఱచిపోవుగదా! నీకు ఉత్తరములు వ్రాయు చుందును. నన్నుకూడ నీ వున్న చోటునకు పిలువుము!"

"సరే! నీ స్కూలు అడ్రసుకు నేనుకూడ ఉత్తర ములు వ్రాయుదును."

జ్ఞానప్రకాశుఁడు కంటతడిపెట్టి–"అన్నయ్యా నిన్ను వీడి యుండలేను! నీ వనిన నా కెంతయో ప్రేమ!" అని ఏడ్చినాఁడు.

"నిన్ను నే నెల్లప్పుడును తలఁచుకొనుచుందును." అని సోదరుని కౌఁగలించుకొని బయలుదేరినాఁడు సత్యప్రకాశుఁడు. దగ్గఱ దమ్మిడీలేదు! కలకత్తా ప్రయాణమైనాఁడు.

# 6

సత్యప్రకాశుఁడు కలకత్తా ఎట్లు చేరినాఁడో యా వృత్తాంతమంతయు వ్రాయుట వ్యర్థము. యువకులందు దుస్సాహస మెక్కువగనుండును. గాలిలో మేడలు కట్టుదురు– నేలపై నోడలు నడుపుదురు. కష్టములను లెక్కసేయరు. తమపై తమ కంతులేని విశ్వాసముండును. కలకత్తా చేరుట కష్టసాధ్యమైన విషయము కాదు. అతఁడు చదువరుఁడు. కల కత్తాలో నేమిచేయవలెనో, యెచట నుండవలెనో యాతఁడు

ముందుగనే నిశ్చయించుకొనినాడు. అతని చేతిసంచిలో వ్రాత పరికములున్నవి. గొప్ప పట్టణములందు జీవికానిర్వహణము చాల తేలిక – చాల కష్టముకూడను. చేతితో పనిచేయువానికి జీవయాత్ర సుగమము. కలముతో పని చేయువానికి కష్టము. అతనికి కూలిచేయుట నీచముగఁ దోఁచెను. సత్రములో సామానుంచి, పట్టణమందలి ముఖ్యస్థలము లన్నియు చూచి, ఒక పోస్టాఫీసువద్ద తన వ్రాత పరికరములను పెట్టుకొని కూర్చుండెను. చదువురానివారి ఉత్తరములు, మనియార్డర్లు వ్రాయుట మొదలుపెట్టినాడు. కొన్నిదినములవరకు కడుపునిండ తిండితినుటకు చాలినంత డబ్బు రాలేదు. క్రమక్రమముగ ఆదాయము పెరిగినది. కూలీలతో నెంతో వినయముగ మాట్లాడును. వారి యుత్తరములు విపులముగ, విస్తారముగ వ్రాయును. ఆ సంగతులు విని వారు సంతసించెడివారు. ఒకే విషయమును నాలుగైదు పర్యాయములు చెప్పినగాని చదువురానివారికి తృప్తి యుండదు. తన రోగ విషయమును విసుగు లేకుండ వైద్యునితో చెప్పు రోగివలె నుండును వారి స్థితి! సత్యప్రకాశుఁడు సూత్రమునకు వ్యాఖ్యాన మొనరించి యా నిరక్షరాస్యులను తృప్తిపొందించును. ఒకడు తృప్తిజెంది, పోయి, తన సోదరుని మఱియొకనినిఁగూడ తీసికొని వచ్చును. ఒక నెల గడచునప్పటికి కాతని యాదాయము రోజుకొక రూపాయికి పెరిగినది. అతడు తన మకాము సత్రమునుండి యెత్తివేసి పట్టణమునకు చివఱ నెల కైదురూపాయల కొకగది యద్దెకు తీసికొనెను. ఒకేపూట వండుకొని రెండుపూటలు భుజించును.

గిన్నెలు తానే తోముకొనును. నేలపై పరుండును. తన నిర్వాసనమున కాతనికి దుఃఖములేదు. ఇల్లు జ్ఞాపకమునకు రాదు. తనస్థితి కాతఁడు సంతుష్టుఁడై యున్నాఁడు. కాని జ్ఞానప్రకాశుని ప్రేమపూర్ణమైన వాక్కులు మాత్రము మఱపునకు రావు. ఆ యంధకారమున నదొక్కటే వెలుగు ! తాను వచ్చునప్పటి యా యంతిగు దృశ్యము కనుల గట్టినట్లుండును. జీవయాత్ర నిశ్చితమైన పిమ్మట తమ్మునికొక ఉత్తరము వ్రాసినాడు. సమాధానము వచ్చినది. ఆతని యానందమునకు మేరలేదు. జ్ఞాను తనను తలఁచుకొని విలపించుచున్నాడు; తనవద్దకు రానలెనని యుబలాట పడుచున్నాడు. ఆరోగ్యముగూడ సరిగలేదు. దాహము గొన్నవానికి నీటివలన జనించు తృప్తియే యా యుత్తరమువలన నాతనికి కలిగినది. నే నేకాకిని కాను. నన్ను ప్రేమించువారు గూడ నున్నారు! అదే యాతనికొక తృప్తి !

ఆ నాటినుండి తమ్మునికేదైన కానుక పంపవలెనను ఆలోచన కలిగినది. యువకులకు స్నేహితులు తేలికగ లభింతురు. సత్యప్రకాశునకు కొందరు మిత్రులులభించిరి. వారితో చాల పర్యాయములు సినిమాకేఁగినాడు. చాల పర్యాయములు కాఫీలు ఫలహారాలుకూడ నైనవి. అద్దము, దువ్వెన, నూనె మున్నగువానిపై నాసక్తి హెచ్చినది. స్నేహితులతో కలిసి యిష్టము వచ్చినట్లు తిరుగును. సంపాదించిన దంతయు మాయమై పోవుచున్నది. నైతిక పతనముతోఁబాటు వేగముగ శారీరక వినాశనముగూడ ప్రారంభమైనది. ఇంతలోతమ్ముని ప్రేమపూర్ణమైన ఉత్తర మాతనిని ఆపినది. కానుక పంపవలె

నను ప్రయాసలోపడి దుర్వ్యసనములకు తిలాంజలి యొసఁగి నాడు. సినిమా పిచ్చి వదలిపోయినది. ఏదియో వంకపెట్టి మిత్రులను తప్పించుకొనినాడు. భోజనముగూడ నెట్లో సరి పుచ్చుకొనుచున్నాడు. ధన సంచయాభిలాష కోరికల నణచి వైచినది. ఒక మంచి గడియారము పంపవలెనని యాతని కోరిక. కనీసము నలుబది రూపాయలైనను ఖరీదుండును. మూఁడు నెలలు దమ్మిడీయైనను అపవ్యయము చేయకున్న చో గడియారము వచ్చును. గడియారముఁ జూచి తమ్ముఁ డెంత సంతసించును! అమ్మ నాన్నకూడ చూతురు. నేను తిండిలేక చచ్చుటలేదని వారును తెలిసికొందురు. పొదుపులోఁబడి యాతఁడు దీపముఁగూడ వెలిగించుటలేదు. ఉదయనే పనిలో నికి బయలుదేరును. రెండు మూఁడణాలు పెట్టి యేదియో కొని తిని కడుపు నింపుకొనును. అతనివద్ద కేతెంచువారి సంఖ్య దినదినము పెరుగుచున్నది. ఉత్తర పత్రములేగాక టెలిగ్రాములు వ్రాయుటగూడ నేర్చినాడు. రెండు నెలలలో నేబది రూపాయలు ప్రోగైనవి. గడియారముతోఁబాటు బంగారపు గొలుసుకూడ కొని జ్ఞానప్రకాశుని పేర పార్శిలు చేసినాడు. అతనికిప్పుడు సంతానహీనునకు పుత్రుడు జనించి నంత సంతోషము కలిగినది.

## 7

'ఇల్లు' అనునది మానవునిలో కోమలమైన, మనోహర మైన, పవిత్రమైన, స్మృతులను మేల్కొల్పును. అయ్యది

ప్రేమకు వాసస్థానము. ప్రేమయనునది కఠినతపశ్చర్యను సల్పి పొందిన వరప్రసాదము !

కిశోరావస్థయందు దది తల్లిదండ్రులను, అప్పచెల్లెండ్రను, స్నేహితులను జ్ఞప్తి కెలయించును. ప్రౌఢావస్థయందు దది భార్య బిడ్డలపైనున్న ప్రేమకు వాసస్థానము. అయ్యాదియే మానవ జీవితమును స్థిర మొనర్చును. ఆ యిల్లే మానవుని సాగరలహరులందు కొట్టుకొని పోకుండ, ఈతిబండలను ఢీకొనకుండ కాపాడును. అయ్యాది జీవితమందలి సమస్త విఘ్నములనుండి బాధలనుండి రక్షించు మండపము !

సత్యప్రకాశుని యిల్లెచటనున్నది? ఏశక్తి యాతనిని కలకత్తాలోని ప్రలోభనములకు వశీభూతుఁడు కాకుండ కాపాడుచున్నది? మాతృస్నేహమా? పితృస్నేహమా? సంతాన స్నేహమా? ఇవి యేవియును కావు! ఆతని నుద్ధరించునది, ఆతని కానందమిచ్చునది, ఆతనినిరక్షించునది జ్ఞానప్రకాశుని స్నేహము! అతనికొఱకే ఒక్కొక్కదమ్మిడీ ప్రోగుచేయును. అతనికొఱకే కఠిన పరిశ్రమ మొనరించును. అతనికొఱకే ధనోపార్జనకై నూతనమార్గముల నన్వేషించును. తమ్ముని యుత్తరముల మూలమున తండ్రి యార్థికస్థితి బాగుండలేదని తెలిసినది. తండ్రి యొక ఇల్లు కట్టించుచున్నాడని, అందుకై యనుకొనిన దానికంటె నెక్కువ ఖర్చగుటవలన ఋణము చేయవలసి వచ్చినదని, అందుచే జ్ఞానప్రకాశునికి చదువు చెప్పు ప్రయివేటు మాష్టరు వచ్చుటలేదనియు తెలిసినది. అప్పటినుండి ప్రతినెల తమ్మునికేదో కొంత పంపుచునే యున్నాడు. ఇప్పుడాతడు కేవలము పత్రలేఖకుడే కాడు -

ప్రాతపరికరములతో చిన్నదుకాణము పెట్టినాడు. ఆదాయము బాగుగనే యున్నది. ఈ విధముగ నైదు సంవత్సరములు గడచినవి. రసికులైన మిత్రులు తమ కేమాత్రమును గిట్టకపోవుటచే దూరమైపోయిరి.

# 8

సంధ్యాసమయము. దేవప్రకాశుఁడింటిలోఁగూర్చుండి భార్యతో జ్ఞానప్రకాశుని వివాహవిషయము మాట్లాడుచున్నాఁడు. జ్ఞానప్రకాశుఁ డిప్పుడు పదునేడేండ్ల యువకుఁడైనాడు. బాల్యవివాహములకు వ్యతిరేకియైనను దేవప్రకాశుడీ శుభముహూర్తమును త్రోసివేయలేకున్నాడు. ఆ మహాశయుఁ డైదువేల రూపాయల కట్నమిచ్చుటకు సిద్ధపడినప్పుడు నిరాకరించు టెట్లు ?

దేవప్రకాశుడు – "నాకిష్టమే ! కాని నీ కుమారుఁడు గూడ నంగీకరింపవలెను గదా!"

"మీరు నిశ్చయముచేయుడు, వాఁ డిష్టపడ కేమి చేయును? ఆందఱు మొదట నాకక్కరలేదనియే యందురు."

"జ్ఞాను వద్దనుట కేవలము సంకోచముచేఁగాదు. అది సిద్ధాంతమునకు సంబంధించిన నిరాకరణము ! అన్నయ్య వివాహము కానంతవఱకు తాను పెండ్లి చేసికొనననని స్పష్టముగ చెప్పుచున్నాడు."

"వాని పెండ్లి యెవరుచేయుదురు? దేనినైన నుంచు కొనినాడేమో! వానికితోడు పెండ్లికూడనా? ఏమిచేయు చున్నాడో యెవరు చూచినారు?"

దేవప్రకాశునకు కోపమువచ్చినది - "దేనినైన నుంచు కొనినచో నీ కుమారునకు నెలకు నలుబది రూపాయలు పంపడు. మొదటినుండి నేటివరకానిధముగ నిన్ని వస్తువులను పంపడు. వానియెడల నీకింత ద్వేష మేలనో తెలియకున్నది. వాడుప్రాణము లర్పించినను నీ మనసు కఱుగదు."

దేవప్రియ కోపముతో నచటినుండి వెడలిపోయినది. ముందు సత్యప్రకాశుని వివాహము చేయుట యుచితమని యామెచే నంగీకరింపఁ జేయవలెనని యాతని కోరిక. కాని యామె సత్యప్రకాశునిమాట యెత్తనీయదు. దేవప్రకాశునకు ముందు పెద్దకుమారుని వివాహము చేయవలెనని యేయున్నది. కాని నేటివఱ కాతఁడు పెద్దకుమారున కుత్తరమైనను వ్రాయ లేదు. నేఁడు మొదటిసారిగ ఉత్తరము వ్రాసినాఁడు. ముందు ఇన్నిదినములనుండి యుత్తరము వ్రాయక మిన్నకున్నందు లకై క్షమింపుమని వ్రాసి, ఒక పర్యాయ మింటికి రావలసిన దని ప్రేమతో నర్థించినాఁడు—"నేను నాలుగు దినములుండి పోవువాడను. బ్రదికినన్నినాళ్లు బ్రదుకను. నా వినయమును నీవు త్రోసిపుచ్చినచో నాకు దుఃఖముకలుగును" అని వ్రాసి నాడు. జ్ఞానప్రకాశుని సంకోచమునుగూడ వివరించినాడు. మఱియొకందులకు కాకున్నను జ్ఞానుపై నీకున్న ప్రేమచే నైనను నీపై బంధనమునకిష్టపడవలెనని వ్రాసినాఁడు.

సత్యప్రకాశున కీయుత్తర మందినది. చాల దుఃఖించి గాఁడు. తన భ్రాతృస్నేహమునకు పరిణామమిట్లగునని తాను తలంప లేదు. తల్లిదండ్రుల కీ విషయమున నేఁడు మానసిక భాధ కలుగుచుండునని యీర్ష్యతోఁ గూడిన ఆనందము కలిగినది—'నాగొడవ వానికి దేనికి? నేను చనిపోయినను వారి కంటివెంట నీరు రాదు. ఏడుసంవత్సరములైనది, పొరపాటున గూడఉత్తరము వ్రాయలేదు. చచ్చినానో బ్రతికియున్నానో యను అజయేలేదు. ఇప్పుడు మేల్కొనినాడు. జ్ఞాను చివరకు వివాహమున కంగీకరించును - కాని అంత తేలికగ నంగీక రింపడు. ఏమైననేమి తనకు తన యసమ్మతిని తెల్పుట కవ కాశము చిక్కినది. జ్ఞానుకు నాపై ప్రేమ మున్నది. కాని ఆకారణమున పారివారికమైన అన్యాయమున నేను దోషిని కాఁజాలను. మన పారివారిక జీవనము పూర్తిగ నన్యాయ భూయిష్టము. ఇయ్యది, దుర్బుద్ధి, క్రౌర్యము, నృశంసతల బీజారోపణము గావించును. ఈ మాయలో చిక్కికొని మానవుడు తన సంతానమునకుఁగూడ శత్రువగును. కనులార చూచుచు నీబురదలో నడుగిడను. తమ్మునికినచ్చఁజెప్పుదును. నావద్దనున్న డబ్బంతయు వాని వివాహమునకై వెచ్చింతును. ఇంతకంటె నేనేమియు చేయఁజాలను. వాడుగూడ సవివా హితుఁడుగనే యున్నచో నింతలో మునిగిపోయిన దేమి? ఇంత మాత్రమున ప్రపంచము తలక్రిందులు కాదు. ఇట్టి తండ్రికి పుత్రులైనవారు వంశాచారమును పాలింపకుందురా?

ఈ యభినయమే వారి జీవితమున నాటకల ప్రారంభమగు నేమో! అదియేగదా నా సర్వనాశన మొనరించినది!'

సుగుణుడు సత్యప్రకాశుడు తండ్రికైదువందల రూపాయలు పంపినాడు. ఉత్తరమునకు సమాధానము వ్రాసినాడు—"మీరు నేటికైనను నన్ను తలంచుకొనుట నా యదృష్టము! తమ్ముని వివాహము నిశ్చయమైనందులకు ధన్యవాదములు! ఈ డబ్బుతో పెండ్లికుమార్తెకొక యాభరణము చేయింపుడు! ఇక నా వివాహ విషయము: నాకసలా నేను చూచిన—నేననుభవించిన విషయములను దృష్టియందుంచుకొని నేనీ కుటుంబపాశమున జిక్కుకొనినచో ప్రపంచమున నాకంటె మూర్ఖుడు సృష్టినొకడుండడు! క్షమింపుడు! వివాహ ప్రశంసయే నా హృదయమునకు బాధకలిగించును."

తల్లిదండ్రుల మాట వినుచుని సుగుణుడొక ఉత్తరము తమ్మునికి వ్రాసినాడు—"నేను చదువురానివాడను. మూర్ఖుడను, బుద్ధిహీనుడను. వివాహమాడు చమత్కారము నాకు లేదు. నేను నీవివాహమునకు రాజాలను. కాని నాకింతకంటె సంతోషకరమైన విషయము వేఱొండు లేదు."

## 9

దేవప్రకాశుడాయుత్తరము చదివి నిశ్చేష్టుడైనాడు. ఇంకను బలవంతము చేయుట కాతనికి సాహసము చాలలేదు. దేవప్రియ మూతి విఱిచి యనినది—"భడవా! పైకిమాత్రము ఏమియు నెఱుగనట్లుండును. లోపల నంతయు విషమే! నంద

మైళ్ళ దూరమున నుండి ఏవిధముగ కాల్చుకుతినుచున్నాఁడో చూడండి !"

జ్ఞానప్రకాశుఁ డాయుత్తరను చదివి మర్మాహతుఁడై నాడు. తల్లిదండ్రుల నిష్ఠుర వ్యవహారమువలననే తన యన్న యిట్టి భీషణవ్రతమునకు నిశ్చయించుకొనినాఁడు. వీరే యాత నిని వెడలఁగొట్టినారు—శాశ్వతముగ! అమ్మ కాతఁడనిన నంత నుంట యేలొకో! చిన్నతనమునుండియు నాతఁడు విధేయుఁ డని, ఆజ్ఞాపాలకుఁడని, గంభీర స్వభావుఁడనియు నాకు గుర్తు! ఆతఁడెన్నఁడును తల్లికెదురాడుట నేను చూడలేదు. నాతిండి నాగుడ్డలు చూచి యాతఁడీర్ష్యతో, అసూయతో నుండి పోవలసినదే! కాని నేనెన్నఁడు నాతని యీర్ష్యనుగాని అసూ యనుగాని చూడలేదు. ఈ స్థితియందాతనికి గార్హస్థ్య జీవన మనిన నసహ్యము కలుగుటలో నాశ్చర్య మేమున్నది? నేను మాత్ర మీవిపత్తులో నేలచిక్కుకొనవలె ? నేనుగూడ నిట్టి పరిస్థితులనే యెదుర్కొనవలసి వచ్చునేమో యెవఁడెఱుఁగును? అన్నయ్య బాగుగ నాలోచించియే యిట్టి నిశ్చయమునకు వచ్చి యుండును.

సాయంసమయమున, తల్లిదండ్రు లీ సమస్యను గూర్చియే యాలోచించుచున్న సమయమున జ్ఞానప్రకాశుఁ డేతెంచినాఁడు—"నేను రేపు అన్నయ్యను చూచుటకు వెళ్లు చున్నాను."

దేవప్రియ—"కలకత్తా వెళ్ళెదవా ?"

"అవును."

"అతని నే యేల పిలువఁగూడదు?"

"ఏ ముఖము పెట్టుకొని పిలుతుము? మీరు ముందే నాపరువు తీసి వేసినారు. ఇట్టి దేవునివంటివాఁడు కాని దేశములో నగచాట్లు పడుచుండ సిగ్గులేనివానివలె నేను..."

"నోరు మూయుము! పెండ్లి చేసికొనుట యిష్టము లేనిచో చేసికొనకుము! కాని పుండుమీఁద కారము చల్లకుము! తల్లిదండ్రుల ధర్మము కాబట్టి చెప్పుచున్నాము. లేనిచో మా కేమియు నష్టము లేదు—పెండ్లి చేసికొనినను సరే! లేదా ఆ జీవనము బ్రహ్మచారిగ నున్నను సరే; కాని నా యెదుటి నుండి లేచిపొమ్ము!"

"ఏమి? నాముఖమున్నను అసహ్యము కలుగుచున్నదా యేమి?"

"నీవు మేము చెప్పినట్లు విననప్పుడు భగవంతుడు మాకు పిల్లవానిని ప్రసాదింపలేదనియే యనుకొందుము."

దేవప్రకాశుఁడనినాడు—"దేని కా పాడుమాటలు?"

జ్ఞానప్రకాశుఁ డనినాడు—"సరే! మీకోరిక యట్లున్నచో నట్లే యగుగాక!"

దేవప్రకాశుఁడు మాటలధోరణి ముదిరిపోవుచున్నదని గ్రహించి కుమారుని సంజ్ఞచేసి వారించి, భార్య కోపమును శాంతపరుప ప్రయత్నించినాడు. కాని దేవప్రియ వెక్కి-వెక్కి యేడ్చుచు—"నేను వీని ముఖము చూడను," అనెను.

దేవప్రకాశుఁడు విసిగి యనినాడు—"నీవే వానిని కటు వచనములతో రెచ్చగొట్టితివి."

దేవప్రియ- "ఇది యంతయు నా చండాలుఁడు తెచ్చి పెట్టినాఁడు. దూరమునకూర్చుండి నాసర్వము నాశన మొనర్పఁ జూచుచున్నాఁడు. నాబిడ్డను నానుండి వేరు చేయుటకే యీ ప్రేమ నభినయించుచున్నాఁడు. వాని విషయము నేను బాగుగ నెఱుఁగుదును. వాని యీమంత్రము నా ప్రాణములు తీసి వదలును. లేనిచో నా బిడ్డ - నాకెన్నఁడు ఎదురాడని నాబిడ్డ నన్నేడ్పించునా?"

దేవప్రకాశుఁడు-"అయిన నీక పిడ్డు వివాహమే చేసికొనడా? ఏదో, కోపములో పిచ్చిగా వాగినాఁడు. ఆకోపము చల్లారినంతనే నచ్చఁజెప్పి యొప్పింతును."

దేవప్రియ-"నాబిడ్డఁడు నాచేయి దాటిపోయినాఁడు."

దేవప్రియ యనుమానము నిజమైనది. తండ్రి కుమారుని కెంతయో బోధించినాఁడు-"నీతల్లి యీ దుఃఖముతో చనిపోవును" అని. కాని ప్రయోజనము కలుగలేదు. అతనినోట 'సరే' యనుమాటరాలేదు. తత్ఫలితముగ తండ్రిగూడ నిరాశఁ జెందినాఁడు.

మూఁడు సంవత్సరములవఱకు పెండ్లిండ్ల దినములందీ ప్రశ్న ముదయించెడిది. కాని జ్ఞానప్రకాశుఁడు తన పట్టు దల వీడలేదు. తల్లి యేడ్పులు వ్యర్థమైపోయినవి. ఆతఁడొక విషయమున మాత్రము తల్లి మాట నంగీకరించినాఁడు-అన్నయ్యను కలిసికొనుటకు కలకత్తా మాత్రము పోలేదు.

ఈమూఁడు సంవత్సరములలో నింటియందు చాల మార్పు వచ్చినది. దేవప్రియ ముగ్గురు ఆఁడపిల్లల వివాహ

ములు నై పోయినవి. ఇంటిలో నామెతప్ప ఆడదిక్కు లేదు. శూన్యముగ నున్న యిల్లామెకు బాధాజనకమైనది. నిరాశతో క్రోధముతో వ్యాకులపడును, భర్తను సాధించును. ఆ సోదరు లిరువురి యుత్తర ప్రత్యుత్తరములు సాగుచునే యున్నవి.

దేవప్రకాశుని స్వభావములో నొక విచిత్రమైన మార్పు వచ్చినది. అతడు పెన్షన్ పుచ్చుకొనినాడు. ధర్మ గ్రంథముల నధ్యయనము చేయుచుండును. జ్ఞానప్రకాశుఁడు కూడ 'ప్రొఫెసర్' పదవిని పొందినాడు. దేవప్రియ యేకాకిని యైనది.

దేవప్రియ తన పుత్రుని గార్హస్థ్యము వైపున కాకర్షించుటకు నిత్యము విశ్వప్రయత్నము చేయును. చుట్టు ప్రక్కల నెవరిపిల్ల సుందరియో, గుణవంతురాలో, చదువు కొనినదో వ్యాఖ్యానించుచుండును. కానియాతని కీమాటలు వినుటకైనను తీరిక లేదు.

వీధిలో ననేక యిండ్లలో పెండ్లిండ్లు జరుగుచున్నవి. కోడండ్రు వచ్చుచున్నారు—బిడ్డల నెత్తుకొనుచున్నారు. ఇండ్లు కలకలలాడుచున్నవి. ఒకయింట అంపకములు, వేఱొక యింట ఆగమనములు! ఒకయింట మేళతాళములు! వేఱొక యింట పేరంటముల కోలాహలము! ఇవియన్నియుఁజూడ నామె మనసు చలించుచుండెను. ప్రపంచమున తానొక్క తెయే దురదృష్టవంతురాలు. నా యదృష్టమున నీ సుఖము లేదు. కోడలిముఖము చూచు సుదినము, మనుమని ఎత్తు కొను సుదిన మెన్నడైన వచ్చునా? నాయింటఁగూడ మంగళ

వాద్యములు చెలరేగు సుదినము వచ్చునా? రాత్రింబవళ్ళదే యాలోచనతో పిచ్చియెత్తుచున్నది. ఉన్నట్లుండి సత్యప్రకాశుని దెప్పుచుండును-అతఁడే తన 'ప్రాణఘాతకుఁ'డని. తల్లీనత ఉన్మాదమునకు ప్రధానగుణము. తల్లీనత యనునది బహు రచనాశీలమై యుండును. అయ్యది యాకాశమున దేవవిమానము లెరుగునట్లు చేయును. కూరలో నుప్పెక్కువైనచో శత్రువేదో ప్రయోగము చేసినట్లుతోఁచును. సత్యప్రకాశుఁడింటికి వచ్చినట్లు, తన్ను చంపయత్నించినట్లు, తన కుమారునికి విషము పెట్టుచున్నట్లు భ్రాంతి కలుగుచుండును. ఒకనాఁడామె సత్యప్రకాశుని కొక యుత్తరము వ్రాసినది. అందాతనిని తనయిష్టము వచ్చినట్లు తిట్టిపోసినది - 'నీవు నా ప్రాణశత్రుఁడవు! కులఘాతకుఁడవు! నిన్ను మట్టిలో కలుపురోజెన్నఁడు వచ్చునో! నీవు నాబిడ్డనిపై వశీకరణమును ప్రయోగించినావు'అని. మరునాడిట్లే మరియొక యుత్తరము వ్రాసినది. ఇయ్యది యామె నిత్యకృత్యమైపోయినది. సత్యప్రకాశుని తిట్టుచు నుత్తరము వ్రాయని రోజున నామెకు శాంతిలేదు. ఈ యుత్తరములను పనిమనిషిచే పోస్టాఫీసుకు పంపును.

## 10

జ్ఞానప్రకాశుఁ డధ్యాపకుఁడగుట సత్యప్రకాశునకొక యాఘాతమైనది. నేటివరకు ప్రపంచమున తానొంటరివాడను కాననియు, తాను నిరాధారుఁడను కాననియు సంతోషముగ నుండెడిది. ఇప్పుడా యవలంబము దూరమగుచున్నది. జ్ఞాన

ప్రకాశుఁడు స్పష్టముగ వ్రాసినాడు—'ఇక నాకై శ్రమపడనద్దు. నాజీవితమునకు కావలసిన దానికంటె హెచ్చుగనే సంపాదించుచున్నాను' అని.

సత్యప్రకాశుని వ్యాపారము బాగుగ సాగుచున్నప్పటికిని కలకత్తావంటి నగరములందొక సామాన్య వ్యాపారస్తుని జీవితము సుఖమయముగ నుండదు. నెల కరువది డెబ్బది రూపాయలయాదాయ మొకయాదాయ మేకాదు. ఇంతవఱకు నాతడు మిగిల్చినది నిజముగ మిగిలినది కాదు—అది త్యాగము! ఒక పూట తిని, ఇరుకుగదిలోనుండి, పదియో యిరువదియో మిగిల్చినాడు. ఇపుడు రెండు పూటలు భోజనము చేయుచున్నాడు. గుడ్డలుగూడ మంచిని ధరించుచున్నాడు. కాని యీ కొలది కాలములోనే యాతని ఖర్చులలో నుందుల పద్దు పెరిగినది. మఱల వెనుకటి స్థితియే ప్రారంభమైనది. కొన్ని సంవత్సరములపాటు శుభ్రమైన గాలి, పౌష్టిక భోజనము లభింపనిచో నెంతటి యారోగ్యమైనను చెడిపోవును. అతనిని మందాగ్ని, అసుచి మున్నగు రోగములు చుట్టినవి. ఒక్కొక్కప్పుడు జ్వరముగూడవచ్చును. యౌవనమందాత్మవిశ్వాస ముండును. మఱియొక యవలంబమును లక్ష్యము చేయఁడు. వయసు పెరిగినకొలఁదియు నితరుల సాయము ఆశ్రయము నవసరమగును. పూర్వము బజారులలో నేదేనితిని పడియుండెడివాడు. వెనుక నిద్రపోయినచో నెవ్వరిటు నొత్తిగిలెడివాడేకాదు. ఇప్పుడు బజారు తిండి రుచించుటలేదు. రాత్రిపూట నిదుర పట్టుటలేదు. రాత్రి కింటికి వచ్చునప్పటికి

బడలికగ నుండును. అప్పుడు ప్రొయ్యి వెలిగించి వంట చేయుటయనిన బద్ధకము. ఒక్కొక్కప్పుడు తన యొంటరి జీవితమునకు దుఃఖించును. ఒక్కొక్కనాడు నిదురపట్టదు. ఎవరితోనైన మాటాడుచుండవలె ననిపించును. అతనితో మాటాడుట కా యంధకారము తప్ప మరెవ్వరున్నారు? గోడలకు చెవులుండవచ్చుగాని నోరు లేదుగదా! జ్ఞానప్రకాశుని వద్దనుండి యుత్తరములు వచ్చుటగూడ తగ్గిపోయినది. వచ్చినను నీరసముగ నుండును. ఆ యుత్తరములందు వెనుకటివలె సరళహృదయమునుండి వెలువడిన ప్రేమవాక్కులు లేవు! సత్యప్రకాశుఁడు మాత్రము వెనుకటివలెనే భావపూర్ణముగ వ్రాయును. కాని యొకఆచార్యునికి భావుకత్వము శోభించునా? మెల్ల మెల్లగ సత్యప్రకాశునకు – 'తమ్ముఁడు కూడ నిష్ఠురుఁడై పోయినాడు, లేనిచో నాలుగురోజులపాటు నావద్దకు రాకుండునా, నేనా యిల్లు త్రొక్కుటకువీలులేదు. కాని తనకేమి యాటంకమున్నది?' అను భ్రాంతి జనించెను. కాని తన తమ్మునిచే తల్లి కలకత్తా పోకుండునట్లు ప్రతిజ్ఞ చేయించినదని యాతనికేమి తెలియును? ఆతనికిఁ గలిగిన ఈ భ్రమ మఱింత నిరాశను కలుగఁజేసినది.

పట్టణమున మనుష్యులు చాలమంది యుందురు–కాని మనుష్యత్వము మాత్ర మేకొద్దిమందిలోనో యుండును. సత్యప్రకాశుఁడా బహుసంఖ్యలోఁగూడవిలక్షణుఁడే! అతనిలో నొకక్రొత్త యాకాంక్ష బయలుదేరినది– 'ఇంటికేల పోఁగూడదు? ఒకయర్ధాంగిప్రేమ నేలయాశ్రయింపరాదు? ఆసుఖను,

ఆ శాంతి, మఱియొకచో లభించునా? నా జీవితమందలి యీ నిరాశాంధకారమును పోద్రోలఁ జాలిన జ్యోతి యింకేమున్నది?' అని అతఁడీ భావములను తనయాలోచనా శక్తి నంతటిని వినియోగించి యణచివేయును. కాని బాలుఁడింటిలోనున్న మిఠాయి జ్ఞప్తికి వచ్చినంతనే యాటలు వీడి యింటికి పరువెత్తునట్లు, మఱలమఱల నాతని మానస మామధుర భావములలో లీనమగుచుండును. అతడనుకొనును-నేను విధివంచితుఁడను. కానిచో నా స్థితి యిట్లెందుకుండును? భగవంతుఁడు నాకు మాత్రము బుద్ధిని ప్రసాదింపలేదా? పని యనిన భయపడుదునా? బాల్యమందే నాయుత్సాహముపై, నాయభిరుచులపై వశపాతము కాకున్నచో, నా బుద్ధిని నలిపివేయకున్నచో నేనును ఏనిమి నయ్యెడివాఁడనే! పొట్టకై యీ దేశముకాని దేశమున తిరుగవలసి వచ్చెడిదికాదు. ఏమైనను సరే! నన్ను నేను నాశన మొనర్చుకొనఁజాలను.

కొన్ని నెలల పర్యంతము నాతని మనసుకు బుద్ధికి ఈ సంఘర్షణము జరుగుచునేయున్నది. ఒకనాడు దుకాణము నుండి వచ్చి పొయ్యి వెలిగించుచుండగా పోస్టుజవాను పిలిచినాడు. తమ్మునివద్దనుండి తప్ప మఱెచటినుండియు నుత్తరములు రావు. అతనివద్దనుండి నేఁడే యుత్తరము వచ్చినది. మరి యీ రెండవ యుత్తర మెచటినుండి? ఆతనిమనసేదియో యనిష్టమునుశంకించినది. ఉత్తరమందుకొని చదువనారంభించెను. అప్రయత్నముగ నాయుత్తర మాతని చేతినుండి జారిక్రిందపడినది. అతఁడు తాను పడిపోకుండ తలపై చేతులు పెట్టుకొని

చతికిలబడినాడు. అయ్యది దేవప్రియ విషపూర్ణమైన లేఖిని నుండి వెలువడిన విషాక్తమైన బాణము! అయ్యది క్షణములో నాతనిని సంజ్ఞాహీనుని నొనర్చినది. ఆతని సమస్తవ్యథ, క్రోధము, నిరాశ, గ్లాని సమస్తము నొక్క నిట్టూర్పుతో సమాప్తమైనవి.

పోయి మంచముపై పండుకొనినాడు. మానసిక వ్యథ యంతయు తనం దాఁజల్లారినది. అహో! జీవితమంతయు నాశన మైపోయినది. నేను జ్ఞానప్రకాశుని శత్రువనా? ఇన్ని దిన ములనుండి యాతని జీవితమును నాశన మొనర్చుటకే యీ కపట ప్రేమాభినయ మొనర్చితినా? భగవానుడా! నీవే యిందులకు సాక్షివి!

మూడవనాడు మఱల దేవప్రియ యుత్తరము వచ్చి నది. సత్యప్రకాశుఁడు దానిని చింపివేసినాఁడు. చదువుటకుఁ గూడ ధైర్యము చాలలేదు.

ఒకరోజు తరువాత మూడవ యుత్తరము వచ్చినది. దానిపనిగూడ నంతేయైనది. ఇఁక నయ్యది నిత్యకృత్యమై పోయినది—ఉత్తరము వచ్చుట, చింపివేయుట! ఆమె యభి ప్రాయము తెలిసికొనుటకు చదువనక్కరలేదు. ఉత్తరము వచ్చినపుడెల్ల నాతని హృదయమున మరియొక గాయ మేర్పడును.

ఒక నెలదినము లీ హృదయవేదన ననుభవించినపిమ్మట నాతనికి జీవితమనిన నసహ్యము కలిగినది. దుకాణము

మూసివేసినాడు. బయట కేఁగుట మానివేసినాడు. ఎల్లప్పుడు మంచముపై పడియుండును. తన తల్లి యొడిలో పరుండ బెట్టుకొని యనిన మాటలు—'నాన్నా! ఆఫీసునుండి వచ్చి నాన్నగా రెత్తుకొందురు' - జ్ఞప్తికి వచ్చును. గంగా స్నానమున కేఁగిన తల్లియొక్క సజీవమూర్తి కన్నుల యెదుట సాక్షాత్కరించును. ప్రేమతో ననిన తల్లి మాటలు చెవులలో ప్రతిధ్వనించును. ఆపిమ్మట తాను సవతితల్లిని'అమ్మా'యని పిలుచుట, ఆమె కటుశబ్దములు, క్రోధపూర్ణమైన యామె భయంకర దృక్కులు, తాను వెక్కి వెక్కి యేడ్చుట జ్ఞప్తికి వచ్చును. ఆ పిమ్మట తాను పురిటిగదిలోని కేఁగుట, ప్రేమతో తమ్ముని యొడిలోనికి తీసికొనదలఁచుట, తల్లి తిట్టినతిట్లు చెవులలో ప్రతిధ్వనించును. అయ్యో! ఆ తిట్లే నన్ను నాశన మొనర్చినవి! పాప మట్టిఘటన లెన్నో జ్ఞాపకమునకు వచ్చును. నిష్కారణముగ సవతితల్లి తిట్టుట, తండ్రి నిష్ఠురుఁడై కసరి కొట్టుట, జ్ఞప్తికి వచ్చును. తండ్రి తన మాటకు మండిపడుట, సవతితల్లి చెప్పుయసత్యములను విశ్వసించుట! అయ్యో!జీవిత మంతయు నాశనమైపోయినది! అంత నాతడు మఱియొక ప్రక్కకు ఒత్తిగిలును. మఱల నా దృశ్యములే సాక్షాత్కరించును. మరియొక ప్రక్కకు తిరుగును! అకస్మాత్తుగ నోటి నుండి- 'నా జీవిత మంతము కాదేమి!' యని వెలువడును. ఈవిధముగ చాల దినములు పడియున్నాడు. సాయంసమయము! ఇంతలో నెవరో గుమ్మమువద్ద పిలుచుచున్న శబ్దము వినవచ్చినది. పరీక్షగ విని యులికిపడినాడు - పరిచితమైన కంఠ

స్వరము! పరుగెత్తి ద్వారము తెఱచినాడు-జ్ఞానప్రకాశుఁడు! ఎంత సుందరుడు! పోయి తమ్ముని కౌగలించుకొనినాడు. జ్ఞానప్రకాశుఁ డన్నకు పాదాభివందన మాచరించినాడు.. ఇరువురు గదిలోని కేతెంచినారు. అంతయు నంధకారముగ నున్నది. ఇంతవఱకును తన యావేగము నాపుకొనిన జ్ఞాన ప్రకాశుఁ డీ యింటిస్థితిఁజూచి యేడ్చినాడు. సత్యప్రకాశుఁడు దీపము వెలిగించినాడు. అదియొక యిల్లువలె లేదు - భూత గృహము! సత్యప్రకాశుఁ డొక చొక్కా తీసి తగిలించుకొని నాడు. జ్ఞానప్రకాశుఁడు అన్నగారి పాలిపోయిన జర్జర శరీర మునుచూచి కంట నీరుపెట్టినాడు.

సత్యప్రకాశుఁడనినాడు. "ప్రస్తుతమును స్త్రీగానున్నది."

"చూచుచునే యున్నాను!"

"నీవు వచ్చుచున్నట్లు వ్రాయనైనను లేదేమి? ఇంటి అడ్రసు ఎట్లు తెలిసికొంటివి?"

"ముందువ్రాసినాను, కాని మీకది యందలేదేమో!"

"కావచ్చును! ఉత్తరము దుకాణమునకు వచ్చి యుండును. నేను చాలరోజులనుండి దుకాణమునకు వెళ్లుట లేదు. ఇంటివద్ద నందరు క్షేమమా?"

"అమ్మ చనిపోయినది."

"అరె! ఏమిటి జబ్బు?"

"జబ్బుకాదు! ఏమితినినదో తెలియదు. కొంతకాలము నుండి యామెకు పిచ్చి యెత్తినట్లున్నది. నాన్నగారుతిట్టినారు. బహుశః అందుకై ఏదియో తిని యుండును."

"నాన్నగారు కులాసాగా నున్నారా?"

"ఇంకను చనిపోలేదు."

"అరె! చాల జబ్బుగా నున్నదా?"

"అమ్మ విషము త్రాగినదని, నాన్నగారు బలవంతముగ నోరు తెఱచి మందు పోయుచున్నారు. ఆమె గట్టిగ వారి రెండు వ్రేళ్ళను కొరికినది. ఆ విషమే నాన్నగారి శరీరములో చేరినది. వారి శరీరమంతయు వాచిపోయినది. ఆస్పత్రిలో పడియున్నారు. ఎవరినైనఁ జూచినచో కఱవఁబోదురు. బ్రదుకు ఆశలేదు."

"అయిన నిల్లంతయు సర్వనాశన మైనదన్నమాట!"

"ఇటువంటి యిల్లు ఎన్నడో నాశనమై యుండవలసినది."

మూడవ నాఁ డుదయమే యిరువురు సోదరులు కలకత్తా వీడి పయనమైరి.

---

# ఆభరణములు

ఆభూషణములనునిందించుట మాయుద్దేశ్యముకాదు. మనము అసహాయోగమువలని బాధను సహింపగలము. కాని ఆడువారి నిర్దయతోఁ గూడిన, ఘాతుకమైన వాగ్బాణములను సహింపఁజాలము. అయినను, ఈ యాభరణ తృష్ణోప శాంతికై మనమెంతటి త్యాగ మొనర్చుచున్నామో, యద్దానిని సదుపయోగ మొనర్చుకొనినచో మహత్తరమైన పదవిని పొందగలము.

ఒక కురూపియైన స్త్రీ యాభరణముల వలన రూపవతి యగుట మేమెఱుఁగము. అయినను ఇంటికి దీపమువలె, అందమునకు ఆ భూషణములుగూడ కొంతవఱ కవసరమని మేమంగీకరింతుము. కాని శారీరక సౌందర్యమునకై త్రిప్పలు పడుచు, మన మనసు నెంత కలుషిత మొనర్చుకొను చున్నామో, మన చిత్తశాంతి నెట్లు భంగ మొనర్చుకొను చున్నామో, మన యాత్మ నెంత మలిన మొనర్చుకొను చున్నామో గ్రహింప లేకున్నాము. ఆ దీపకాంతికి కండ్లు చీకట్లు క్రమ్మును. ఈ బాహ్యాడంబర మెంత ఈర్ష్యను, ద్వేషమును, ప్రతిస్పర్ధను, దురాలోచనలను, దురాశలను పుట్టించునో తలఁచుకొనినచో కంప మొదవును. వీటిని భూష ణము లనుటకంటె దూషణము లనుట మిక్కిలి యుప

యుక్తము ! అట్లు కానిచో క్రొత్తగ కాపురమునకు వచ్చిన పెండ్లికూతురు మూడవనాడే భర్తతో - నీ మెడ కంటగట్టి మానాయన నా జీవితమును నాశనము చేసినాఁడు' అని యనగలదా ?

శీతల నేఁడు ఆ గ్రామపు యీనాందారుడు-సురేశ సింహు నింటికి క్రొత్తకోడలిని చూచుటకై వెళ్ళినది. ఆమెను చూచి మంత్రముగ్ధవలె నిలబడినది. క్రొత్తకోడలి రూప లావణ్యములను జూచికాదు-ఆమె దాల్చిన యాభరణముల తళుకుబెళుకులఁ జూచి! ఇంటికి తిరిగి వచ్చినప్పటినుండియు నామెకు పిచ్చియెత్తినట్లయినది. భర్త యింటికి వచ్చినంతనే యాతనిపై విరుచుకుపడినది. మనసులోని కోపము పైఁజెప్పిన శబ్దములలో బయటకు వచ్చినది. శీతల భర్తపేరు విమల సింహుఁడు. అతని పూర్వులును నొకప్పు డీనాముదారులే ! ఈ గ్రామమున పూర్తి యధికారము వారిదే! కాని నేఁడు వారి సంసారము చిదికిపోయినది. సురేశసింహుని తండ్రి జమీందారీ వ్యవహారములలో సమర్థుఁడు. విమలసింహుని యీనామంతయు నెమ్మదిగ వారిచేఁజిక్కినది. నేఁడువిమలుని స్వారి కొక గుఱ్ఱమైనను లేదు. రెండు పూటలు భోజననే గగనమైనది. ఇఁక సురేశునికి గుఱ్ఱములు, మోటార్లు, నౌకర్లు సమస్తభోగములు నున్నవి. ఎల్లప్పుడు నెవరోయొకరువచ్చుచు పోవుచుందురు. వీరిరువురియందు నింతటి భేదమున్నను వారి సోదర సంబంధమునకుఁ గొఱతకలుగలేదు. సురేశుఁడువిద్యా ప్రియుఁడు. హిందూదేశమున నున్నత విద్య నభ్యసించి

యూరపు వెళ్ళినాడు. ఇచటివారియనుమానములకుభిన్నముగ నార్యసభ్యతను పూజించు భక్తుఁడై తిరిగి వచ్చినాడు. అచటి జడవాదము, భోగలిప్స, అమానుషికమైన సుఖాంధత, ఆత నికి జ్ఞానమును కల్గించినవి. మొదట యింటిలోనివారెంత బల వంతము చేసినను పెండ్లికి అంగీకరింపలేదు. పిల్లతో పూర్వ పరిచయమున్ననేగాని యామెను ప్రేమింపఁజాలననెడి వాఁడు. కాని యూరపునుండి తిరిగి వచ్చినపిమ్మట నాతని వివాహ సంబంధమైన సిద్ధాంతములందు పెద్దమార్పు వచ్చి నది. అంతకుపూర్వ మనుకొనిన పిల్లనే, వారి యాచార వ్యవహారముల నెఱుంగకయే వివాహమాడినాఁడు. వివాహ మనునది, ప్రేమబంధము కాదనియు, నయ్యది ధర్మబంధ మనియు నాతని యుద్దేశ్యము. సౌభాగ్యవతియైన నా క్రొత్త పెండ్లికుమార్తెను చూచుటకే నేఁడు శీతల వెళ్ళినది – తన యత్తగారితోఁగూడ. ఆమె దాల్చిన యాభరణములఁ జూచి మర్మాహతయైనది. వ్యథితుఁడై నిమలసింహుఁ డనినాఁడు – "అవును మణీ! నీవు నీ తల్లిదండ్రులతో చెప్పియున్నచో సురేశునకిచ్చి వివాహము చేసియుండెడివారు. అతఁడు నిన్నా భరణములలో ముంచి తేల్చెడివాఁడు."

"దేనికీ తిట్లు?"

"తిట్లుకాదు. ఉన్నమాట యనుచున్నాను. నినంత సౌందర్యవతిని అన్యాయముగ నాకు కట్టినారు."

"మానాభిమానములు లేకుండ ఈచెప్పిపోడు ప్రేల!"

"అదృష్టము నాచేతిలోనిదా? అతనివలె చదువనైనను లేదు - పెద్ద యుద్యోగము చేసి సంపాదించుటకు !"

"ప్రేమలేదని యనరాదూ? ప్రేమయనున దున్నచో బంగారము కురియును."

"నీకు నగలనిన ప్రేమ కాదూ?"

"అందరికిని ప్రేమయే! నాకును నున్నది."

'నీవు దురదృష్టవంతురాలనని యనుకొనుచున్నావా?'

"కాదా మఱి? అనుకొనుట యేమి? దురదృష్టవంతురాలను కానిచో నితరులనుచూచి యేడ్వవలసి వచ్చునా ?"

"నగలు చేయించినచో నదృష్టవంతురాల నను కొందువా ?"

(కోపముతో) "కంసాలివచ్చి గుమ్మమువద్ద నిలబడి నట్లే మాట్లాడుచున్నావు !"

"కాదు. నిజమే! తప్పక చేయింతును. కాని కొన్ని దినము లోపిక పట్టవలె!"

## 2

సమర్థులైన పురుషులకు మాట పట్టుదల యెక్కువ-అందులకై వారు ప్రాణములు తీయుదురు. సామర్థ్యహీనులైన వారు తమ ప్రాణములనే యర్పింతురు. విమలసింహుఁ డింటి నుండి వెడలిపోవుటకు నిశ్చయించుకొనినాడు. భార్యను నగలతోనైనను ముంచి యెత్తవలె, లేదా వైధవ్యశోకము నం

దైనను ముంచియెత్తవలెనని నిశ్చయించుకొనినాడు. నగలైనను ధరింపవలె లేదా పసుపుకుంకుమ గూడ లేకుండ పోవలె!

రోజంతయు నాతని కదే యాలోచన. ఆతడు భార్యను ప్రేమతో సంతుష్టురాలి నొనర్ప నెంచినాడు. కాని, స్త్రీ హృదయము ప్రేమపాశముకంటె స్వర్ణపాశమునకే సులభముగ కట్టుబడునని నేఁడనుభవమునకు వచ్చినది. ఒక జాము ప్రొద్దుయుండగ రాత్రివేళ నింటినుండి బయలుదేరినాడు - వెనుదిరిగియైనను చూడలేదు. జ్ఞానజనితమైన విరాగమందు మోహసంస్కార మింకను మిగిలి యుండవచ్చును. కాని నిరాశాజనితమైన విరాగముమాత్రము తిరుగులేనిది. వెలుగులో నిటనటు గల వస్తువులను జూచి మనసు చలింపవచ్చును, కాని యంధకారమున నట్టి యవకాశమేయుండదు.

ఆతనికి విద్యలేదు, కళాకౌశల మంతకుమునుపే లేదు; కఠినమైన పరిశ్రమ, కఠినమైన ఆత్మత్యాగమే శరణ్యము! ముందుగ నాతడు కలకత్తా వెళ్ళినాడు. అచట నొక సాహుకారువద్ద జవానుగ చేరినాడు. ఇంతలో రంగూనులో కూలి బాగుగ లభించునని వినినాడు. బయలుదేరినాడు రంగూనుకు. అచటి హార్బరులో సామానులు దించుట ఎక్కించుట ఆతని పని!

అసలే కఠిన పరిశ్రమ, దానికితోడు ఆహారవిహారము లందు సంయమము! గాలి నీరు సరిపడక జబ్బు చేసినది. శరీరము బలహీన మైపోయినది. ముఖకాంతి క్షీణించినది.

అయినను నాతనివలె కష్టపడి పనిచేయు కూలివాఁడా సార్వ్ర రులో మరియొకడు లేడు. మిగిలినకూలీలు కూలీలే ! ఈతడు మాత్రము తపస్వి! తాను నిశ్చయించుకొనిన విషయమును పూర్తి చేయుటయే యాతని యేకైక లక్ష్యము.

ఇంటికి తన సమాచారము వ్రాయలేదు. ఇంటివద్ద 'నా'యనువా రెవరున్నారని మనసును సమాధానపఱచుకొని నాడు. నగలముందు నా విషయ మెవరికి కావలె ? ఆభరణ లాలసయున్నను, ప్రేమ నిర్వాహణము సంభవమే యను రహ స్యమును గ్రహించు శక్తి యాతనికి లేదు. ఇతర కూలీలు కడుపునిండ తిందురు. మధ్యమధ్య పొగాకు, గంజాయి దమ్ము వేయుదురు. అవకాశము లభించినచో బజారులందు షికారుకు బయలుదేరుదురు. కొందరికి మద్యపానముగూడ నలవాటు ! కానులకు బదులు రూపాయలు సంపాదింతురు, కానులు ఖర్చు పెట్టవలసినపుడు రూపాయలు ఖర్చు చేయుదురు. ఒక్కొక్కనికి శరీరరముపై సరియైన వస్త్రములే యుండవు. తిని తిరుగుటయే ప్రధానోద్దేశ్యము గాక, సంయమముతో నుండు నలుగురైదుగురు కూలీలలో విమలసింహుఁడొకఁడు. కొలఁది దినములలో నాతనివద్ద కొంత డబ్బు ప్రోగైనది. డబ్బుతో బాటు ఇతర కూలీలపై నధికారముగూడ పెఱిగినది. విమలసింహుడు కులీనుడని యందరు నెఱుగుదురు. అందరు నాతనిని 'ఠాకూర్ సాహెబ్' అనియే పిలుతురు. సంయమము, ఆచారము నీ రెండును సమ్మానసిద్ధికి మంత్రములు. విమల సింహుడు కూలీలకు నాయకుడు, సాహుకారు !

అతడు రంగూను వచ్చి మూఁడు సంవత్సరములైనది. సాయంకాలమైనది. ఇతర కూలీలతోఁబాటు సముద్రపు టొడ్డున గూర్చుండి మాట్లాడుచున్నాఁడు.

ఒక కూలివాఁడు ప్రారంభించినాఁడు — "ఇచటి స్త్రీలందఱును నిష్ఠురలే! పాపమా కీచుగాఁడు పది సంవత్సరముల నుండి యీ బర్మాదానితో నున్నాఁడు ఎవఁడును తాను కట్టుకొనిన భార్యనైనను నింత ప్రేమింపఁడు. సంపాదించినదంతయు దానికే యిచ్చెడివాఁడు–దానిపై నంత విశ్వాసము! ముగ్గురు పిల్లలుకూడను! నిన్నటివఱకును హాయిగకలిసియేయున్నారు–పోట్లాటలేదు, మాటామాటా యనుకొనుట లేదు! ఉన్నట్లుండి రాత్రి లేచి యెటకేగినదో తెలియదు. పిల్లలను వదలి వెళ్ళిపోయినది. పాపము వాఁడొకటే యేడుపు! ఆ చిన్నపిల్లవానితో మిక్కిలి యాతనగ నున్నది–ఆరునెలల పసిగ్రుడ్డు! వాఁడెట్లు బ్రతుకునో భగవంతునికే తెలియవలె!"

"నగలేమైన చేయించుచున్నాఁడా లేదా?" విమలసింహుఁడు గంభీరభావముతో ప్రశ్నించినాఁడు.

"వచ్చిన డబ్బంతయు దానికేయిచ్చుచున్నాఁడుగదా! అది నగలు చేయించుకొనినచో కాదనువా రెవరు?"

మరియొక కూలివాఁ డందుకొనినాఁడు–"ఒడలంతయు నగలతో నిండినది. ఎచటికేఁగినను ఘణఘణ మ్రోగుచుండెడివి!"

"నగలు చేయించినను నింతటి నిష్ఠురయై పోయినచో నిక నా జాతియే కృతఘ్నమైన దనవలె!" విమలసింహుఁడు సిద్ధాంత మొనర్చినాఁడు.

ఇంతలో మరియొక కూలివాడువచ్చి విమలసింహు నితో—"శాకూర్జీ! ఇంతక్రితనే నా వద్దకొక పోలీసు వచ్చి నాడు. నీ పేరు, ఊరు, తండ్రిపేరు అడిగినాడు. సురేశసింహుడని యెవరైన ఉన్నారా?" అనెను.

విమలసింహు డనుమానముతో-"అవును! ఉన్నాడు! మా గ్రామమున నీనాముదారు! వరుసకు సోదరుఁడగును" అనినాడు.

"అతడు పోలీసు స్టేషనులో నొక నోటీసు కట్టించినాడట! విమలసింహునిజాడ తెలిపినవానికి వెయ్యిరూపాయలు బహుమతి నిత్తునని."

"అయిన నా పోలీసువానికి నాజాడ చెప్పితివా ?"

"నే నేమంత తెలివితక్కువవాడనా ? ఇందేదియో రహస్య మున్నదని గ్రహించినాను. లేనిచో నింత డబ్బెవ డిచ్చును? అతనిపేరు విమలసింహుడుకాదు. యశోదాపాండే యనిచెప్పినాను. తండ్రిపేరు సదాసుఖపాండేయనియు, ఊరు ఘూన్సీ జిల్లాలో నున్నదనియు చెప్పినాను. ఇచట నెన్నిదినములనుండి యున్నాడని యడిగినాడు. పది సంవత్సరముల నుండి యిచటనే యున్నాడని చెప్పినాను. కాస్సేపేదియో ఆలోచించి వెడలిపోయినాడు. సురేశసింహునితో నేమైన విరోధ మున్నదా ?"

విరోధ మేమియులేదు. కాని యాతని బుద్ధి మారినదేమో ఎవరెఱుఁగుదురు? నాపై నేదైన కేసు బనాయించి

ఇల్లు వాకిలి కాజేయ దలచినాడేమో! పోలీసుతో అబద్ధ మాడి మంచిపని చేసినావు."

"నీవు సరిగచెప్పినచో నీకొక యాభై రూపాయలిత్తు ననినాడు. 'నీవు వెయ్యిరూపాయల మూటను కొట్టివేసి యేబది యిత్తువా?' యనుకొనినాను-పో పొమ్మనినాను."

మరియొక కూలివా డనినాడు-"రెండువంద లిత్తునని నచో సరిగా చెప్పెడివాడవేనా? ఛీ! ఆశపాతకుడా!"

"రెండువందలు కాదు; రెండు వేలిచ్చినను చెప్పెడి వాడనుకాను. నేనంతటి కృతఘ్నుడ ననుకొంటివా? కావలసి నచో నన్నెప్పుడైనను పరీక్షింపుము!"

కూలివాండ్రిట్లు మాట్లాడుకొనుచునే యున్నారు. విమలసింహుడు తన గదికివచ్చి పండుకొని యాలోచింప సాగినాడు-"ఇక నేనేమి చేయవలె! సురేశసింహు నంతటి వాని బుద్ధియే మారిపోయినది; ఇంకెవరిని నమ్మగలము? ఇక ఇంటి కేఁగనిదే పని జరుగదు. ఇంకను కొన్నినాళ్ళిట్లే గడచిపోయినచో నెందులకు గాకుండ పోదును. ఇంకను రెండు సంవత్సరము లున్నచో మొత్తము అయిదువేలు పూర్తి యగును. శీతలకోరిక నెఱవేరును. ఇప్పుడున్న మొత్తము మూడువేలే! దీనితో నామె కోరిక తీరదు. సరే! ఇప్పుడే బయలుదేరుదును. ఆఱునెలలచట నుండవలసిన పని యేము న్నది? వెళ్ళివచ్చుట కొక నెల పట్టును. ఇంటివద్ద పదునైదు దినములకంటె నెక్కుడయుండను. ఉండుమనువారు మాత్ర మెవరున్నారు? వచ్చినను రాకపోయినను, చచ్చినను బ్రదికి

నను న్యాయవిషయ మెవరికి పట్టును? ఆమెకు కావలసినవి నగలే! నగలపైననే ప్రేమ !"

ఈవిధముగ నిశ్చయించుకొని మరునాడే రంగూను నుండి బయలుదేరినాడు——

## 3

గుణముల ముందు రూప మనున దొక లెక్కలోనిది కాదని ప్రపంచ మనును. మన నీతి శాస్త్రజ్ఞుల యభిప్రాయ మును నిదియే! కాని యథార్థమున కిది యెంతటి భ్రమ మూలకము! సురేశసింహుని భార్య మంగళకుమారి గృహ కార్యములందు నిపుణురాలు. భర్త కోర్నచో ప్రాణముల నైన నర్పించును. విచారశీల, మధురభాషిణి, ధర్మభీరువు! కాని సౌందర్యవిహీన యగుటవలన భర్తదృష్టిలో చులకనయై పోయినది. అతడుమాటమాటకును విసిగికొనును; కాని రెుక ఘడియ తరువాత మరల పశ్చాత్తప్తుడై యామెను క్షమా పణ వేడును. మరల మరునాడాకుత్సిత వ్యాపారమే సాగుచుండును. ఆతని ప్రవర్తన మితర ధనికులవలె భ్రష్టము కాకపోవుటయేవచ్చినచిక్కు. ఆతడు దాంపత్యజీవనమునందే ఆనందమును, సుఖమును, శాంతిని, విశ్వాసమును, సమస్త లౌకికాలౌకికోద్దేశ్యములనుపొందనలెననితలచును. దాంపత్య సుఖము లేనిచో తన జీవితము నీరసముగను, ఆస్వాదహీన ముగనుతోచును. తత్ఫలితముగ మంగళకు తనపైతన కేవిశ్వా

సము సన్నగిలెను. తా నేపని చేయదలంచినను భర్త కోపగించు నేమో యని భయపడును. భర్తను సంతోష పెట్టుటకై తన పొరపాట్లను దాచుకొనును. ఏవియో సంకెలు వెదకును, అబద్ధము లాడును. నొకర్లపై నపరాధములను నెట్టి యాత్మ రక్షణ గావించుకొనును. భర్తను ప్రసన్ను నొనర్చుటకై తన గుణములను, తన యాత్మనే యవహేళన మొనర్చినది. కాని భర్తదృష్టిలో గౌరవమును పొందుటకు బదులు మఱింత దిగజారి పోయినది. నిత్యమును నూత్న శృంగారము లొన రించుకొనును. కాని, లక్ష్యమునకు మాత్రము దూరమైపోవు చున్నది. భర్తనుండి యొక చిఱునవ్వును పొందుటకు, ఆతని యధరములపైనుండి వచ్చు నొక సాధువు శబ్దమునకై యామె తృషితహృదయము పరితపింపసాగినది. లావణ్యహీనయైన స్త్రీ పట్టెడు ముద్దతో సంతృప్తిజెందు భిక్షకురాలు కాదుగదా! ఆమెగూడ సంపూర్ణమైన, అఖండమైన భర్తృప్రేమను కోరును. బహుశః సౌందర్యవతులకంటె నెక్కువగనే కోరును. కారణమేమన నామె వారికంటె నీ తపస్సిద్ధికై అసాధారణ ప్రయత్నముల ననుష్ఠించును. మంగళ యీ ప్రయత్నములం దసఫలయై మఱింత తపించుచున్నది.

క్రమక్రమముగ భర్తపైనున్న శ్రద్ధాభక్తులు సన్నగిల సాగినవి. ఇట్టి క్రూరునితో, హృదయ శూన్యునితో, కల్పనా శూన్యునితో నేనును వల్లె ప్రవర్తించితినని తర్కించుకొని నిశ్చయించుకొనినది. రూపమును మాత్రమే యుపాసించు

పురుషుఁడు ప్రేమకు భక్తికి యోగ్యుఁడు కాఁడు. ఈ ప్రత్యాఘాతము అసలుసమస్యను మఱింత జటిలమొనర్చినది.

మంగళకు తన సౌందర్యవిహీనత కేడ్పుటతో సరిపోలేదు. శీతలయందున్న అనుపమ రూపలావణ్యము లామె కోరికల కాటంకమైనవి— అంతేకాదు, ఆమె యాశాలతపై తుషారపాతమైనది. మంగళ సౌందర్యవతి కాదు - కాని భర్తకై ప్రాణము లర్పించును. మనలను ప్రేమించువారి యెడల మనము విముఖులము కాఁజాలము - ప్రేమశక్తియే యట్టిది! కాని శీతల రూపము సురేశుని హృదయద్వారమున నుండి మంగళను లోనికి ప్రవేశించుట కనుమతించుట లేదు—ఆమె యెన్ని వేషములు దాల్చివచ్చినను సరియే! సురేశుఁడా మూర్తిని తొలగించుటకు విశ్వప్రయత్న మొనరించినాఁడు; కాని ప్రయోజనము లేకపోయినది - సౌందర్య ప్రభావము ధన ప్రభావముకంటె తక్కువదికాదు. శీతల మంగళను చూచుట కా యింటికి కేతెంచిన నాఁడే సురేశుఁడామె సౌందర్యప్రకాశమును చూచినాఁడు. ఆ సౌందర్య ప్రకాశ మొక క్షణకాలికమే యైనను, ఒకే మెఱపుతో నాతని హృదయసామ్రాజ్యము నాక్రమించి తన యాధిపత్యమును స్థాపించుకొనినది.

పిరికువురిలోనున్న అంతరమును నిశ్చయించుకొనుటకై సురేశుఁ డేకాంతమున గూర్చుండి శీతల రూపచిత్రముతో మంగళరూపమును పోల్చుకొనును. శీతల చిత్రమేల తన హృదయము నాకర్షించుచున్నది? మంగళ చిత్రమేల తన

హృదయమును దూరముగ త్రోసివేయుచున్నది? కానియాతని యీమానసికాకర్షణ మొక చిత్రకారుని లేక కవి యందలి రసాస్వాదనము వంటిది – వాసనారహితమై పవిత్రమైనది! ఆ రూపము కేవల మాతని మనోరంజనమునకు మాత్రమే యుపకరించును. ఇఁకనుండి మంగళను సంతోషపెట్టవలెనని, మనసును సమాధానపఱచుకొనును. ఆమె సౌందర్యవతి కాకపోవుటలో నామె దోషమేమున్నది? కాని యాతని యీ ప్రయత్నమంతయు మంగళయెదుట కేఁగినంతనే విఫలమై పోవును. అతఁడు సూక్ష్మదృష్టితో మంగళ మనసులో మార్పుజెందుచున్న భావములను గ్రహించును; కాని, పక్షఘాత పీడితుఁడైనవాఁడు నేతిముంత దొర్లి పడిపోవుచున్నను దాని నాపలేడు! దీనిపరిణామ మేమగునని యాలోచించుటకే వానికి ధైర్యముండదు. చివఱకు మంగళ యాతనిని తీవ్రముగ విమర్శింపఁ బూనినప్పుడు, ఆతనియెడల నుచ్ఛృంఖలముగ ప్రవర్తింపసాగినపుడు, ఆతని మనసులో నామె యెడల మిగిలియున్న సౌహార్దముగూడ మాయమైపోయినది. ఇంటిలోనికి వచ్చుటయే మానినాఁడు.

ఒకనాటి సాయంకాలము వడగాడ్పు హెచ్చుగ నున్నది. విసరినచో వేడిమి మఱింత యెక్కువగుచున్నది. షికారుకుగూడ నెవరును బయిటికేఁగుటలేదు. శరీరమందలి స్ఫూర్తియంతయు చెమ్మటరూపమున వెడలిపోవుచున్నది. ఎచటివారచటనే పడియుండిరి. నిప్పులపై కాచిన డప్పుకొలె ప్రజల స్వరము కర్కశమైనది. సాధారణమైన రాపిడికే యడ

వులు తగులబడునట్లు, మామూలు సంభాషణలోనే జను లుత్తేజితులగుచున్నారు. సురేశుడునాలుగడుగులు వేయును, మరల నాయాసముతోఁ గూర్చుండును. నోకర్లపై తొందరగా నీళ్లుచల్లనందులకై కోపగించుచున్నాడు. ఇంతలో నాతనికి లోపలినుండి పాట వినవచ్చినది. ఉలికిపడినాడు - వెంటనే కోపము వచ్చినది. మధుర గానముగూడ చెవుల కప్రియమైపోయినది. సమయముగాని సమయమున నీ సంగీత మేమిటి? ఇచట వేడిమికి ప్రాణములు పోవుచున్నవి - వారి కిపుడు సంగీతము మనసైనది! మంగళయే పిలిపించినదేమో! ఇంకెవరున్నారు? స్త్రీల జీవనాధారము ప్రేమయందురు; కాని యట్లుగాదు! ప్రాణిమాత్రసహజమైన భోజనము, నిద్ర, విలాసములు, భోగములు మాత్రమే వారి జీవనాధారములు! గంట సేపటినుండి వినుచున్నాను. ఆ సంగీతము పూర్తి యగు నట్లులేదు. వారెవరోగాని వ్యర్థముగ గొంతు చించుకొని పాడుచున్నారు.

చివరకు సహింపలేకపోయినాడు. ఇంటిలోని కేఁగి విఱచుకొని పడినాడు-"ఏమిటీ కాకిగోల? ఇది సంగీతమునకు సమయమేనా? బయట కూర్చుండుటయే దుర్భరమైపోయె!" అల్లరి చేయుచున్న తరగతిగదిలోని కుపాధ్యాయుడు వచ్చి నట్లు వాతావరణము నిస్తబ్ధమైపోయినది. అందరు తలలు వంచుకొని యెచటివారచట నక్కినారు.

మంగళ గబగబ లేచి ప్రక్కగదిలోనికేఁగి భర్తను పిలిచినది. మెల్లగా నడిగినది - "దేనికింత కోపము?"

"నాకీ సమయమున సంగీతము వినుట యిష్టములేదు."

"మీకెవరు వినిపించుచున్నారు? నా చెవులపై గూడ మీ యధికారమేనా?"

"అనవసరపు వాగుడు!..."

"అనగా?"

"నా యింటిలో నీ గోల పనికిరాదు."

"నాకు వేఱుగ మరియొక యిల్లున్నదా?"

అతఁ డీ మాటకు సమాధాన మీయలేదు-"మఱియొకప్పుడు రమ్మని వారితోఁ జెప్పుము!"

"వారు వచ్చుట మీ కిష్టము లేదన్నమాట! అంతియేనా?"

"అవును!"

"అయిన మీ రెల్లప్పుడును నాకు నచ్చిన పనులే చేయుచున్నారా? మీతో మాట్లాడుట కనేకులు మిత్రులు వత్తురు. మీ నవ్వులు లోపలికి వినిపించును. వారి నందఱను పంపివేయుడని నేనెన్నడైన నంటినా? నా పనులలో మీ జోక్యమేల?"

సురేశ్వరుఁ డుండిపడినాడు—"ఈ యింటికి యజమానిని నేను!"

"బయటనే మీరు యజమానులు! ఇంటిలో యజమానిని నేనే!"

"అనవసరమైన వాగుడు ప్రారంభించినావు! నాకు కోపము కలిగించినందువలన నీకేమి లభించును?"

మంగళ కాస్సేపు నిశ్శబ్దముగ నిలబడియున్నది. ఆమె తన భర్త మనోగతభావమును గూర్చి మీమాంస చేయుచున్నది—"సరే! ఈ యింటిలో నా యధికార మేమాత్రమును లేనిచో, నిచట నుండను. ఇంతవఱకును భ్రమలో నున్నాను. నేఁ డా భ్రమను తొలగించితిరి. నాకీ యింటిపై పెత్తన మెన్నఁడును లేదు. భర్తృహృదయముపై నధికారము లేని స్త్రీకి వాని సంపత్తిపై నధికారముమాత్ర మెట్లుండును?"

సురేశుఁడు లజ్జితుఁడై నాఁడు—"మాటకు మఱియొక అర్థము కల్పింతు వేమి? నా యుద్దేశ్య మదికాదు. నే ననునది యొకటి, నీ వర్థము కల్పించునది మఱియొకటి!"

"మనసులోని మాట తేలికగ బయట పడును. కాని ఎంతో జాగ్రత్తగ దానిని దాచుటకై ప్రయత్నింతుము. అంతియే!"

సురేశుఁడు తన యసజ్జనత్వమునకు విచారించినాఁడు. ఈమె ననునయించిన కొలఁదియు నోటికివచ్చినట్లు మాటాడును నను భయముతో నచటినుండి వెడలిపోయినాఁడు.

ప్రాతఃకాలమున చల్లనిగాలి వీచుచున్నది. సురేశుఁడు పండుకొని స్వప్నముఁ జూచుచున్నాడు. మంగళ ప్రక్కనుండి వెళ్ళుచున్నది. ఉలికిపడి చూచినాడు. గుమ్మమువద్ద నిజముగనే మంగళ నిలువఁబడియున్నది. దాసీ జనము కన్నులు తుడుచుకొనుచున్నారు. నౌకర్లు అచటకు చేరినారు. వారందరును విచారముగ నున్నారు. కంట తడిపెట్టినారు—ఆఁడుబిడ్డ వెడలిపోవుచున్నట్లు!

నిన్నటి మాట మంగళకు కష్టము కలిగించినదని గ్రహించినాఁడు సురేశుఁడు. లేచి మాటాడుటకుగాని, ఓదార్చుటకుగాని, నచ్చఁజెప్పుటకుగాని ప్రయత్నింపలేదు. "ఈమె నన్నవమానపఱచుచున్నది. నన్నల్లరిచేయఁ జూచుచున్నది. పోనిమ్మెచటికి పోవునో! చెప్పకుండ వెడలిపోవుట కర్థమేమి? నేననిన లక్ష్యము లేదన్నమాట! నేనెందుల కాపలె."

అతడట్లే జడునివలె పడియున్నాఁడు. మంగళ వెడలిపోయినది. ఆమెవైపు కన్నెత్తియైనను చూడలేదు.

## 4

మంగళ కాలినడకనే బయలుదేరినది. ఒక యీనాందారుని భార్య కాలినడకన బయలుదేరుట మామూలు విషయముకాదు. అయినను నామెను ప్రశ్నించుట కెవరికిని ధైర్యముచాలలేదు. పురుషులు ప్రక్కకుతప్పుకొనుచున్నారు. స్త్రీలు గుమ్మమువద్ద నిలువబడి కరుణ కౌతూహలపూర్ణమైన దృక్కులతోఁ జూచుచున్నారు — "అయ్యో ! నిర్దయుడా ! మేనాపై పంపుటకైనను బుద్ధి పుట్టలేదా?"యని మనసులో ననుకొనుచుండిరి.

మంగళ తన గ్రామమునుండి బయలుదేరి యాగ్రామము నానుకొనియే శీతల యున్న గ్రామమును చేరినది. ఈవిషయము తెలిసినంతనే శీతల గుమ్మమువద్ద కేతెంచి—

"చెల్లీ! కాస్సేపు ఇంటిలోనికి వచ్చి విశ్రాంతి తీసికొనుము! రమ్మ!" అని పిలిచినది.

మంగళ యింటిలోని కేగి చూచినది - ఇల్లంతయు నచ్చటచట పడిపోయియున్నది. వరండాలో నొక వృద్ధస్త్రీ మంచముపైబడి యున్నది. ఇల్లంతయు దారిద్ర్య చిహ్నము లతో నిండియున్నది.

"ఏమిటిదియంతయు?" అని శీతల యడిగినది.

"అదృష్టము!"

"సురేశుఁ డేమైన ననినాఁడా?"

"నోటితో ననకపోయినను, మనసులోని విషయము దాగదుగదా!"

"అరే! ఇంతవఱకు వచ్చినదా?"

దుఃఖమున కంతిమదశ సంకోచహీనత్వమగును. మంగళ యనినది-"అచటనే పడియుండెడిదానను. ఆ యింటిలోనే జీవితము గడపెడిదానను. కాని ప్రేమ, గౌరవము, ఆదరము లేనిచోట నేనుండలేను."

"నీ పుట్టినిల్లెచట?"

"పుట్టినింటి కే ముఖము పెట్టుకొని పోదును?"

"మఱి ఎచట కేఁగుదువు?"

"భగవంతునివద్దకు! నాకు నీవు సౌందర్యము నేల ప్రసాదింపలేదని యడుగుదును. నన్ను కురూపినిగ నేల సృష్టించితివని యాతనినే యడుగుదును. సోదరీ! స్త్రీకి కురూపి

యగుటకంటె సౌభాగ్యము వేఱొండులేదు. పూర్వజన్మ మందలి పిశాచినులే యీ జన్మమున కుటుంబినులగుదురేమో! రూపమున్న ప్రేమ లభించును. ప్రేమమున్నచో సలక్ష్య మేమున్నది ?"

ఈమాట యని మంగళ లేచినది. శీతల యామె నాపలేదు—'ఈమెకు భోజన మేమి పెట్టగలను ? నేఁడు ప్రొయ్యి వెలిగించు నాసయే లేదు' అనుకొనినది.

ఆమె వెడలిపోయిన తరువాత చాల సేపటివఱకు నాలోచించుచు కూర్చుండినది—'నేనెంతటి దురదృష్టవంతు రాలను! ఏ ప్రేమ లభింపనందునవలన నీమె తన జీవితమునే త్యజింపసిద్ధపడినదో యట్టి ప్రేమను నేను కాలితో తన్ని వేసితిని. ఈమెకు నగల లోటున్నదా ? ఈ యాభరణము లన్నియు నామెకు సుఖము నీయఁజాలకపోయినవి. ఈమె యా నగలను కాలితో తన్ని వేసినది. ఆ యాభరణములకై నేను నా సర్వస్వమును పోఁగొట్టుకొంటిని. అయ్యో! వా రెన్నటికి తిరిగివత్తురో ! ఎట్లున్నారో !'

తన ఆశను, లాలసను నామె యెన్నిసార్లో ధిక్కరించి నది. నేఁడు శీతలస్థితి జూచినంత నామెకు నగలనిన నసహ్యము కలిగినది.

విమలసింహుఁ డింటినుండి వెడలి రెండు సంవత్సరము లైనది. శీతల మనసునం దిపుడు భర్తను గుఱించిన శంక లెన్నియో పొడసూపుచున్నవి. ఆమె మనసు దుఃఖముతో—గ్లానితో జ్వలించుచున్నది.

గ్రామములందలి ప్రతి యీనాందారుని పనులన్నియు దబాయింపులు, కేకలతోడనే జరిగిపోవుచుండును. విమలసింహుఁడు పేరునకు మాత్రమే యీనాందారుఁడైనను అతనికున్న కొలది వ్యవసాయమును కూలి లేకుండగనే జరుగుచుండెడిది. అతడు వెడలిపోయినపిమ్మట వ్యవసాయ మొనర్చువారెవరు? పొలమంతయు బీడై పోయినది. పాలికైనను నెవఁడును దున్నలేదు — మధ్యలో విమలసిహుఁడు వచ్చి దబాయించి వాటా యెగగొట్టునేమో యని! శిస్తు వసూలు కాలేదు. శీతల షావుకారువద్దనుండి అప్పు తెచ్చి గడిపినది. మరుసంవత్సరముగూడ నట్లేయైనది. ఈసంవత్సరము షావుకారు అప్పుగూడ నీయలేదు. ఇఁక శీతలకున్న యీ కొద్దిపాటి నగలే యాధారమైనవి. రెండవ సంవత్సరము పూర్తి కానచ్చునప్పటికి మార్గాంతరమే తోఁచలేదు—ఉపవాసములకంటె గత్యంతరము లేదు. ముదుసలి యత్తగారు, చిన్నమఱఁది, ఆఁడుబిడ్డ, తాను—నలుగురు ప్రాణుల పోషణము! చుట్టపక్కముల రాకపోకలు తప్పవుకదా! గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు మరియొక విపత్తు వచ్చినది — ఆమె పుట్టినింటివారిపై నొక క్రిమినల్ కేసు వచ్చినది. తండ్రి అన్నగారు విపత్తులో చిక్కుకొనినారు—తప్పించుకొనుట అసంభవమైనది. తమ్ములిద్దరు, చెల్లెలు, తల్లి మఱి నలుగురు ప్రాణులు వచ్చి నెత్తినెక్కినారు. అతికష్టముమీఁద నడచుచున్న బండి బురదలో కూరుకొనిపోయినది.

నిద్రమంచమునుండి లేచుటయే తడవుగ పోట్లాటలు ప్రారంభము! వియ్యపురాలు వియ్యపురాలితో! ఆఁడుబిడ్డ వదినతో! మఱఁది బావతో! ఒక్కొక్కనాడు ఇంటిలో నేమియు లేకపోవుటవలన నన్నమే యుండెడికాదు. ఒకవేళ వంటయైనను ఈ కొట్లాటలతో భోజనము లయ్యెడివికావు- ఎవరికివారే యలిగి బిగిసి కూర్చుండెడివారు. పిల్లలు ఊరివారి పొలములపైఁబడి, శనగకాయలు, పెసరకాయలుతినెడివారు. ముసలివారు ప్రక్కయిండ్లకేఁగి తమదుస్థితిఁజెప్పికొని యేడ్చి వారిని స్తుతించి పని జరుపుకొనెడివారు. మగవాడు లేనప్పుడు ఆఁడుదాని పుట్టినింటివారి యధికారము హెచ్చును! ఆ నిత్య సంగ్రామమున పుట్టినింటివారిదే విజయము! ఒకవేళ ధాన్య మెచటనైన లభించినను దానిని దంపున దెవరు? విసరున దెవరు? అత్తగార నెడిది-'తినుటకు మాత్రము పిల్లులవలెవచ్చి కలియబడుదురు-దంపుటకు ప్రాణముపోవును!' అని. విధిలేక శీతల తానే దంపెడిది, తానే విసిరెడిది. భోజన సమయమున చుట్టుప్రక్కల వారందరును హడలిపోవునంతటిగోల ప్రారంభ మయ్యెడిది. శీతల తన యత్తగారి కాళ్లుపట్టుకొనును, తల్లిచరణ ములకుమ్రొక్కి బ్రతిమాలును, కాని యిరువురునూరకుండరు. మమ్మిచటికి పిలిచి మా బ్రదుకు వీధినిపెట్టినావనును తల్లి! నానెత్తిన నొక సవతి నెక్కించినావనును అత్తగారు! ఈఘోర వివాదములందు శీతల తనవిరహాశోకమును మఱచినది. భర్తను గుఱించిన శంకలన్నియు నీ విరోధాగ్నిలోఁబడి శాంతించినవి. ఇప్పుడామె కొకటే చింత - ఈ విపత్తు ఎప్పుడు తొలగునా

యని. తల్లి, అత్తగారు - నీ రిపువురకును యమసదనమున తప్ప తావులేదు. కాని యమధర్మరాజు వీరి నాహ్వానించుట కుత్సాహము చూపుటలేదు. ఎన్నియో యుపాయము లాలోచించును-కాని రోజంతయు తిరిగి తిరిగి తన ద్వారము నద్దకే చేరునట్టి పథికునివలె నామె యాలోచననాశక్తియు నిష్ఫలమైపోయినది. ఎచటనైన రక్షణస్థాన మున్నదాయని నలువైపుల దృష్టిసారించును. కాని యెచటనుచూపునిలువదు.

ఒక నాడామె గుమ్మమునద్ద నిలువబడినది. ఇట్టి నిరాశా స్థితియందు, విపత్తులో మునిఁగియుండె, హృదయోద్వేగముతో ప్రతీక్షణలో మునిఁగియున్నపుడు గుమ్మమునిన నొక విధమైన ప్రేమ కలుగును. ఇంతలో సురేశుఁడు గుఱ్ఱముపై నెక్కి యా దారినే వెళ్ళుచున్నాడు. ఆమె చూపు అటు తిరిగినది. ఇరువురి చూపులును కలిసినవి. ఆమె సంకోచముతో వెనుకకు తగ్గి తలుపులు మూసికొనినది. సురేశుఁడు ముందునకు సాగిపోయినాడు. అతడు తన్ను చూచినాడుగదా యని యామెకు విచారము కలిగినది. చీరె చిరిగిపోయినది - చీరె యంతయు చిరుగులు, కుట్లు! అతఁ డేమనుకొనునో!

సురేశునకు గ్రామీణులవలన విమలసింహునిపరివారపు కష్టములు తెలిసినవి. అతడు గుప్తరూపమున వారికి సాయ మొనర్ప నెంచెను. కాని శీతలను చూచినంతనే సంకోచ మావహించి యా గుమ్మమువద్ద నొకక్షణమైనను నిలువనీయ లేదు. సంగళ యిల్లుసేడి చనినతరువాత మూఁడు నెలల

కాతఁ డీ నాడు ఇంటినుండి బయలుదేరినాడు. సిగ్గుతో బయటకే వచ్చుటలేదు.

సురేశుఁడు మనసులో శీతల రూపము నాస్వాదించు చున్నాడనుటలో సందేహము లేదు. మంగళ వెడలిపోయిన తరువాత నాతని మనసులో నొక విచిత్రమైన దుష్కామన బయలుదేరినది—ఏ యుపాయముననైన నీ సుందరి నాకు చిక్కునాయని. చాలకాలమైనది; విమలుని జాడలేదు. అతడు జీవించి యున్నాఁడో లేఁడో! కాని యాత డీ దుష్టకల్పనను ఆలోచనతో నణచుచున్నాడు. శీతల యనుభవించుచున్న కష్టలగాథలను వినియు నామెకు సాయమొనర్ప భయపడు చున్నాడు-'నాలోని వాసన, నాలోని కామము, ఈరూపమును దాల్చి నావివేకమును నాశన మొనర్చునేమో!' అని. కాని చివఱకు లాలస తన కపట లీలలతో నాతనిని లోఁగొన్నది. ఆతడు శీతల స్థితిగతులను విచారించుట కామె యింటి కేఁగి నాడు. మనసులో తర్కము ప్రారంభమైనది—'ఒక అబల ఘోరవిపత్తులో నున్నప్పుడామెవిషయ మాలోచింపకుండుట ఎంత యన్యాయము!' అచటినుండి తిరిగి వచ్చునప్పటికాతని బుద్ధి, వివేకముల బంధనములు సడలిపోయినవి. మోహ వాసనాసాగరమున నావ పరిభ్రమించుచున్నది-మునకలు వేయు చున్నది. ఆహా! ఎంతటి మనోహరరూపము! ఎంతటి యనుపమ కాంతి!

క్షణములో నాతఁడున్మత్తుఁడై పోయినాడు-"ఈశరీరము ఈప్రాణము నీకే యర్పింతును! ప్రపంచము నవ్వును; నవ్వ

నిమ్ము! మహాపాపమే కానిమ్ము! పరవాలేదు. ఈ స్వర్గీయానందమును విడువఁజాలను. ఇఁకనామె నానుండి తప్పించుకొనఁజాలదు. నాహృదయమునామెచరణములందర్పింతును. మఱి విమలసింహుఁడో? అతడు చనిపోయినాడు, ఇంకెక్కడి విమలుఁడు! చావకపోయినచో చచ్చును! ఇందు పాపమేమున్నది? ఈ కమల మెంతకోలమైనది? ప్రఫుల్లమై మనోహరముగ నున్నది. ఆమె యధరములు..."

ఏదియో మఱచిన విషయము జ్ఞప్తికి వచ్చినట్లు అకస్మాత్తుగ నాగిపోయినాడు. మానవుని బుద్ధిలో నజ్ఞాతరూపమున వేఱొక బుద్ధియుండును. రణక్షేత్రమునుండి పారిపోవు సైనికునకు గుప్తస్థానమునుండి సాయము లభించుటవలన నుఱల నాతడు యుద్ధక్షేత్రమున నిలువబడునట్లు, ఈ యజ్ఞాతముగనున్న బుద్ధి సురేశుని చైతన్య నొనరించెను. కొంతసేపటివఱ కాతఁడు శిక్షవిధింపబడినటై దీవలె క్షుబ్ధభావముతో నిలువబడినాడు. పిమ్మట విజయధ్వనితో ననుకొనినాడు - "ఎంత తేలిక! ఈవికారమను మదగజమును సింహముతోఁ గాదు, చీమతో చంపుదును. శీతల నొక పర్యాయము 'సోదరీ' యనినచో వికారము శాంతించును. సోదరీ! శీతలా! నేను నీసోదరుడను!"

వెంటనే యాతడు శీతల కొక యుత్తరము వ్రాసినాడు- "సోదరీ! నీ విన్ని కష్టము లనుభవించినావు, కాని నాకు కబురైనను చేయలేదు. సరే; ఇఁక భగవాను ననుగ్రహమున

కష్టము లనుభవింపనక్కరలేదు.'' అని. ఉత్తరముతోఁబాటు ధాన్యము, కొంత డబ్బును పంపినాడు.

శీతల సమాధాన మిచ్చినది–''సోదరా! క్షమింపుము! జీవితాంతము నీ మేలు మఱువఁజాలను. మునిఁగిపోనున్న నావను దరిజేర్చితివి.''

# 5

కొన్ని నెలలు గడిచినవి. సాయంసమయము. శీతల తన కొఱకై సురేశుఁడు కొని తెచ్చిన చిలుకకు గింజలు వేయుచున్నది. సురేశుఁడు వచ్చి యింటి ముంగిలిలోకూర్చుండెను.

''అన్నయ్యా! ఎచటినుండి రాక?'' అని యడిగినది శీతల.

పోలీసుస్టేషనుకు వెళ్ళినాను. జాడ తెలియలేదు. రంగూనులో నున్నట్లు మొదట తెలిసినది. కాని యతడు మఱి యొక డనినారు. ఏమిచేయను? బహుమతి పెంచుదునా?''

''డబ్బు యెక్కువగ నున్నది కాఁబోలును! కానిమ్ము! ఆయన కిష్టమైనప్పుడే వత్తురు.''

''ఒక విషయ మడుగుదును. చెప్పుదువా? అసలు ఏమాటపై కోపగించి వెడలిపోయినాడు?''

''ఏమియులేదు. నగలు చేయింపుమనినాను. నా వద్ద డబ్బులేదనినారు. (సిగ్గుతో) అట్టివాడవు పెండ్లి యేల చేసికొనవలె నన్నాను. మాట మాటమీద కోపమువచ్చినది.''

ఇంతలో శీతల యత్తగారువచ్చినది. సురేశుఁడు శీతల తల్లిని, సోదరులను వారింటికి పంపివేసినాడు. అందుచే కొంత

శాంతిగనున్నది. అత్తగారు కోడలిమాట వినినది-"నాయనా, నీవు పరాయివాడవు కావు. నీవద్ద దాపరిక మేల? ఈ మహా రాణి చూచుటకు మాత్రమే గులాబిపువ్వు! లోన నన్నియు ముండ్లే! తన యలంకారము, సింగారమేగాని మగని విష యము పట్టదు. పాపము! వాడు దీనికొఱకై ప్రాణము లిచ్చెడి వాడు. కాని తిన్నగ నిది మాటాడనైన మాటాడెడిది కాదు. దీని హృదయమున ప్రేమయనునది లేశమైనను లేదు. చివ రకు వానిని కొంపనుండి వెడలగొట్టి యూరుకొన్నది."

"ఆయనయే డబ్బు సంపాదింతునని వెడలినారు. సంపాదనకై దేశవిదేశముల కేగుట మగవారి పనియే!" అని శీతల కొంచెము కోపముతో ననినది.

"యూరపు దేశములందు స్త్రీ పురుషులకు ధనము, భోగము, తప్ప వేఱొక సంబంధముండదు. ఈ సోదరి యూరపు నందు పుట్టి యున్నచో ధనముతో, నగలతో విలసిల్లి యుండె డిది. శీతలా! సౌందర్యమిట్లు యుత్తలంచినచో యూరపు దేశము లందు జన్మించు నట్లనుగ్రహింపుమని భగవానుని వేడుము."

శీతల వ్యథిత స్వరముతో నన్నది-"అదృష్ట మున్న వారికి ఈ దేశమందున్నను నగలకు లోటులేదు. అందరు నావలెనే తమ దురదృష్టమున కేడ్చుటలేదు."

శీతల ముఖకాంతి మలినమై నట్లాతడు గ్రహించినాడు. పతివియోగమునగూడ నగలకై యింతటి యుబలాటమా? "సరే! నేను నీకు కావలసిన నగలు చేయింతును!" అనినాడు.

ఈవాక్యము లవమానజనకములైనను శీతల నేత్రము లానందాశ్రువులతో చెమ్మగిలినవి--కంఠము గద్గదమైనది. ఆమె కండ్లముందు రత్నజటితాభరణభూషితయైన మంగళ చిత్రము సాక్షాత్కరించినది. కృతజ్ఞతాపూర్ణమైన దృష్టితో సురేశునివైపు చూచినది. ఆమె నోటితో మాటాడలేదు. కాని, ఆమె ప్రత్యంగమును 'నేను నీదానను' అనుచున్న ట్లుండెను.

# 6

గున్నమామిడి కొమ్మపై గూర్చుండియున్న కోయిల గాని, నిర్మల శీతనారిని మగ్నమైయున్న చేపగాని, విశాలమై శ్యామలమైన మైదానమున గంతులిడు హరిణశాబకముగాని మంగళయాభరణములను దాల్చి సంతోషముతోనున్న శీతల వలె సంతుష్టములు కావు. ఆమె పాదములు నేలపై నానుట లేదు - సంతోషమువలన- ఆకాశమున విహరించుచున్నట్లు న్నది. కేశసంస్కారములతో, కాటుక తీర్చుటలో, సింగార ములో నిమగ్నమైయుండుటచే పొగమంచు విడిపోయినది - స్వచ్ఛమైన వెన్నెల వచ్చినది! ఆమె యింటిలో పూచిక పుల్లనుగూడ ముట్టుటలేదు. ఆమె స్వభావమున నొక విచిత్ర మైన గర్వము ప్రవేశించినది.

కాని యీశృంగారమున కర్థమేమి? నిద్రాణమైయున్న కామవాసనలను మేల్కొల్పు ఘోర నినాదము!- ఉద్దీపన మంత్రము! ఆపాదమస్తక శృంగారమైన పిమ్మట ఆమెకు

'ఎవరైన నన్నుఁ జూచిన బాగుండునుగదా!' యనిపించును. గుమ్మమువద్దకే తెంచి నిలబడును. చుట్టుప్రక్కలనున్న అమ్మలక్కల ప్రశంసలతో నామె సంతసింపదు. ఆ గ్రామమందలి పురుషులామెకు శృంగారరసహీనులైన పశువులవలెఁ దోఁచుదురు. అందువలననే సురేశునకై కబురు పంపెడిది. ఇంతకు పూర్వమాతఁడు ప్రతిదినమును వచ్చెడివాడు. కాని యీ మధ్య శీతల కబురుచేసినను, బ్రతిమాలినను వచ్చుటలేదు.

జాముపొద్దు గడచినది. వీధి దీపము లారిపోయినవి. ఇండ్లలోని సందడి సద్దుమణగినది. శీతల యింటిలోమాత్రము దీపము వెలుగుచునే యున్నది. ఆమె సురేశుని తోటలో నుండి పూలు తెప్పించినది. దీపముముందు కూర్చుండి మాల గ్రుచ్చుచున్నది.— తనకొఱకు కాదు – సురేశుని కొఱకు, ఉపకారమునకుఁ గృతజ్ఞత చూపుట కామెవద్ద ప్రేమతప్ప యేమున్నది?

ఇంతలో నకస్మాత్తుగ కుక్కలు మొఱిగిన చప్పుడైనది. విమలసింహుఁ డింటిలో నడుగుపెట్టినాడు. ఒకచేతిలో పెట్టె, వేఱొకచేతిలో మూట. దుర్బలమైన దేహము, మురికిగుడ్డలు, పెఱిగినగడ్డము, పాలిపోయినముఖము, చెఱసాలనుండివచ్చిన కైదీవలె నున్నాడు. దీపపు వెలుగుచూచి శీతలయున్న గది వైపున కేఁగినాడు. పంజరములో చిలుక రెక్కలతో చప్పుడు చేయుచున్నది. శీతల యులికిపడి తలయెత్తి 'ఎవరు?' అనినది. వెంటనే గుర్తించినది. పువ్వులనొక గుడ్డక్రింద కప్పిపెట్టి

నది. లేచి నిలువబడి తలవంచి యనినది—"ఇన్నాళ్ళకు జ్ఞాపకము వచ్చితిమా?"

విమలసింహుఁడు సమాధాన మీయలేదు. అతఁడు విమూఢుఁడై శీతలవైపు జూచును—మఱియొకపరి యింటిని పరికించును అతనికొక నూత్న ప్రపంచమున నడుగిడినట్లున్నది. ఇయ్యది అనుకూలమైన జలవాయువులు లేక ముకుళించుకొనియున్న అర్ధవికసితకుసుమము కాదు! తుహిన బిందువుతో మిలమిలలాడుచు, చిఱుగాలితరగల నూయెల లూగుచున్న పూర్ణవికసిత కుసుమము! అతఁడామె సౌందర్యమునకు మొదటినుండియు ముగ్ధుఁడే! కాని యియ్యది యగ్నిజ్వాల! హృదయమున తాపము, కండ్లకు మంట కలిగించునట్టి యగ్నిజ్వాల! ఈయాభరణములు; ఈవస్త్రములు! ఈయలంకరణములు! అతని తల తిరిగిపోవుచున్నది. చతికిలబడినాడు. ఈ సూర్యముఖముందు కూర్చుండుట కాతనికి సిగ్గుగనున్నది. శీతల యింతవఱకును రాపడినిలుచుండెను. నీరు తెచ్చియిచ్చుటకు పోలేదుభర్త – పాదప్రక్షాళనమునకు! విసరనైనను లేదు. ఆమెబుద్ధి పనిచేయుటలేదు. తానెంతరమ్యమైన యుపవనమును సృష్టించుకొనినది! ఆ కల్పనావాటికపై తుషారపాతము! సర్వనాశనమైనట్లున్నది. ఈ మలినవదనునిపై, ఈ యర్ధనగ్నునిపై నామె కసహ్యము కలిగినది. ఈయింటి జమీందారైన విమలసింహుఁడు కాఁడితడు– కూలివాఁడైపోయినాడు. బండ పనుల ప్రభావము ముఖముపై

వ్యక్తమగుచునే యుండును. అందమైన వస్త్రములు ధరించి నను కూలివాడు కూలివాడే!

ఇంతలో విమలసింహుని తల్లి లేచి—శీతల గదిలోనికి వచ్చినది. విమలసింహునిజూచి పుత్రస్నేహముతో నక్కున జేర్చుకొనినది. కుమారుడు తల్లి పాదములకు నమస్కరించి నాడు. అతని కండ్లనుండి వేడికన్నీటిచుక్కలు రాలుచున్నవి. మాతృదేవి పుత్రప్రణయమున పులకితమైనది—నోటమాట వచ్చుటలేదు.

ఒక క్షణమాగి విమలసింహుఁడు—'అమ్మా!' యని నాడు. కంఠధ్వనినిబట్టి కుమారునిఆశయము కనిపెట్టినదితల్లి.

"కాదు నాయనా! అట్టిదేమియు లేదు."

"మఱి యిదియంతయు నేమి?"

"స్వభావమే యంత! ఎవ రేమి చేయగలరు?"

"సురేశుఁడు నా జాడ కనిపెట్టుట కెందుకు ప్రయ త్నించినాడు?"

"నిన్ను తీసికొని వచ్చుటకే! అతడు దయతలఁచనిచో నీపాటి కందరము చచ్చియుండెడివారమే!"

"ఎంతో బాగుండెడిది!"

"ఎవరి అదృష్టము వారిది. అందరి యదృష్టమును నీవే శాసింతువా?"

విమలసింహుఁడు కోపముతో కంపించుచు—"అమ్మా! నన్నీగదినుండి యావలకు గొనిపొమ్ము! ఈపిశాచిని ముఖము జూచుట నా కిష్టములేదు. నాకు కోప మెక్కువగుచున్నది. నే నీ కులకళంకిని కొఱకై చేసిన మూఁడు సంవత్సరముల కఠినతపస్సుకు భగవానుఁడు ప్రత్యక్ష మయ్యెడివాడు—కాని దీనినిమాత్రము పొందలేకపోతిని."

ఇట్లని యచటినుండి లేచి తల్లి గదిలోని కేఁగినాడు. తల్లి చేతులు కాళ్లుకడిగికొనుటకు నీరిచ్చి, పొయ్యి వెలిగించి వంట ప్రారంభించినది. వంట చేయుచు ఇంటి కథయంతయు వివరించినది. విమలసింహుని హృదయమున సురేశునియెడల ప్రజ్వరిల్లుచున్న విరోధాగ్ని శాంతించినది. కాని హృదయ దాహము రక్తదాహముగ మారినది. తీవ్రమైన జ్వరమువచ్చి నది. దూరయాత్ర వలనయలసట, చిరకాల మొనర్చిన శారీరకశ్రమ, ఆ తపస్సునకు పిమ్మట కలిగిన ఈ మానసిక సంతాపము దుర్భరమైనది.

రాత్రి యంతయు నొడలెఱుంగక పడియున్నాఁడు. తల్లి ప్రక్కన కూర్చుండి వీచుచున్నది—కంటనీరు నింపుచు న్నది. మరునాడుగూడ శీతల యాతనివద్ద కొక్కసారియైనను రాలేదు—"నాకేమి బంగారపు ముద్దలు పెట్టినాడా? ఆతని మాటలేల పడవలె? ఇచట నున్నపు డెంతయో విదేశమున నున్నను నంతే! దమ్మిడియొఱుఁగను. సంపాదించుహానివలె

బెదిరించి వెళ్ళినాడు. ఏమి కట్టుకొని వచ్చినాడు?" ఇవి యామె భావములు!

సాయంకాలము సురేశునకు కబురందినది. పరుగు పరుగున వచ్చినాఁడు. ఆతఁడీ యింటిలో నడుగుపెట్టి రెండునెలలైనది. విమలసింహుఁడు కండ్లు తెఱచినాఁడు–గుర్తించినాడు. ఆతని కనులు చెమ్మగిలినవి. సురేశుని ముఖారవిందమున దయాజ్యోతి వెలిగినది. సురేశుని యెడల తనకు గలిగిన సందేహమునకు విమలసింహుడు తన్ను తానే నిందించుకొనుచున్నాడు.

శీతల సురేశుఁడు వచ్చినాడని వినినంతనే అద్దము ముందునకు పోయినది–ముంగురులను చెల్లాచెదరొనర్చినది–విషాదపూర్ణమైన మోముతో విమలసింహుఁడున్న గదిలోని కేఁగినది. విమలసింహుఁడుకనులు మూసికొని పడియున్నాడు–మూర్ఛితునివోలె! శీతల వచ్చినంతనే కనులు తెఱచినాఁడు. నిప్పులు గ్రక్కు నేత్రములతో—"ఇప్పుడే వచ్చినావేమి? నేటికి మూడవనాడు రమ్ము! సురేశునితో మఱల ఆనాడు కలిసికొనఁగలవు!" అనినాడు.

శీతల వెనుకకు మఱలినది. సురేశునిపై మిన్ను విఱిగి పడినట్లయ్యెను! అతడు తనలో ననుకొనినాడు – 'ఎంతరూపలావణ్యము లున్నవి! కాని యవి విషాక్తములు! హృదయము లేదు–దాని బదులు శృంగారలాలస యున్నది."

రోగ తీవ్రత హెచ్చి పోవుచున్నది. సురేశుఁడు డాక్టరును పిలిపించినాడు. మృత్యుదేవత యెవరిప్రార్థననువినలేదు.

ఆమె హృదయము పాషాణము! అయ్యది ద్రవింపదు. కల కలలాడుచున్న యింటిని నాశనమొనర్చుట, సస్యశ్యామల మైనపొలమును బీడొనర్చుట దాని పనియే! అయ్యది యా మృత్యుదేవతకు నిర్దయతోఁగూడిన వినోదము! అది నిత్య నూత్నరూపములఁ దాల్చుచుండును. ఒకప్పుడు సౌదామిని, మఱొకప్పుడు పుష్పదామము! ఒకప్పుడు సింహముగ మఱొ కప్పుడు నక్కగ మారును. ఒకప్పుడు అగ్నిరూపము, వేఱొ కప్పుడు జల రూపము!

మూడవనాటి చివరి జామున విమలసింహుని మానసిక బాధ, హృదయతాపము నంతమొందినవి. దొంగ పగటివేళ దొంగతనము చేయడు. యమదూతలుగూడ నట్లే యెవరి కండ్ల పడకుండ రాత్రివేళ వచ్చుచు—ప్రాణరత్నము నపహ రింతురు. ఆకాశసుమములు ముకుళించుకొని పోయినవి. శోకమగ్నమై తలవాల్చి వృక్షసమూహము మాత్రము స్థిర ముగనున్నది. రాత్రి యనునది శోకమునకు బాహ్యరూపము. రాత్రియే మృత్యువునకు క్రీడాక్షేత్రము! ఆరాత్రి వేళనే విమలసింహునింటిలోనుండి యార్తనాదము వెలువడినది - దానిని వినుటకే మృత్యుదేవత సదా తొందరపడుచుండును.

శితల యులికిపడినది. భయముతో మరణశయ్యవద్ద కేఁగినది. ఆ మృత దేహముపై దృష్టి నిగిడ్చినది. భయ భీతయై యొకయడుగు వెనుకకు వేసినది. భర్త తీవ్రదృష్టితో తన వైపు చూచుచున్నట్లనిపించినది. ఆరిపోయిన దీపములో నామెకు భయంకరజ్యోతి కన్పట్టినది. భయము వలన నచట

నిలువలేకపోయినది. గుమ్మము దాటుచుండగనే సురేశుఁడు వచ్చినాడు. కాతర స్వరముతో నన్నది—'నాకిచట భయముగ నున్నది.' ఆతని పాదములపై పడవలె ననిపించినది—కాని యాతడు ప్రక్కకు తొలగినాడు.

## 7

బోటసారికి కొంతదూరమేఁగిన పిమ్మట త్రోవతప్పినామని తెలిసినచో నతడు వెనుకకు-సరియైన మార్గమునకు వచ్చుటకు మఱింత వేగముగ నడచును. తన యజాగ్రతకు తానే విసిగికొనును. సురేశుఁడుగూడ శాంతిపథమున కేతెంచుటకు త్వరపడుచున్నాడు. మంగళ చేసిన ప్రేమతోఁగూడిన సపర్యలు గుర్తుకు వచ్చుచున్నవి. హృదయమున వాస్తవమైన సౌందర్యోపాసనాభావము లుదయించినవి. ఆమెలో నెంత ప్రేమ, త్యాగము, క్షమాభావములున్నవి! ఆమె యతులిత పతిభక్తిని తలఁచుకొని యప్పుడప్పుడాతఁడు వికలుఁడై పోయెడివాడు. 'అహో! నేనెంత యన్యాయ మొనర్చినాను! ఒక యుజ్జ్వల రత్నము నాదరింపలేదు. నేనిచట పడియేయున్నాను-నాముందునుండి లక్ష్మి వెడలిపోయినది.' మంగళ తాను వెడలిపోవునప్పుడు శీతలతో ననినమాట లాతడెఱుంగును—కాని యాతనికి నమ్మకము కలుగుటలేదు. మంగళ శాంతస్వభావముగలది. ఆమె యింతటి ఘోరకృత్యమున కొడిగట్టజాలదు. ఆమె క్షమాస్వరూపిణి! ఆమె యింతటి విద్వేషమునకు పూనుకొనఁజాలదు. ఆమె జీవించి యున్నదనియే యాతని

నమ్మకము. ఆమె పుట్టినింటి కెన్నియో యుత్తరములు వ్రాసినాడు—అచటినుండి వ్యంగ్యములు, వేళాకోళములు, కటువచనములుతప్ప వేఱొండు సమాధానములేదు. చివఱకు తానే యా రత్నము నన్వేషించుటకు బయలుదేరుచున్నానని వ్రాసినాడు, వెంటతీసికొని వచ్చుటయో లేక చనిపోవుటయో తేలిపోవలెనని నిశ్చయించుకొనినాడు.

ఆయుత్తరమునకు సమాధానము వచ్చినది-"మంచిది. బయలుదేరుడు. కాని మా యూరిమీదుగ బయలుదేరుడు. మేముగూడ తమతో వత్తుము-వెదకుటకు!"

సురేశున కీ మాటలలో నేదియో యాశాజ్యోతి కనిపట్టినది. ఆనాడే బయలుదేరినాడు. ఎవరిని వెంటగొనిపోలేదు.

అత్తవారింటిలో నెవరును ఆతనిని గౌరవించి సత్కరింపలేదు. అందఱును ముఖము ముడిచికొని యున్నారు. మామగారు మాత్రము భర్తృ ధర్మముపై నొక యుపన్యాసమిచ్చినారు.

రాత్రి భోజనమై పండుకొనినాడు. మఱదలువచ్చి యెదురుగ కూర్చున్నది. చిరునవ్వుతో—"బావగారూ! ఒక అందమైన స్త్రీ తన భర్తను వదలిపెట్టినచో, భర్తనవమానించినచో నట్టిదాని నేమందురు?"

"కులట యందురు."

"రూపహీనమైన తన భార్యను వదలిన పురుషుని?"

"పశువు!"

"ఆ పురుషుఁడు విద్వాంసుఁడైనచో?"

"పిశాచము!"

మఱదలు నవ్వుచు—"అయిన నేను పారిపోదును. నాకు మిమ్ము జూచిన భయమగుచున్నది." అనెను.

"పిశాచములకుగూడ ప్రాయశ్చిత్తమున్నది."

"కాని యా ప్రాయశ్చిత్తము నిజమైనది కావలె."

"అయ్యది భగవంతునికే తెలియును."

"పాయశ్చిత్తము నిజమైనదైనచో దానికి ఫలితము తప్పక లభింపగలదు. సరే! మాఅక్కయ్యను తీసికొని మఱల మా యింటికివచ్చి వెళ్లుదురా!"

సురేశుని ఆశానౌక మఱల నటు నిటు నూగులాడ సాగినది. గిలగిలలాడుచు—"ప్రభా! నాపై దయఁజూపుము. నేను దుఃఖితుడను. సంవత్సరమునుండి నేను యేడ్చి యేడ్చి గాని నిదురపోని రోజులేదు"అనినాడు.

"మీ రొనర్చినదానికది చికిత్స! నేను వెళ్లుచున్నాను. నిద్రపొండు!" అని ప్రభ లేచినది.

ఒక క్షణమాగి మంగళతల్లి వచ్చినది – "నాయనా! నీవు చదువుకొనినవాడవు! దేశవిదేశములు తిరిగినవాడవు! సౌందర్యవంతుల నొనర్చుమంత్రచటను కనబడలేదా?"

"తల్లీ! క్షమింపుము! నన్నింక నునవమానపరుపవద్దు!" సురేశుఁడు వినయముతో ప్రార్థించినాఁడు.

"నీవు నాకుమాత్రె ప్రాణములు తీసినావు! నేనునిన్ను నాలుగు మాటలైన ననరాదా? నోటికి వచ్చినట్లెల్ల తిట్టవలె

నను కొంటిని–కాని నీవు మాయింటి కేతెంచిన చుట్టమవు! ఏమిచేతును? సరే! నిద్రింపుము!”

సురేశుఁడు, ఆశతో, భయముతో నటునిటు దొరలుచున్నాడు. ఇంతలో గుమ్మమువద్ద నెవరో మెల్లగ ఇట్లనుచున్నారు–“ఏవేమి? మేలుకొనియే యున్నాడు.”

ఎవరో సమాధాన మిచ్చిరి—“సిగ్గుగ నున్నది.”

సురేశుఁడు కంఠధ్వనిని గుర్తించినాడు. తృషితునకు నీరు లభించినది. మరుక్షణమున మంగళ యాతని యెదుటి కేతెంచినది. తలవాల్చి నిలువబడినది. సురేశుని కామె మోమున నొక దివ్యకాంతి కన్పట్టినది, రోగి యారోగ్యమును పొందినట్లు!

రూపమదియే! కాని కండ్లు మాత్రము వేఱు!

## మాయ

నీల:—"నీ వాతని కుత్తర మేల వ్రాసితివి?"

మీనా:—"ఎవరికి?"

"అతని కే!"

"నాకు తెలియుట లేదు."

"తెలియ కేమి! అన్నియుఁ దెలియును. న న్నవమాన పఱచినవానిని, వీధివీధుల న న్నల్లరిపాలు చేసినవానిని నీవు ప్రేమించుటా? నీకిది తగునా?"

"నీవు పొరపడుచున్నావు!"

"నీ వాతని కుత్తరము వ్రాయ లేదా?"

"లేదు!"

"అయిన నాదే తప్పు! క్షమింపుము! నీవు నా సోదరివి కాకున్న చో నిన్ను నే నీ విషయ మడిగెడిదానను కాను."

"నే నెవ్వరికిని ఉత్తరము వ్రాయ లేదు."

"అట్లయిన నాకు చాల సంతోషము!"

"అదేమి! నవ్వుచున్నా వేమి?"

"నేనా?"

"అవును! నీవే."

"నే నేమాత్రమును నవ్వ లేదు."

"నేను గ్రుడ్డిదాననా?"

"నీ నోటితోడనే చెప్పుచున్నావు గదా!"

"నీ వేల నవ్వినావు?"

"నేను నవ్వలేదు. నిజము!"

"నేను నాకండ్లతోఁ జూచినాను."

"నేను నీకెట్లు నమ్మకము కలిగింపఁగలను?"

"నీవు నాకండ్లలో దుమ్ము చల్లుచున్నావు."

"సరే! నవ్వితిని! అయిన? నాప్రాణము లేమైన తీయుదువా?"

"ఇతరులనుచూచి నవ్వుట కధికారము నీకెక్కడిది?"

"నీపాదములకు మ్రొక్కెదను! మీనా! నన్ను వదలి పెట్టుము. నే నేమాత్రమును నవ్వలేదు."

"నేనంత తెలియనిదానను కాను."

"అవును, నే నెఱుఁగుదును."

"నే నబద్ధము లాడుదాన నని నీ యుద్దేశ్యము."

"నీవు నే డెవరి ముఖము చూచి లేచినావు?"

"నీ ముఖమే!"

"నాకు కాస్త విషము సంపాదించి పెట్టరాదూ?"

"నేను దుర్మార్గురాలనుగదా!"

"నేననలేదే!"

"ఇంకేమనవలె? డప్పుకొట్టి చాటవలెవా? నేను దుర్మార్గురాలను, మదించినదానను, పాపిష్ఠిదానను. నీవు సద్గుణ పుంజమువు. సీతవు, సావిత్రివి. ఇక సంతోషమేనా?"

"అన్నియు నీకు నీవే కల్పించుకొనుచున్నావు."

"ఇదిగో! వినుము! నే నుత్తరము వ్రాసినాను. ఇందు నీకేమి సంబంధము? నన్నడుగుటకు నీ వెవరవు?"

"మంచిపని చేసితివి. నిన్నడుగుట బుద్ధి తక్కువే."

"నాయిష్టము! నాయిష్టము వచ్చినవానికి వ్రాయుదును. నాయిష్టము వచ్చినవానితో మాటాడుదును. నన్నడ్డగించుటకు నీవెవరవు? నీవు నిత్యము కట్టలకుకట్టలు ఉత్తరములు వ్రాయుట చూచుచునే యున్నాను. నేను నిన్నడిగితినా?"

"మానాభిమానము లేనాఁడో వదలిపెట్టినావు. నీ యిష్టము వచ్చినట్లు చేయుము."

"నీ వెన్నాళ్లనుండి మానవతి వైతివి? అమ్మతో చెప్పఁదలఁచినావు కాఁబోలు! నాకేమియు భయములేదు. నేనాతనికి ఉత్తరము వ్రాసితిని. అతనిని పార్కులో కలిసికొంటిని. మాటాడితిని. వెళ్లి అమ్మతో, నాన్నతో, ఊరివారందఱితోఁ జెప్పుము."

"ఎవరు చేసికొనినది వారే యనుభవింతురు, వారితో వీరితో నే నేల చెప్పవలె?"

"ఓహో ఎంతటి ధైర్యశాలినివి! ద్రాక్షపండ్లు పుల్లగ నున్నవనుము!"

"సరే! నీ యిష్టము వచ్చినట్లనుకొనుము!"

"చుప్పనాతితనము!"

"నాకేమి?"

"కాస్సేపు ఏడ్వుము!"

"నీ వేడ్వుము! నాకేమి పట్టినది?"

'నాకాతడొక రిష్టువాచికొనిపెట్టినాడు. చూపుదునా?'

"మంచిదే! నా కొరిగిన దేమియు లేదు."

"నీ కెందులకింత కడుపుమంట?"

"నా కేమియు లేదు."

"నీ వుడికిన కొలది నుడికింతును."

"నే నుడుకుబోతుదానను కాను."

"అవును! స్పష్టముగ కన్పించుచునేయున్నది."

"సందేశ మెప్పుడు వచ్చును?"

"ఇట్లే యేడ్చి యేడ్చి చనిపొమ్ము!"

"ముందు నీ వివాహసమయమున నగ్ని ప్రదక్షిణలు చూచి ఆ పిమ్మట!"

"ఆ యగ్నిప్రదక్షిణల పిచ్చి నీకే యెక్కువ."

'అయిన అగ్నిపరిక్రమణములు లేకుండ నేవివాహమా?'

"నాకీ వెధవ ఆడంబరము లనవసరము! ప్రేమయే చాలును! వివాహమునకు!"

"అయిన నీవు నిజముగ...!"

"నాకేమి భయమా?"

"ఇంతవఱకు వచ్చినదా వ్యవహారము? నేను ఉత్తరము వ్రాయలేదని ఒట్లు పెట్టుకొందువేమి?"

"నా మనసులో మాటను ఎందుకు చెప్పవలె?"

"నిన్ను నేనడుగలేదే? నీ యంతట నీవే వాగుచున్నావు!"

"నీవు నవ్వుచున్నావేల?"

"ఎందుకును లేదు, ఆ దుర్మార్గుడు నన్నువలెనే నిన్నును మోసగించునని. నాతో చెప్పిన మాటలే నీకును

చెప్పియుండునని! తరువాత నావలెనే నీవును ఏడువవలసి వచ్చునుగదా యని!"

"నీపై నాతనికి ప్రేమ లేదా?"

"నాపైననా? నా పాదముల చెంత తలయుంచి యనేక పర్యాయములు ఏడ్చినాడు. ఆత్మహత్య చేసికొందునని, విషముఁ ద్రాగుదునని అనెడివాడు."

"నిజమేనా?"

"అవును!"

"నాతోడను నిదే వరుస!"

"నిజమేనా?

"నీమీద ఒట్టు!"

"అయినగింజలు చల్లి వలపన్నుచున్నా డన్నమాట."

"అయిన నాతడు నిజముగ...?"

"మంచి నేర్పరియైన వేటగాడు! సందేహము లేదు!"

మీనాదేవి శిరమున కరము లిడుకొని దుఃఖించుచున్నది.

—(౦)—

# కౌశలము

పండితబాలకరామశాస్త్రి భార్య—మాయాదేవికి—చాల దినములనుండి నెక్కహారము చేయించుకొనవలెనని కోరిక! ఆమె భర్త ననేకవందలసార్లు అడిగినది—పట్టు బట్టినది. ఏవేవో సాకులు చెప్పుచు శాస్త్రి భార్యకోర్కెను నెట్టుకొని వచ్చుచున్నాఁడు. నావద్ద డబ్బులేదని మాత్రమనడు — అట్లన్నచో తన పౌరుషమునకు కళంకమాయె! ఏవేవో తర్కములను వెదకుచుండును——నగలవలన ప్రయోజనము లేదు. బంగారమే మంచిదిదొరుకుటలేదు. మంచిబంగారము దొరికినను కంసాలి అదియిదికలిపి దానిని సగమునాశనమొనర్చును. ఇఁక అన్నిటికంటె ముఖ్యమైన విషయము! — నగల నింటిలో నుంచుటయన దొంగల నాహ్వానించుటయే! స్వల్పకాలికమైన ఆనందమునకై యింతటి విపత్తులఁగొని తెచ్చుకొనుట మూర్ఖత్వము. పాపము మాయాదేవి తర్కశాస్త్రము చదువలేదాయె! పండితుని యుక్తికేమని సమాధాన మొసంగఁగలదు? నగలు ధరించిన ఇరుగుపొరుగు స్త్రీలను చూచినప్పుడామెకు కూడ కోరికపుట్టును. కాని, తన దుఃఖమెవరితోఁ జెప్పుకొనును? పండితుఁడే యొడలువంచి పనిచేయువాఁడైనచో నామెకోరికతీరుట యసంభవమయ్యెడిదికాదు. కాని యాతఁడు సోమరి. భోజనము, విశ్రాంతి ఈరెండు పనులకే యాతని సమయమంతయు వ్యతీతమగును. భార్య సాధింపులు సహింపఁగలడు,

కాని నిద్రలో మాత్ర నేమాత్రమును లోటును సహింపఁ జాలఁడు.

ఒకనాఁడు పండితుఁడు పాఠశాలనుండి వచ్చినంతనే భార్య మెడలో నొక హారమును చూచినాఁడు. ఆ హారము వలన నామె ముఖజ్యోతి పూర్వాధికముగ ప్రకాశించు చున్నది. తన భార్య యింతటి సౌందర్యవతియని యాతఁడెన్నడును తలఁచియుండలేదు. ఈ హారమెవరిదని యడిగినాఁడు.

"ప్రక్కయింటి యావిడది. మాటాడుదమని వారి యింటి కేఁగితిని. హారము చూచితిని, బాగున్నది. మెడలో వేసికొని వచ్చితిని – మీకు చూపించుటకు. ఇటువంటి హార మొక్కటి చేయింపుడు!"

"అనవసరముగా నితరుల వస్తువు తెచ్చినావు. ఎవరైన నెత్తుకొని పోయినచో చేయించి యీయవలెను. పైగా అప్రతిష్ఠ!"

"నేనిటువంటి హారమే చేయించుకొందును. ఇరువది సవరన్లలట!"

"మఱల నదే మాటయా?"

"అందఱు వేసికొనుచున్నారు. నేను మాత్రమేల వేసి కొనరాదు?"

"అందఱు నూతిలో దూకినచో నీవును దూకుదువా? నీవే యాలోచింపుము! ఈహారము చేయించుటకు ఆరువందల రూపాయలగును. కనీసము రూపాయి వడ్డీ చూచుకొనినను 5 సంవత్సరములలో ఆరువందలు వెయ్యి రూపాయలగును.

ఇంత నష్టపడి హారము చేయించుకొనుటవలన ప్రయోజన మేమి? ఆ హారము వారికిచ్చి భోజనముచేసి హాయిగ నిద్ర పొమ్మ!" ఈ విధముగ నని పండితుఁడు బయటకేఁగినాడు.

అర్ధరాత్రి యకస్మాత్తుగ మాయాదేవి కేకలు పెట్టినది- "దొంగలు! దొంగలు! అయ్యో! ఇంటిలో దొంగలు! నన్ను లాగికొని పోవుచున్నారు!"

పండితుఁడులికిపడి గాభరాతో లేచినాఁడు—"ఎక్కడ? పట్టుకొనుడు! పట్టుకొనుడు!"

"నాగదిలోనికి వెళ్ళినాఁడు. నేను వానినీడ చూచినాను."

"లాంతరు తీసికొనిరమ్మ! ఆమూలనున్న కఱ్ఱకూడ తెమ్మ!"

"నాకు భయము! నేను కదలలేకున్నాను."

ఇరుగుపొరుగువారు గుమిగూడిరి—"ఎక్కడండీ? కన్నమేమైన వేసినారా?"

మాయ-"లేదులేదు. చూరులోనుండిదిగినాడు. నాకు మెలకువ వచ్చునప్పటి కెవఁడో నాతలవైపున వంగి యున్నాఁడు. అయ్యోరామా! వాఁడు నా హారమే తీసికొని పోయినాఁడురా దేవుఁడా! అది మెడలో వేసికొనియే నిద్ర పోయినాను. ఇంకేమున్నది? అయ్యోదేవుఁడా!"

పండితుఁడు- "ఆ హారముతీసి యెచటనైన నెందులకు దాచలేదు!"

"ఈనాఁడే నానికడుపు కాల్చుకొనుదని నేనేమెఱుఁగుదును? అయ్యో దేవుఁడా!"

"ఇప్పుడి యేడుపులతో ప్రయోజనమేమి? నీ కర్మ యిట్లున్నది! అందువలననే అన్నిరోజులు నొకవిధముగ నుండవని చెప్పితిని. ఎప్పుడేమగునో ఎవరికి తెలియును? నామాట యిప్పుడు తెలిసినదా? చూడు! ఇంకేనేమి పోయినవో!"

ఇరుగు పొరుగువారు లాంతరులు తెచ్చిరి. ఇల్లంతయు మూలమూలల చూచిరి—గదిలో, వెలిసిపైన, దొడ్డిలో, స్నానాలగదిలో వెదకినారు. దొంగ కన్పట్టలేదు.

ఒకరు—"ఎవఁడో ఎఱిగి యున్నవాని పనియే!"

ఇంకొకరు—"ఇంటిగుట్టు తెలియనివాఁడు లేనిదే దొంగతనమే జరుగదు. ఇంకేమియు పోలేదుగద!"

మాయ—ఇంకేమియు పోలేదు. గిన్నెలన్నియు నట్లే యున్నవి. పెట్టెలుకూడ తాళములతో నున్నవి. పాపిష్ఠి ముండకొడుకు! నానస్తువులు తీసికొని పోరాదా? పరాయి వస్తువు! వారికెట్లు ముఖము చూపఁగలను!"

పండితుఁడు—"నగలమూజా నేఁడు తెలిసినదా."

మాయ—"దేవుఁడా! ఇది యొక అప్రతిష్ఠ!"

పండితుఁడు—"ఎన్ని చెప్పినాను! నామాట వినినగదా! క్షణములో నారువందలు పోయినవి! ఇఁక గౌరవము దక్కించుకొనుట యెట్లో!"

మాయ—"ఆ పాపిష్ఠి వెధవ కొంపలో పూచికపుల్ల మిగులకుండ యెత్తుకొని పోయినను నాకు దుఃఖముండెడిది కాదు. పాపము! క్రొత్తది చేయించుకొనినది! నిన్ననే!"

పండితుఁడు—"ఇరువది నవర్సులని నీకు సరిగా తెలియునా?"

మాయ—"ఇరువది నవర్సులనియే చెప్పినది."

పండితుఁడు—"దుంప తెగినది! ఇంకేమున్నది?"

మాయ—"దొంగ లెత్తుకొని పోయినారని చెప్పెదను. ప్రాణము తీయుదురా యేమి? ఆవిడ సొమ్ము మనమేమైన కాజేసినామా?"

పండితుఁడు—"వస్తువు నీ యింటిలో పోయినప్పుడు నీ వీయవలె! దొంగలెత్తుకొని పోయినారో లేక నీవే దాచికొనినావో యామె కేమి? ఆమె నమ్మదు."

మాయ—"మఱి అంత డబ్బెచటినుండి వచ్చును?"

పండితుఁడు—"ఎచటనుండియైనను తీసికొని రావలసినదే! లేనిచో గౌరవము నిలచునా? కాని నీవు పెద్దపొరపాటొనర్చితివి!"

మాయ—"దేవుఁడు ఎరువుసొమ్మునుకూడ చూడలేకపోయినాఁడు. నాకే మైకము కమ్మినది. లేనిచో రెండు గంటలపాటు మెడలో వేసికొనినచో నాఱిగిన దేమి? దౌర్భాగ్యురాలను!"

పండితుఁడు—"ఇప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజన మేమున్నది. నోరు మూసికొని పడియుండుము. ఆమెతో భయపడవద్దని, నీవస్తువు తెచ్చియిత్తుమని, అంతవఱకు నిద్ర పోమని చెప్పుము."

## 2

ఏదియో యొకవిధమున హారము చేయించి యివ్వవలెననియే పండితుని దిగులు! కాళ్ళు పాఱజాచిన చో చేయున దేమియులేదు. పొరుగింటి యిల్లాలిని సంతోషపెట్టవలె!—బ్రాహ్మణద్రవ్య మెవరికికావలె? తన బ్రాహ్మణత్వ గౌరవము నింత చౌకగ విక్రయించుట పండితున కిష్టములేదు. సోమరి తనము వీడి ధనోపార్జనకు పూనినాఁడు.

ఆరు నెలలపాటు రాత్రియనియుపగలనియుచూడలేదు. మధ్యాహ్నసమయమున నిద్రపోవుటమాని వేసినాఁడు. రాత్రి పూటగూడ చాలసేపటివఱకు మేల్కొని యుండును. ఇంతకు పూర్వ మొకపాఠశాలలో చదువు చెప్పెడివాఁడు. అధ్యాపన కార్యముతప్ప ధనోపార్జనమునకుగల యితర యుపాయములను హేయముగ జూచెడివాఁడు. కాని యిపుడు పాఠశాలనుండివచ్చిసాయంసమయమున భాగవతకాలక్షేపము చేయును. రాత్రి 11, 12 గంటలవఱకు జాతక చక్రములు, సంవత్సర ఫలములు వ్రాయుచుండును. ఉదయము గుడిలో

దుర్గాస్తోత్ర పారాయణముచేయును. మాయాదేవి తన భర్త చేయుచున్న పరిశ్రమనుచూచి 'నెంతటి కష్టము కలిగించుచున్నా'నని పశ్చాత్తాపపడును. రోగము వచ్చినచో నేమి కావలె? ఆతని శరీరము క్షీణించుటచూచి యామె లోలోన బాధపడును. ఐదారు నెలల కాలమిట్లే గడచినది.

ఒకనాడుమాయాదేవి సంధ్యాసమయమున దీపములు వెలిగించుచుండగా భర్తవచ్చినాఁడు; జేబునుండి యొక పొట్లముతీసి యామెవైపునకు విసిరి—ఇదిగో! నేటితో ఋణవిముక్తియైనది!" అనెను.

మాయాదేవి పొట్లమువిప్పి చూచినది-అందు బంగరు హారమున్నది! దాని మెఱుపు-అందమైనచేత చూడ, నామెకు చక్కిలిగింతలు వెట్టినట్లయినది. మోమున నానందరేఖలు తోచినవి. కాతరదృష్టితో భర్తవైపుజూచి — "సంతోషముతో నిచ్చుచున్నారా? కోపముతోనా?"అని యడిగినది.

ఎట్లైననేమి? ఋణము తీర్చవలసినదే గదా! — సంతోషముతో నైననేమి? కోపముతో నైననేమి?"

"ఇది ఋణముకాదు"

"మఱేమి? పోనీ! బదులు!"

"బదులుకూడ కాదు."

"మఱేమి?"

"మీా ప్రే...కు గుర్తు!"

"అయిన నీ ఋణము తీర్చుటకు మఱియొక హారము చేయింపవలెనా ?"

"అక్కర లేదు. ఆహారమును దొంగలెత్తుకొనిపో లేదు. నేనే ఊఱక కేకలు పెట్టితిని."

"నిజమేనా?"

"అవును ! నిజమే !"

"నా మీద ఒట్టేనా?"

"మీచరణము లంటి చెప్పుచున్నాను."

"నీ వీ యుపాయము పన్నినావన్నమాట !"

"అవును !"

"నీయుపాయమునకు, నీ నేర్పుకు, నే నెంతటి మూల్య మర్పింపవలసి వచ్చినదో యెఱుగుదువా?"

"600 రూపాయలకంటె నెక్కువా?"

"అవును! చాల యెక్కువ ! ఈ హారము కొఱకై నా యాత్మస్వాతంత్ర్యము నే బలియొసంగవలసివచ్చినది."

—(౦)—

# తథ్యము

అమృతుని మనసులో నా రహస్యమట్లే యున్నది. ఎన్నటికిని నాతని కయ్యది రహస్యముగనే యుండిపోయినది. ఆతని దృష్టుల వలనగాని, మాటల వలనగాని, యాతని చేష్టల వలనగాని, చిన్నతనమున నిరుగు పొరుగు పిల్లల ప్రవర్తనము కంటె, స్నేహముకంటె నమృతునితో తనకు వేఱొక సంబంధముండునని గాని, యున్నదనిగాని పూర్ణిమ యూహింపలేక పోయెను. ఆమె బిందెతీసికొని నూతివద్ద కేఁగినంతనే ఎచటి నుండి వచ్చెడివాఁడో, అమృతుఁ డేతెంచి యామె చేతినుండి బిందె తీసికొని నీరుతోడి యిచ్చెడివాఁడు. ఆమె యావుకు కుడితిపోయుట కేఁగుచున్నచో నామె చేతినుండి చిట్టు తట్ట లాగికొని తానే తొట్టిలో నీరుపోసి కుడితి పట్టెడివాఁడు. ఆమె కోమటింటి కేఁగుచున్నచో త్రోవలో నామెను కలిసికొని యామె పనులను తానే చేసిపెట్టెడివాఁడు.

పూర్ణిమ యింట నింకెవరును లేరు. తండ్రి చాల దినములైనది స్వర్గస్థుడై. తల్లి బయటకురాదు. పూర్ణిమ కన్న దమ్ములులేరు. అమృతుఁడు పాఠశాల కేఁగునపుడు పూర్ణిమ యింటికేఁగి బజారునుండి యేమైన తేవలెనేమో కనుగొనుచుండెడివాఁడు. అమృతుని తండ్రికి వ్యవసాయమున్నది. ఎడ్లున్నవి, తోటలున్నవి. అతఁ డింటిలోనివారు చూడకుండ తోటలో నేమైన కాచినచో నవి పూర్ణిమ యింటికిఁ గొనివచ్చి యిచ్చెడివాఁడు. ఆతఁడొనర్చు యీ సపర్యలనాతని నుంచితనముగ నెంచుటకంటె, వాటి ననుభవించి

యానందించుకంటె పూర్ణిమ కేమియు నర్థమయ్యెడిదికాదు. గ్రామమున నున్నవారికి రక్తసంబంధ ముండక పోయినను గ్రామసంబంధమువలన అన్న, చెల్లెలు నగుట సహజమే! కావున నామె దృష్టిలో నాతని సపర్యలందు వేఱొక ప్రయోజనమునకు తావులేదు.

ఒకనాడు పూర్ణిమ యాతనితో "నీవు పగలంతయు పాఠశాలలో నుందువు. నాకేమియు తోఁచుటలేదు." అనినది.

అతడు సహజ ధోరణిలో ననినాడు-"ఏమిచేయుదును? పరీక్షలు దగ్గఱకు వచ్చినవి."

"నేను వెళ్ళిపోయినచో నీవు నాకిక కనపడవుగదా యని, మాయింటికిక రావు గదాయని దిగులుగనున్నది."

"ఎచటి కేఁగుదువు?" అని యులికిపడి యడిగినాడు.

"మీఅక్కయ్యలు వెళ్ళిన చోటునకు! అందరు ఆఁడపిల్లలు వెళ్ళుచోటునకు."

"అదియా విషయము!" నిరాశతో ననినాడు. అమృతుఁడిక మాటాడలేదు. పూర్ణిమ మరియొకయింటి కేఁగునని యాతడింత వఱకు ననుకొనలేదు. ఇంతదూర మాలోచించుట కాతని కవకాశమేలేదు. సంతోషమనునది వర్తమానమునందే నిమగ్నమై యుండును. భావిని గూర్చి యాలోచింప మొదలిడినచో నాసంతోషమే యుండదుగదా!

అమృతుఁ డనుకొనిన దానికంటె ముందుగనే యీ దుర్ఘటన వార్తా రూపమున ప్రత్యక్షమైనది. ఆమె వివాహ మొకచో నిశ్చయమైనది. సంపన్నులు, ప్రతిష్ఠితుల యింటనే

సంబంధముకుదిరినది. పూర్ణిమతల్లి సంతోషముతో నంగీకరించినది. ఆ బీదస్థితిలో నన్నిటికంటె ప్రియమైనది ధనమే గదా! అచట పూర్ణిమ హాయిగ, సుఖముగ జీవించుటకుఁ గావలసిన సదుపాయము లన్నియు నున్నవి. ఆడబోయిన తీర్థమెదురైనట్లున్నది. ఇంతవఱకును నామెకీ కుమార్తె వివాహవిషయమైన దిగులే! పిల్లదాని పెండ్లి విషయము జ్ఞాపకమునకు వచ్చినప్పుడామె గుండె కొట్టుకొనెడిది. నేఁడు భగవానుఁడు దయదలఁచి సమస్త దుఃఖములనుండి యుద్ధరించినాడు.

అమృతునకీ విషయము తెలియుటతో నాతనికిఁబిచ్చియెత్తినట్లైనది. పిచ్చివానివలె పూర్ణిమ యింటివైపు పరుగెత్తి మఱల వెనుదిరిగి వచ్చినాడు. సాహసము చాలలేదు. 'అచటికేఁగినందువలన ప్రయోజనమేమి? ఇందామెదోషమేమున్నది. ఎవరిదోషము మాత్రమేమున్నది?' అనుకొని యింటికివచ్చి ముసుగుపెట్టి పండుకొనినాడు. 'పూర్ణిమ వెడలిపోవును — తాను ఒంటరిగ నెట్లుండగలఁడు?' అను భావముతో నాతడు చలించిపోయెను. 'ఈ బ్రతుకు దేనికి? జీవించి చేయునదేమి?' అనుకొనినాడు. క్రమముగ నా భావమును మాయమై పోయినది. ఉపాను పిమ్మట నానరించు నిస్తబ్ధతమాత్ర మానరించియున్నది. అతఁడుదాసీనుఁడై యున్నాఁడు. పూర్ణిమ వెడలిపోవుచున్నప్పుడామెతో తనకు సంబంధమేమి? ఆమెతో కలియుట మాత్రమేల? ఆమె గోడన నాకేల? ఆమె నావిషయమెన్నడైన పట్టించుకొనినదా? తానే కుక్కవలె తోకాడించుకొనుచు నామెచుట్టును తిరిగినాడు. ఆమె నోరెత్తలేదు.

ఆమెకు గర్వము కలుగుటలో నాశ్చర్యము లేదు-లక్షాధి కారి భార్య కాబోవుచున్నది. కావచ్చునుగాక ! ఈ యమృ తుడు గూడ బ్రదికియే యుండును. ఇంతమాత్రమున కే ప్రాణ ములు పీడడు. అవును ! ఈ కాలమున విశ్వాసమునకు ఫలి తనే యిట్లుండును ! ఈకాలపు తీరే యింత !

కాని యీ యుద్రేకమంతయు మనసులోననే! పైగా నిరర్థకమైనది! పూర్ణిమ తల్లి వద్దకేఁగి 'పూర్ణిమనాది! ఎల్ల ప్పుడు నాదిగనే యుండును!' అని చెప్పుటకు సాహసమెక్క డిది? గోల బయలుదేరును! గ్రామమంతయు నుడికిపోవును! గ్రామీణులిట్టి విషయములను కనినారా, వినినారా ?

ఇఁక పూర్ణిమ విషయము ! ఆమె పగలెల్ల నాతనికై ప్రతీక్షించును. గుమ్మమువఱకు వచ్చి లోనికి రాకుండ నాతడు తిరిగిపోవుటకు కారణమామె కర్థమగుటలేదు. త్రోవలో కనుపించినచో నాతడు దూరముగ తప్పుకొనిపోవు చున్నాడు-తన ఛాయయే గిట్టనట్లు ! నీళ్ళబిందె తీసికొని నూతివద్ద ప్రతీక్షించును-ఆతడు వచ్చునేమోయని ! కాని యాతఁడెచటను కన్పించుటలేదు.

ఒకనాడామె యాతని యింటికేఁగి "యీమధ్య మాయింటికి నచ్చుటలేదే"నని యడిగినది. ఆ మాటతో నాతని కంఠము గద్గదమైపోయినది-ఆమె యీ గ్రామమున నిఁక కొలదిదినములు మాత్రమే యుండుననువిషయమాతనికి గుర్తుకు వచ్చినది.

అమృతుడు మాటాడలేదు — అట్లే కూర్చుండి యున్నాడు. "పరీక్షలు దగ్గరకు వచ్చినవి. తీరిక లేదు." అని మాత్రము నిర్లక్ష్యముగ ననినాడు.

కొంతది సేపాగి మరల ననినాడు-"నీవెట్లును నిచట నుండి వెడలిపోవు చున్నావు......" "ఇంకను ప్రేమ బంధ మును పెంచుకొనుట యేల?" అని యనదలంచినాడు. కాని అట్లనిన తన స్వార్థ్యమే బయట పడును. రోగి చనిపోవుటకు సిద్ధముగా నున్నాడని చికిత్స చేయుట మానుదురా? రోగము పెరుగుచున్న కొలందియు,మృత్యువు సమీపించుచున్న కొలం దియు నింకను శ్రద్ధతో చికిత్స చేయుదురు. అంతిమక్షణమున చుట్టపక్కముల ఆతురత కంతేయుండదు. అతడు మాట మార్చి యనినాడు - "వాళ్ళు చాల భాగ్యవంతులని విని నాను."

పూర్ణిమ యాతని యీ చివరి మాటలు వినలేదో లేక వినియు సమాధాన మిచ్చుట యనవసరమని తలంచినదో! కాని యామె చెవులలో నాతని సమాధానమందలి మొదటి భాగమే ప్రతిధ్వనించు చున్నది.

ఆమె దుఃఖపూర్ణమైన స్వరముతో నన్నది-"ఇందు నాదోష మేమున్నది? నాయంతట నేను సంతోషముతో వెళ్లుట లేదు. వెళ్ళవలసి వచ్చుచున్నది గాన వెళ్లుచున్నాను."

ఈ మాట లనుచుండ నామె ముఖము సిగ్గుతో నెఱ్ఱ బారినది. ఆమె తా ననవలసిన దానికంటె నెక్కుడుగ మాట్లా డినదేమో!

ప్రేమలోఁగూడ చదరంగపు ఎత్తులుండును. అన్నతుడా మెవంక 'యీ మాటలలో నేమైన నర్థమున్నదా లేదా' యనునట్లు పరీక్షగ చూచినాడు. తన కండ్లలో నెదుటివారి యాంతర్యమును చూడగలిగిన శక్తియున్నచో నెంత బాగుండెడిది! ఈ విధముగ నాఁడుపిల్ల లందరును నిరాశాభావముతో మాట్లాడుచునే యుందురు - ఈ పెండ్లి తమకిష్టము లేనట్లు! ఈ పెండ్లి తన ప్రాణముమీఁదకు తెచ్చిపెట్టినట్లు! కాని యీ పెండ్లి నా డందరును మంచి వస్త్రములు ధరించి, అలంకరించుకొని పల్లకీలో కూర్చుందురు. ఆమె మాటలవలన నాతనికి సంతోషము కలుగలేదు.

అయినను భయపడుచుననినాఁడు–"అయిన నిఁక నేను గుర్తుందునా నీకు?" అని.

ఈ మాట లనునప్పటికి ముచ్చెమటలు పోసినవి. చెప్పలేనంత సిగ్గు కలిగినది. గదిలోనికి పారిపోవలె ననిపించినది. పూర్ణిమ వైపు చూచుటకు సాహసము చాలకుండెను. ఆమె గ్రహించినదేమో!

పూర్ణిమ తలవంచి తన హృదయముతోఁ జెప్పుచున్నట్లనినది–"నీవు నన్నింత నిర్మోహినిగ పరిగణించుచున్నావు. నేను నిరపరాధను. అయినను నీవు నాపై కోపగించుచున్నావు. నాయెడ నిజముగ సానుభూతి చూపవలసిన సమయమిది. నాకు ధైర్యము చెప్పవలసిన తరుణమిది. నీవు నాపై నలిగినావు. ఇఁక నాకు గత్యంతర మేమున్నదో నీవే చెప్పుము! నా వాళ్లైనవారే నన్ను పరాయికొంపకు పంపుచున్నారు.

అచట నాగతి యేమగునో, నా స్థితి యెట్లుండునో! ఈ దిగులే చాలును నా ప్రాణములు తీయుటకు! దీనికితోడు నీవు నీ కోపమునుగూడ జోడించినావు!”

ఆమె సగద్గదయైనది. మాట రాలేదు. ఆమె హృదయమునందుసైత మొకవిధమైన వేదన యున్నదని యమృతునకు నమ్మకము కుదిరినది. తన నీచత్వము, తన స్వార్థపరత ముఖముపై చక్కగ ప్రతిబింబించినది. పూర్ణిమ మాటలలో సత్యమున్నది – తిరస్కారముతోఁబాటు ఆత్మీయతగూడ నున్నది. పరులవద్ద నెవరైన తమ విషయము జెప్పికొందురా? తా నామెకు ధైర్యముఁజెప్పవలె! ఈస్థితిలో తాను పూర్ణిమ నోదార్పవలె! ఈస్థితియందు సంతోషముతో తన యీ కర్తవ్యమును నెరవేర్చుకొనవలె! పూర్ణిమ తన యెదుట నొక నూత్న ప్రేమాదర్శ ముంచినది. అతఁ డా యాదర్శమును మీఱలేడు. ప్రేమ యనునది హృదయమును దహించివేయునట్టి స్వార్థత్యాగ మనుటలోసందియము లేదు.

“పూర్ణిమా! క్షమింపుము! నాదే పొరపాటు! తప్పు చేసినాను.” సిగ్గుతో ననినాడు.

## 2

పూర్ణిమ వివాహమైనది. అమృతుఁడు మనస్ఫూర్తిగ వివాహ ప్రయత్నములు చేసినాడు. పెండ్లికుమారుడు చదువుకొనినవాడు కాడు, అజ్ఞాని! దుంగుముక్క! పెద్దబొజ్జ! గర్విష్ఠి!

పైగా మంచి - చెడుగులు తెలియని మూర్ఖుడు. కాని యమృతుఁడు మాత్ర మాతఁడొక దేవతయను భావముతో, ఆతని చిసునవ్వు స్వర్గము నొసంగునను తత్పరతతో నాతనికి సపర్యలు చేసినాడు. పూర్ణిమతో మాటాడుటకే యాతని కవకాశము చిక్కలేదు. అట్టి యవకాశముకొఱ కాతఁడు ప్రయత్నింపనులేదు. ఆతఁడు పూర్ణిమను చూచినపుడెల్ల నామె యేడ్చుచునే కన్పట్టెను. అమృతుఁడు నోటితో మాటాడకుండ చూపులతోడనే తన శక్తినంచన లేకుండు నట్లు ఓదార్చినాడు-సానుభూతిని ప్రదర్శించినాడు.

మూడవనాడు పూర్ణిమ కంటనీరుపెట్టి యత్తవారింటికి పయనమైనది. అమృతుఁడానాటి సాయంకాలము శివాలయమున కేఁగి నిష్ఠాయుక్తుఁడై భక్తిప్రపత్తులతో పూర్ణిమ యెల్లప్పుడు సుఖముగ నుండవలె నని ప్రార్థించినాడు. నూతనమైన దుఃఖము వచ్చినప్పుడిఁక వెనుకటి దుఃఖములకు తావుండదు. దుఃఖమనునది ఆత్మసంబంధమైన రోగములను పోఁగొట్టును. కాని యాతని మనసులో నొక విధమైన శూన్యభావ మేర్పడెను, లేదా అసలు కోరిక యనునదే నశించెనో!

## 3

మూఁడు సంవత్సరములకు పూర్ణిమ పుట్టి నింటికి వచ్చినది. ఈలోగా అమృతుని వివాహము గూడ నైనది. సంసారమును కాడి భుజమున వేసికొని మోయుచునే

యున్నాడు. కాని యింకను నాతని మనసులో నొక యస్పష్ట మైన కామము పనిచేయుచునే యున్నది; కాని యా వాసన కొక రూపమును మాత్రము కల్పింపలేకున్నాడు. అతని యందా వాసన థర్మామీటరులోని పాదరసమువలె మనసు లోనే సురక్షితమై యున్నది. ఇప్పుడు పూర్ణిమ యోతెంచి వేడిని కల్గించినది. ఇప్పుడది వ్యాప్తమై చివరిహద్దును చేరినది. ఆమెయొడిలో నిపుడు రెండేడ్ల పిల్లవాడున్నాడు. అమృతుండా బాలుని రాత్రింబవళ్లు నెత్తినెక్కించుకొని తిరుగును. ఉద యము సాయంకాలము నా బాలునెత్తుకొని వీధులవెంట బయలు దేరును. బజారునుండి యాపిల్లవానికై బొమ్మలు తినుబండారములు తెచ్చును. తెల్లవారినంతనే వానికై పాలు తెచ్చును. వానికి నీరుపోసి తుడుచును, తలదువ్వును. వాని కురుపులకు మందు వేయును. పిల్లవాని పోషణభారమంతయు నాతడే వహించెను. పిల్లవాడు గూడ వానినెత్తి కెక్కెను- అంతటి చన వేర్పడినది. క్షణము విడచి యుండడు. అతని వద్దనే పండుకొనును. పూర్ణిమ వచ్చి పిలిచినను పోడు!

"నీవెనరి పిల్లవాడవు?" అని యమృతుండడుగును.

'మా అబ్బాయిని!' అని వాడుసమాధాన మిచ్చును.

అమృతుం డానందముతో వానిని కౌగలించుకొని ముద్దాడును.

పూర్ణిమ యందము వెనుటికంటె పెఱిగినది. ముగ్ధ వికసించినది—పుష్పమైనది. ఆమె స్వభావముగూడ మారినది. ఆత్మాభిమానము పెఱిగినది. శృంగారము, అలంకరణము

వీనిపై ప్రేమ హెచ్చినది. బంగారు నగలుధరించి, సిల్కు చీరలుకట్టి యామె వెనుకటికంటె యాకర్షణీయముగనున్నది. అమృతునికిఁగొంచెము దూరముగ నుండదలఁచుచున్నట్లున్న దామె ప్రవర్తనము! ఏదియో పెద్ద యవసరమున్న నేగాని యాతనితో విశేషముగ మాటాడదు. ఒకవేళ మాటాడినను నాతనిపై దయదలఁచినట్లు మాటాడును. అమృతుఁ డామె కుమారునికై ప్రాణమర్పించును. ఆమె పురమాయించిన పని నుత్సాహముతో చేయును. కాని యామెదృష్టిలో నాతని సేవాసపర్యలకు విలువయున్నట్లు లేదు–సేవచేయుట యాతని కర్తవ్యమున్నట్లు, ఆ కర్తవ్యమునే యాతఁడు నెఱవేర్చుచున్నాడన్నట్లు ! అందుచే కృతజ్ఞతగాని, ధన్యవాదములు గాని యవసరము లేదన్నట్లు!

పిల్లవా డేడ్చినచో కోపగించును—'నీ వేడ్చినచో మామయ్య నీజత యుండఁడు' అని. అంతటితో పిల్లవాడేడ్పు మానును.

ఏదైన వస్తువు కావలసి వచ్చినచో నమృతుని పిలిపించి యాజ్ఞాపించును. అతఁడును వెంటనే యామె యాజ్ఞను మన్నించును – ఆమెకు సేవకునివలె! ఆమెయు నమృతుని తాను బానిసగ కొనివేసినట్లు భావించును!

ఆరు మాసములు పుట్టినింటనుండి పూర్ణిమ సుశీల అత్తవారింటికి బయలుదేరినది. అమృతుఁడామెను సాగనంపుటకు స్టేషనుకు వచ్చినాడు. ఆమె బండిలో కూర్చున్న పిమ్మట పిల్లవాని నామెకిచ్చినాడు. ఆతని కనులనుండి

యశ్రుబిందువులు జాలువాఱినవి—ముఖము ప్రక్కకుత్రిప్పు కొనినాడు—కన్నీరు తుడిచి కొనినాడు. ఆమెకు తన కన్నీ రెట్లు చూపును! ఆమెకనులు రిక్తములాయె! అయినను నిగ్రహించుకొనలేదు – మఱల నెన్నాళ్ళకు చూడగల్గుదునో గదా యనుకొనును.

"పిల్లవాడు నీకై కొన్నాళ్ళవఱకు దిగులు పెట్టు కొనును." పూర్ణిమ సాభిమానముగ ననిన దీ మాటలు.

"జీవితాంతము నేను నీనినిమఱువజాలను" అస్పృశుడు సగద్గదుఁడై యనినాడు.

"అప్పుడప్పుడుత్తరము వ్రాయుచుండుము."

"వ్రాయుదును!"

"నేను మాత్రము సమాధానము వ్రాయను! ముందే చెప్పుచున్నాను."

"వ్రాయకుము! నేనడుగుటలేదు గదా!......కాని గుర్తుమాత్ర ముంచుకొనుము!"

బండి బయలుదేరినది. అత డామె కూర్చుండియున్న కిటికీవైపు చూచుచునే యున్నాడు. బండిగొంక పర్లాంగు దూర మేఁగినపిమ్మట పూర్ణిమ తనవైపు చూచినది – పిల్ల వానిని కిటికీలోనుండి చూపినది.

ఆ క్షణమున నాతని కెగిరి పూర్ణిమవద్ద కేఁగవలె ననిపించినది. తన యుద్దేశ్యము సిద్ధించిన ట్లాతడు సంతసించి నాడు.

## 4

ఆ సంవత్సరమే పూర్ణిమతల్లి చనిపోయినది. పూర్ణిమ యప్పుడు పుట్టింటిలో నున్నది. తన తల్లి నామె చివరి ఘడియలలో చూడజాలకపోయినది. సాధ్యమైనంతవఱకు అమృతుండే యామెకు చికిత్స చేయించినాడు. చనిపోయినపిమ్మట కర్మకాండలుసైతమాతండే చేసినాడు. బ్రాహ్మణులను, ఇరుగు పొరుగువారిని భోజనమునకు పిలిచినాడు — తన తల్లికి వలెనే సమస్తమును నెరవేర్చినాడు. ఆతని తండ్రి యిదివఱకే చనిపోయినాడు. కాన తానే యింటియజమాని. అతని కడ్డులేదు.

ఇంక పూర్ణిమ యే సంబంధమున్నదని పుట్టినింటికి వచ్చును? వచ్చుటకు తీరికమాత్రమేది? తాను తనయిల్లు చూచుకొనుటతోడనే సరిపోవుచున్నది. ఇల్లు వదలి వచ్చుటెట్లు? ఆమెకు మఱి యిరువురుపిల్లలుపుట్టినారు. పెద్దపిల్లవాడు స్కూలులో చదువుచున్నాడు. చిన్నపిల్లవాడా యూరి చిన్నబడిలో చదువుచున్నాడు. అమృతుడు సంవత్సరమున కొకపర్యాయము మనిషినిపంపి వారి క్షేమసమాచారము లరయుచుండును. పూర్ణిమ సుఖముగ నిశ్చింతగనున్నది—ఆతనితృప్తి కదియే చాలును! అమృతుని పిల్లలుగూడ పెద్దవాళ్లైనారు. ఆతండా యింటి వ్యవహారములలోనే మునిగియుండును. ఆతని వయసుగూడ నలుబదికి మించినది. అయినను పూర్ణిమ స్మృతి మాత్ర మాతని హృదయమున గంభీరతరమైన భాగమున సురక్షితమైయున్నది.

## 5

అకస్మాత్తుగా నొకనాడు పూర్ణిమ భర్త చనిపోయినాడను సమాచారము వచ్చినది. కాని యాశ్చర్యమేమన

అస్పృశునకు దుఃఖము కలుగలేదు. ఆతడు తన మనసులో మొదటినుండియు 'నీ ముసలివానితో పూర్ణిమ జీవితము సుఖవంతముగ నుండ'దని నిశ్చయించుకొనియే యున్నాడు. కర్తవ్యమువలననైనవివశత్వము, పాతివ్రత్యపాలనము, పీటి వలన నామె యెన్నడును తన మానసిక కష్టములను వ్యక్తము కానీయలేదు. ఎన్ని సుఖములున్నను, జీవితమెంత నిశ్చింతగ గడచినను, ఆ యసహ్యాకరమైన వ్యక్తి నామె ప్రేమించి యుండుట అసంభవము! ఇయ్యది భారతదేశము! అందువలననే యిచట నిట్టి యప్సరసలను మూడుకాళ్ళ ముదుసలులకుఁ గట్టుదురు. ఈ పూర్ణిమయే యితర దేశములందున్నచో దేశమునందలి నవయువకు లామె నారాధించి సర్వసమర్పణ మొనరించెడివారు! ఆతని గుప్తవాసనలు మరల జాగృతము లైనవి. ఇప్పుడాతనిలో వెనుకటి సంకోచములేదు. ఆతని ముఖమున మానముద్రయులేదు. పూర్ణిమయు నేఁడు స్వతంత్రయే! అవస్థాధర్మ మామెను దయనీయురాలి నొనర్చి యుండవచ్చును. ఆ పెంకెతనము, ఆ నిర్లక్ష్యము అన్నియు మాయమై యుండును. ఆ చిన్నతనపు చేష్టలకు బదులిప్పు డామెలో ప్రేమ నాదరింపజాలునట్టి ప్రౌఢలక్షణము లంకురించియుండును. ఆమె తనను ఆదరింపవచ్చును. అతఁడామె యింటికి కర్మకాండలకు వెళ్లును, తనతోఁబాటు తీసికొని వచ్చును. చేతనైనంతవఱకు నామెకు సేవచేయును; ఆమె సామీప్యమే యాతని సంతోషమునకు చాలును! ఆమె తనను జ్ఞప్తియందుంచుకొనిన చాలును! చిన్నతనమునందు వలె తనను ప్రేమించుచున్నట్లామె నోటినుండి వెలువడిన

ఘూలును! ఇరువది సంవత్సరములకు పూర్వము తాను పూర్ణిమను చూచినప్పు డవయవము లన్నియు నిండుగ నున్నవి. కపోలము లెఱ్ఱగ నున్నవి, శరీరము కోమలముగ నున్నది. చిరునవ్వుతోఁగూడిన నామె బుగ్గ యమృతకుండము! ఆ చిరునవ్వు మాదకము! ఆ వెనుకటి రూపమే కొలఁది మార్పులతో నాతని కండ్ల యెదుట సాక్షాత్కరించుచున్నది. ఆ పరివర్త మా కండ్లకింకను ప్రియమైనది. కాలప్రభావము మానవుల శరీరముపై కన్పట్టును. కాని పూర్ణిమ శరీరముపై గూడ కాలప్రభావము కలుగునని యాతఁడూహింపఁజాలఁడు- ఆమె సౌందర్యమునకు గొంత లోటు కలుగునని యాతడు భావింపఁజాలఁడు. ఆతఁ డామె బాహ్యరూపముకంటె నామె మధురవచనములకై వ్యగ్రుఁడగుచున్నాఁడు. ఆ ప్రేమపూర్ణమైనదృష్టి, ఆమె విశ్వాసము-ఆతడు కోరున దదియే! పురుషోచితమైన ఆత్మాభిమానముచే ప్రేరితుడై యప్పుడప్పుడాతడు తాను పూర్ణిమ యతృప్తవాసనలను తన ప్రేమావేశముచే, తన సపర్యలచే రక్షింతుననియు, వెనుకటి తన పొరపాటు నీవిధముగ కడిగివేయుదుననియు తలపోయును.

## 6

సంయోగ వశమున నొకనాడు పూర్ణిమ చంటిపిల్లవానితోఁగూడ తన యింటికి వచ్చినది. ఒక విధవ పినతల్లి యున్నది. ఆమెయు పూర్ణిమ తల్లితోఁబాటు వైధవ్యదినములను గడపుచున్నది. ఆమె యింకను జీవించియున్నది. అందుచే నింకను నా శూన్యగృహము నిలిచియున్నది.

ఈ సమాచారము వినినంతనే యమృతుడు సంతోష

ముతో మదమత్తునివలె నా యింటికి పరువెత్తినాడు. అతడు తన బాల్యస్మృతులను, యౌవనానుభవములను, తన మనసులో భద్రపఱచుకొని వెంటగొని పోవుచున్నాడు. ఆతని స్థితి, తనస్నేహితుని చూచి తన విరిగిపోయిన బొమ్మలను వెంటగొని సంతోషముగా నాడుకొనుటకై బయలుదేరిన చిన్న పిల్లవానివలె నున్నది.

కాని యామెరూపమును చూచినంతనే యాతని సంతోషము, అతని యుత్సాహము మాయమైనవి నిస్తబ్ధుడై నిలబడిపోయినాడు. పూర్ణిమ యాతని ముందు తలవంచి నిలువబడినది. తెల్లని చీరెచెంగుతో సగము ముఖము కప్పుకొని యున్నది–నడుము వంగిపోయినది. చేతులు పుల్లలై తెల్లబాఱినవి. కాని వెనుక భాగమున నరము లుబికి యున్నవి. కంటినుండి యశ్రుప్రవాహము! ముఖము కాంతివిహీనమై యున్నద. గుడ్డ కప్పిన శవమువలె నున్నది!

పూర్ణిమ పినతల్లి వచ్చినది–"కూర్చుండుమునాయనా! చూచితివా దీనిస్థితి? ఎండిపోయినది. క్షణము గూడ నేప్పు మానదు. ఒకపూటమాత్రమే యెంగిలిపడును. ఏవిషయమును పట్టించుకొనదు. ఉప్పు, కారము, పాలు, పెఱుగు అన్నియు వర్జించినది. ప్రతిరోజు వ్రతములు! ఏకాదశి, ఆదివారము, మంగళవారము! ఒక చాప పఱచుకొని దానిపై పడి యుండును. ఘడియ ప్రొద్దుండగనే లేచి పూజలు ప్రారంభించును. పిల్లలెంత చెప్పినను వినదు. భగవంతుడు మాంగళ్యమునే హరించినపు డీక నంతయు మిథ్యయే యనును. మనసు కూరట లభించునని యిచటికి వచ్చినది. ఇచటను

నిరంతర దుఃఖమే! ఎన్నియో చెప్పినాను-"అమ్మా! మన యదృష్ట మిట్లున్నది! ఏడ్చి ప్రయోజనమేమి? భగవానుడు సంతానమును ప్రసాదించినాడు.. ఆ పిల్లలను పెంచి పెద్దవారి నొనర్పుము! భగవంతు డిచ్చిన దింత యున్నది. నీవు తిని నలుగురికి పెట్టవచ్చును. మనసు పవిత్రము కానపెగాని శరీరమును శుష్కింపఁజేసి ప్రయోజనమేమి?" అని. కాని నామాట పట్టించుకొనదు. నీవైనను చెప్పుము నాయనా!"

అమృతుడు పైకి మాత్రము నిశ్చేష్టుడై యున్నాడు. కాని లోపల హృదయ విదారకమైన వేదన యిమిడియున్నది. తా నే పునాదిపై జీవిత హర్మ్యమును నిర్మించుకొనినాడో ఆ పునాదియే సమూలము కదిలి పోయినది! జీవితమంతయు తా నే విషయమును సత్యమని తలచినాడో అయ్యది మృగతృష్ణయని, స్వప్నమని నేడు తేలిపోయినది. ఆ మెయిూయాత్మ సంయమము; ఈ తాపసీప్రవృత్తి యెదుట నాతని సమస్త వాసనలు, ప్రేమోద్రేకములు మాయమైపోయినవి. మనసున మట్టిబొమ్మను దేవునిగ భావించుశక్తి యున్నచో మానవుని గూడ దేవునిగ భావించుకొన వచ్చునను సత్యము నేఁడాతనికి గోచరించినది. ఆ యసహ్యాకరమైన మానవునే పూర్ణిమ నేఁడు దేవునివోలె నారాధించుట లేదా?

"తపస్వినికి మనబోటి స్వార్థపరులేమి చెప్పగలరు పిన్నీ? ఆమె పాదములకు నమస్కరించుటే మన కర్తవ్యము" అని శాంత భావముతో ననినాడు.

పూర్ణిమ ముసుగు కొంచెము తొలగించి-"నీపిల్లవాడింకను నిన్ను అడుగుచునే యున్నాడు" అనినది.

---